# ఇది అభివాన ప్రాతకాదు

(యజుర్వేద దర్శనముపై భాగవతులవారి అభిప్రాయ భాగః
వేదములోని "విశ్వకర్మ" శబ్దము పరమాత్మ వాచకము. ఉపనిషదాది వాఙ్మయములో "బ్రహ్మ" మను పేరున ప్రసిద్ధి అని విజ్ఞలోకమునకు విశేషముగ నెఱుక కలుగచేసిన కీర్తి, ప్ర శ్రీమాన్ ఆచార్యులవారికే దక్కినదనుకొందును.

"విశ్వకర్మ" తనయులే, వసువులు, ఏకాదశరుద్రులు, అ "విశ్వకర్మ"యే పరమేష్ఠి- అని సప్రమాణముగా నిందు నిరూపి విశ్వకర్మోపనిషత్తులోని విషయములుకూడ వేదానుసారులైన బోధకములే యని సోదాహరణముగ నిచట నిరూపితమైనవి దర్శనములను చదువుచున్నకొలదియు, ఎప్పటికప్పుడు క్రొత్త విషయములను తెరమీదకు తీసికొని వచ్చి, చూపుచూ, పాఠకులకు అచ్చెరువును కలిగించు నాచారు కరద్వయము అంజలి ఘటించుచున్నది. "విశ్వకర్మ" యను మనము పురుష సూక్తాదులలో దినదినము వినుచునే యున్న పరబ్రహ్మకు విశేషణవాచక శబ్దములలో నొకటియని గ్రహించి, చున్నామేకాని, దాని ప్రాముఖ్యమును ప్రత్న్యానందులు మనకు నంతవరకు మనము గుర్తింపలేదని పాఠకులు తప్పక భావిం శ్రీమదాచార్యుల వారొక యభిమానాభినివేశములతో నిట్లువ్రాయుచు కొనువారును నుండవచ్చును. వారిని మఱొకసారి మీ అభిప్రాం పర్యాయలోచన చేయుడని మాత్రమే చెప్పగలము.

వేదములలో నద్వైతభావన యున్నదనియు ననిదర్శనమ గ్రంథములలో నిరూపితమైనది. అడుగడుగున, అందఱును, ప్రమాణముగ నంగీకరించుచు భగవద్గీతా శ్లోకములనుకూడ నిరూపితములైన విషయములకు ప్రమాణముగ నాచార్యులవారుదా చునే యున్నారు.

ఇట్లు,

20-17, చిలకలపూడి,
మచిలీపట్నం-2
14-3-'90

భాగవతుల కుటుంబరావు
(రిటైర్డ్ ప్రిన్సిపాల్)
మచిలీపట్నం జాతీయ కళాశాల.

శ్రీ వీరరాఘవ వ్యాసావళి :

# వి శ్వ క ర్మ  వి శ్వ రూ ప ము
## (వి శ్వ క ర్మ  మ య ం  జ గ త్)


శ్రీ ప్రత్మానంద స్వామి

దర్శనాచార్య, కళాప్రపూర్ణ

(డా॥ కొండూరు వీరరాఘవాచార్య)


ప్ర ణీ త ము.


ప్ర కా శ కు లు :

శ్రీ కోసూరి వేంకట సుబ్బారావు

అడ్డావారి వీధి, నాజరుపేట, Dr. No. 1-33-11

తె నా లి - 522 201.





This Book is published
with the financial assistance of
TIRUMALA TIRUPATHI DEVASTHANAMS
under the scheme
"Aid to publish Religious books."

# మా వేద దర్శనములు

## పీఠిక

"శిల్ప సాహిత్యములు నాకు జీవగఱ్ఱలు,
ఔపనిషదవనాలు విహార వీథులు,
ఈ చరాచరాత్మక జగద్ధితము వ్రతము,
నడపు మిటు నాదు జీవిత నాటకమ్ము."

అనే చిన్ననాటి ప్రతిజ్ఞ ప్రకారం- శిల్ప, ఆత్మ, యోగ, సాహిత్య దర్శనములు, వాటికి సంబంధించిన అనేక వ్యాసములు, అమరావతి, తోరణ కావ్యములు, అనేక నాటికలు, నవలలు, మహనీయుల జీవిత చరిత్రలు, మిత్రసాహస్రి పద్యాలు, 2 వేల తత్త్వ సూక్తులు వ్రాయడ మైనది. వీటిలో 3 నవలలు- అమరావతి, మూడు కావ్యాలు, సాహిత్య వ్యాసములు తెలుగు కల ప్రతి విశ్వవిద్యాలయములోను పాఠ్యములై మన్ననల నందుకొన్నవి. ఇవియేకాక రేడియోలో చేసిన వివిధ ప్రసంగాలు,ప్రసారమైన నాటికలు అనేకం. ఇది అంతా పై ప్రతిజ్ఞకు లోబడిన సాహిత్యమే.

తరువాత ఉపనిషత్తులలో వర్ణింపబడిన "జగత్కారణ బ్రహ్మపదార్థం" వేదాలలో ఎలా వర్ణింపబడినదో అనే ఆలోచన బయలుదేరింది. ఉపనిషద్విజ్ఞానం కూడ వేదాలలో ఏ రీతిగా మొదట ఉగ్గడింపబడి ఉంటుందో అన్న ఆలోచన బయలుదేరింది. ఆ ఆలోచనతో వేద పరిశీలన దాదాపు 40 ఏండ్ల నాడే ప్రారంభమయింది. వేదాలను చదివి అర్థం చేసుకోవాలంటే తపస్సు కావాలనీ, యోగమూ, యోగ పరిపూత బుద్ధీ అవసరమని "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" అనే వాక్యం చెప్పుతున్నది. ఇక్కడ 'బ్రహ్మ' అంటే వేదమనే అర్థం. ఇంకో అర్థం జగత్కారణ

పరబ్రహ్మ"మని కూడ. ఆ రెంటిని అవగాహన చేసుకోడానికి తపస్సు సాధనయే. బాల్యం నుండి అలవడుచుకొన్న యోగం ఉండనే ఉన్నది కనుక, దానికి గాఢమైన తపస్సును తోడుచేసి, రేలు పవళ్ళు తపించి వేదార్థం కోసం అన్వేషించడం అయింది. ఆ తపస్సులో చదివిన యాస్క, సాయణ, శంకర, రామానుజాదుల భాష్యాలకు అంతులేదు. ఈ దృష్టితో 20 ఏండ్లు ఎడతెగని తపస్సు, కృషి నడపిన పిమ్మట ఋగ్వేద దర్శనం రచితమైంది. దానికి ఇంకొక పేరు "ఏకం సత్". "ఏకం స ద్విప్రా బహుధావద న్తి" అనే మంత్రానుసారం అదే పేరు పెట్టి ఆ విధం గానే విష్ణు, రుద్ర, త్వష్టృ, పురుష, విశ్వకర్మ, ప్రజాపతి, హిరణ్య గర్భాది దేవతలను గూర్చిన సత్యాలు ఆ గ్రంథంలో ఆవిష్కృతా లైనాయి.

ఋగ్వేదంలో సృష్టి ప్రణాళికను బోధించే సూక్తాలకు "విశ్వోత్పత్తి సూక్తాలని" పేరు. అవి- 1) నాసదీయ, 2) విశ్వకర్మ, 3) పురుష, 4) మోక్ష సూక్తాలుగా ప్రసిద్ధాలు. ఇంక విడివిడిగా ఉన్న విష్ణు, రుద్ర, త్వష్టృ, హిరణ్యగర్భాదుల సూక్తాలు, మంత్రాలు ఉపయోగించినాయి. వీటన్నిటి పరిశోధన, పరిశీలన ఫలితంగా 40 ప్రకరణాలతో ఋగ్వేద దర్శనం వెలువడింది. ఇందులోని ప్రధానాంశాలు, క్రొత్తగా కనిపెట్టినవి- విష్ణు మంత్రాలలోనే కుండలినీయోగం ఉన్నదనీ, విష్ణువు మెట్టిన త్రి, సప్త లోకాలు ఆధారాది సప్తచక్రాలనేది ఒకటి. ఇంకొకటేమో- అద్వైత సిద్ధాంతమనేది ఉపనిషత్తులు ప్రతిపాదించిన దెంతమాత్రమూ కాదు. దానికి మూలం "విశ్వకర్మ సూక్తం" లోని తొలి మంత్రమే అనేది రెండవది. "స ఆశిషా ద్రవిణమిచ్ఛ మానః ప్రథమచ్ఛ దవరా నావివేశ" అనే విశ్వకర్మ సూక్తార్థ మంత్రార్థమే నా నా ఉపనిషత్తులయందు విస్తరింపబడిన దని సిద్ధాంతం. ఇక విష్ణు, రుద్ర, ఇంద్ర, మిత్ర, అగ్ని ప్రభృతి దేవతలు భిన్నులుకారనీ, వారు "విశ్వకర్మ" పుత్రులే, తదంశజులే అనీ

సప్రమాణంగా నిరూపించడం మతొకటి. ఇందు మానవులందరూ అమృత పుత్రులే అనడానికి "శృణ్వన్తు విశ్వే అమృతస్య పుత్రాః" అనే మంత్రం దారిచూపింది. ఇలా ఋగ్వేద దర్శన ప్రథమ భాగం "ఏకం సత్" అయింది. దాన్ని మహా పండితులైన డా॥ ధూళిపాళ్ళ అర్క సోమ యాజులు, డా॥ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, సాహిత్యబ్రహ్మ డా॥ V. V. L. నరసింహారావు, మహాకవి మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి ప్రభృతులు ఎంతగానో మెచ్చి ప్రశంసావర్షం కురిపించారు. దానిని ఆవిష్కరించిన ఆనాటి (1985) ఆంధ్రప్రదేశ్ గవర్నర్, డా॥ శంకర దయాళ్‌శర్మ ఎంతగానో గ్రంథకర్త కృషిని అభినందించారు. డా॥ దివాకర్ల వెంకటావధాని "ఇది అపూర్వ కృషి" అన్నారు.

ఈ గ్రంథం వెలువడిన సంవత్సరంలోపలనే గ్రంథకర్తకు కేంద్ర ప్రభుత్వంవారు "నేషనల్ కల్చరల్ ఫెలోషిప్" అవార్డు ఇచ్చి సత్కరించారు. దీని ఫలితంగా గ్రంథకర్తకు నెలకు 5 వందల రూపాయల సత్కారంతో నాలుగేండ్లపాటు తన వేద పరిశోధన కృషిని కొనసాగించడానికి వీలుచిక్కింది. ఈ పుస్తకం ప్రతులు సంవత్సరానికే చెల్లిపోయినవి. T. T. D. వారు ఈ ప్రథమభాగ ముద్రణకు ధన సహాయతను అందించారు. కాని దర్శనాన్ని, "దిగ్దర్శనం" అనమన్నారు. కనుక అది "ఋగ్వేద దిగ్దర్శనం" అయినది.

ఇందు వర్ణింపబడ్డదంతా "విశ్వకర్మ" పర స్వరూపమన్నమాట. "పరో దివా, పర ఏనా పృథివ్యా, పరో దేవేభి రసురైర్గుహాయత్" అని విశ్వకర్మ సూక్త మంత్రం. ఈ భావాన్నే ఆత్మదర్శనంలో ఇలా గానం చేయడమయినది-

"ఏకం సదేవ య దనిర్వచనీయ మాయా
సంబంధ మేత్య బహుధా ఘటతే జగన్తి,
స చ్చిత్సుఖైకరస మాద్య మతీంద్రియం త
త్తత్వం పరాఖ్య మనిశం హృది సంస్మరామి.

ఇట్టి విశ్వకర్మ పర తత్త్వము అష్ట ప్రకృతులుగాను, వాటి వికారములైన జగత్తులుగాను వికసించి ఈ సర్వమూ అయినది. కనుక, ఈ సర్వముకూడ విశ్వకర్మ యొక్క బాహ్య (స్థూల) రూపమే అన్నమాట. అందుకే దాన్ని ఉపనిషత్తు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నది. దృష్టి గోచరమయ్యే విశ్వమంతా విశ్వకర్మయే, అఖండ బ్రహ్మమే. ఇది ఋగ్వేద దిగ్దర్శనం యొక్క 2వ భాగపు నామం. ఇందులో పంచ భూతాలను గూర్చి, పంచ దేవతలు, త్రిమూర్తులను గూర్చి, ఓషధీ-అన్న సూక్తములను గూర్చి, వాస్తోష్పతిని గూర్చి వివరణలున్నవి. ఇంకా వివాహ మంత్రాల అర్థం, స్త్రీ దేవతలు, మంత్రాలు వ్రాసిన మహిళలు మొదలైన లోక విషయా లనేకం వివరింపబడినాయి. అందుకే ఇది బ్రహ్మస్వరూపమే అయిన లోకవిశేష చర్చ చేసినట్లయినదన్నమాట!

ఇక మూడవ భాగానికి "బ్రహ్మైవేదం విశ్వం" అని పేరు. ఇందులో మోక్ష సూక్తాదులను అనుసరించి కుండలినీయోగ విశేషాలను చెప్పడం, సౌర దేవతలను గూర్చి, సవితను గూర్చి, మరికొందరు దేవతలను గూర్చి, అందునా ముఖ్యంగా వసు, రుద్ర, ఆదిత్యులను గూర్చి, వారు శరీరంలో ఎలా ఉన్నదీ- ఇత్యాది పరమ రహస్యాలు అనేకం చర్చింపబడ్డాయి. శిల్పం "బ్రహ్మకర్మమే" అని స్వప్రమాణ నిరూపణం ఇందులో ఉన్నది. దీనిని డా॥ శోభిరాల సత్యనారాయణ ప్రభృతి విద్వాంసులు, శ్రీ సూరి రామకోటిశాస్త్రి ప్రభృతులు మెచ్చుకొన్నారు.

ఇక నాల్గవది "యజుర్వేద దర్శనం". యజుర్వేదంలో ముఖ్యంగా మనం గమనించవలసిన విశేషాలు- విశ్వకర్మ సూక్తం, నమక చమకాలు. వీటిలో ఆధ్యాత్మికత, ఆధిదైవిక, అధి భౌతిక తత్త్వాలు బహుధా సరహస్యంగా ప్రవచింపబడినాయి. ఈ మూటి తత్త్వాన్ని గూర్చి వివరణం ఇంత విపులంగా ఎక్కడ చేయబడలేదని శ్రీ భాగవతుల కుటుంబరావుగారు తమ

పీఠికలో ఎంతగానో మెచ్చుకొన్నారు. తరువాత, గ్రంథకర్త దృష్టి ఋగ్వేదంలో ఉన్న రహస్యాలమీద ప్రసరించింది. చిరతపస్సుల ఫలితంగా "త్ర్యంబకం యజామహే" అనే మృత్యు విమోచన మంత్రానికి 30కి పైగా అర్థాలను చూపి పాఠకులను ఆశ్చర్యపఱచినాడు గ్రంథకర్త. ఈమంత్రములో- వసిష్ఠ మహర్షి యే బ్రహ్మ, విష్ణు, రుద్రులకు తండ్రి అయిన పరమాత్మ (విశ్వకర్మ)యే 'త్ర్యంబకుడ'ని నిర్ధారించాడన్నాడు. ఆ త్ర్యంబక మంత్ర తత్త్వాన్ని ప్రతివారు చదివితీరాలి. ఇంకా ఇంద్ర-విష్ణువులు జీవేశ్వర రూపులనీ, మిత్రావరుణులు ప్రాణాపాన (పింగళా-ఇడా) రూపులనీ, వాగర్థ రహస్యాన్ని గూర్చిన అనేక విషయాలు ఇందులో వివరింపబడినాయి. నాసదీయ, విశ్వకర్మ, పురుష సూక్తములకు గల పరస్పర సంబంధమూ, అవి ఎలా మోక్షహేతువులయినదీ ఇందులో లెస్సగా వివరింపబడినది. అజాత, శూన్య, అచల పరిపూర్ణాది వాదములు ఇందు వేద సమ్మతముగా పర్యాలోచింపబడినవి. ఇంతయేల ? ఈ గ్రంథానికి "ఋగ్వేద రహస్యాలు" అనే పేరు సార్థకమయ్యేటట్లు అనేక వేద మంత్ర రహస్యాలు ఈ గ్రంథంలో నిస్సందిగ్ధం గాను, పరమ ప్రమాణంగాను వివరింపబడినాయి.

ఇక 6వ పుస్తకమే "అథర్వవేద దర్శనం". అథర్వ వేదం వాచస్పతి సూక్తంతో ప్రారంభమవుతున్నది. "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అనే విశ్వకర్మ సూక్త మంత్రాన్ని అనుసరించి వాచస్పతి అనగా వేదజనకుడైన "విశ్వకర్మ" అని అర్థం. "యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః, వాచస్పతి ర్బలా తేషాం తన్వో అద్య దధాతు మే" అనే మంత్రంతో ప్రారంభమయిన అథర్వ వేదం యోగప్రధానమైనదని గ్రంథకర్త ఆశయం. మంత్రారంభంలో చెప్పబడిన త్రి, సప్త, శబ్దాలు ఆధారాది సప్తచక్ర సూచకాలని గ్రంథకర్త నిరూపించారు. దానికి తగినట్లు ప్రాణ సూక్తం, విస్తరంగా అథర్వంలో ఉండడంకూడ అది యోగ ప్రధానమనడానికి బలం చేకూర్చింది. అసలు గ్రంథకర్త దృష్టిని

బట్టి ఋగ్వేదం జ్ఞానప్రధానమనీ, యజుర్వేదం కర్మప్రధానమనీ, సామం భక్తి ప్రధానమనీ, అథర్వం కుండలినీ అష్టాంగయోగ ప్రధానమనీ నిర్ణయం. అలాగే ఆయన సమన్వయించారుకూడ. ఇందులో- జగత్కారణం, పురుష-స్కంభ సూక్తములు, రుద్ర-విశ్వకర్మలు, ప్రాణవిద్య, కాల-పృథివీ సూక్తములు, మనుష్య సూక్తం, వేదదేవతలు-పిండ బ్రహ్మాండ సమన్వయం, 33 దేవతలు, జగద్బ్రహ్మానుభవం, అతీత స్థితి- ఇత్యాది తత్త్వయోగ విద్యాప్రధానాలైన 20 ప్రకరణాలతో ఈ గ్రంథం అత్యపూర్వంగా రూపొందింది. శ్రీ భాగవతుల కుటుంబరావుగారు దీనికి అద్భుతమైన ప్రవేశికను వ్రాశారు. ఈ ఆరు వేద దర్శనములకు గ్రంథకర్త వ్రాసిన పరిచయ పీఠికలు ప్రతివారూ చదువదగినట్టివి. ఈ విధంగా ఈ షడ్దర్శనాల రచన కొనసాగినది.

ఇక సప్తమ గ్రంథము, సహస్రారం వంటిదే అని చెప్పవలసియున్నది. దానిని "వైదిక విశ్వకర్మ దర్శనమ"నీ, "విశ్వకర్మమయం జగత్" అనీ అనవచ్చు. శ్రీ భాగవతుల కుటుంబరావుగారు ఈ పుస్తకాలను "విశ్వకర్మ విశ్వరూపము" అనవచ్చునని తన పీఠికలో ఒక సూచన చేశారు. ఆ మహా పండితుల సూచన ననులరించి ఈ గ్రంథాన్ని "విశ్వకర్మ విశ్వరూపము" అనదలచినాము. వేదార్థము నెఱింగిన సత్పురుషునిలో సర్వ దైవశక్తులు సన్నిహితాలై ఉంటాయని "యావతీర్వై దేవతాస్తాస్సర్వా వేదవిది బ్రాహ్మణేవసన్తి" అనే వేదవాక్యం చెప్పుతున్నది. కనుక "వేదవేత్త సర్వదేవతామయుడు" అనే ప్రకరణంతో ఈ గ్రంథం ఆరంభమవుతుంది. పిమ్మట "బ్రహ్మను, వేదములను సృష్టించినది విశ్వకర్మ"యే అనీ, ద్యావా పృథువులను, పంచర్షి, సప్తర్షులను, వసురుద్రాదిత్యులను, సమస్త దేవతలను, భృగ్వంగిరః ప్రభృతులను సృష్టించిన విశ్వజనకుడు "విశ్వకర్మ"యే అని ఇందు సప్రమాణముగా నిరూపితమయినది.

ముఖ్యంగా "విశ్వకర్మ సూక్తము"ను పలు దృక్కోణములతో చూచి, వ్యాఖ్యానించి, దానియొక్క విశ్వార్థ బోధకత్వము ఇందు విశదము చేయబడినది. అందుకే దీనికి "విశ్వకర్మ విశ్వరూపము", "విశ్వకర్మ మయం జగత్" అనే పేర్లు తగిఉంటాయని భావించడమైనది.

ఈ గ్రంథాన్ని మనస్సుతో భావించి వ్రాసే శక్తి లేక, కంటిచూపు కుంటువడి దిక్కులు చూస్తున్న సమయంలో బుద్ధిమంతుడైన, శ్రీ కోసూరి వెంకట సుబ్బారావుగారి కుమారుడు చిరంజీవి శివకుమార్ నా యీ పరిస్థితిని గమనించి "మీరు చెప్పండి, నేను వ్రాస్తాను" అని పూనుకొని 3 నెలల నిర్విరామకృషితో ఈ గ్రంథం వ్రాతను పూర్తిచేసి అచ్చుకు సిద్ధపరచి ప్రూఫులు గూడా దిద్ది ఈ గ్రంథాన్ని వెలుగులోనికి తెచ్చినాడు. వేదంమీది భక్తితో, నామీది విశ్వాసంతో నా కృషి వెలుగు చూడాలని వ్రాతప్రతిని సిద్ధం చేసిన చి॥ శివకుమార్‌కు "శ్రీమద్గాయత్రీ-విశ్వకర్మ"ల పరమానుగ్రహం సిద్ధించాలని నా ఆశీస్సులు.

ఈ సందర్భముగా శ్రీ కోసూరి వేంకట సుబ్బారావుగారిని గూర్చి నాలుగు మాటలు వ్రాయవలసి యున్నది. 1960వ సం॥ నుండి వారికి నా సాహిత్య గ్రంథాలతో పరిచయం ఉన్నది. క్రమంగా నా ఆత్మదర్శనాది వేదాంత గ్రంథాలను, పత్రికలలోని వ్యాసాలను చదువుతూ, రేడియో ప్రసంగాలను కూడ వింటూ ఉండేవారు. ఇలా పెరుగుతూ పోయిన పరిచయం,1983వ సంవత్సరములో వారు రిటైర్ అయినాక నేను తరచు వారి ఇంటికి రాకపోకలు చేయడంతో ఇనుమడించింది. ప్రతిరోజూ ఆధ్యాత్మిక బోధ జరుగుతూ ఉండేది. క్రమంగా ఆయన వేదాంతంలోకి ఆకర్షింపబడినారు. నా వేద దర్శన రచన ప్రారంభమయింది. ఆరు వేద దర్శనాలను, దాదాపు 2,000లకు పైగా తత్త్వ సూక్తులను నేను చెబుతూ ఉండటము, వారు వ్రాస్తూ ఉండటము జరిగినది. ఈ తత్త్వ సూక్తులు కూడ మూడు గ్రంథాలుగా వెలువడినాయి.

ఇరువురం కలసి సత్తెనపల్లి సమీపంలోని రాజుపాలెం బాల యోగినిని దర్శించడం, మహాత్ముల చరిత్రలను చర్చించడము ఇత్యాదులు జరుగుతూ ఉండేవి. సుబ్బారావుగారు వేదాంతంలో చాలవరకు పరిణతిని పొందారనవచ్చు. నా వలెనే ఆయనకూడ వేషానికి ప్రాధాన్యము ఇవ్వక హృదయ పరిపక్వతకే, ఆత్మనిష్ఠకే ప్రాముఖ్యత నిచ్చే సాధకుడై నారు. "సంన్యాసము తీసుకుంటేనే గాని మోక్షము రాదు" అనే అభిప్రాయము పోయింది. ఏ ఆశ్రమములలో ఉన్నా తత్త్వజ్ఞానాన్ని సంపాదించి ఆచర ణలో పెట్టి ముక్తిని సాధించవచ్చు అనే సిద్ధాంతానికి కట్టువడి పరిపక్వ తను సాధించే అజ్ఞాత యోగసాధకుడుగా తయారైనారు.

1980 నుండి వెలువడిన నా గ్రంథాలు చాలా భాగం నేను చెప్పగా ఆయన వ్రాసినట్టివి, మరియు నేను చిత్తుగా వ్రాసికొనగా ఆయన సాపు వ్రాసినట్టివి అయినాయి. ఇలా మా ఉభయుల సమ్మేళనంతో ఇంతింతై వటుడింతయై పెరిగినవారే శ్రీ కోసూరి వేంకట సుబ్బారావు గారు. అలాంటి సుబ్బారావుగారి కుమారుడు శ్రీ శివకుమార్ ఈ గ్రంథాన్ని నేను చెప్పగా వ్రాయడం ఇంకొక విశేషం.

మా వేద దర్శనాలేమి, ఈ "విశ్వకర్మ విశ్వరూప" మేమి వేద సమ్మితాలు. పరమ ప్రమాణాలు. పురాణాలలోని కట్టుకథల వంటివాటికీ, వీటికీ పోలిక లేనేలేదు. వేదమూ, ఆ వేదద్రష్ట అయిన భగవంతుడూ, ఆ భగవంతుడు సృష్టించిన విశ్వమూ కల్ల అయితేనే ఈ గ్రంథస్థ విషయాలూ కల్లలవుతాయి.

ఇలాంటి "విశ్వకర్మ విశ్వరూప" గ్రంథాన్ని అందరూ చదివి వైదిక సత్యాన్ని అవగాహన చేసుకొంటారని మా విశ్వాసం. మా కృషి ఇంతవరకూ ఈ సప్త గ్రంథ రూపంగా విస్తరించుటకు నేషనల్ కల్చరల్ ఫెలోషిప్ అవార్డు ఇచ్చి తోడ్పడిన భారత ప్రభుత్వానికీ, ముద్రణకు తోడ్పడుచున్న T. T. D. వారికీ, ఈ సత్యాలను అనుసరించి ప్రోత్సహిస్తున్న మహా విద్వాంసులకూ, చదువుతున్న యోగ్యులైన పాఠక ప్రవరులకూ మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

ఆయుశ్శేషమూ, ఆరోగ్యము ఉంటే సామవేద దర్శనాదులు కూడ వెలువడవచ్చునేమో అని మా భావం.

"ఆలకింపు డమృత పుత్రు లందఱిద్దీ."

తెనాలి }
1-4-'94 }

ప్రత్నానంద



శ్రీస్వామి ప్రత్నానందుల ఋగ్వేద దిగ్దర్శనాదులను
చదివి ప్రముఖులు వ్రాసిన అభిప్రాయములు
కొన్ని మాత్రము :

## శ్రీ భాగవతుల కుటుంబరావుగారి అభిప్రాయము

(మచిలీపట్నం జాతీయ కళాశాల రిటైర్డు ప్రిన్సిపాల్)

దర్శనాచార్య, కళాప్రపూర్ణ డా॥ కొంపూరు వీరరాఘవాచార్యులు గారు (ప్రత్నానందులు) నేటి ఆంధ్రులకు గర్వకారణమైన మహనీయులలో ఒకరు.

వీరిని తలచుకొన్నప్పుడెల్లా "సముదితః గుణానాం సముదయః" అనే శ్రీహర్ష వాక్యం స్మృతికి వస్తుంది. ఆంధ్ర సంస్కృత భాషా పాండిత్యం, విమర్శకత్వం, కవిత్వము, యోగము, ఆధ్యాత్మ విజ్ఞానము, దర్శన పరిజ్ఞానము, వేదదిగ్దర్శనము, తపస్సు, బోధకత, అనుష్ఠానము- అనేవి వీరిలో చోటు చేసికొన్నై.

వీరు పట్టింది బంగారం అవుతుంది. ఏ రచనచేసినా అందులో విషయం కూలంకషంగా, విశదంగా, సుబోధంగా ఉంటుంది. తాము చెప్పే విషయాన్ని, తాము అనుభవపూర్వకంగా అవగాహన చేసుకొన్న

వారే ఈ విధంగా ప్రతిపాదన చేయగలుగుతారు. శిష్యులకు కలిగే సంశ
యాల నూహించి, వాటికి సమాధానాన్ని ఇస్తూ సిద్ధాంతాలనేగాక, సాధన
మార్గాలను గూడ బోధిస్తున్న ఒక గురువు పాఠకుల మనోవీధిలో అడ
గడుగునా సాక్షాత్కరిస్తాడు. "అధ్యాస, మిథ్యా, శూన్యవాదాది" జటిలమైన
విషయాలను అతిసులభంగా బోధింపగలిగారు. పాండిత్యము, బోధకత
అనే రెండూ కల ఉత్తమ గురువులు వీరు.

"యస్యోభయం సాధు స శిక్షకానాం
ధురి ప్రతిష్ఠాపయితవ్య ఏవ".

శిల్ప, యోగ, ఆత్మదర్శనాలు, తత్త్వసాధన, తత్త్వ సూక్తులు
అనే వీరి గ్రంథాలు విజ్ఞానానికీ, సాధనకుగూడ సోపానాలుగా ఉపయో
గించే ఉత్తమ గ్రంథాలు. వీరి "మిత్రసాహస్రి"కి ఆంధ్రశతక వాఙ్మ
యంలో చిరస్థానం లభిస్తుంది.

ఇవన్నీ ఒక యెత్తు, వీరు తమ చరమ వయస్సులో చిర తపఃఫల
ముగా రచించి, ఆంధ్రులకు, ఆంధ్ర వాఙ్మయానికి, ఎనలేని కానుకగ
సమర్పించిన "ఋక్, యజు, రథర్వవేద దర్శనాలు, ఋగ్వేద రహ
స్యాలు" అనే గ్రంథాలు ఒక యెత్తు! ఇందులో వీరు ఆ యా దేవత
తత్త్వ స్వరూపవర్ణన, ఆ యా మంత్రార్థ ప్రతిపాదనలలో చూపించిన
ప్రతిభ ఆ గ్రంథాలను చదివినవారికే తెలుస్తుంది. వీటిలో కూడ వీట
అన్నిటినీ మించినది, వీరు ప్రతిపాదించిన "విశ్వకర్మ బ్రహ్మ సిద్ధాంతము
ఇది అనిదం పూర్వము. యుక్తిప్రమాణ సిద్ధము". వేదములలోని
"విశ్వకర్మ"యే ఉపనిషత్తులలోని బ్రహ్మము- అని సిద్ధాంతీకరించి "విశ్వ
కర్మ"కు సర్వదేవతా సార్వభౌమ పట్టాభిషేకం చేసినారు. ("యో దేవ
నాం నామధా ఏకఏవ" అని ఋక్కుకదా) ఈ గ్రంథాలలో- "ఏకంసత్
సర్వం ఖల్విదం బ్రహ్మ. బ్రహ్మ సత్యం జగద్బ్రహ్మ" అనే వాక్యాలన
వేదముల లోని విషయాలకు సమన్వయించి, అద్వైత వాదంలో ఒక
విశిష్ట మార్గాన్ని సూచించిన కీర్తి కూడ వీరికే దక్కుతుంది. వీ

గ్రంథాలు ప్రపంచ భాషలలోనికి అనువదింపబడితే లోకానికి ఎనలేనిమేలు చేకూరుతుంది. అందుకు ప్రభుత్వం పూనుకోవాలి. వీరి గ్రంథాలను అందఱూ చదివి ధన్యులు కావాలని కోరుతున్నాను. వీరికి నా హృదయ పూర్వకాభినందనాలను అందచేస్తున్నాను.

చిలకలపూడి
20-7-92

భాగవతుల కుటుంబరావు



భగవత్ స్వరూపులైన ప్రత్యానందులకు నమస్కారములు.

నేను 1954 August-15న విజయవాడ మునిసిపల్ ఓరియంటల్ కాలేజిలో లెక్చరరుగా చేరినప్పటినుండి మిమ్ము, మీ సాహిత్య కృషిద్వారా బాగా ఎఱుగుదును. ఈ మధ్య మీ గ్రంథాలను చాలావరకు చదివినందున మీరు సర్వజ్ఞులని, తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు మొదలైన భాషల లోని గ్రంథాలన్నింటినీ ఆలోడనము చేసి ఆపోశన పట్టినారని తెలిసి పోయినది. మీరెన్నో గ్రంథాలను కంఠస్థము చేసిఉంటారని ఏకసంధా గ్రాహులని నాకు నమ్మకము ఏర్పడిపోయినది. నేను మనస్సులో ఒకటి పెట్టికొని పైకి ఒకరకంగా మాట్లాడలేను, వ్రాయలేను. అయినా నా వ్రాతలన్నీ భక్తితో వ్రాయునవేగాని విరక్తితో వ్రాయునవి కావు. మీవంటి మహానుభావులు ఎందఱో ఉండరు. మీరు అపర వ్యాసులో, శంకరులో, మఱెవరో అయిఉండాలి. మీ వ్రాతలవలన మావంటివారము లాభము పొందుచున్నాము. చిత్తగింపుడు.

ఇట్లు,
బోడాల రామకోటయ్య
Lecturer,
Municipal oriental college,
Vijayawada.

కారంచేడు
14-9-94

తాము వేదజలధిని మథించుచూ మంథరాయమాణులై దార్శనిక స్థితి నుండి ఎదిగి ద్రష్టలైతిరి. ఈ విషయమున మిమ్ములను రెండవ సాయణు లనవచ్చును. ఆ మహానుభావుని యంశ మిమ్మావేశించినదని పించినది. ఆయన విజయనగర సామ్రాజ్యమును స్థాపించెను. మీరు విశ్వకర్మ విజయనగర సామ్రాజ్యమును మీ లేఖినిద్వారా స్థాపించు చున్నారు.

ఇట్లు,

కపిలవాయి లింగమూర్తి
Retd. Lecturer in Telugu

నాగరకర్నూలు
23-19-91



ప్రత్నానంద మహోదయేభ్యః సప్రణామం సబహుమాన పుర స్సరం చేదం విజ్ఞాప్యతే—

పఞ్చదశ నిమేషావధౌ మిత్రస్య గృహే మయా తత్రభవతాం "ఋగ్వేద రహస్యాలు" ఇతి, యజుర్వేద దర్శనమితిచ గ్రంథ ద్వయం గత సప్తాహే దృష్టపూర్వ మాసీత్. తత్ర భవతామ్ తాదృశ గ్రంథ ప్రణయనోపకారాయ ఆంధ్రాః సర్వే ప్యధమర్ణా భవేయుర్భవతా మితి నిశ్చప్రచయో మమాభిప్రాయః. తత్ర భవతాం భవతాం తపోదృష్టిః (ఆలోచనా సరణిః) పచేళిమా చాతీవ సుబోధా సతీ మాదృశానా మల్ప జ్ఞానా మనల్ప మానంద ముపజనయతీత్యత్ర నాస్తి సంశయ లేశోఽపి.

ఇట్లు,

కొల్లూరు అవతార శర్మ
M.A., B.Sc., B Ed.
Sanskrit Lecturer,
P. R. Govt. College.

కాకినాడ
31-12-91



My dear Acharyaji,

I feel that 'Rigveda Rahasyalu' is your Magnum opus and surpasses three parts of 'Rigved Darshanamu' published you. The mysticism of Rigveda untravelled in the work could be equated to that Sri Aurobindo's 'The secret of Veda'. The interpretation of vedic hymns could be done by juggler knowing vedic phrases. But to bring out its soul as yon have done only a yogi could do. I am very hapyy that Sri Pratnananda could reveal his inner achievements thro' Rigveda Rahasyalu. It greately deserves to be translated into other languages for the benifit of students of Rigveda.

Gnana Bandara,
Bharat Nagar,
Colar,
Karnataka State.

Yours sincerely,
*G. Gnanananda* M.A.,
23-10-'91.



# ప్రకాశకుల విజ్ఞప్తి

జగత్ ప్రసిద్ధ విద్వత్కవులు, బహు గ్రంథకర్తలు అయిన Dr॥ కొండూరు వారు భార్యా వియోగానంతరము (1982) "ప్రత్యానంద స్వామి" అనే నామంతో వేదవేదాంత గ్రంథాలు వ్రాస్తూ, లోకోపకారం చేస్తూ ఉండటము జగమెఱిగిన సత్యమే.

వేదాల మీద ఆరు దర్శనాలను వ్రాసి ప్రకటించే సందర్భములో పాపు వ్రాయటమనే పనిని నాకు అప్పగించి వారు నా జీవిత విజ్ఞాన వికాసానికి తోడ్పడిన ఆధ్యాత్మిక గురువర్యులు. వారు "వేషమెన్న వెలిది విజ్ఞత లోనిది, జ్ఞానమొకటే మోక్షసాధనంబు, వట్టి వేషమూని వంచింపక జగంబు" అనే మార్గానికి చెందిన సిద్ధపురుషుబు. వారి బోధలవల్ల నేన తాత్త్వికముగా ఎంతవరకు సాధింపగలిగినానో అది వారికే తెలియవలెను

సహస్రారము వంటిదని చెప్పదగిన ఈ సప్తమ గ్రంథాన్ని వార స్వయముగా ముద్రించుకొనలేక మాకు ముద్రణాధికారాన్ని కల్పించినారు దీనికి T. T. D. వారు ముద్రణ ద్రవ్యాన్ని చేకూర్చారు. వా తోడ్పాటుతో ఈ గ్రంథము వెలువరించే అదృష్టము కలిగినది. ఈ గ్రంథాన్ని ప్రథమ ముద్రణకు, సర్వాధికారాలతో మాకు ఇచ్చిన శ్రీశ్రీశ్రీ ప్రత్యానందులవారికీ, ముద్రణ ద్రవ్యాన్ని అందించిన తిరుమల తిరుప దేవస్థానములవారికీ మా కృతజ్ఞతా పూర్వక నమస్సులు.

ఆచార్య స్వాములవారి అన్ని గ్రంథాలవలె, ఈ "విశ్వకర్మ విశ రూప" గ్రంథాన్నికూడ, పాఠకలోకం శ్రద్ధాభక్తులతో చదివి, అనుష్ఠిం లాభము పొందుతుందని ఆశిస్తున్నాము. ఈ గ్రంథ ముద్రణలో శ్రమ అనుకోకుండా ఎంతగానో మాకు తోడ్పడిన వాణీ ఆర్ట్ ప్రింటర్స్ అధిప చి॥ టి. శివశంకరరావుగారికి, తదితర సిబ్బందికి "శ్రీ గాయత్రీ-విశ్వకర్మ భగవానులు ఆయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించవలెనని ప్రార్థిస్తున్నాను.

ఇట్లు, ప్రకాశకులు
కోసూరి వెంకట సుబ్బారావు

# విషయసూచిక

## లభించే ఇతర గ్రంథాలు

| | | | |
|---|---|---|---|
| 1. | ఋగ్వేద దిగ్దర్శనము (2, 3 భాగములు) | .... | రు. 60-00 |
| 2. | ఋగ్వేద రహస్యాలు | .... | ,, 30-00 |
| 3. | యజుర్వేద దర్శనము | .... | ,, 30-00 |
| 4. | అథర్వవేద దర్శనము | .... | ,, 30-00 |
| 5. | ఆత్మదర్శనము | .... | ,, 20-00 |
| 6. | శిల్ప దర్శనము (దేవాలయ తత్త్వచర్చ) | .... | ,, 25-00 |
| 7. | యోగ దర్శనము | .... | ,, 25-00 |
| 8. | తత్త్వ సాధన | .... | ,, 25-00 |
| 9. | తత్త్వసూక్తి సాహస్రి | .... | ,, 40-00 |
| 10. | నాగరఖండము | .... | ,, 15-00 |
| 11. | అమరావతి (పద్యకావ్యము) | .... | ,, 5-00 |
| 12. | శ్రీ వీరబ్రహ్మ సుప్రభాతము | .... | ,, 5-00 |
| 13. | మాఘమహాత్మ్యము | .... | ,, 15-00 |
| 14. | అనర్ఘ రాఘవము | .... | ,, 15-00 |
| 15. | మోహనాంగి | .... | ,, 10-00 |

## పునర్ముద్రణము కావలసినవి

1) మూడు కావ్యాలు [రామాయణ, భారత, భాగవతముల సమీక్ష] 2) నిరంజన విజయము 3) సిద్ధప్ప చరిత్ర 4) మన గురుదేవుడు 5) ఆసియా జ్యోతులు [ఇవి జీవిత చరిత్రలు] 6) తోరణము (ఖండకావ్య సంపుటి] 7) తత్త్వ సూక్తులు [1వ భాగము] 8) ప్రత్యానంద తత్త్వ సూక్తులు 9) ఋగ్వేద దిగ్దర్శనము [ప్రథమ భాగము] 10) సాహిత్య వ్యాసములు 11) శిల్పకళా క్షేత్రాలు [2 భాగములు] 12) శ్రీ వీరరాఘవ వ్యాసావళి (2 భాగములు) 13) గాయత్రీ-విశ్వకర్మలు 14) కళారాధన [నవల] 15) లేపాక్షి [నవల] 16) మిత్రసాహస్రి [1, 2 భాగములు 17) విశ్వకర్మ పురాణము.

---

చూ : కళాప్రపూర్ణ, దర్శనాచార్య

డా॥ కొండూరు వీరరాఘవాచార్య (ప్రత్యానంద)

గాంధీనగర్, తెనాలి-522 201.

# విశ్వకర్మ విశ్వరూపము

## (వైదిక విశ్వకర్మ దర్శనము)

"ఓం నమో విశ్వకర్మణే, స ఉపా త్వాస్మాన్."

### వందనాదికము.

శ్లో॥ పంచాననాది సామ్యేన, పంచ సృష్ట్యాది కర్మభిః,
వేదస్య పితరౌ వన్దే ఆద్యౌ వన్వర్థ దంపతీ. 1

తా॥ అయిదు మోములు, పది చేతులు మొదలగు పోలికల చేతను, సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము-అనెడి అయిదు కర్మలచేతను సార్థకత్వమును పొందిన ఆదిమ దంపతులగు వేద జననీ జనకులకు (గాయత్రీ-విశ్వకర్మలకు) వందనము.

శ్లో. నమస్తే వేదమాత్రే తే. జగదాకృతయే సదా,
నమస్తే వేదపిత్రే తే, జగదాత్మ స్వరూపిణే.

తా॥ పంచభూతమయములగు జగత్తుల ఆకారమే అయిన వేదమాత (గాయత్రి) వగు నీకు నమస్కారము. జగద్రూపమునే కాక, దానికి ఆధారమైన అంతరాత్మ స్వరూపముకూడ తాల్చిన వేదజనకుడవగు (విశ్వకర్మకు) నీకు నమస్కారము. గాయత్రీ-విశ్వకర్మల పరమతత్త్వము యజుర్వేద దర్శనమున కొంతవఱకు వివరింపబడినది.

శ్లో. శ్రుతి సూక్తాని సర్వాణి, యః క్రమేణ విభక్తవాన్,
చతుర్వేద స్వరూపేణ, వేదవ్యాసం స్మరామి తమ్.

తా॥ ఏ మహానుభావుడు సమస్తమైన శ్రుతి సూక్తరాశి ఋగ్యజు స్సామాథర్వములనెడి నాలుగు వేదములు 7 విభజించినాడో, అట్టి వేదవ్యాసుని స్మరింతును.

శ్లో. ఆత్మనః పితరౌ వన్దే, పార్వతీశ్వర రూపిణౌ,
విశ్వకర్మ దర్శన గ్రంథ నిష్పత్త్యూహ సమాప్తయే

తా॥ ఈ విశ్వకర్మ దర్శన రచన నిర్విఘ్నముగా కొనసాగ టకు పార్వతీపరమేశ్వర స్వరూపులైన నా తలిదండ్రుల శ్రీమత్పార్వతీ కోటీశ్వరాచార్య దైవతములను గూర్చి నమస్కరించుచున్నాను. (ఈ గ్రంథమును 'విశ్వకర్మ దర్శన మని కూడ అనవచ్చునని ఇందలి భావము.)

శ్లో. ప్రత్నం జ్ఞానం సమాసాద్య, ప్రత్నానంద య ఈరితః
సోఽహం ప్రత్నర్షి మాత్మజ్ఞో గోత్ర కర్తార మాశ్రయే

తా॥ ఏ నేను సనాతనమైన వేదవేదాన్త విజ్ఞానము నార్జించి ప్రత్నానంద స్వామి అని పిలువబడితినో, అట్టి ఆత్మవేత్త నైన నేను నా గోత్రకర్త అయిన ప్రత్నబ్రహ్మ ఋషిని ఆశ్రయించుచున్నాను.

శ్లో. ఋగ్వేద దిగ్దర్శనాది షట్కనిర్మి త్యనంతరం
క్రియతే శ్రీ విశ్వకర్మ విశ్వరూపాఖ్య సత్కృతిః.
సర్వవేదోపనిషదాం, సారరూపా సదాశ్రయా
యస్యా నామాంతరం సద్భి "ర్విశ్వకర్మ మయం జగత్
ఇతి ప్రోక్తం భవేద్విద్వ దానందాయ ప్రజాహితమ్.

తా॥ ఋగ్వేద దిగ్దర్శనము మొదలగు ఆరు గ్రంథముల రచించిన పిమ్మట విశ్వకర్మ విశ్వరూపమనెడి సత్ గ్రంథః రచింపబడుచున్నది. ఇది సర్వవేదోపనిషత్తుల యొక్క సా మైన సద్విషయములకు ఆశ్రయము. దీనిని 'విశ్వకర్మమయ జగత్' అనెడి మరొక పేరుతో కూడా పిలువవచ్చును. ఇ విద్వాంసులయొక్క ఆనందమునకునూ, పాఠకుల యొక హితము కొఱకునూ తగిన గ్రంథము.

# వేదవేత్త సర్వదేవతా స్వరూపుడు

"యావతీర్వై దేవతా స్తా స్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి.
తస్మాద్ బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివేదివే
నమస్కుర్యా న్నాశ్లీలం కీర్తయే
దేతా ఏవ దేవతాః ప్రీణాతి."

ప్రతి వైదిక కార్యము నందును యజమానుని "యో వై తాం బ్రహ్మణో వేద, అమృతేనావృతాం పురీం" అనెడి మంత్రములతో దీవించుట వేద సంప్రదాయము. అట్టి ఆశీర్వచన మంత్రములోనిదే పైన చూపిన మంత్రము. దాని భావమిది.

ప్రకృతిలో ఎన్ని దైవశక్తులు కలవో, అవి అన్నియూ వేదార్థము నెఱిగిన బ్రాహ్మణుని ఆశ్రయించి ఉండును. కావున వేదవిదులైన బ్రాహ్మణులకు ప్రతిదినము నమస్కరించుచు వారి అనుగ్రహమును పొందవలయును. అంతేకాని వారిని కఠిన వాక్యములచే దూషింపరాదు. వారిని గౌరవించి ఆరాధించువారిని వేదవేత్తల యందున్న దేవతలు దయ చూచి కాపాడుచుందురు.

ఈ మంత్రము వేదదేవతల ప్రభావము నెఱిగినవారు బ్రాహ్మణులనియు, అట్టివారిని నిందింపక పూజించినవారు

దేవతానుగ్రహమునకు పాత్రులగుదురనియు వక్కాణించు చున్నది. ఇది వేదార్థము నెఱిగి ఆచరించి దివ్యశక్తులను పొందినవారిని గూర్చి చెప్పినదేకాని, కేవలము మంత్ర పాఠకులను గూర్చి చెప్పినదికాదని గ్రహింపవలసియున్నది. వేదార్థవిదుల దేవతా వశీకరణ ప్రభావమును గూర్చి దీనికి ముందరి మంత్రమేమనుచున్నదో చూతము.

"బ్రాహ్మణో వై సర్వా దేవతాః.
స్సర్వాభి రేవైనం దేవతాభి రుద్ధరతి".

బ్రాహ్మణుడనగా వేదార్థ జ్ఞాని, సమస్త దేవతా మయుడు. ప్రకృతిలోని సమస్త దైవశక్తులతోను వేదజ్ఞుడైన బ్రాహ్మణుని సృష్టి జరుగును. పురుషసూక్తములోని ఇంకొక మంత్ర మేమనుచున్నదో చూడుడు.

"యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్
తస్య దేవా అసన్ వశే."

తా॥ ఏ వేదపాఠకుడు ఈవిధమైన పురుష సూక్త భావమును తెలిసికొనుచున్నాడో, అట్టివానికి దేవతలు వశమై యుందురు. ఈ వాక్యము పురుషసూక్తమునకు మాత్రమే సంబంధించినదైనను, సమస్త వేదరాశికి కూడ అవి అన్వయించునని మరవరాదు. అనగా ఏ విజ్ఞుడు వేదార్థము నెఱింగి, దానిని త్రికరణశుద్ధిగా అనుష్ఠించునో, అట్టివానికి

ప్రకృతిలోని దైవశక్తులు వశములైయుండునని సారాంశము. ఇట్టి వేద వాక్యములు కేవలము వేదపఠన మాత్రము చేత ప్రయోజనము లేదనియు, అర్థ భావ సహితముగా దాని నెఱిగి ఆచరించిననే ప్రయోజనమనియు జనులను హెచ్చరించుచున్నవి. ఇట్టి స్థితిలో ఈనాడు కేవల వేద పాఠకులు వేద పండితులుగా లెక్కింపబడుట ఆశ్చర్యము కాదా!

"సక్తు మివ తితఉనా పునన్తో
యత్రధీరా మనసా వాచ మక్రత,
అత్రా సఖాయ స్స ఖ్యాని జానతే
భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి."

— ఋగ్వేదము 10-71-4.

ఈ మంత్రమేమో వేదవాగ్బ్రహ్మము యొక్క తత్త్వము నెఱిగినవారి వాక్కులయందు మంగళకరమైన లక్ష్మి నివసించునని పలుకుచున్నది. కనుక వేదమంత్రావగాహనము కలవారి మాటలు మంగళప్రదమని తెలియుచున్నది.

వసువులు, రుద్రులు, ఆదిత్యులు అనెడి దేవతలు మన శరీరము నందు కూడ ఉన్నారని మన వేద దర్శనములలో మనము చదివేయున్నాము. ఇంకనూ తేటతెల్లముగా శరీరము నందలి వారి ఉనికిని విశదముగా పరికింతము.

**మిత్రా వరుణులు :**

మనము వసు, రుద్ర, ఆదిత్యులనెడి దేవతలను ఎఱిగియే యున్నాము. మిత్రుడు, వరుణుడు అను దేవతలు కవలలు. అనగా జంటగా పుట్టినవారన్నమాట. ఈ మిత్రా వరుణులు మన శరీరము నందు ముఖ్యభూతులై యున్నారు. ఎట్లో చూతము— "ప్రాణో వై మిత్రః అపానో వరుణః" అని తైత్తిరీయ సంహిత (5వ కాండం, 3వ ప్రశ్న, 17వ మంత్రము) చెప్పుచున్నది. ప్రకృతిలోని ఈ మిత్రా వరుణులు వరుసగా పగటికిని, రాత్రికిని, అధిపతులని వేద సంప్రదాయము. వారు శరీరము నందు "ప్రాణాపాన వాయు రూపులే" అని చెప్పు వేద వాక్యము మనలోని మిత్రావరుణుల అనుగ్రహమును మనము పొందవలయునని మనలను ప్రబోధించు చున్నది.

ఈ మిత్రా వరుణులే కుడి, ఎడమ నాసారంధ్రము లందలి ప్రాణవాయువులని గ్రహింపవలయును. ఆ కుడి, ఎడమలు పింగళా, ఇడా నాడులకు సూర్య చంద్రు లధిపతులని మనకు స్వరశాస్త్రము చెప్పుచున్నది. మిత్రా వరుణులు కవలలైనట్లు కుడి, ఎడమ రంధ్రములందును ప్రాణ వాయువు జంటగానే సంచరించుచున్నది. కనుక ప్రతి మానవుడు మిత్రా వరుణారాధన చేయుట యనగా, ప్రాణాయామము ద్వారా స్వప్రాణ రక్షణ చేసికొని చిరంజీవియై మనుటయే.

వేదములందుకూడా బహుమంత్రములలో మిత్రా వరుణులను గూర్చి స్తుతులు, ప్రస్తావనలు కాంచగలము.

వేద పఠన ప్రారంభ సమయమున మన మీ దిగువ శాంతి మంత్రమును చదువుచుందుము.

"శం నో మిత్ర శ్శం వరుణః, శం నో భవ త్వర్యమా,
శం న ఇంద్రో బృహస్పతిః, శం నో విష్ణు రురుక్రమః-
నమో బ్రహ్మణే, నమ స్తే వాయో!
త్వ మేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వా మేవ ప్రత్యక్షం
బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యం
వదిష్యామి, తన్మామవతు, తద్వక్తారమవతు,
అవతుమాం, అవతువక్తారం, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః."

ఈ మంత్రమున మొదటగా స్మరింపబడిన మిత్రా వరుణులు బ్రహ్మాండములోని జగత్పాలకులేకాక, పిండాండమున (శరీరమున) సూర్య చంద్ర రూపులై ప్రాణ వాయు స్వరూపముగా ముక్కు రంధ్రములలో సంచరించు దేవతలే అని తెలియవలయును. అట్టి మిత్రా వరుణులను ప్రాణాయామ విధానము ద్వారా వశము చేసికొని, ధ్యాన సమాధుల మూలమున అణిమాద్యష్ట సిద్ధులను సైతము సాధించుమనియే జనులను ఈ శాంతి మంత్రము ప్రబోధించుచున్నది. వీరి ప్రాముఖ్యమును చెప్పుటకే వీరిని, మంత్రము మొదటగా పేర్కొని పిమ్మట ఇంద్రాదులను ప్రస్తావించినది.

"సమస్తే వాయో" అనుటయు, "త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మ" అనుట కూడ శరీరమున ప్రాణవాయువు యొక్క ప్రాధాన్యమును చెప్పుటకే, దానిని కాపాడుకొని దీర్ఘకాల జీవులగుటకు నరులను మేల్కొలుపుటకే. అంతేకాదు. మిత్రా వరుణుల తరువాత పేర్కొనబడిన అర్యముడు, అనగా సవిత (సూర్యుడు) సహస్రారము నందలి పర మాత్మయే ఇతడే గాయత్రీ మంత్రములోని సవిత. ప్రాణా యామాదులచేత కుండలినీ శక్తిని మేల్కొలిపి సహస్రారము నకు చేర్చుటయేకదా ఉత్తమోత్తమ యోగలక్ష్యము.

ఇక "శంనో మిత్ర శ్శం శరుణః" అనెడి మంత్ర ములోని ఇంద్ర బృహస్పతులు సరేసరి. వారు జీవాత్మకును, జగద్గురువునకు ప్రతిమూర్తులు. పిమ్మటి ఉరుక్రముడు విష్ణువే కనుక, ఆతడు కుండలినీ శక్తి స్వరూపుడే, యోగి అను వానికి ఋత సత్యములు ఆరాధింపదగిన, ఆచరింపదగిన సాధనములు. ఋతమనగా మానసిక సత్యము. సత్యమనగా వాచిక సత్యము. ఇవి యోగి యగువానికి ఆచరింపదగిన "అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యము" ల లోనివే. బాహ్యమునన్న మిత్రా వరుణులు జగత్పాలకులై విశ్వోప కారమును చేయుచుండగా శరీరములోనున్న మిత్రావరు ణులు (కుడి, యెడమ నాసారంధ్రములలోని ప్రాణ వాయు వులు) శరీర రక్షకులై జీవాత్మతో గాఢ సంబంధము కలిగి

అతని నిలకడకు, పోకడకు పరమాధారభూతులై యున్నారు.

కుడి ఎడమ నాసారంధ్రము లందు సూర్య చంద్రులుగా సంచరించుచున్నారనుకొన్న యీ మిత్రా వరుణులే విశ్వకర్మ సూక్తమునందలి దిగువ మంత్రమున ఇట్లు పేర్కొనబడినారు.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ, ఆది
ద్గంధర్వో అభవద్ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనామ్."

ఇది యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తములోనిది. దీని భావమిది— విశ్వకర్మ మొదట, దేవుడైన త్వష్ట బ్రహ్మ అయినాడు. ఆవల రెండవవాడుగా గంధర్వుడు-సూర్యుడయినాడు. ఇక మూడవవాడుగా ఓషధీపాలకుడైన చంద్రుడైనాడు. ఇది బ్రహ్మాండ పక్షార్థము. పిండాండ పక్షమున విశ్వకర్మ శరీరమునందలి జీవుడయినాడు. ఆవల ఆ జీవుని నిలకడకు సాధనభూతులయిన సూర్య చంద్ర (పింగళా-ఇడా) నాడులయినాడు. అనగా ప్రాణాపాన వాయువులయినాడని భావము. కావున వేదలక్షణమైన వాక్కును ధరించువాడు గంధర్వుడు; సూర్యుడని భావము. సూర్యుడు త్రయీ (వేద) మయుడని మన మెఱుంగుదుము. "సూర్యో గంధర్వ స్తస్య కిరణా న్యప్సరసః" సూర్యుడు గంధర్వుడనియు, అతని

కిరణములు అప్సరసలనియు యజుర్వేదమన్నది. ఇదే భావమును "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః" అనెడి మంత్రము కూడ చెప్పినదని తెలిసికొందుము

మిత్రావరుణాగ్నుల ప్రాధాన్యమునూ, పిండ బ్రహ్మాండముల యందు వారి అవసరమునూ, జగత్ ప్రసిద్ధ మయిన ఋగ్వేదమంత్ర మింకొకటి పరమ సత్యముగా వాకొనుచున్నది. దానిని పరిశీలించి చూతము.

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహురథో
దివ్య స్స సుపర్ణో గరుత్మాన్,
ఏకం స ద్విప్రా బహుధా వద
న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః."

— ఋగ్వేదము 1-164-46.

"ఏకం సత్" అని విశ్వాద్వైతమును వక్కాణించు ఈ మంత్రము వేద మంత్రరాశిలో కిరీటము వంటిది. అంతే కాదు. ప్రపంచ తాత్త్విక వాఙ్మయమున కూడ దీనిని మించిన పరమ సత్యమును చెప్పు మంత్రము లేదు. విశ్వకర్మ సూక్తములోని "యో దేవానం నామధా ఏక ఏవ" అనున దొక్కటే దీనికి పోలునట్టి మంత్రము. దీని యర్థమిది — ఒకే ఒక్కటైన జగత్కారణ తత్త్వము (సత్తు)ను మేధావులగు వారు ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, మంచి ఱెక్కలుగల గరుత్మంతుడు, యముడు, మాతరిశ్వుడు

(వాయువు) అని బహు నామములతో పేర్కొనుచున్నా
ఆ నామములకు తగినట్లు రూపములుకూడా భావింప
చరిత్రలు బయలుదేరినవని మనమూహింపవచ్చును. ఇక
వివరణము :-

మంత్రములో ముందు ఇంద్రనామ మున్నది.
ఇంద్రుడు స్వర్గాధిపతి. తన సుఖమును, శత్రునాశనవ
కోరు ప్రకృతి గుణములు కలవాడు. ఇతడు శరీరస్థ
జీవునికి ప్రతీక అని మనము చెప్పుకొనియున్నాము. అ
జీవునితో పోల్చతగిన వాడన్నమాట. ఈ ఇంద్రప
ఋగ్వేదములోనే పరమాత్మపరముగా గూడ ప్రయో
బడినది.

"రూపం రూపం ప్రతిరూపో బభూవ
తదస్య రూపం ప్రతిచక్షణాయ,
ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే
యుక్తా హ్యస్య హరయ శ్శతా దశ."

— ఋగ్వేదము 6-47.

ఈ మంత్రమున ఇంద్ర శబ్దము పరమాత్మ వాచక
ఆ పరమాత్మ మాయావశమున ప్రతి శరీరమునను
బింబరూపుడై యున్నాడు. అనగా అతడే ఇంద్ర వరు
రూపములను దాల్చి తోచుచున్నాడన్నమాట. ఆరా
బడుచున్నాడనియు భావము. ఈ భావము "ఏకం స

అనెడి మంత్రపు భావమునే పోలియున్నదికదా. ఇంద్ర పదమునకు జీవుడను అర్థము మన దర్శనములు చెప్పుచునే యున్నవి. మంత్రములో ఇంద్ర శబ్దము తరువాత మిత్రా వరుణ పదములు కలవు. ఈ మిత్రావరుణులు సూర్యచంద్ర నాడీ (పింగళ, ఇడ) స్వరూపులని మనము చదివియే యున్నాము. ఇకపోగా 4వ వాడు అగ్ని. చంద్రసూర్యులు ఇడా, పింగళలకు అధిపతులై వాటిని సూచించునట్లే, అగ్ని సుషుమ్నా నాళమునకు అధిపతియై దానిని సూచించు చున్నాడు. ఇడా, పింగళ ద్వారా ప్రాణాయామమును చేసిన యోగి తన ప్రాణ వాయువు కుండలిని మేలుకొలుపగా దానితో సహస్రారమునకు చేరి పరమాత్మ సంయోగముచే అమృతుడగుచున్నాడు. కావున ఈ మంత్రమున మిత్రా వరుణాగ్నులు పింగళ, ఇడా, సుషుమ్నలకు సంకేతములై కుండలినీ యోగము నాచరించి మానవులు ముక్తినందవలెనని సూచించుచున్నారు.

"శం నో మిత్ర శ్శం వరుణః" అనెడి మంత్రము కుడి, యెడమ నాసారంధ్రములతో నొనర్చు ప్రాణాయామమును సూచింపగా, "ఇంద్రం, మిత్రం, వరుణ, మగ్నిమాహుః" అనెడి మంత్రము ఇడా, పింగళల తరువాతిదైన సుషుమ్ననే ఏల సూచింపవలెను ? ఆ స్థానమున వేదపురుషుడు అగ్ని పదమునే ఏల ప్రయోగింపవలయును ? ఇది అంతయు వేద మాతకు కుండలినీయోగముపైనున్న ప్రధాన దృష్టికి

సూచకము కాదా ! కావున ఇంత లోతుగానూ, ఉన్నతము గానూ, అటనట పడియున్న వేదమంత్రములనేరి సమన్వ యించుకొని మనము తత్త్వసిద్ధిని పడయవలసియున్నది. అగ్ని మోక్షసాధకుడు, మోక్షప్రదాత అను విషయమును దిగువ మంత్రము వక్కాణించుచున్నది.

"అగ్నే నయ సుపథా రాయే
అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్,
యుయోధ్యస్మజ్జుహూ రాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ."

— ఋగ్వేదము 1-189-1.

ఇందు సుషుమ్నానాళాధిపతియైన అగ్ని పరమాత్మగా భావింపబడి మోక్షము నొసంగ కోరబడుచున్నాడు. "సర్వ జ్ఞుడవైన ఓ అగ్నిదేవా! మమ్ము తగిన యోగమార్గమున నడిపి మోక్షరూపమైన నిధిఉన్న తావునకు చేర్చు" మని భక్తుడు (సాధకుడు) కోరుచున్నాడు. అంతేకాదు తన యందలి అజ్ఞానరూప పాపమునుకూడ దహింపుమని వేడు చున్నాడు. ఈ మంత్రమునను్న (సుపథము) మంచి మార్గ మని చెప్పబడినట్టిది సుషుమ్నా మార్గమే. ఆ మార్గమున ప్రయాణము సాగినకాని జీవుడు సహస్రారమునకు చేరి మోక్షమునందుకొనలేడు. అగ్ని పదము యొక్క వ్యుత్పత్త్య ర్థము కూడా ఇందుకు తగినట్లేయున్నది. "అగ్రేనయతీతి

అగ్నిః” ముందుకు (పైకి) తీసికొనిపోవువాడు కావున “అగ్ని” అని దాని వ్యుత్పత్త్యర్థము. యజ్ఞయాగాదులు చేయువారిని పైనున్న స్వర్గమునకు చేర్చువాడని ఒక భావము.

ఈ “అగ్నేనయ సుపథా” అను మంత్రమును గాయత్రీ మంత్రము వలె తత్త్వ సాధకులు జపించి, భావన చేసి, యోగసిద్ధిని పొందవచ్చును. వేదములో జపయోగ్యము లైన గాయత్రీ మంత్రము వంటివి అరుదుగా నుండును. అట్టి వాటిలోనిదే ఈ “అగ్నేనయ సుపథా” అనెడి మంత్రము.

ఈ మంత్రమునకు యోగులలో కుండలినీ శక్తిని మేలుకొలిపి సుషుమ్నా నాళము ద్వారా (పైకి) సహస్రా రమునకు చేర్చువాడని ఆధ్యాత్మిక భావము. చంద్ర సూర్యులు ఇడా, పింగళలయందు సంచరింపగా, ఇక “అగ్ని” తిరుగాడు సుపథము సుషుమ్నా, నాళమే. కావుననే ఉప నిషత్తు— “శతం చైకాచ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధానమభినిః సృతైకా” హృదయమున సంచరించు శతా ధిక నాడులలో ఒక్కటి మాత్రమే శిరస్సునకు ప్రయాణము చేయుచున్నదన్నది. మిత్రావరుణాగ్నుల ప్రాధాన్యము పిండాండమున ఇంతగా నుండుటంబట్టియే “ఏకం సత్” మంత్రము “ఇంద్రం, మిత్రం, వరుణ, మగ్ని, మాహుః” అన్నది. ఇంద్రపదముచే చెప్పదగిన జీవునికి శరీరమున ఇడా,

పింగళా, సుషుమ్నలతోటి పొత్తు (పని) ఇంతగానున్నదః
మాట.

ఇక తరువాతిమాట "గరుత్మాన్" అనునది, రెం
రెక్కలు గల గరుత్మంతుడు స్వర్గమునకు పోయి అమృ
భాండమును తెచ్చినాడని పురాణకథ. మంత్రములోని గ
త్మంతుడు ఇడా, పింగళనెడి రెండు రెక్కలుగల హంసరు
జీవుడే (లేదా ప్రాణమే) అనికూడా అనుకొనవచ్చు
మంత్రము ఇంద్రపదముచేత జీవుడని సాధారణముగా చె
గరుత్మంతుడను మాటచేత ఆ జీవుడు ఇడా, పింగళల
రెక్కలుగలవాడని చెప్పినదని భావించుట సముచితము. స
మొదట ఇంద్రపదముచే పేర్కొనబడిన జీవుడు గరుత్మంతు
అనగా ఇడా, పింగళలనెడి రెండు రెక్కలుగలవాడ
మాట. అంతమాత్రమున అతడు పక్షికాదని "దివ్య" పద
చెప్పుచున్నది.

ఇక 4వ పాదమున "అగ్నిం యమం మాతరిశ్వ
మాహుః" అని ఇందు అగ్నిని రెండవసారి పేర్కొ
దాని ప్రాధాన్యమును సూచించుటకే. అనగా ప్రాణాయా
ప్రక్రియచే ప్రాణము సుషుమ్న యందు ప్రవేశించిననే
అమృతత్త్వము కలుగదని రహస్యము. అందుకే మ
'అగ్ని'పద ప్రయోగము. ఈ మిత్రావరుణాగ్నులను ఁ
ధింపనిచో, నీకు మృత్యువే శరణ్యమని తరువాత "య

పదము ప్రయోగింపబడినది. తరువాతి మాట "మాతరిశ్వ" డనునది. అనగా గాలి లేక ప్రాణవాయువు అన్నమాట. దీనినికూడా రెండవసారి ప్రయోగించుటకు కారణము ప్రాణమును ఆరాధించి పెంచుమని చెప్పుటకే. అనగా ఆయు ర్వృద్ధిని పొంది జ్ఞానవిజ్ఞానములను సంపాదింపుమని తేలు చున్నది. ఋగ్వేదములోని ఇంకొక మంత్రము ఈ రహస్యము లను ఇట్లు చాటుచున్నది.

"మహానాదిత్యో నమసోపసద్యః
యాతయ జ్జనో గృణతో సుశేవః
తస్మా ఏతత్పన్యతమాయ జుష్టం
అగ్నౌ మిత్రాయ హవి రాజుహోత."

— ఋ. 3-59-4.

తా॥ ప్రతి దినమును తనను ఆరాధించుటకై జనులను మేలుకొలుపు ఆదిత్యుడు (సవిత-సూర్యుడు) మహాత్ముడు. అనగా జగన్నిర్మాతయైన పరమాత్మయే అన్నమాట. కనుకనే ఆ జగత్కారణుడు సర్వులచే, నమస్కారాద్యర్చనలచే పొందదగినవాడు. ఈ విధముగా అందఱియొక్క శిరఃప్రదే శముననే ఉండి వారిని ప్రబోధించు పరమాత్మను గూర్చి నిత్యము అగ్నియందు ఆహుతుల నర్పించుట అను బాహ్యా ర్థము అందఱెఱింగినదే! మన మిప్పుడు అంతరర్థమును

మూతము. అగ్ని శబ్దముచేత అది అధిదేవతగా గలిగి సుషుమ్నా నాళమని చెప్పుకొన్నాము కదా! ప్రాణాయామము చేత ప్రాణవాయువును సుషుమ్నా నాళము ప్రవేశపెట్టి యోగాభ్యాసము చేయుట కుండలినీ యోగాభ్యాసపరులకు అపరిచితము కాదు. వారు ప్రాణాయామము ద్వారా తమ ప్రాణమును సుషుమ్న యందు ప్రవేశింపజేసి కుండలినీ శక్తిని మేలుకొల్పి సహస్రారమును చేరుకొనుటయే. ఈ మంత్రము సూచించిన మిత్రునికి హవిస్సుల నర్పించుట. ఇట్టి యోగకార్యమున గెలుపొందిన సాధకుడు సహస్రారమునకు చేరుకొని పరమాత్మలో లీనమై అమృతుడగును. పురుష సూక్తము చెప్పిన- "తమేవం విద్వాన్ అమృత ఇహ భావతి" అన్న అమృతస్థితి ఇదియే.

"అగ్నియందు ఆహుతులను అర్పింపుడు" అను మాటను బట్టి బాహ్యార్థమును మాత్రమే గ్రహించి అందరు నిప్పులలో నేయి మొదలగు వస్తువులను కుమ్మరించుచున్నారు. కాని అది జన్మతారకమైన అంతరర్థము కాదు. ప్రాణములనెడి ఆహుతులను, సుషుమ్నా నాళమనెడి అగ్నిలో వేల్చుట (సమర్పించుట) యే నిక్కమయిన ప్రాణాహుతుల సమర్పణము కాగలదు. మనము భుజించునప్పుడు ప్రాణాహుతులను వేయుచుందుము. అవి ప్రాణములకు వేసెడి అన్నాహుతులన్న మాట. ప్రాణాయామ విధానము చేత

సుషుమ్నాగ్ని యందు వేసెడి ప్రాణములనెడి ఆహుతులే అసలైన, జన్మతారక ప్రాణాహుతులు. అవి సహస్రార పర్యంతము చేరి శివార్పితములై ప్రాణిని జన్మబంధ ముక్తుని చేయును. తపస్సాధ్యములగు నిట్టి గంభీరార్థములు వేదపురుషుని హృదయమున ఎన్నియో కలవు.

పశుబంధ మనగా యజ్ఞాదుల యందు పశువులను బంధించి చంపుట అని తలంచుచున్నారు. కాని అది నిక్కమైన, ఆంతరికమైన పశుబంధము కాదు. శతపథ బ్రాహ్మణము "ప్రాణబంధ ఏవ పశుబంధః" అన్నది. ప్రాణములను యోగవిధానము చేత బంధించుటయే, అనగా ప్రాణాయామమే సత్యమైన పశుబంధమన్నమాట. ఇట్టి రహస్యార్థముల నెఱింగి, మనము వేదానుసారులము; వైదికులము; మరియూ ఆ వేదార్థమును ఆచరించిన బ్రాహ్మణులము కావలయును. వేదము బ్రహ్మము కావున, దాని సత్యముల నెఱింగి ఆచరించిన యాతడే నిజమగు బ్రాహ్మణుడగుచున్నాడు. అట్టివానియందే దేవతలు నివసింతురు. వాడే సర్వ దేవతా స్వరూపుడు. వానికి నమస్కరించిననే ధన్యత.

"యావతీర్వై దేవతా స్తా స్సర్వా వేదవిది బ్రాహ్మణే వసన్తి ..." అనెడి మంత్రములో ఇంత గంభీరార్థము ఉన్నది.

## బ్రహ్మను, వేదములను సృష్టించినది విశ్వకర్మయే.

"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం,
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై,
తం హ దేవ మాత్మబుద్ధి ప్రకాశం
ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే."

— శ్వేతాశ్వతరోపనిషత్ 6-18

టీక :- యః=ఏ విశ్వకర్మ, పూర్వం = సృష్ట్యాది యందు, బ్రహ్మాణం=బ్రహ్మదేవుని, విదధాతి=సృష్టించెనో యో వై=ఎవడు, వేదాం శ్చ=వేదములను, తస్మై = ఆ బ్రహ్మకొఱకు, ప్రహిణోతి=ఒసంగెనో, అనగా వేదముల సృష్టించి బ్రహ్మకొసంగినాడో అని భావము. ఆత్మబుద్ధి ప్రకాశమ్=సాధకుల యొక్క ఆత్మబుద్ధిని ప్రకాశింపచేయు వాడగు, తంహ దేవమ్ = ఆ దేవుడగు విశ్వకర్మను ముముక్షుః=సంసారబంధము నుండి ముక్తి పొందదలచినవా నైన, అహమ్=నేను, శరణం ప్రపద్యే = శరణు పొంది చున్నాను.

ఈ మంత్రమున ప్రస్తావింపబడిన దేవుడు విష్ణువ సామాన్యముగా తలచుచుందురు. పురాణములు విష్ణు కుమారుడు 'బ్రహ్మ' అని చెప్పుచున్నందున అట్టి భావవ

సాధారణముగా కలుగుచుండును. ఇందుకు మన పురాణ కథలే కారణము. కాని వేదము ననుసరించి చూచినచో, ఆ దేవుడు విశ్వకర్మ యని మనకు స్పష్టము కాగలదు. ఎట్లో చూతము.

యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తమునందలి దిగువ మంత్రము విశ్వకర్మ నుండి బ్రహ్మదేవుడు, సూర్యచంద్రులు కలిగినారని చెప్పుచున్నది.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆదిద్గంధర్వో అభవ ద్వితీయః
తృతీయః పితా జనితౌషధీనా
మపాంగర్భం వ్యధధాత్పురుత్రా."

ఇందలి భావము : విశ్వకర్మ మొదట సృష్టికర్తయైన బ్రహ్మదేవుడైనాడు. ఆవల సూర్యచంద్రులుగా రూపొంది నాడు. అనగా ఆయనయే బ్రహ్మ, సూర్యచంద్రులుగా అయినాడని భావము. అనగా వారిని సృష్టించినాడని సారాంశము. ఉపనిషత్తు పేర్కొనిన ఈ బ్రహ్మ ఋగాదివేదముల యందు త్వష్టగా మొదట వర్ణింపబడినాడు. ఆవల ఆ త్వష్టయే బ్రాహ్మణారణ్యకాదులలో బ్రహ్మగా పేర్కొన బడినాడు. ఈ అంశమును వేదపరిశీలనచే మనము ఎఱుంగ వచ్చును ఇందుకు యజురారణ్యకములోని పురుషసూక్త మంత్రమే పరమ ప్రమాణము—

"విశ్వకర్మణ స్సమవర్తతాధి,
తస్య త్వష్టా విదధ ద్రూపమేతి."

విశ్వకర్మ నుండి త్వష్ట వెలసినాడని మంత్ర భావ
ఈ అంశము మదీయ మిత్రసాహస్రిలో ఇట్లు పేర్కొ
బడినది.

"విశ్వకర్మ తాల్చు వివిధావతారాల
త్వష్ట రూపు తొలిది తఱచి చూడ,
త్వష్ట విశ్వకర్మ తనయుడే అనియును,
ఇరువురొక్క రూపమే యటంచు
శ్రుతులు, శాస్త్రములను నుతియించుచున్నవి.
విశ్వహిత చరిత్ర వినర మిత్ర."

కనుక పైని పేర్కొన్న వేదవాక్యములను బట్టి "
కర్మా హ్యజనిష్ఠ దేవః" అన్న మంత్రములోని దేవుడు త
అనియు, ఆతని జనకుడు విశ్వకర్మ యనియు వేదప్రమ
సిద్ధము. కాగా, సాయణులు పై వాక్యమునకు భాష్య
వ్రాయుచు-

"సత్యలోకవాసియైన బ్రహ్మదేవుడు, ఆ విశ్వ
యొక్క బొడ్డు నుండి కలిగినాడని" వ్రాసినారు. ఇది పు
ప్రభావముచే వ్రాసిన మాట. సాయణులు యజురార
పురుషసూక్తమును దృష్టిలో నుంచుకొన్నచో ఇట్లు జరి
కాదు. అందుకే ఆయన 'విష్ణు-విశ్వకర్మలు' అభేదరూప
తన భాష్యములందు వ్రాయుచుండుదు. అస్తు.

ఇక "యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను వాక్యమునకు ఋగ్వేద ప్రమాణమును చూతము. ఋగ్యజుర్వేదముల యందలి విశ్వకర్మ సూక్తములు రెంటనూ "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అన్న వాక్యమునకు "మంత్ర రూపాయా వాచః పతిం పాలకం" అని వ్రాసినారు. మంత్రరూప వాక్యములు వేదములే కదా. వాటికి పతి- అనగా సృష్టికర్త విశ్వకర్మయే యని వేదవాణి గంట కొట్టినట్లుగా చెప్పినది కదా! విశ్వకర్మ వేదములను సృష్టించి త్వష్టకు అనగా బ్రహ్మదేవునికి ఇచ్చినాడని తేలిన సారాంశము. బ్రహ్మకు, వేదములకు, సృష్టికర్తయైన విశ్వకర్మను, మోక్షార్థినై నేను శరణు పొందుచున్నానని శ్వేతాశ్వతర మంత్ర రహస్యార్థము అని సమన్వయము. ఆ జగత్కారణమును విశ్వకర్మ పదముచే పేర్కొనుటయే శ్వేతాశ్వతరోపనిషత్తునకు ఇష్టము. ఇది పూర్తిగా విశ్వకర్మ సూక్తము ననుసరించి వెలువడిన ఉపనిషత్తు. కనుకనే 4వ అధ్యాయమునగూడా దిగువ మంత్రము ఇట్లనుచున్నది.

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః,
హృదా మనీషా మనసాభి క్లృప్తో
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి." 4-17

దీనికి శ్రీ వడ్డెపాటి నిరంజనశాస్త్రి గారి తెలుగు అనువాద పద్యము-

తే. గీ. "ఇతఁడు విశ్వకర్మ, ఈ దేవుఁడు మహాత్మ,
ఁడెపుడు నిలుచు, జనుల హృదయమందు
ఎవ్వరీమనీష నెదలోన భావింతు
రమృతులగుదు రెల్ల రట్టివారు."

ఇంకొక మంత్రము ఆ విశ్వకర్మ యొక్క సర్వేశ్వరత్వ
ఇట్లు చాటుచున్నది.

"త మీశ్వరాణాం పరమం మహేశ్వరమ్,
తం దేవతానాం పరమంచ దైవతం,
పతిం పతీనాం పరమం పరస్తాత్,
విదామ దేవం భువనేశ మీడ్యమ్." 6-7

తా॥ ఆ దేవుఁడు ఈశ్వరులకెల్ల పరమేశ్వరుఁడు
తల కెల్లా పరదేవత. పతులకెల్ల పరుఁడైన పరమపతి.
భువనేశ్వరుని ఎఱుఁగుదుము గాక! అను ఈ భావ
అన్నియూ విశ్వకర్మ సూక్తములోని—

"యో దేవానాం నామధా ఏక ఏవ"
"పరో దివా పర ఏనా పృధివ్యా పరో దేవేభి
రసురైర్గుహాః"

అను మంత్రము ఆధారముగా వెలువడినట్టివే. ఁ
మంత్రమును చూతము.

"అనాద్యనంతం కలిలస్య మధ్యే
విశ్వస్య స్రష్టార మనేక రూపం

విశ్వస్యైకం పరివేష్టితారం
జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః."
శ్వేతాశ్వతరము. 6-13

ఆతడు ఆద్యంతములు లేని శాశ్వతుడనియు, విశ్వములను సృష్టించినవాడనియూ, ఆ విశ్వమునందంతటా నెలసి ప్రకాశించువాడనియూ, ఆతనిని తెలిసికొని మనుజులు సంసారపాశముల నుండి ముక్తులగుదురనియూ మంత్రభావము. ఈ మంత్రమును విశ్వశబ్దము ఆవృత్తమగుట (మరల వచ్చుట) గమనింపదగినది. విష్ణుసహస్ర నామములు కూడా "విశ్వం, విష్ణుర్వషట్కారః" అని విశ్వ శబ్దముతో ప్రారంభమగుట, విష్ణు- విశ్వకర్మల అభేదమును ప్రకటించుటకే అని తెలియవలెను. శ్వేతాశ్వతరోపనిషత్తు విశ్వకర్మ శబ్దముతోపాటు శివ, రుద్ర శబ్దములను కూడా వాడి, ఆ ఉభయుల అభేదమును కూడా వక్కాణించినది. చూడుడు.

"యదా తమ స్తన్న దివా న రాత్రిః
న సన్న చాస చ్ఛివ ఏవ కేవలః." 4-18

రాత్రింబవళ్ళు, వెలుగు చీకట్లు, సదసత్తులు- మొదలైన ద్వంద్వములు లేనప్పుడు, కేవల శివతత్త్వము మాత్రమే కలదని మంత్రభావము. ఇది నాసదీయ సూక్త భావమే ! ఇక రుద్రాది శబ్దములెట్లు ఇందు ప్రయోగింపబడినవో చూతము.

"ఏకోహి రుద్రో నద్వితీయాయ తస్థు
ర్య ఇమాన్ లోకానీశత ఈశనీభిః,
ప్రత్యఙ్ జనాం స్తిష్ఠతి సంచుకోపాన్తకాలే
సంసృజ్య విశ్వాభువనాని గోపాః" శ్వేతాశ్వ 3-2

తా॥ ఏ రుద్రుడు తన నియామక శక్తిచేత జగత్తు లను నియమించుచున్నాడో, అట్టి రుద్రుడొక్కడే స్వతస్సిద్ధుడై యున్నాడు. ఆతడు తననుండియే మహదాది సృష్టి ద్రవ్యమును వెలువరించి సృష్టిచేసి ప్రతిరూపమునందునూ, తానే నివసించుచున్నాడు. ఈ విశ్వ భువనములను సృష్టించి రక్షించుచూ, చివరకు (అంతకాలమున) తనలో లీనము చేసికొనుచున్నాడు- అనునది ఈ పై మంత్ర భావము.

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా
నిషసాద పితా నః.
స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర
ఆవివేశ."

అనెడి విశ్వకర్మసూక్త ప్రథమ మంత్రభావమును పోలియుండుటను సాధకులు గమనించి రుద్ర-విశ్వకర్మల ఐక్యము నెట్లు సాధించుచున్నవో గమనింతురు గాక! పై రుద్ర మంత్రము తరువాతనే మూడవ మంత్రముగా విశ్వకర్మ సూక్తములోని

"విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖః"

అనెడి మంత్రము కూర్పబడియుండుటను మనము గమనింపవలసియున్నది. ఇక మరికొన్ని మంత్రములను పరిశీలింతము.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్, మాయినంతు
మహేశ్వరం,
తస్యావయవ భూతైస్తు వ్యాప్తం సర్వ మిదం
జగత్." 4-10

"యో దేవానాం ప్రభవ శ్చోద్భవ శ్చ,
విశ్వాధిపో రుద్రో మహర్షిః." 4-11
"హిరణ్యగర్భం పశ్యత జాయమానం
సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు." 4-12
"యో దేవానా మధిపో, యస్మింలోకా అధిశ్రితాః,
య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః
కస్మై దేవాయ హవిషా విధేమ." 4-13
"సర్వానన శిరో గ్రీవ, స్సర్వభూత గుహాశయః
సర్వవ్యాపీ స భగవాన్ తస్మా త్సర్వగతః శివః."
3-11

తా॥ ప్రకృతిని మాయ యని ఎఱుగవలెను. ఆ మాయకు అధిపతియే మహేశ్వరుడు. కనుక అతడు మాయి (మాయ గలవాడు) అని చెప్పబడుచున్నాడు. ఆ శివుని యొక్క ఆకాశాదులైన అవయవములచేతనే చరాచరములు వ్యాపింపబడి యున్నవి. సమస్త దేవతల జన్మనాశములకు

కారణుడైనవాడు మహర్షియైన రుద్రుడే. అట్టి ఆతడు నన్ను శుభంకరమైన బుద్ధి కలవాని నొనర్చుగాక! ఎవడు సర్వదేవతలకూ అధిపతియో, లోకములు ఎవనిని ఆధారము చేసికొని వర్ధిల్లుచున్నవో అట్టి సర్వప్రాణి శాసకుడైన దేవునికి సమస్త కర్మములు అనెడి హావిస్సులను అర్పింతుము గాక! అంతటా ముఖములు, శిరములు, మెడలు కలవాడునూ, సర్వభూతముల హృదయములందు ఉండువాడునూ, అంతటా వ్యాపించినవాడునూ అగువాడు భగవంతుడైన శివుడు- మంగళకరుడన్నమాట. ఈ మంత్రము

"విశ్వత శ్చక్షురుత విశ్వతోముఖః" అన్న విశ్వకర్మ సూక్త మంత్రమునకు "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః." అనెడి మంత్రమునకు పుట్టిన బిడ్డయే. శ్వేతాశ్వతరము నందలి జగత్కారణము "శివ విశ్వకర్మస్వరూప పరమాత్మయే" అనుటకు నమకము నందలి మంత్రము లనేకములు ఇందు స్వీకరింపబడుటయే నిదర్శనము. ఇక విశ్వకర్మ సూక్తార్థమంతయు ఇందు నిక్షేపింపబడియే యున్నది కదా! ఇంతకూ తేలిన సారాంశము-

"విశ్వకర్మా జగత్కర్తా, ప్రకృతి ర్విశ్వకర్మజా,
విశ్వకర్మాత్మకా దేవాః, విశ్వకర్మమయం జగత్."

ఇది నేను వ్రాసినట్టిదే. విశ్వకర్మయే జగములకు కర్త. ఈ చరాచర ప్రకృతి అంతయూ విశ్వకర్మ యందు తోచి

నట్టిదే. దేవతలు కూడా (జీవులతో సహా) సాక్షాత్తు విశ్వకర్మ స్వరూపులే. ఇంత ఏల! "జగమంతయూ విశ్వకర్మ స్వరూపమే" యన్నట్లు త్రిమూర్తులు కాని, పంచమూర్తులు కాని, విశ్వము కాని, విశ్వకర్మ యందు తోచినట్టిదే కాని, భిన్నము కాదని వేద హృదయము.

దీనికి తగినట్లుగానే శ్వేతాశ్వతరము నందు "విశ్వకృత్, విశ్వకర్మ, విశ్వవిత్" పదములతో పాటు విశ్వశబ్దము కూడా విశేషముగా ప్రయోగింపబడినది. అది విశ్వకర్మ పదములోని మొదటి రెండక్షరములే రూపముగా కలది. "నామైకదేశే నామగ్రహణం" నామములోని కొంత భాగమును గ్రహించినచో నామము నంతటినీ గ్రహించినట్లే. అను న్యాయము ననుసరించి ఈ విశ్వశబ్దము విశ్వకర్మ వాచకమే అగుచున్నది. అట్లే ఉపనిషత్తు ఆదినుండి చివరి వరకూ దేవపదమును కూడా ఎక్కువగానే ప్రయోగించినది. ఈ దేవ పదము విశ్వకర్మ సూక్తములో "విశ్వకర్మా వ్యాజనిష్ఠ దేవః, ఆదిద్గంధర్వో అభవ ద్వితీయః" అన్న వాక్యములోనిదే. ఇక విశ్వకర్మ సూక్తార్థ సాదృశ్యము ఉపనిషత్తు నందంతటనూ గోచరించునే యున్నది. ఇట్టి విశేషములన్నియూ "తే ధ్యాన యోగానుగతా అపశ్యన్" అన్నట్లు ధ్యానమార్గమున పయనించెడి బుద్ధితో మాత్రమే తెలియదగినవి కాని, స్థూల బుద్ధితో తెలియునట్టివి కావు. ఋగ్వేదములోని మంత్రములు కూడా అనేకము లిందు ఉన్నవి ఉన్నట్లుగానే స్వీకరింపబడుట

ఒక గొప్ప విశేషము. దానిచేత వేదానుసరణము దీనికి ప్రముఖముగా కలదన్నమాట రూఢి అగుచున్నది.

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమ చ్ఛదోవర ఆవివేశ." ఆ విశ్వకర్మయే ప్రాణుల హృదయమున జీవరూపుడై ప్రవేశించెను, అన్న భావమే-

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః" అనెడి మంత్రరూపమును తాల్చినది. అట్లే "త మేవం విద్వా నమృత ఇహాభవతి" అనెడి పురుష సూక్త వాక్యము "య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి" అనెడి మంత్ర- ఉత్తరార్ధ రూపమును పొందినది. పరిశీలించినచో ఇట్టి సాదృశ్యములు వేదోపనిషత్తులకు అనేకము గోచరింపగలవు. అట్టివే మనకు పరమ ప్రమాణములు. విశ్వకర్మ నుండియే వేదములు కలిగినవనుటకు "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అను ఋగ్వాక్యమే కాక, దానిననుసరించి వెలువడిన-

"అస్య మహతో భూతస్య నిః శ్వసిత మేత ద్య
దృగ్వేదో, యజుర్వేదః, సామవేదో హ్యథర్వాంగిరసః
అస్యై వైతాని సర్వాణి నిఃశ్వసితాని." 2-4-10

అనెడి బృహదారణ్యకోపనిషన్మంత్రము కూడా ప్రమాణమే. ఈ చర్చనుబట్టి బ్రహ్మను సృష్టించి, అతనికి అవాంతర ప్రళయానంతర సృష్టిచేయుటకు వేదములను సృజించి

ఇచ్చినది విశ్వకర్మేశ్వరుడే అనుటకు ఎవరికినీ ఎట్టిసందేహ ములు ఉండరాదు. పురాణాది గ్రంథములు ఇందుకు భిన్న ముగా చెప్పినచో వాటిని వేదప్రమాణవాదులు అంగీకరింప జాలరు. అవి వేదవిరుద్ధ కల్పనల వర్గమునకు చేరును. దేవతలు విశ్వకర్మ స్వరూపులైనట్లు, వేదముకూడ విశ్వకర్మ స్వరూపమే.

విశ్వకర్మను గూర్చి గ్రంథకర్త అభిమానముతో వ్రాసిన వ్రాతలు కావివి. పక్షపాతముతో వ్రాసినవి అసలే కాదు. వేదములయొక్క, అందును ముఖ్యముగా ఋగ్వేదము యొక్క ప్రమాణముల నాధారము చేసికొనియే ఆచార్య రచనలు వెలువడుచున్నవి. గ్రంథకర్తకు బ్రహ్మ, విష్ణు, రుద్రాదుల మీద లేశమాత్రమేని చిన్నచూపు లేదు. విష్ణు, రుద్ర, త్వష్టృ, ప్రజాపతి, హిరణ్యగర్భాదులు విశ్వకర్మనుండి కలిగినవారే అని వేదము చెప్పగా, ఆ అంశములనే గ్రంథ కర్త అనువదించి చెప్పుచున్నాడు. ఇందు అహంకారము గాని, స్వోత్కర్ష గాని ఏమాత్రమును లేదు.

వేదద్రష్టలైన వసిష్ఠ, విశ్వామిత్రాదులే తాము చేసిన కృషిమీద ఆత్మవిశ్వాసమును ప్రకటించుకొనినారు. ఋగ్వేద ములో 3వ మండలమునకు విశ్వామిత్రుడు ద్రష్ట. ఆయన ఒక మంత్రములో "విశ్వామిత్రస్య రక్షతి బ్రహ్మేదం భార తం జనమ్". 3-53-12. విశ్వామిత్రుడు దర్శించిన వేద భాగము భారత ప్రజను రక్షించుచున్నదని సాహంకారము

గను, సత్యముగను చెప్పికొనినాడు. ఔను. ఏల చెప్పి కొనడు. ప్రపంచమున గాయత్రీ మంత్రము సర్వులకు జపింప దగినదైనది కదా. అట్టి 24 అక్షరముల గాయత్రీ మంత్రము నకు ఆతడే ద్రష్ట. ఇదియొక్కటే విశ్వామిత్ర ప్రతిజ్ఞకు చాలును. అట్లే వసిష్ఠుడు దర్శించిన ఏడవ మండలములో "త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం..." అనెడి మంత్రమున్నది. దీనికి మృత్యువిమోచన మంత్రమని పేరు. ఇందలి త్ర్యయంబకుడు "రుద్రుడ"నుకొందురేమో అని శిష్య సమాహితుడైన వసిష్ఠుడే "త్రయాణాం=బ్రహ్మ విష్ణు రుద్రాణా మంబకం=పితరమ్" అని బ్రహ్మ, విష్ణు, రుద్రు లకు గూడ తండ్రియైన పరమాత్మయే- అనగా "విశ్వ కర్మయే" ఈ మంత్రమునందలి అధిదేవత అని స్పష్టము చేసి నాడు. అట్టి మృత్యువిమోచన, గాయత్రీ మంత్రములను మనకు ప్రసాదించినవారు వసిష్ఠ, విశ్వామిత్రులు.

వసిష్ఠ మహర్షి తనకు అగౌరవమని కూడ ఎంచక తాను ఊర్వశీ సంభూతుడనని కూడ ఒక మంత్రములో ప్రస్తావించుటయైనది. ఆ మంత్రమును తిలకింతము-

"ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యాం
బ్రహ్మ న్మనసోఽధిజాతః
ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన
విశ్వేదేవాః పుష్కరే త్వాదదంత!" ఋ. 7-33-11

అనేకులు తమ గుణములను చెప్పికొందురేకాని దోషములను చెప్పికొనరు. మహర్షులైనవారు మాత్రమే తమ గుణ దోషములను ప్రకటించుకొందురు. అట్టివారు చెప్పిన పరమ సత్యములను మనము అనుసరింపవలదా!

అట్లే నాల్గవ మండలమును దర్శించిన "వామదేవ ఋషి" కూడ తనను సాక్షాత్తు సర్వదేవతామయునిగాను, పరమాత్మ స్వరూపునిగాను భావించినాడు.

"అహం మను రభవం, సూర్యశ్చాహం,
కక్షీవాఙ్ ఋషిరస్మి విప్రః..." ఋ. 4-26-1.

"నేను మనుబ్రహ్మను, సూర్యుడను అయినాను. అంతేకాదు మేధావినైయు పలు మంత్రములను రచించిన 'కక్షీవంతుడ'ను ఋషినికూడ అయితిని" అని మంత్రభావము. అట్లే అంభృణ మహర్షి కూతురగు "వాగ్దేవి" కూడ పరమాత్మ భావము తనను ఆవేశింపగా, తనకు జగత్కారణముతో గల అభేదమును ఇట్లు గానము చేసినది :-

"అహం రుద్రేభి ర్వసుభిశ్చరా
మ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః,
అహం మిత్రావరుణోభా బిభ
ర్మ్యహ మింద్రాగ్నీ అహమశ్వినోభా."
ఋ. 10-25-1.

"నేను వసువులతోను, రుద్రులతోను, ఆదిత్యుల తోను, విశ్వదేవతలతోను కలసిమెలసి తిరుగుచున్నాను. అనగా వీరు నా స్వరూపులే, నాలోనివారే, నేనే" అని సారాంశము. నేను మిత్రావరుణులు, ఇంద్రాగ్నులు, అశ్వినీ దేవతలను భరించుచున్నాను- అనగా వారు నాతోనే ఉన్నారని భావము. కాగా సర్వవిశ్వమూ, మరియూ ఆ విశ్వమును సృష్టించిన జగత్కారణమూ తానే అని భావము. ఇట్టి వాక్యములు అహంకారము క్రిందికిరాక ఆత్మావలోకనము. ఆత్మానుభూతుల క్రిందికి రాగలవని సాధకు లెఱుంగవలయును. ఇట్లే అనేకులైన ఆత్మవేత్తలయొక్కయూ, జగద్బ్రహ్మ స్వరూపులైనవారియొక్కయూ భావము లుండునని అర్థము చేసికొనవలయును.

## పంచ ఋషులు

వైదిక సిద్ధాంతమున పంచసంఖ్య ఎంతో ప్రాధాన్యము కలిగినట్టిది. అనేక లౌలికాధ్యాత్మిక రహస్యములకు నిలయమైనట్టిది. ఈ పంచసంఖ్యా ప్రాధాన్యమును గూర్చి ఋగ్వేద దిద్దర్శ ప్రథమ భాగమున, 185వ పుటనుండి కొంత వ్రాయబడినది. సృష్టి పంచ భూతములతో ఏర్పాటైనది. ఆ పంచభూతములచే ఏర్పడిన ప్రాణులకు పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములుకూడా

కలవు. జ్ఞానేంద్రియములు శబ్ద, స్పర్శ, రూప, రస గంధము లనెడి విషయములను గ్రహించును. కర్మేంద్రియములు వచన, ఆదాన, గమన, ఆనంద, విసర్జనములనెడి కార్యము లను చేయును. ఈ పంచభూతములచే జరుగు క్రియలను సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములని ఐదై ఉన్నవి. అట్లు మానవులు పొందెడి అవస్థలు (దశలు) కూడా జగత్తు, స్వప్నము. సుషుప్తి, తురీయము (సమాధి), తురీయా తీతము అని ఐదై ఒప్పుచున్నవి. ఈ తురీయాతీత స్థితియే నాసదీయి సూక్తము చెప్పిన సదసదతీత స్థితి. ఇట్టి విషయము లన్నింటినీ సూచించుటకే భగవంతుడు మన కాళ్ళు, చేతు లకు ఐదేసి వ్రేళ్ళను సృష్టించినాడు. సృష్ట్యాది పంచక్రియ లకు, అధిపతులైనవారిని బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులనెడి పంచమూర్తులుగా ఎన్నినారు. వారే బ్రహ్మ లుగా ఎన్నబడినప్పుడు త్వష్ట్ర, మయ, మను, శిల్పి, విశ్వ జ్ఞులుగా ఎన్నబడినారు. వీరిని మనము వ్యవహారమున మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులని చెప్పుచుందుము. ఇందుకు తగినట్లుగానే ప్రథమ ఋషులనుకూడా ఐదుగురే అని యజు ర్వేదమన్నినది. వారే సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణు లనెడివారు. ఈ పంచ ఋషులనుగూర్చి మదీయ మిత్రసాహస్రిలో ఇట్లు వ్రాయుటయైనది.

“పూర్వ ఋషులు కూడ పొలిచినా రేవురై
పంచసంఖ్య తత్త్వ మెంచిచూడ, నట్లె

కాళ్ళు చేతులకును గలిగె నైదగు వ్రేళ్ళు
సృష్టి తత్త్వమిద్ది శిష్టమిత్ర."

ఈ పంచ ఋషులు కృష్ణయజుర్వేద (తైత్తిరీయ సంహిత) చతుర్థకాండ తృతీయ ప్రశ్నమున దిగువ మంత్రములలో ప్రస్తావింపబడినారు. ఇవి ఇష్టకోపధాన మంత్రములు. యజ్ఞకుండమున ఆ యా దిక్కులయందు బంగారపు ఇటుకలను పేర్చునప్పుడు ఈ మంత్రములను చదువుదురు. వీటికి "ప్రాచీదిశామాది మంత్రములు" లేక "పంచబ్రహ్మర్షి మంత్రముల"ని పేరు.

1) "ప్రాచీ దిశాం, వసన్త ఋతునా, మగ్ని ర్దేవతా,
బ్రహ్మద్రవిణం, త్రివృత్ స్తోమ, స్స ఉ పంచదశవర్తని,
త్ర్యవి ర్వయః, కృతమయానాం, పురో వాతో వాత,
స్సానగ ఋషిః.

2) దక్షిణా దిశాం, గ్రీష్మ ఋతూనా మింద్రో దేవతా,
క్షత్రం ద్రవిణం, పంచదశ స్తోమ, స్స ఉ సప్తదశవర్త
నిర్దిత్యవాడ్వయ, స్త్రేతాయానాం, దక్షిణా
ద్వాతో వాత, స్సనాతన ఋషిః.

3) ప్రతీచీ దిశాం, వర్షా ఋతూనాం, విశ్వేదేవా దేవతా,
విట్ ద్రవిణగ్ం, సప్తదశ స్తోమ, స్స ఉ వేకవిగ్ం శ
వర్తని, స్త్రివత్సో వయో, ద్వాపరోఽయానాం,
పశ్చాద్వాతో వాతోఽహాభూన ఋషిః.

4) ఉదీచీదిశాగ్ం, శరదృతూనాం, మిత్రావరుణౌ దేవతా, పుష్టం ద్రవిణ, మేకవిగ్ంశస్తోమ, స్స ఉత్రిణవ వర్తని, స్వర్యవాడ్వయ, ఆస్కందోఽయానా ముత్తరా ద్వాఽో వాతః ప్రత్న ఋషిః.

5) ఊర్ధ్వాదిశాగ్ం, హేమన్త శిశిరా వృతూనాం, బృహస్పతిర్దేవతా, వర్చో ద్రవిణం, త్రిణవస్తోమ, స్స ఉత్రయస్త్రి్రిగ్ంశ వర్తనిః, పష్ఠవా డ్వయోఽభి భూరయానాం, విష్వగ్వాతో వాత, స్సుపర్ణ ఋషిః."

— తైత్తిరీయ సం-4, 3-5, 6.

వీటి భావము ఇది :- 1) ఓ ఇటికా నీవు దిక్కులలో తూర్పువు. 2) ఋతువులలో వసంతమవు. 3) దేవతలలో అగ్నివి. 4) ధనములలో బ్రాహ్మణ ధనమవు. 5) స్తోమము లలో త్రివృత్తవు. 6) పంచదశ స్తోమమును ప్రవర్తింపచేయు శక్తివి నీవే. 7) వయస్సులలో అర్ధ సంవత్సరమవు. 8) యుగములలో కృతయుగమవు. 9) వాయువులలో తూర్పు గాలివి. 10) ఋషులలో సానగఋషివి. ఇట్లనుచూ దిక్కునకు 10 చొప్పున ఇటికలను పేర్చెదరు. దక్షిణాది దిక్కుల యందునూ ఇదే క్రమమున ఇష్టకా విన్యాసము (ఇటుకల పేర్పు) జరుగును విస్తరణాభయమున తక్కిన మంత్రముల అర్థమును వ్రాయలేదు. ఐననూ పంచమ దిక్కును గూర్చిన విశేషము వ్రాయవలసి ఉన్నది.

ఐదవ ప్రాచీదిశామాది మంత్రార్థము :- 1) ఓ ఇటికా నీవు దిక్కులలో ఊర్ధ్వ దిక్కువు. 2) ఋతువులలో హేమంత, శిశిరములు మీ స్వరూపమే. 3) దేవతలలో బృహస్పతివి. 4) వర్చోరూప ధనమవు. 5) త్రిణవ స్తోమ మవు. ఈవిధముగా చెప్పుచూ యుగములలో "అభిభూర్యుగ మవు" అని మంత్రము చెప్పినది. కాని మనకు కృత, త్రేతా, ద్వాపర, కలియుగములే వ్యవహార సిద్ధములు. యజుర్వేదము అభిభూర్యుగమని ఐదవ యుగమును కూడా చెప్పినది. ఈ యుగము కలియుగమైన పిమ్మట, కృతయుగము వచ్చులోపల కొంతకాలముండునని శాస్త్రము (భాష్యము). అట్లే ఋతువులు 6. వీటిని 5 దిక్కులకు పంచునప్పుడు చివ రిది మిగిలిపోవునుకదా! కనుక వేదము "హేమంత శిశిరా వృతూనాం" అని శిశిర హేమంతములను కలిపి ఒకే దిక్కు చేసినది. ఇట్టి రహస్యములు లోకమునందు కంటే వేద ప్రపంచమున అగపడగలవు. మనము సంవత్సరమునకు పండ్రెడు నెలలనియే ఎఱుగుదుము. వేదము సందర్భాను సారముగా, అధికమాసమును కూడా కలుపుకొని 13 నెలలని కూడ చెప్పుచుండును. అట్లే అధిక మాసమునకు ఒక ఋతువు కూడా కలదని, ఆ సంవత్సరమునకు మాత్రమే 'సప్తఋతువు' లంటూ ఉంటాయని వేద సందర్భానుసారముగా తెలిసికొన గలము.

ఈ 5 మంత్రములలో వరుసగా 1) సానగుడు, 2)

సనాతనుడు 3) అహాభూనుడు 4) ప్రత్నుడు 5) సుపర్ణుడు అనెడి 5 గురు బ్రహ్మఋషులు ప్రస్తావింపబడినారు. వీరికే సానగాది పంచఋషులని పేరు వీరు విశ్వకర్మ బ్రహ్మము యొక్క అంశావతారులే అనియూ, పంచ భూతములకు ప్రతినిధులనియూ, సృష్టి ప్రవర్తకులనియూ, ఈ వేదము ననుసరించి శాస్త్రస్మృతి పురాణాగమాదులు కూడా తెలుపు చున్నవి. ఈ సానగాదులకునూ మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞులనువారికినీ అభేదమును తరువాత మనము చూతుము. అందు వసిష్ఠ పురాణము ఏమనుచున్నదో చూతము. "విశ్వ కర్మ నుండి సానగాది ఋషులు ఎట్లు కలిగినారు ?" అని శౌనకుడు అడుగగా వసిష్ఠు డిట్లు చెప్పుచున్నాడు.

"సుపర్ణ, స్సానగశ్చైవ, సనాతన, ఇతి స్మృతః
గురుశ్రేష్ఠోఽహాభూనశ్చ ప్రత్నో ధాత్రీసురక్షకః
విశ్వకర్మ ముఖోద్భూతా బ్రహ్మణః పంచకీర్తితాః."
కాండము 3, అధ్యాయము-5.

సుపర్ణ, సానగ, సనాతన, అహాభూన, ప్రత్నులనెడి అయిదుగురును విశ్వకర్మ ముఖోద్భూతులైన పంచబ్రహ్మ లని తాత్పర్యము. వీరు విశ్వకర్మయొక్క సద్యోజాత, వామ దేవ, అఘోర, తత్పురుష, ఈశానములనెడి ముఖముల నుండి- సానగ, సనాతన, అహాభూన, ప్రత్న, సుపర్ణులనెడి నామములతో ప్రభవించినారని 14, 15, 16 సంఖ్యల

శ్లోకములు వివరించుచున్నవి.

"సద్యోజాతముఖే జాత స్సానగో విశ్వకర్మణః, 14.
వామదేవముఖే జాతో బ్రహ్మర్షి స్తు సనాతనః,
అఘోరముఖ సంజాతో ऽహభూనో విశ్వకర్మణః, 15
తత్పురుష ముఖే జాతః ప్రత్నో ऽసౌ విశ్వకర్మణః,
తస్యేశానముఖే జాత స్సుపర్ణో విశ్వకర్మణః 16.

విశ్వకర్మ ముఖములకు సద్యోజాతాది నామములు కలవని దీనిచే తెలియుచున్నది. ఈ సద్యోజాతాది మంత్రములు తైత్తిరీయోపనిషత్తు నాల్గవ ప్రశ్నమున ఇట్లు పేర్కొనబడినవి. వీటికి "పంచబ్రహ్మ మంత్రము" లని కూడా పేరు.

1) సద్యోజాతం, ప్రపద్యామి, సద్యోజాతాయ వై నమోనమః,
భవే భవేనాతి భవేభవస్వ మాం, భవోద్భవాయ నమః.

2) వామదేవాయ నమో, జ్యేష్ఠాయ నమః
శ్రేష్ఠాయ నమో, రుద్రాయనమః కాలాయనమః.
కలవికరణాయ నమో, బల వికరణాయ నమో,
బలాయ నమో, బలప్రమథనాయ నమః.

3) అఘోరేభ్యోऽథ ఘోరేభ్యో ఘోర ఘోరతరేభ్యః,
సర్వేభ్య స్సర్వ సర్వేభ్యో నమ స్తేऽస్తు రుద్రరూపేభ్యః.

4) తత్పురుషాయ విద్మహే, మహాదేవాయ ధీమహి,

తన్నో రుద్రః ప్రచోదయాత్.

5) ఈశాన స్సర్వవిద్యానా మీశ్వర స్సర్వభూతానాం
బ్రహ్మాధిపతిర్ బ్రహ్మణోధిపతిర్
బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్,

శివుని ముఖములకు కూడా ఈ సద్యోజాతాది నామములు కలవు. పై వసిష్ఠ పురాణము విశ్వకర్మయొక్క ముఖములకు సద్యోజాతాది నామములు కలవని చెప్పినందున వసిష్ఠునకు 'శివ-విశ్వకర్మలు', ఒకే దేవత యనెడి భావము కలదని మనము గ్రహింపవచ్చును. మూలస్తంభాది గ్రంథములు కూడా శివ-విశ్వకర్మలకు అభేదమును చెప్పుచున్నవి. "పరశివ విశ్వకర్మ" పేర "పరశివ విశ్వకర్మాగమము" అని ఒక గ్రంథము కూడా కలదు. దీనిని తంజావూరు ప్రాచ్య లిఖిత గ్రంథాలయము నుండి కీ. శే. స్వర్ణసుబ్రహ్మణ్య కవిగారు వ్రాయించి తెప్పించినారు. అది అచ్చు కాలేదు. "భవోద్భవాయ" అనుటకు "మనూద్భవాయ" అనియు, "బలప్రమథనాయ" అన్నపిమ్మట "మయోద్భవాయ" అనియు, "రుద్రరూపేభ్యః" అనుటకు "త్వష్టృరూపేభ్యః" అనియు, "రుద్రః ప్రచోదయాత్" అనుటకు "శిల్పీప్రచోదయాత్" అనియు, "బ్రహ్మాధిపతిః" అనుటకు "విశ్వజ్ఞ బ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మ శివో మే అస్తు సదా శివోమ్" అనియు, విశ్వకర్మ సంప్రదాయమునకు చెందిన

బ్రాహ్మణులు చదువుచుందురు. ఈ భేదము ఎప్పుడు కలిగినదో తెలియదు. ఇంకనూ స్కాందాది పురాణములు కూడా ఇట్టి అంశములను స్పష్టము చేయుచునేయున్నవి. వాటిని పిమ్మట చూతము.

**వీరే పూర్వ ఋషులు :**

ఈ సానగాదులను "పూర్వ ఋషులని" ఋగ్యజురాది వేదములు అనుచున్నవి. యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తము లోని-

"త ఆయజన్త ద్రవిణగ్ం సమస్మా ఋషయః పూర్వే జరితారో నభూనా, అసూర్తా సూర్తా రజసో విమానే యే భూతాని సమకృణ్వన్నిమాని."

అనెడి మంత్రమునకు భాష్యము వ్రాయుచూ సాయణు లిట్లనినారు. "త ఆయజన్త ... సమకృణ్వన్నిమానీతి- పూర్వోదాహృతేన విశ్వకర్మణా ప్రథమముత్పాదితా యే స్రష్టారః ఇమాని భూతాని = సర్వానేతాన్ ప్రాణినః, సమకృణ్వన్ = సమ్యగుత్పాదిత, వన్తః, తే పూర్వే స్రష్టారః అస్మై=సృష్టాయ జగతే, ద్రవిణం=ధనరూపం భోగ్యజాతం, సమాయజన్త = సమ్యక్ సంపాదితవంతః. కీదృశాస్తే ఋషయః= అతీంద్రియ ద్రష్టారః, సర్వజ్ఞాఇత్యర్థః. భూనా జరితారో న=భూమ్నా స్వకీయేన మహత్వేన, న కదాచిదపి జీర్ణా=నశ్వరానభవన్తి. కీదృశాని భూతాని? అసూర్తాః =

అసుభిః ప్రాణై రీరితాని-ప్రాణయుక్తానీత్యర్థః. తథా రజసో విమానే సూర్తా=రంజనాత్మకస్య విశేషేణ ప్రమితౌ స్వస్వ కర్మభిః సుష్ఠు ప్రేరితాః" దీని భావమిది:

పూర్వము చెప్పబడిన విశ్వకర్మచే సృజింపబడిన వైశ్వకర్మణులగు స్రష్టలు (బ్రహ్మలు) సానగాదులు గాని, మనుమయాదులు గాని, బ్రహ్మ విష్ణ్వాదులుగాని ధనమని చెప్పదగిన- అనుభవింపతగిన, వస్తు సముదాయమును లెస్సగా సంపాదించి (సృష్టించి) అతీంద్రియ ద్రష్టలునూ, సర్వజ్ఞులునూ అయి (ఆ సానగాది పూర్వఋషులు మాత్రమే) తమ స్వకీయ మహిమచేత, తాము ఎప్పుడునూ నశింపక, రంజనాత్మకములైన (రంజింపచేయునట్టి)టువంటి తమ తమ శిల్ప కర్మలచేత ప్రేరేపింపబడు ఈ సమస్త భూతములను, ప్రాణములతో కూడినవానినిగా పుట్టింపచేసిరి. ఇందు ఆదిమ సృష్టి కర్తలైన వారి యొక్క సృష్టి వర్ణింపబడినది. ఆ సృష్టికర్తలను "స్రష్ట" లనియూ, "పూర్వ ఋషు" లనియూ వారు జగత్సృష్టి చేసిరనియూ, ఎప్పుడునూ "జీర్ణులు" (నశించెడివారు) కారనియూ, అనుటలో సాయణుల విశాలదృష్టియూ, వివిధ వేదతత్త్వ విజ్ఞానమును వ్యక్తములగుచున్నవి. దీనిని బట్టి సానగాదులుకాని, మన్వాదులుకాని, బ్రహ్మాదులు కాని, విశ్వకర్మచే సృజింపబడిన ఆదిదైవతములనియూ, మొదటి సృష్టికర్తలనియూ, "ఋషయః పూర్వే" వారే పూర్వ ఋషులనియూ సామాన్యులకేని తెలియుచున్నది.

సాయణులు తన భాష్యమున విశ్వకర్మ, త్వష్ట, విశ్వరూపుడు, సానగాదులను గూర్చి పరమసత్యములను లెస్సగానే వ్రాసినారు. ఈ విషయములను నామిత్రసాహస్రిలో ఇట్లు ప్రస్తావించినాను.

"సాయణుండు భాష్య సారస్వతమునందు
విశ్వకర్మ, త్వష్ట్ర, విశ్వరూప,
సానగాది ఋషుల సర్వశక్తులనెన్ని
వ్రాసినాడు; కనవె వాని; మిత్ర!" 849.

ఉదాహరింపబోయెడి అథర్వ వేద మంత్రమును సైతము దృష్టిలోనుంచుకొని సాయణులు ఈ భాష్యపంక్తులను వ్రాసియుందురని తలంపవచ్చును.

"వాచస్పత ఋతవః పంచ యే నో వైశ్వకర్మణాః
పరి యే సంబభూవుః ఇహైవ ప్రాణ స్సఖ్యే నో అస్తు.
తం త్వా పరమేష్ఠిన్ పరిరోహిత ఆయుషా వర్చసా
దధాతు." కాండం-13, సూక్తం-1, మంత్రం-18.

ఈ సూక్తమునకు "రోహిత" సూక్తమని పేరు. దీని వినియోగముచేత రాజునకు రాష్ట్రమును భరించెడి శక్తి కలుగునని సాయణులు వ్రాసినారు. ఇందు వర్ణింపబడిన దేవతలు రాజునకు అట్టిశక్తిని కలిగింతురన్నమాట. ఈమంత్రము వాచస్పతిని (విశ్వకర్మను, "వాచస్పతి విశ్వకర్మాణం)" సంబోధించి చెప్పబడుచున్నది. ఇందు ఐదుగురైన విశ్వకర్మ

పుత్రులు (వైశ్వ కర్మణులు) ఆయా ఋతువులలో రాజునకు ఆయుస్సును, వర్చస్సును ఒసగి కాపాడుదురుగాక! అనుట చేత ఈ పంచవైశ్వ కర్మణులు, 'సానగాదులు' గాని, 'మనాద్వాదులు' కాని, 'బ్రహ్మాదులు' కాని అగుచున్నారనుకొనవలయును. ఈ మూడు తెగలవారికి అభేదమును తరువాత తెలిసికొందుము. వీరెల్లరునూ విశ్వకర్మ ముఖోద్భూతులే కదా! ఈ అథర్వ మంత్రము ఋగ్యజుర్వేద విశ్వకర్మ సూక్తములలో "త ఆయజన్త" అనెడి మంత్రభావమునే చెప్పుచున్నది. ఆ వైశ్వకర్మణులు రాజునుగాని, ఆతని రాజ్యమునుకాని, అందలి ప్రజలను కాని, (సమస్తమునూ) ఆయుస్తేజస్సులు కలవారినిగా ఒనర్చునని అథర్వవేద హృదయము. ఇట్టిదే మరియొక మంత్రము అథర్వవేద ద్వాదశకాండము నందలి పృథివీ సూక్తములో అగపడుచున్నది :-

"యస్యాం వేదిం పరిగృహ్ణన్తి భూమ్యాం,
యస్యాం యజ్ఞం తన్వతే విశ్వకర్మాణః,
యస్యాం మీయన్తే స్వరవః పృథివ్యాం,
ఊర్ధ్వాః శుక్రా ఆహుత్యాః పురస్తాత్,
సానో భూమి ర్వర్ధయ ద్వర్ధమానా."

అథర్వ. 12-1-13.

ఈ పృథివీ సూక్తము అథర్వ వేదములో, అతిసత్యమూ, సుందరమూ అయినట్టిది. ఈ మంత్రభావము :- ఏ భూమి

యందు విశ్వకర్మ పుత్రులైన సానగాదుల సంతానము యజ్ఞవేదులను నిర్మించి యజ్ఞములను చేయుచుందురో అట్టి భూమి తాను వృద్ధిపొందుచూ మనలను వృద్ధి పొందించు గాక! దీనినిబట్టి వైశ్వకర్మణులగు సానగాదులునూ, వారి సంతానమునూ ఈ భూమిమీద సృష్టి పుట్టిననాటినుండియూ, యజ్ఞాదులు చేయుచూ లోకక్షేమంకరులు అగుచున్నారని తెలియుచున్నదికదా! కాన సానగాదులు పూర్వ ఋషులను టలో ఎట్టి సందియమును ఉండకూడదు.

ఈ మంత్రమున ఇంకొక విశేష రహస్యముకూడా అగపడుచున్నది. విశ్వకర్మ పుత్రులైన సానగాదులను, వారి సంతానమును "విశ్వకర్మాణః" అని మంత్రము పేర్కొన్నది. విశ్వకర్మయొక్క సంతానము వైశ్వకర్మణులు కావలయును. అయిననూ అట్లనక వేదమే వారిని "విశ్వకర్మ" లని పేర్కొనుటచేత వేదపురుషునికి వైశ్వకర్మణులను, "విశ్వకర్మ" లని అనుటకూడా ఇష్టమని గ్రహింపవలసియున్నది. వారు సానగాది పంచఋషుల సంతానము కావున "విశ్వబ్రాహ్మణు" లనియూ, "పంచాహ్నేయు" లనియూ, కూడా చెప్పబడు చున్నారు. ఈ మూడువిధములైన పేర్లనూ, ఈనాటి విశ్వబ్రాహ్మణులు వాడుకొనుచునేయున్నారు. "విశ్వకర్మా చాసౌ బ్రాహ్మణః విశ్వబ్రాహ్మణః" విశ్వకర్మయైన బ్రాహ్మణుడు 'విశ్వబ్రాహ్మణుడని' వ్యుత్పత్తి. ఇది మధ్యమ పలోపికర్మధారయ సమాసము. ఇంకొక పక్షమున 'విశ్వాని

=సమస్తములైన, బ్రాహ్మణాని=బ్రహ్మకర్మలు (అనగా వేదకర్మలు), యస్యసః=ఎవనికో, వాడు 'విశ్వబ్రాహ్మణు' డనియునూ విగ్రహము-అవయవార్థము చెప్పవచ్చును."

ఈ సందర్భమున విశ్వబ్రాహ్మణేతరులు, విశ్వకర్మలు కాగూడదా? కారా? అని పాఠకులకు ఒక సందేహము కలుగవచ్చును. అట్టిదేమియునూ కాదు. సమస్తమునూ విశ్వకర్మమయమే 'విశ్వకర్మ నుండి పుట్టినదే' అని చెప్పుట మా లక్ష్యము కావున సర్వమానవులునూ, దేవతాదులు కూడా, విశ్వకర్మలు అగుటకు మాకెట్టి ఆక్షేపమునూ లేదు. ఈ అంశమును ఋగ్వేద దిగ్దర్శన గ్రంథములలో ప్రకటించియే యున్నాము. ఐతే విశ్వబ్రాహ్మణులు తమ తమ గోత్ర సూత్ర ప్రవరాదులను చెప్పుకొనగలుగుచున్నారు. ఇతరులకు అట్టి జ్ఞప్తి లేకున్నది. ఇంతమాత్రమే తేడా.

ఈ సానగాదులు పూర్వఋషులగుటయే కాదు. ఐదుగురు అగుటచేత పంచజనులనియూ, పంచ మానవులనియూ కూడా వేదముల యందు పేర్కొనబడినారు.

"త్వజ్జాతా స్త్వయి చరన్తి మర్త్యాః,
త్వం బిభర్షి ద్విపద స్త్వం చతుష్పదః,
త వేమే పృథివి, పంచ మానవా
యేభ్యో జ్యోతి రమృతం మర్త్యేభ్య
ఉద్యన్ త్సూర్యో రశ్మిభి రాతనోతి."

— అథర్వ. కాం. 12-1-15.

తా॥ "ఓ భూదేవీ! మనుష్యులు నీయందు పుట్టి నీయందే తిరుగాడుచున్నారు. నీవు రెండుపాదములు, నాలుగు పాదములు కల ప్రాణులను భరించుచున్నావు. ఓ భూమీ! ఇందలి పంచ మానవులు (పంచజనులన్నమాట) నీవారే. ఏ పంచబ్రహ్మల ద్వారా ఉదయించుచున్న సూర్యుడు మనుజులకు తన కిరణములచేత వెలుగును, అమృతమును (మానసిక దైహికారోగ్యము) ప్రసాదించుచున్నాడో!" కనుక దీనిని బట్టి ఈ భూమి పంచవిధ మానవులకు నివాసమని తేలుచున్నది.

"త ఆయ జన్త ... ఋషయః పూర్వే" అనెడి మంత్రము ఋగ్వేదములో కూడా ఉన్నది కదా! దానికి సాయణుల భాష్యము ఇట్లున్నది. "తే పూర్వే ఋషయో, అస్మై=విశ్వకర్మణే చరుపురూడాశాది లక్షణం ధనం, సం = సమ్యక్, ఆయజన్త=సర్వతోయజన్తే... యే స్థావర జంగమాత్మకే జగతి వర్తమానాన్ ఏతాన్ ప్రాణినః తేజసా సమకృణ్వన్, తే పూర్వఋషయో- ద్రష్టారో రశ్మయో అస్మై = ఆదిత్యాత్మకాయ విశ్వకర్మణే, ద్రవిణం = తేజః, ఆయజన్త."

అనగా పూర్వఋషులను, ఋషులుగానే భావింపక కిరణములుగా కూడా భావించుట ఇచ్చటి విశేషము. అట్లే విశ్వకర్మను ఆదిత్యాత్మకుడు (సూర్య స్వరూపుడు) అనుట కూడా సాయణులు చేసిన ఘనకార్యమే. ఈ సూర్యుడు

విశ్వకర్మ నుండి పుట్టినట్లు "విశ్వకర్మాహ్యజనిష్ట దేవ ఆది ద్గంధర్వో అభవద్ద్వితీయః" అనెడి విశ్వకర్మ సూక్త మంత్రము చెప్పినది కదా! ఇంకనూ గాయత్రీ మంత్రము నందలి సవిత 'ఈ విశ్వకర్మయే' యని మన దర్శనములలో చదివియే ఉన్నాము. కాన అది ఈ భాష్యకారునికినీ సమ్మ తమే అనియూ గ్రహింపదగును. "చరుపురోడాశాది లక్షణం ధనమ్" అని సాయణు లనుట వైదిక కర్మకాండ యందలి ప్రీతితో మాత్రమే. ఈ భావము యజుర్వేద మంత్ర వ్యాఖ్యాన ఘట్టమున అనలేదు. ఋగ్వేదమున ప్రస్తావింప బడిన ఋషులు పూర్వులు, నూతనులు అని రెండు విధము లుగా ఉన్నారు. ఈ అంశమును పెక్కు మంత్రములలో మనము కాంచగలము. అందు ఋగ్వేద ప్రథమ మండల ప్రథమ సూక్తములోని రెండవ మంత్రమునందే మనము కాంచగలము.

"అగ్నిః పూర్వేభిర్ ఋషిభి రీడ్యో నూతనై రుత
స దేవాగ్ం ఏహ వక్షతి." 1-1-2

ఇది అగ్ని సూక్తము. అగ్ని పూర్వులు, నూతనులు, అగు ఋషులచేత స్తుతింపదగినవాడు. అట్టి అగ్ని ఈ యజ్ఞ కార్యమునకు దేవతలను రప్పించుగాక- అని మంత్రభావము. సాయణులు ఇందలి పూర్వశబ్దమునకు అర్థము వ్రాయుచూ "పూర్వేభిః పురాతనైః, భృంగ్వంగిరః ప్రభృతిభిర్

ఋషిభి రీడ్యః" అని వ్రాసినారు. అనగా ఆ పూర్వఋషులు "భృగ్వ్యంగిరః ప్రభృతులు" అని భావము. ఆ విషయమున ఎవరికినీ అభ్యంతరము లేదు కాని వారికన్ననూ, సానగాది బ్రహ్మఋషులు పూర్వులను విషయమును మఱువరాదు. సానగాదులైన పంచర్షులు సృష్టిలోని పంచసంఖ్య భావమైన పంచభూతములను, పంచకర్మములను, పంచాంశాదులను అనుసరించి విశ్వకర్మ నుండి కలిగినారని ఇతఃపూర్వపు గ్రంథమున చదివియున్నాము. సప్తఋషులు వారి తరువాత సృష్టింపబడినట్లు ఇందలి పూర్వపదమే చెప్పుచున్నది. అది యునుగాక సాయణులే స్వయముగా 'త ఆయజన్త' అను మంత్రమునకు భాష్యము వ్రాయుచూ "పూర్వోదాహృతేన విశ్వకర్మణా ప్రథమముత్పాదితా యేస్రష్టారః" అనినారు (అనగా ఆ ఋషులు) విశ్వకర్మచే మొదటగా పుట్టింపబడినారని తానే వ్రాసినారు. కనుక అదియే పరమ ప్రమాణము. కనుక సానగాదులే పూర్వఋషులనుట వేదాభిప్రాయము. దీనికింకనూ ఇతర ప్రమాణములను చూతము.

భగవద్గీత కూడ "మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవస్తథా" అన్నది. "పూర్వేమహర్షయః" అనగా ఈ పంచఋషులే. "సప్త మహర్షయః" అనగా సప్తఋషులని అక్కడి భావము. "మహర్షయః" శబ్దానికి పూర్వే, సప్త అనువాటిని, ప్రత్యేక ప్రత్యేకముగా విశేషణములను చేయవలె. పూర్వులైన సానగ, సనాతనాది ఋషులుగాని, మను,

మయాది బ్రహ్మలుగాని పురాణవాఙ్మయమున సృష్టికర్తలుగాను, సృష్టికి సంకేతములుగాను పేర్కొనబడినారే కాని, నానావిధములైన కథలకు, కల్పనలకు పాత్రులైనవారుగా వర్ణితులు కాలేదు. దానినిబట్టికూడ వీరు పూర్వులని రూఢియగుచున్నది.

ఇంతియేకాక సృష్టిహేతువులైన తత్త్వములలో సముచితముగా సమన్వయంచునది పంచసంఖ్యయేకాని సప్తసంఖ్య కాదు. సప్తసంఖ్యకునూ సమన్వయించెడి తత్త్వార్థము ఆధార స్వాధిష్ఠానాది రూపమైనది- పిమ్మట చదువగలము. ఇంతకును పంచఋషులైనను, సప్తఋషులైనను, విశ్వకర్మ సంభూతులే గాని భిన్నులుకారని తెలియవలయును. పూర్వాధునాతన ఋషిప్రశంసను ఋగ్వేదము నాల్గైదు తావులలో చేసియున్నది. వాటిని ఋగ్దర్శన ప్రథమ భాగమున చూపినాము. ఐననూ ఒకదాని నిచ్చట ఉదాహరింతుము.

"యమాయ మధుమత్తమం రాజ్ఞే హవ్యం జుహోతన
ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః
పూర్వేభ్యః పథికృద్భ్యః.

— ఋగ్వేదము 10-14-15.

ఓ ఋత్విజులారా! రాజగు యమునికి మిక్కిలి మధురమైన హోమద్రవ్యమును సమర్పింపుడు- మనకు సుఖమార్గమును చూపునట్టివారునూ, సృష్టి జరిగిన తొలునాళ్ళలో

సూక్తాదులే వక్కాణించుచున్నవి. విశ్వకర్మ తరువాతి ప్రథమ శిల్పాచార్యులు- మిత్రుడు, వరుణుడు, అగ్ని- అట. ఇక ఐదవవాడే బృహస్పతి.

ఇందలి విశ్వకర్మ సృష్ట్యాదికర్మల నొనర్చు దేవుడు- జగత్కారణశక్తి యన్నమాట. అతడే జీవరూపమున చరాచరముల హృదయములందు ప్రవేశించినవాడు (జీవుడు) కూడా అని "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః ప్రథమచ్ఛదో వర ఆవివేశ" అనెడి విశ్వకర్మ సూక్త ప్రథమ మంత్రము చెప్పుచున్నదికదా. సహస్రార నివాసి అయిన ఆ విశ్వకర్మయే భ్రూమధ్యస్థ ఆజ్ఞాచక్రము నందలి కారణ శరీరమున ప్రతిబింబించి జీవుడైనాడని వేద సిద్ధాంతము. అట్టి జీవుడు శరీరమున నిలుచుటకు హేతువు, మిత్రావరుణులుగా పేర్కొనబడిన పింగళా, ఇడా నాడులయందు సంచరించు ప్రాణములే. వీరు దేహమున, జీవుని నిలకడకు కారణభూతులుకాగా, ఆ జీవునికి ఆత్మజ్ఞానము కలిగి, వాడు ముక్తుడగుటకు 'అగ్ని' హేతువు. ఈ అగ్ని సుషుమ్నాధిపతి యని మనమింతకు పూర్వమే చెప్పుకొనియున్నాము. కనుక "అగ్నే నయ సుపథా రాయే" అన్నది వేదము. విశ్వకర్మ పదముచేత జీవేశ్వరులు, 'మిత్రావరుణ' పదములచేత ప్రాణాపానములు లేక పింగళా- ఇడా నాడులు సూచించబడినవి. సూచనయే ఏమి, మాటలతో చెప్పబడినట్లే లెక్క. ఇకపోగా ఐదవవాడు బృహస్పతి

యున్నాడు. ఇతడు దేవగురుడు. అంతేకాదు "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అను వేదవాక్యమును బట్టి ఆతడు జగద్గురువు, బ్రహ్మావిద్యకు ఆద్యగురువు అయిన విశ్వకర్మయే! విశ్వకర్మ మోక్షమునిచ్చు భగవంతుడని పురుషసూక్తమునందలి "ఉతామృతత్వస్యేశానః" అనెడి వాక్యము కూడ చెప్పుచున్నది. ఆ వాక్యమునకు పురుషుడు (విశ్వకర్మ) అమృతత్త్వమునకు గూడ ప్రభువే అని భావము. ఈ అంశమును "తమేవం విద్వా నమృత ఇహాభవతి" ఆతనిని ఎఱింగినవాడు అమృతుడగును- అనెడి వాక్యము స్పష్టము చేసినది. పురుషసూక్త ప్రస్తుతుడు విశ్వకర్మ పరమాత్మయే అని పాఠకులు మా దర్శనముల ననుసరించి యెఱింగియే యున్నారు. వీరైదుగురును సృష్టి మొదలుకొని జీవులు మోక్షమునందువరకు, వారిని సర్వవిధముల తీర్చిదిద్దెడి "సంకృతులు" అనగా శిల్పాచార్యులై వరలినారని ఈ మంత్రము పేర్కొన్నది. లోకయాత్ర నిర్విఘ్నముగా సాగుటకు కృషి, శిల్పములు (కర్షకులు, శిల్పులు) మూలము లైనట్లే, జనులు ఆధ్యాత్మిక యాత్ర గమ్యమును చేరుటకు కూడా పై మంత్రములో పేర్కొనబడిన (1) విశ్వకర్మ (2) మిత్రుడు (3) వరుణుడు (4) అగ్ని (5) బృహస్పతి (జగద్గురువు) అను పంచాచార్యులు మూలములై ఉన్నారని స్పష్టమగుచున్నది కదా!

వేదాధ్యయన ప్రారంభమున పఠించు "శం నో

మిత్రః" అను మంత్రములో మిత్రావరుణులు ప్రస్తావింప బడుట, ఆ మిత్రావరుణులను "ప్రాణో వై మిత్రః అపానో వరుణః" ప్రాణాపాన స్వరూపులు, సూర్యచంద్ర నాడీ సంకేతములు అని యజుర్వేదము వ్రాక్కుచ్చుట, "ఏకం సద్విప్రా" అను మంత్రము ఆ విషయమునే "ఇంద్రం, మిత్రం, వరుణ, మగ్నిమాహుః" అని ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్నులని ప్రవచించుట, విశ్వకర్మ సూక్తము "విశ్వకర్మాహ్య జనిష్ఠ దేవ ఆదిద్గంధర్వో అభవద్ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనాం" అని చెప్పుట, యజుర్బ్రాహ్మణము, వారిని "విశ్వకర్మ, మిత్ర, వరుణ, అగ్ని, బృహస్పతుల" నెడి ప్రథమ శిల్పాచార్యులుగా వర్ణించుట విచిత్రముగా లేదా! దీనినిబట్టి వేద మంత్రార్థ చింతనము, సమన్వయము, దాని ఫలితమును తేల్చుట ఎంత కష్టమో, తపస్సాధ్యమైన పనియో తోచుట లేదా! వేదమంత్రము లీవిధముగా అటనట విప్రకీర్ణములై యుండును. వాటిని సమకూర్చుకొని సమన్వయించుకొని ఆచరించి సిద్ధిని పొందవలసిన భారము విజ్ఞులపైనున్నది.

ఈ ప్రకరణమున మిత్రా వరుణాగ్నులు శరీరమున కలరని తెలిసికొన్నాము. ఈ మిత్రావరుణాగ్నులేగాక వసువులు, రుద్రులు, ఆదిత్యులు కూడా శరీరమునందే కలరని రాబోవు ప్రకరణములలో సప్రమాణముగా నిరూపించుకొందుము. అది అత్యపూర్వమైన రహస్యమై సాధకుల కనులను తెరపించి మోక్షమార్గమును చూపి, సత్యమైన గమ్యము

నకు చేర్చగలదు. పంచఋషులను గూర్చిన ఈ సందర్భమున పంచసంకృతులను గూర్చికూడ తెలిసికొని పిండబ్రహ్మాండ ములయందు వారి ప్రాధాన్యమును గ్రహించుటయైనది.

సృష్ట్యాదియందు విశ్వకర్మ నుండి పంచఋషులే కాక, సప్త ఋషులు కూడ కలిగినారని విశ్వకర్మ సూక్తములోని మంత్రమే చెప్పుచున్నది. ఇప్పుడా సప్త ఋషులను గూర్చి తెలిసికొందము.

## సప్త ఋషులు

"విశ్వకర్మా మనసా యద్విహాయా ధాతా విధాతా
పరమోత సందృక్, తేషా మిష్టాని సమిషా మదన్తి
యత్ర సప్తర్షీ న్పర ఏక మాహుః."

— యజు. కాం. 4-6-2.

దీనికి సాయణుల భాష్యము ఇట్లున్నది. "విశ్వవిష యాణి- సృష్టి, స్థితి సంహారరూపాణి యస్యాసౌ విశ్వకర్మా. తస్య చ తేషు కర్మసు సత్యత్వాదయ ఏవ సాధనం- సత్య సంకల్పత్వాత్. య ద్యస్మా దయం మనస్సంకల్పమాత్రేణ విశ్వకర్మా తత్ ధాతా, విధాతా, విహాయా ఇతి చోచ్యతే. ధాతా=ఉత్పాదకః, విధాతా=పోషకః, విశేషేణ జహాతి- పరిత్యజతీతి. విహాయాః=సంహర్తేత్యర్థః, ఉత=అపిచ, అత

ఏవ పరమః=సర్వేభ్యః ఉత్కృష్టః, సమ్యక్పశ్యతీతి సం దృక్=సర్వజ్ఞ ఇత్యర్థః, యత్ర=యస్మిన్, పరే-పరస్మిన్నీశ్వరే సప్తర్షీన్ ఏక మాహుః. య ఏతే మరీచ్యత్రిముఖా స్సప్త ఋషయః వివిధా దృశ్యన్తే. తే సర్వే సృష్టేః ప్రాక్ పరస్మిన్ ఏకీ భూతా ఇతి వేదాంతపారగా ఆహుః. స పరమేశ్వరః తేషాం- సప్తర్షి ప్రభృతీనామ్ ఇష్టాన్యపేక్షితానీషా=స్వేచ్ఛామాత్రేణ సంపాదయతి. తేన చ తే మహార్షయో మదన్తి- హృష్యన్తి."

దీని భావము : విశ్వమునకు సంబంధించిన సృష్టి, స్థితి, సంహారము- అనెడి కర్మలు ఎవనివలన జరుగునో ఆతడు విశ్వకర్మ యగుచున్నాడు. అతనికి ఆ సృష్ట్యాది కర్మల యందు సత్యసంకల్పాదులే సాధనము.

"యస్య జ్ఞానమయం తపః" అని ఉపనిషత్తు. మన స్సంకల్ప మాత్రముచేతనే ఆ విశ్వకర్మ ధాత (త్వష్ట, లేక బ్రహ్మ) అనగా ఉత్పాదకుడును, విధాతా=పోషకుడునూ, (విష్ణువు లేక మయుడు) విహాయా=విశేషముగా జగములను హరించువాడు- అనగా సంహారకర్త (రుద్రుడు)యూ, అగుచున్నాడు. ఇంకనూ ఆతడిట్టి సృష్ట్యాది సమస్త కర్మలనూ నడపుచుండుటచేతనే సర్వులకంటెనూ శ్రేష్ఠుడునూ, సర్వజ్ఞుడునూ కూడా అగుచున్నాడు. సృష్టికి పూర్వము ఆ విశ్వ

కర్మ పరమేశ్వరుని యందు మరీచ్యాది సప్తఋషులను ఏకీభూతులైనవారినిగా వేదాంతులు చెప్పుచుందురు. ఆ విశ్వకర్మ తత్త్వము తెలియనప్పుడు ఈ సప్తఋషులు భిన్నులుగా తోచుచుందురు. ఆ విశ్వకర్మ పరమేశ్వరుడు, ఆ సప్తఋషులు మున్నగువారి మనోభీష్టములను లీలామాత్రముచే తీర్చుచుండును. అందుచే వారు హర్షము నందుచుందురు. వేదమిట్లు చెప్పుటచేత సప్త ఋషులకునూ విశ్వకర్మ ప్రభునకునూ గల గాఢ సంబంధము సువ్యక్తమగుచున్నది. ఈ మంత్రమున విశ్వకర్మ 'సృష్టి, స్థితి, లయముల'నెడి కర్మలకు తానే ప్రభుడనుటచేత వాటికి ప్రత్యేకాధికారులుగా ఎన్నబడిన బ్రహ్మాదిమూర్తులు ఆయనలోనివారే అని స్పష్టమగుచున్నది కదా! ఇక్కడ బ్రహ్మములు కలిగిన తరువాతకాని సప్తర్షులు పుట్టుటకు వీలులేదు కాన, ఆ బ్రహ్మాది పంచకము, లేదా సానగాది ఋషిపంచకము మొట్టమొదటివారగుచున్నారు. కనుకనే "త ఆయ జన్త" అనెడి మంత్రము వారిని "ఋషయః పూర్వే" అని, వారు పూర్వ ఋషులని స్పష్టముగా పేర్కొన్నది. ఈ సందర్భమున "ఋషులు బ్రహ్మలగుదురా?" అని సందేహము కలుగవచ్చును. వేదమే విశ్వకర్మను ఋషియని (ఋషిర్హోతా) యన్నది. అట్లే రుద్రుని కూడా (రుద్రో మహర్షిః) అన్నదికదా! ఇంతియేగాక ఈ సానగాది ఋషులకు, మన్వాది బ్రహ్మలకు బ్రహ్మాది మూర్తులకు అభేదమును తరువాత ప్రమాణములలో మనము చదువ

గలము. ఈ సప్తర్షులు విశ్వకర్మ నుండి పుట్టినారను విషయ మును అథర్వ వేదముకూడా ఇట్లు ప్రతిపాదించుచున్నది.

"విశ్వకర్మాణం తే సప్త ఋషివన్త మృచ్ఛన్తు,
యే మాఘాయవ ఉదీచ్యాదిశోఽభిదాసా."
— కాం. 19, సూ.18, మంత్రము.7.

ఈ మంత్రము నందలి "సప్తఋషివంతం" అను పదము నకు సాయణులు "సప్త సంఖ్యాకా ఋషయః స్రుజ్యత్వేన యస్యసన్తి ఇతి మతుప్" అనినారు. అనగా సప్తర్షులు సృజింపదగినవారుగా ఎవనికి ఉన్నారో, ఆతడు సప్తఋషి వంతుడని భావము. ధనవంతుడు అన్నప్పుడు, ధనము కల వాడని అర్థమైనట్లు, సప్తఋషివంతుడనగా సప్తఋషులు సృజింపతగినవారుగా గల విశ్వకర్మ యని భావము. దీనినిబట్టి విశ్వకర్మ సానగాదులైన పంచ ఋషులకేకాక, మరీచ్యాదు లైన సప్తఋషులకుకూడ తండ్రియైనట్లు తెలియుచున్నది కదా! ఈ అథర్వ వేదమంత్రమునకు కీ. శే. వడ్డెపాటి నిరం జన శాస్త్రి కవిశేఖరుల తెలుగు పద్యమును చూతము.

గీ॥ "ఎవ్వరుత్తర దిశ నుండి యేగుదెంచి
అఘుచయంబుల మముఁ ద్రోతు రట్టి రిపులు
సప్తఋషుల సృజించు ప్రసన్నవిశ్వ
కర్మ తేజోఽగ్ని దగ్ధతఁ గాంత్రుగాక!

ఈ విషయమును గీతాప్రమాణములో కూడా సాయ

ణులు దిగువ అథర్వవేద మంత్ర భాష్యములోనే స్పష్టీకరించిన ఘట్టమును చూతము.

"విశ్వకర్మా మా సప్తఋషిభి రుదీచ్యాదిశః పాతు
తస్మిన్ క్రమే తస్మిం ఛ్రయే తాం పురం ప్రైమి.
స మా రక్షతు, స మా గోపాయతు, తస్మా
ఆత్మానం పరిదదే స్వాహా."

— అథర్వ. కాం.-19, సూ.-17, మంత్రము-7.

రాజుగారు రాత్రియందు నిద్రింపబోవునప్పుడు అన్ని దిక్కుల నుండి ఆయనకు ఆ యా దేవతలు భద్రములు కలిగింపవలయునని ఈ మంత్రములు పఠింపబడును. అందు ఉత్తర దిక్కునుండి భద్రమును కోరునది ఈ మంత్రము.

"విశ్వకర్మ సప్తఋషులతోకూడి ఉత్తర దిక్కు నుండి కలుగు ఆపదల నుండి నన్ను కాపాడుగాక. ఆ విశ్వకర్మ నన్ను రక్షించుగాక. నన్ను శత్రువుల బారిపడకుండా నుంచుగాక." ఇచ్చట రక్షణ గోపనక్రియలు సమానార్థకములే అయిననూ, ఒకదానికి అహిత నివృత్తియూ, ఇంకొకదానికి హితప్రాప్తియూ, చెప్పికొని పునరుక్తిని పరిహరింపవలయును. ఆ విశ్వకర్మకు రక్షణార్థమై నన్ను సమర్పించుకొనుచున్నాను అని భావము.

ఈ మంత్రమున సప్తఋషులతో కూడిన విశ్వకర్మ రక్షించుటలోగల ఔచిత్యమును సాయణులిట్లు వివరించి

యున్నారు. "విశ్వకర్మా = విశ్వం-సర్వం కర్మ-కార్యం-సృజ్యం యస్మాద్భవతి స విశ్వకర్మా = విశ్వజగత్ కారణ భూతః పరమాత్మా" సప్తఋషీభిః=స్వమనస్సృష్టైః సప్త సంఖ్యాకైః ఋషిభిస్సహా, మా=మాం, ఉదీచ్యా=ఉత్తరస్యా దిశః పాతు. విశ్వకర్మణ స్సప్తఋషి సాహిత్యం స్వకార్య త్వేన. ఉక్తంచ భగవతా గీతాసు-

> "మహర్షయ స్సప్త పూర్వే, చత్వారో మనవ స్తథా,
> మద్భావా మానసా జాతా, యేషాం లోక ఇమాః
> ప్రజాః." — భగవద్గీత. 10-6.

"తస్మిన్ = సప్తఋషి సహితే విశ్వకర్మణి క్రమే ఇత్యాది పూర్వవద్ వ్యాఖ్యేయం."

విశ్వమంతటినీ సృజంచిన విశ్వకర్మ యను పేరుగల విశ్వజగత్కారణ భూతుడగు పరమాత్మ తన మనస్సుచేత సృష్టింపబడిన సప్తసంఖ్య గల ఋషులతో గూడినవాడై ఉత్తరదిక్కునుండి కలుగు ఉపద్రవముల బారిపడకుండా నన్ను కాపాడుగాక. విశ్వకర్మకు సప్త ఋషులతో కూడిక ఏల చెప్పవలసి వచ్చెననగా ఆయన కారణముగా కలిగిన కార్య భూతులేవారు కనుక- అని సమాధానము. ఇందుకు గీతలోని "మహర్షయః సప్తపూర్వే" అనెడి శ్లోకమునుకూడా సాయ ణులు ప్రమాణముగా ఇచ్చినారు. వారు మద్భావులు=నన్నే భావించువారు. మానసా జాతాః = నా మనస్సుచేతనే

పుట్టింపబడినవారు. అనగా మానసపుత్రులన్నమాట. ఆ మనువులు, మహర్షులు అనువారినుండియే ఈ స్థావరజంగమ లక్షణ ప్రజాసృష్టి కొనసాగినదన్నమాట. ఇక్కడ "మహర్షయ స్సప్తపూర్వే" అనుమాటకు అర్థమును ఇట్లు చెప్పుకొనవలయును. పూర్వే మహర్షయః = మొదట పుట్టిన మహర్షులు వారు. "త ఆయ జన్త ద్రవిణం" అన్న వేదమంత్రము. వారు పూర్వులైన విశ్వకర్మ మానసభవులగు సానగసనాతనాది పంచర్షులైనందున వారిని గీత కూడా పూర్వశబ్దముతోనే పేర్కొన్నది. కాని ఈ భావమును వేదమంత్ర పరిజ్ఞానము లేనివారు చెప్పజాలరు. ఇక అటుపిమ్మట 'సప్తమహర్షయః' అని అన్వయించుకొనవలయును. వారు మరీచి, వసిష్ఠాది సప్తఋషులు కాగలరు. పంచఋషులు, సప్తఋషులు కూడా విశ్వకర్మ మనస్సంకల్పమాత్రముచేత కలిగినవారే అని విశ్వకర్మ సూక్తము మనకు గంట కొట్టినట్లు చెప్పుచున్నది. పురాణాది వాఙ్మయము ఆ పంచ సప్తఋషుల పుట్టుకను ఇంకొక రీతిగా చెప్పినచో అది ప్రమాణమెంతమాత్రమునూ కాదు. ఆ పంచ, సప్త ఋషిగణములు పరమాత్మయైన విశ్వకర్మనుండియే కలిగి లోకమునకు తారక మార్గమును చూపిన వారు, చూపుచున్నవారుకూడను. ఈ సందర్భమున భగవద్గీతను చెప్పినది విష్ణుని అవతారమగు కృష్ణుడని మనము కొనుచున్నాము. విశ్వకర్మ సూక్తమేమో వేదములలోనున్నట్టిది. వేదముయొక్క, గీతలయొక్క భావములు సరి

పోవుటచే 'విష్ణు-విశ్వకర్మ'లు అభేదరూపులని గమనింపవల యును. విష్ణువును సృజియించినది విశ్వకర్మయే యని మనము ఇంతకుముందు చదివేయున్నాము. కనుక విశ్వకర్మకు, ఋషి, మూర్తి, బ్రహ్మలకు గల సంబంధము పితాపుత్రుల సంబంధ మని స్పష్టమగుచున్నది. పితాపుత్రులు అభేదరూపులని "ఆత్మా వై పుత్రనామాసి" అనెడి వేదమంత్రము చెప్పినది కదా! అనగా తానే పుత్రుడుగా పుట్టునని భావము. కనుక 'విష్ణు-విశ్వకర్మలు' భిన్నదేవతలని భ్రాంతిపడరాదు. మన పురాణ కథలనుబట్టి వారు భిన్నులని తోపవచ్చును. అయి ననూ వేదాధారమునుబట్టి చూచినచో అవి ప్రమాణములు కావు. విష్ణుదేవుడును, విశ్వకర్మ భగవానుడునూ, ఒక్కరే అను అంశము ఇట్టి ప్రమాణములవల్లనే కాక విష్ణు సహస్ర నామములనుండియు ధ్రువమగుచున్నది. "విశ్వకర్మా, మనుః స్త్వష్టా, స్థవిష్ఠః, స్థవిరో, ధ్రువః" (శ్లో-6.) ఈ పదములకు శంకర భాష్యము- "విశ్వం కర్మ=క్రియాయస్య సః విశ్వ కర్మా, క్రియతే ఇతి జగత్ కర్మ. విశ్వం కర్మయస్యేతివా విచిత్రనిర్మాణశక్తిమత్వా ద్విశ్వకర్మా (త్వష్టా సాదృశ్యా ద్వా)మననాన్మనుః. "నాన్యోతోస్తిమన్తా" ఇతి శ్రుతేః మంత్రోవా, ప్రజాపతిర్వా మనుః. సంహార సమయే సర్వ భూత తనూకరణ త్వాత్ త్వష్టా. త్వక్షు తేస్తనూకరణార్థ త్వాత్ తృచ్ ప్రత్యయః."

దీనికి తెలుగు :- విశ్వమంతయూ ఎవని కర్మ

(సృష్టి)యో, ఆతడు విశ్వకర్మ. లేదా, చేయబడునది కర్మ. ఆ చేయబడునది జగత్తుకాన, అట్టి విశ్వరూపమైన కర్మ ఎవరివలన జరిగెనో ఆతడు విశ్వకర్మ: అనగా విచిత్రనిర్మాణ శక్తి కలవాడగుటచేతనూ, త్వష్టతో సాదృశ్యము కలవా డగుటచేతనూ విశ్వకర్మకు త్వష్టతో సాదృశ్యము "విశ్వకర్మ ణస్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధద్రూపమేతి" అనెడి పురుషసూక్త వాక్యమువలన అని తెలియవలయును. మన నము చేయుటవలన మనువగుచున్నాడు. సృష్ట్యాది కర్మలను గూర్చి చింతించుటచేత మనువని సారాంశము. ఇందుకు ప్రమాణము "నాన్యోఽతోస్తి మన్తా" అను ఉపనిషద్వా క్యము. పరమాత్మకంటెనూ వేఱుగా మననము చేయువాడు లేడని భావము. లేదా మంత్రస్వరూపుడనియూ, మనువనెడి ప్రజాపతి అనియూ, అయినను చెప్పవచ్చును. త్వష్ట యనగా ప్రళయకాలమున సర్వ భూతములను తనువులుగా- సూక్ష్మ రూపములు కలవానినిగా చేయువాడని భావము." ఇవి భాష్యకారుని భావములు. "త్వక్షూ తక్షూ కరణే" అనగా తనువులు లేనివానికి తనువులను సృజించువాడనికూడా చెప్పి కొనవచ్చును. సాయణాదుల భావము ఇదియే. ఈ శబ్దముల అర్థములు మా దర్శనములందు పలుతావుల వివరించియే ఉన్నాము. సూర్యునికిగల ద్వాదశ నామములలో ధాత, విష్ణువు, త్వష్ట అనికూడా కలవు. విశ్వకర్మ నామమును రామాయణములోని ఆదిత్య హృదయములో చదువగలము.

కావున ధాత, సూర్యుడు, విష్ణువు, విశ్వకర్మ అనువారు అభేదరూపులే అని తెలియుచున్నది కదా! సాయణులు "ఆదిత్యాత్మకాయ విశ్వకర్మణే- ఆదిత్యాత్మకాయ విష్ణవే" అనుటనుకూడ గమనింపవచ్చును.

వేద వాఙ్మయములోను, ఆధ్యాత్మిక జగత్తునందును, పంచఋషులకు ఎట్టి స్థానమున్నదో సప్తర్షులకును అట్టి స్థానమే ఉన్నది. సప్తర్షులు మంత్రద్రష్టలు అగుటయేకాక పురాణ వాఙ్మయమున ఎంతో చరిత్రకలవారుగా అగపడుచున్నారు. ఆ అంశములను ఏ పురాణమును తీసికొని చదివినను తెలియ గలదు. పురాణములు వ్రాసినవారు వారి వంశమునకు చెందిన వారగుటయూ ఒక కారణమే. అది అంతయూ ఆధిభౌతిక జగమునకు చెందిన వర్ణనము. దానినటుంచి చూచినచో ఈ సప్తర్షులు- ఆధార, స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములనెడి సప్తచక్రములకు సంకేతములై (గుర్తులై) పొడకట్టుచున్నారు. వీరిచే ఊహింపదగిన షట్చక్రముల మీద కుండలినీశక్తిని పయనింపచేయుటచేత బ్రహ్మర్షియైన "వసిష్ఠుని స్థానమని" చెప్పదగిన సహస్రారమునకేగి, అచ్చట అఖండ బ్రహ్మముతో లీనమై ఆనందించు స్థితి- అనగా సంసార నివృత్తి, పరమేశ్వర ప్రాప్తి, లేదా పరమేశ్వర సామ్యము సిద్ధించుచున్నది. కనుక వీరు 1) భూ

2) ర్భువః 3) స్సువ 4) ర్మహ 5) ర్జన 6) తప 7) స్స
లోకములకు ప్రతీకలనియు వాటిలోనే వీరి విహారణమని
భావింపవచ్చును. అందుకే ఋగ్వేద ప్రథమ మండలములో
22వ సూక్తమునందలి 16వ మంత్రము ఇట్లనుచున్నది.

"అతో దేవా అవన్తునో,
యతో విష్ణు ర్విచక్రమే,
పృథివ్యా స్సప్త ధామభిః." — ఋ. 1-22-16

తా॥ పరమేశ్వరుడునూ, వ్యాపనశీలుడునూ అ
విష్ణువు భూమినుండి సప్తలోకములందు అనగా ఆధార
సప్త ప్రదేశములలో విహరించుచున్నాడని ఎఱింగిన మవ
సర్వదేవతలూ కాపాడుదురుగాక. అనగా నాకు సర్వ
శక్తులు వశీభూతములగుగాక అని భావము. ఆధారాదు
వరుసగా పృథివ్యాది భూతములకు స్థానములనియూ,
భూతములచే పుట్టినవనియూ తత్త్వశాస్త్రవేత్తలు ఎఱుం
దురు. పంచభూత లోకములకు ఆవలనున్నవి తపస్సత్య లో
ములేకదా. అవియే ఆజ్ఞాసహస్రారములు. కావున స
ఋషులచేత ఈ ఆధారాది సప్తస్థానములు చెప్పబడుచున్న

ఈ సప్తఋషులు, పంచ ఋషులవలె వరుసగా వే
ములో చెప్పబడినట్లులేదు. పంచఋషులను వరుసగా చెప్పి
యజుర్వేదము నందే ఇష్టకోపధాన ఘట్టములలో "అయ
పురో భువాది" మంత్రములలో ప్రాచ్యాది దిక్కులయం

వసిష్ఠుడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని అనెడి నల్గురు ఋషులూ వినబడుచున్నారు. ఐదవదగు ఊర్ధ్వ దిక్కున 'విశ్వకర్మ' అనువదింపబడినాడు. ఆ మంత్రములను కూడ చూతము.

1) "అయం పురోభువ స్తస్య ప్రాణో భౌవాయనోవస న్తః ప్రాణాయనో గాయత్రీ వాస న్తీ గాయత్రియై గాయత్రం గాయత్రా దుపాగ్ంశు రుపాగ్ంశో స్త్రివృత్త్రి వృతో రథన్తగ్ం రథ న్తరాద్వసిష్ఠఋషిః ప్రజాపతి గృహీతయాత్వయా ప్రాణం గృహ్ణామి ప్రజాభ్యః.

2) అయం దక్షిణా విశ్వకర్మా తస్య మనో వైశ్వకర్మణం గ్రీష్మో మానస స్త్రిష్టుప్ గ్రైష్మీ త్రిష్టుభ ఐడ మైడా ద న్తర్యామో౽న్తర్యామా త్పంచదశః పంచదశా ద్బృహ ద్బృహతో భరద్వాజ ఋషిః ప్రజాపతిగృహీ తయా త్వయా మనో గృహ్ణామి ప్రజాభ్యః.

3) అయం పశ్చా ద్విశ్వవ్యచా స్తస్య చక్షు ర్వైశ్వ వ్యచసం వర్షాణి చాక్షుషాణి జగతీ వార్షీ జగత్యా ఋక్ష మమృక్షమా చ్ఛుక్ర శ్శుక్రా త్సప్తదశా ద్వైరూపం వైరూపా ద్విశ్వామిత్ర ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా చక్షుర్ గృహ్ణామి ప్రజాభ్యః.

4) ఇద ముత్తరా త్సువ స్తస్యశ్రోత్రగ్ం సౌవ్వగ్ం

శరచ్ఛా(త్రిత్ర్యనుష్టు ప్పారద్యనుష్టుభ స్వారగ్ం స్వారాన్మన్థీమన్థిన ఏకవిగ్ంశ ఏకవింశా ద్వైరాజం వైరాజాజ్జమదగ్నిర్ ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయాశ్రోత్రం గృహ్ణామి ప్రజాభ్యః.

5) ఇయ ముపరిమతి స్తస్యైవాజ్మాతీ హేమన్తో వాచ్యాయనః పంక్తిర్హైమన్తీ పంక్త్యై నిధనవ న్నిధన వత ఆగ్రయణ ఆగ్రయణా త్రిణవత్రియ స్త్రిగ్ంశౌ త్రిణవత్రయ స్త్రిగ్ంశాభ్యాగ్ం శాక్వరరైవతే శాక్వరరైవతాభ్యాం విశ్వకర్మ ఋషిః ప్రజాపతి గృహీతయా త్వయా వాచం గృహ్ణామి ప్రజాభ్యః."

— తైత్తిరీయ కాండం-4, ప్రశ్న-3, అను-1.

ఇందు వరుసగా- వసిష్ఠుడు, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని అను నలుగురు ఋషులు పేర్కొనబడిన పిమ్మట విశ్వకర్మ ఋషి పేర్కొనబడుట గమనింపదగినది. ఈ సందర్భమున ఋషుల నామములే మనకు అవసరమైనందున ఈ మంత్రములకు అర్థములు వ్రాయలేదు. ఈ మంత్రముల తరువాతనే "ప్రాచీదిశా"మాది మంత్రములు ప్రారంభమగుచున్నవి. అవికూడా యజ్ఞకుండమునకు ఇటికలను పేర్చు మంత్రములే అని చదివియే యున్నాము. సప్త ఋషులు ఆ యా మన్వన్తరముల యందు భిన్న భిన్న వ్యక్తు

లుగా ఉన్నట్లు పురాణములను బట్టి తెలియుచున్నది. పంచ ఋషులు మాత్రము అట్లు మారుచున్నట్లు వేదము కాని, పురాణములు కాని అనలేదు. వారు పంచభూతములు, పంచ క్రియలవలె స్థిరులని విశ్వకర్మ సూక్తము నందలి "ఋషయః పూర్వే జరితారో నభూనా" అనెడి వాక్యము చెప్పుచున్నది. దీని భావము ఆ పూర్వఋషులు జీర్ణులుకాక శాశ్వతులే అయియుందురని. ఎన్ని కల్పములు మారిననూ మన్వన్తర ములు చెల్లిననూ ఆకాశాది పంచభూతములకు, సృష్టి, స్థితి, లయ, తిరోధానాది పంచకర్మలకు మార్పు లేనట్లు ఈ పంచ ఋషులకునూ మార్పుగాని, జీర్ణత్వముగాని లేదన్న మాట. (చూడు- యజుర్వేదీయ విశ్వకర్మ సూక్త సాయణ భాష్యము.) సప్తఋషుల నామధేయములను మహాభారత శాంతిపర్వము ఇట్లు పేర్కొన్నది-

"మరీచి, రంగిరా, శ్చాత్రిః, పులస్త్యః, పులహః, క్రతుః
వసిష్ఠ ఇతి సప్తైతే మానసా నిర్మితా హి తే. 69
ఏ తే వేదవిదో ముఖ్యా, వేదాచార్యాశ్చ కల్పితాః,
ప్రవృత్తి ధర్మిణ శ్చైవ, ప్రాజాపత్యే చ కల్పితాః."
70 —34వ అధ్యాయం

ఇక బ్రహ్మాండ పురాణము ఇట్లనుచున్నది-

"భృగ్వంగిరా, మరీచిశ్చ, పులస్త్యః, పులహః, క్రతుః,
అత్రిశ్చైవ, వసిష్ఠశ్చ, సప్త స్వాయంభువేఽంతరే."
— 1-2-13-103

భృగువు, అంగిరసుడు, మరీచి, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అత్రి, వసిష్ఠుడు- అనువారు స్వాయంభువ మన్వంతరమున సప్తఋషులని భావము.

మహాభారతము భృగువును చెప్పలేదు. మరీచిని మాత్రమే పేర్కొన్నది. బ్రహ్మాండ పురాణమేమో భృగ్వంగిరులను ఒకేఋషిగా పేర్కొన్నది. దీనినిబట్టి ఉభయులూ ఒక్కకుదుటిలోనివారే అని ఎన్నవలసియున్నది. ఈ ఏడుగురిలో ఇష్టకోపధాన మంత్రములలో పేర్కొనబడిన భరద్వాజ, జమదగ్ని, విశ్వామిత్రులు లేరు. ఒక్క వసిష్ఠుడు మాత్రమే కలడు. కనుక పంచ ఋషులవలె, సప్త ఋషుల క్రమము మనకు వేదమున అగపడుటలేదు. ఇందుకు కారణము వారు ప్రతిమన్వంతరముననూ మారుచుండుటయే కారణము కావచ్చును.

సాయణులు యజుర్వేదీయ సూక్తమునందలి "యత్ర సప్తర్షీన్పర ఏకమాహుః" అనెడి వాక్యమునకు భాష్యము వ్రాయుచూ "యత్ర=యస్మిన్, పరే=పరస్మిన్నీశ్వరే, సప్తర్షీన్ ఏకమాహుః." యద్యతే మరీచ్యత్రిముఖాః సప్తర్షయో వివిధా దృశ్యంతే. తే సర్వే సృష్టేః ప్రాక్పరస్మిన్నేకీభూతాః ఇతి వేదాంతపారగా ఆహుః." అని- మరీచి, అత్రి ప్రభృతులనే సప్తర్షులుగా భావించినారు.

ఇటీవలి బ్రహ్మాండ పురాణము సప్తఋషులనూ, నవ

బ్రహ్మలనూ ప్రశంసించు శ్లోకములను ఉన్నవి ఉన్నట్లుగా ఉంచి, సానగ సనాతనాది పంచఋషులకు సంబంధించిన శ్లోకములను తొలగించుట, అత్యంత ఘోరకార్యము, వాఙ్మయ ద్రోహము. సత్యమును చంపివేయుట కాదా!

సప్తఋషులు ఎవరైన అగుదురుగాక. మనకిచ్చట కావలసినది వారిచే నెఱుంగదగిన తత్త్వార్థము మాత్రమే. పంచఋషులు పంచభూతాత్మకమైన సృష్టికి ప్రతీకలైనట్లు, సప్తఋషులుకూడా ఒకానొక తాత్త్వికార్థమునకు అనగా ఆధారాది సహస్రారము వరకు కల సప్త చక్రములకు ప్రతీకలనుటయే ముఖ్యము. ఈ సందర్భమున ఋగ్వేదహృదయమేమో తెలిసికొనుటకూడా మంచిదే. ఋగ్వేదమున భృగ్వంగిరోగణములు, ఇంకా పెక్కురు ఋషులున్నూ కన్పట్టుచునే యున్నారు పురాణ వాఙ్మయమున అగపడని ఋషులుకూడా పెక్కురు ఋగ్వాది వేదములందు కలరు. సప్తఋషులకు సూర్యునియొక్క సప్తకిరణములనికూడా ఒక భావనను సాయణులు విశ్వకర్మ సూక్తార్థ వివరణ సందర్భమున సూచించియున్నారని లోగడ చెప్పకొనియే యున్నాము. దిగువ నుదాహరించెడి ఋగ్వేద మంత్రము ఇట్లనుచున్నది.

"సప్తానాం సప్తఋషయః
సప్త ద్యుమ్నా న్యేషాం

సప్త అధి శ్రియో ధిరే." — ఋ. 8-28-5

ఈ మంత్రమునకు భాష్యము వ్రాయుచూ సాయణులు ఒక పురాతనమగు గాథను చెప్పినారు. అది ఇది :-

ఒకానొకప్పుడు అదితి ఇంద్రునితో సమానుడైన కుమారుని కనదలచినదట. అప్పుడింద్రుడు ఆ కోరికను సహింపనేరక గర్భములోని పిండమును ఏడు ఖండములగునట్లు చేసినాడట. ఆ గర్భమే ఏడుగురైన మరుత్తులు అయినారట. అందుకే తైత్తిరీయ సంహిత "సప్త గణా వై మరుతః" (2-2-11-1) అన్నది. కనుక ఈ ఋక్కునకు ఆయన ఇట్లర్థము చెప్పినాడు.

సప్తానాం=సప్త మరుత్తులకు, సప్తఋష్టయః = సప్త సంఖ్య గల ఆయుధ విశేషములు (కలవు). ఏషాం గణానాం = ఈ మరుద్గణములకు, సప్తద్యుమ్నాని=ప్రకాశించునట్టి కుండలాది భూషణములునూ (లేక అన్నదమ్ములునూ)కలవు. తరువాత, సప్త= ఈ ఏడు మరుద్గణములు, శ్రియః = సప్త విధములైన=శ్రీలను (దీప్తులను), అధిధిరే=ధరించిరి.

సప్తర్షి శబ్దమున కిచ్చుట మరుద్గణముల ఆయుధములని చెప్పుట విచారింపదగియున్నది. అట్లుగాక సప్తలోకములకు, సప్తఋషులు ప్రతీకలుగాని, అధిపతులుగాని అయి ఉన్నారనియూ, వారికి ఆధారాది లోకములు ద్యుమ్నములై =నిలయములై యున్నవని (గాని) చెప్పినచో సప్తర్షి శబ్దము

సార్థకము కాగలదు. సప్త లోకములకు ఆధారాదులనెడి తాత్త్వికార్థమును ఎచ్చటనూ తడవకుండుట సాయణుల కర్మ కాండ పరాయణత్వమునే చాటుచున్నది.

శరీరమున సప్తర్షి శబ్దముచే సూచితములైన ఆధారాది చక్రములు ఉన్నవి అనుటకును, ఆ చక్రములకు సప్త ఋషులు సంకేతములనుటకునూ దిగువ నుదాహరించెడి శుక్ల యజుర్వేద మంత్రమును ప్రమాణముగా ఎంచవచ్చును.

"సప్త ఋషయః ప్రతిహితాశ్శరీరే,
సప్త రక్షన్తి సద మప్రమాదమ్,
సప్తాపః స్వపతో లోక మీాయు,
స్తత్ర జాగృతో అస్వప్నజౌ,
సత్ర సదే చ దేవౌ." — శుక్ల యజుః- 34-55.

సప్తర్షి శబ్దముచేత పంచ జ్ఞానేంద్రియములను, ప్రాణమును, అంతఃకరణమునూ లెక్కించి వీరే సప్త ఋషులని కొందఱు భావించి, వారు శరీరమునందు ఉన్నారని అర్థము చెప్పుచుందురు. అదికూడా సమంజసమే. అట్లేకాక ఆధారాది సహస్రారము వరకూ గల సప్తకమలములుగా కూడా వారిని భావించినచో వారిమూలమున లేదా వారిద్వారా కుండలినియొక్క సహస్రార ప్రవేశము చెప్పుకొని తత్త్వార్థ లాభమును పడయవచ్చును. అప్పుడు పంచర్షులకు వలె,

సప్తర్షులకు కూడా తత్త్వార్థమును సిద్ధింపచేసికొన్నట్లు కాగలదు. భూర్భువస్సువరాది సప్త వ్యాహృతులుకూడా సప్తఋషులకు సంకేతము కావచ్చును. భావించినకొలది ఇట్టి అమూలార్థములు పంచర్షి, సప్తర్షి గణములకు గోచరింప గలవు.

ఈ చర్యవలన పంచఋషులు, సప్త ఋషులు విశ్వకర్మ సంభూతులే అనియు, అందు పంచఋషులు, పంచ భూతము లకు, పంచేంద్రియములకు, పంచ ప్రాణములు మొదలగు వానికి సంకేతములై శరీరమున ఉన్నారనియు సప్తఋషులు పంచేంద్రియ, ప్రాణాంతఃకరణ రూపులై, ఆధారాది సప్త చక్ర స్వరూపులై శరీరమునందే యున్నారనియు తెలిసికొన వలయును. ఇది బ్రహ్మాండమంతయు పిండాండమునందే కల దని నిరూపించిన మా వేద దర్శనార్థములకు అనుకూలమైన విషయమే.

## వసురుద్రాదిత్యులు

దేవతలనువారు ముప్పదిముగ్గురనియు, వారు భూమి మీద పదునొకండుగురు, అంతరిక్షమున పదునొకండుగురు, ద్యులోకమున పదునొకండుగురు ఉందురనియు, ఋగ్వేద మంత్రమొకటి చెప్పుచున్నది. అది విశ్వేదేవ సూక్తము

లోని మంత్రము.

"యే దేవాసో దివ్యేకాదశస్థ,
పృథివ్యా మధ్యే కాదశస్థ,
అప్సు క్షితో మహినైకాదశస్థ,
తే దేవాసో యజ్ఞమిమం జుషధ్వం." 1-139-11.

తా॥ ఇది విశ్వేదేవతలను ఉద్దేశించి చెప్పినదిగానే ఉన్నది. ఓ దేవతలారా! మీలో ఏ పదునొకండ్రు, ద్యులోకమునందు ఉన్నారో, మరొక పదునొకండ్రు భూమి మీద ఉన్నారో, ఇంకొక పదునొకండ్రు అంతరిక్షమున ఉన్నారో, అట్టి మీరందరూ- అనగా ముప్పదిముగ్గురు కూడా ఈ యజ్ఞకార్యమునకు విచ్చేసి హవిర్భాగములను స్వీకరింపుడు. వీరి వివరములను ఈ సూక్తమున చెప్పలేదు.

ఈ ముప్పదిముగ్గురు దేవతల వివరములను గూర్చి శతపథ బ్రాహ్మణము నందలి అష్టాధ్యాయీ కాండము యొక్క షష్ఠాధ్యాయములోని తృతీయ బ్రాహ్మణము ఇట్లు చెప్పుచున్నది.

"కత్యేవదేవా యాజ్ఞవల్క్యేతి. త్రయస్త్రింగ్ంశ
దిత్యోమితి 3. కతమే తే త్రయ స్త్రింశదితి. అష్టౌ
వసవ, ఏకాదశ రుద్రా, ద్వాదశాదిత్యా స్త ఏక
త్రింశ, దింద్రశ్చైవ ప్రజాపతిశ్చ ఇతి- 4. కతమే
వసవ ఇతి. 1. అగ్నిశ్చ, 2. పృథివీచ, 3. వాయుశ్చ,

4 అన్తరిక్షంచ, 5. ఆదిత్యశ్చ, 6) ద్యౌశ్చ, 7) చంద్రమాశ్చ, 8) నక్షత్రాణిచైతే వసవ, ఏతే హీదగ్ం సర్వం వాసయన్తే. తే య దిదగ్ం సర్వం వాసయన్తే తస్మా ద్వసవ ఇతి-5."

తా॥ 1) అగ్ని, 2) పృథివి, 3) వాయువు, 4) అన్త రిక్షము, 5) ఆదిత్యుడు, 6) ద్యులోకము, 7) చంద్రుడు, 8) నక్షత్రములు- అనునవి అష్టవసువులు. ఇవి సర్వమును వసింపచేయుచున్నందున వసువు లనుచున్నారు.

"కతమే రుద్రా ఇతి? దశేమే పురుషే ప్రాణాః,
ఆత్మైకాదశ, స్తే యదాస్మాన్మర్త్యా చ్ఛరీరాదు
త్క్రామ న్త్యథరోదయన్తి, తద్యద్రోదయన్తి,
తస్మాద్రుద్రా ఇతి- 6."

తా॥ జీవులయందలి దశప్రాణములు (దశేంద్రియ ములు) ఆత్మ కలసి ఏకాదశ రుద్రులగుచున్నారు. ఈ ప్రాణాత్మలు శరీరమునుండి లేచిపోయి బంధువులను ఏడ్పిం తురు కావున వీరిని రుద్రులని పిలుచుచున్నారు. "రోదయ న్తీతి రుద్రాః" అని భావము (వ్యుత్పత్తి).

"కతమ ఆదిత్యా ఇతి? ద్వాదశమాసాః సంవత్సరస్యైత
ఆదిత్యాః. ఏ తే హీదగ్ం సర్వ మాదదానా యన్తి,
తస్మాదాదిత్యా ఇతి 7."

తా॥ పదిరెండు నెలలే ఆదిత్యులు. ఇవి సర్వుల

ఆయుస్సును తీసికొనుపోవుచున్నవిగాన 'ఆదిత్యులని' చెప్ప బడుచున్నవి-

"కతమ ఇంద్రః? కతమః ప్రజాపతిరితి? స్తనయిత్ను రేవేంద్రః, యజ్ఞః ప్రజాపతిరితి- కతమః స్తనయిత్ను రితి ? అశనిరితి. కతమో యజ్ఞ ఇతి ? పశవ ఇతి."-8.

తా॥ ఇంద్రుడనగా స్తన యిత్నువు- అనగా మేఘము. ప్రజాపతి అనగా యజ్ఞము. అనగా పశువులన్నమాట.

"కతమే తే త్రయో దేవా ఇతి? ఇమ ఏవ త్రయో లోకాః. ఏషుహీమే సర్వేదేవా ఇతి. కతమౌతౌ ద్వౌ దేవావితి? అన్నంచైవ ప్రాణశ్చేతి. కతమో అధ్యర్థ ఇతి. యోఽయం పవత ఇతి. కతమ ఏకోదేవ ఇతి? ప్రాణ ఇతి." -9.

తా॥ ఆ ముప్పురు దేవత లెవ్వరు ? సర్వ దేవతలూ వేటియందున్నారో ఆ ముల్లోకములే- (మణిపూర, అనాహత, ఆజ్ఞాచక్రములని అంతరర్థము). ఇద్దఱు దేవతలెవరు ? అన్నము, ప్రాణము. అధ్యర్థమనగా నేది! వాయురూపమున చరించునట్టిది. ఒక్క దేవత ఎవరు ? ప్రాణమే! చివరకు ప్రాణమనునది పరమోత్కృష్టమైనదిగా తేలినది. ముప్పది ముగ్గురైన దేవతలకు సంబంధించి శతపథ బ్రాహ్మణము చెప్పినరీతి మనకెన్నో ఆధ్యాత్మిక రహస్యములను చాలు

వారు 'వసువులనుట' పరమ సత్యము. ఆ వసువులనువారు పురాణాదులయందు వర్ణింపబడిన వ్యక్తిమాత్రులే కారు. వారు, వాటి ఆధిదైవిక రూపములైనను కావచ్చును. వసువుల ముఖ్య స్వరూపమును- పంచ భూతములు, సూర్యచంద్రులు, నక్షత్రములు అని మొత్తము ఎనిమిదిగా శతపథము చెప్పినది. పంచభూతములు సృష్టికి మూలభూతములని సమస్త సృష్టి శాస్త్రములునూ చెప్పుచునేయున్నవి. ఇక సూర్య చంద్రులు పగటిని, రాత్రిని సృష్టించెడి దివాకర, నిశాకరులు. వీరు లేనిచో క్షణాదియుక్త యుగాంతమైన కాలమే లేక పోవచ్చును. ఈ కాలస్వరూపమును గూర్చి మన దర్శనము లలో మనమింతవరకు చదివియేయున్నాము. ఈ కాలమును శతపథము నక్షత్రములని చెప్పినది. అశ్విన్యాది నక్షత్రములు మేషాది రాసులయందు తిరుగుటచేతనే మాసాదులేర్పడు చున్నవని జ్యోతిశ్శాస్త్రము మనుచున్నది కదా! కనుక కాలము నకు నక్షత్రములు సూచకములనదగును. శతపథము చెప్పిన అంతరిక్షమును జలమని గ్రహింపవలయును. అంతరిక్షము నుండియే, మేఘముల మూలమున జలము, మనకు లభించు చున్నందున అన్వయించుటలో దోషము లేదు. పోగా ఇక ఆకాశమును ద్యులోక శబ్దముచే గ్రహింపవలయును. ఈ ఎనిమిదింటిచేతనే జగద్వ్యవహారమంతయు జరుగుచున్నది. వీటిని పరమశివుని (భగవంతుని) యొక్క "అష్టమూర్తు లనుగా" ఎన్నినారు. శివునియొక్క అష్టమూర్తులలో పంచ

భూతములు, సూర్యచంద్రులు, జీవుడు- అనువారు కలరు. అష్ట వసువులలో జీవుని ద్యులోకముగా భావించినచో అష్ట మూర్తులు ఈశ్వరస్వరూపులే అగుదురు. జగత్తుల సృష్టి ఈ ఉపాదాన కారణములచేతనే అగుచున్నదన్నమాట.

ఇక ఏకాదశ రుద్రులను దశవాయువులుగాను, లేక దశేంద్రియములుగాను యెన్ని, పదునొకండవది 'ఆత్మ' యనియు శతపథమన్నది కదా! ఈ పదునొకండుగురు శరీరము నందు ఉన్ననేకాని స్థూలశరీరము ప్రాణవంతమై మనజాలదు. ప్రాణములతోపాటు జీవుడునూ లేచిపోగా శరీరము మృతమగుచున్నది. అప్పుడు దానిని ప్రేమించువారు ఏడ్చెదరు. ఇట్లు శరీర బంధువులను ఏడ్పించునట్టివైన దశవాయువులకు, జీవునకు, రుద్రులనెడి పేరు తగియున్నది. ఆ రుద్రులు ఏకాదశ సంఖ్యవారు.

పంన్డెండు నెలలకు పన్నిద్దఱు ఆదిత్యులున్నారు. వీరు సంవత్సర స్వరూపమైన కాలచక్రమును త్రిప్పుచూ జీవులయొక్క ఆయుస్సును ఆక్రమించుచున్నందున ఆదిత్యులని వ్యవహరింపబడుచున్నారు. ఇప్పటికి 8+11+12=31 అయినారు. ఇక మిగిలినవారు ఇంద్ర, ప్రజాపతులు. వారిలో ఇంద్రుడు మేఘుడే. ఆతనినుండియేకదా వర్షము పడునది. వర్షము లేనిచో జీవులకు జీవనమే దుర్లభమగుచున్నది. కనుకనే ఇంద్రునికింత ప్రాధాన్యము నిచ్చి దాదాపు 250

సూక్తములలో ఋగ్వేద మాతనిని వర్ణించినది. పోగా ఇక మిగిలినవాడు ప్రజాపతి. అతనిని శతపథము 'యజ్ఞమే' అన్నది కదా! యజ్ఞమనగా జీవులు తమ అభ్యుదయ మోక్షముల కొఱకు చేసెడు కర్మమే అన్నమాట. ఆ కర్మము లేనిదే జగత్తున వ్యవహారమే సాగదుకదా!

ఈ సందర్భమున 'ప్రజాపతి' అనగా భగవంతుడైన "విశ్వకర్మ" యని శతపథమే- ఇంకొకచోట చెప్పినది- చూడుడు.

"ప్రజాపతి ర్విశ్వకర్మేతి- ప్రజాపతిర్వై విశ్వకర్మా. సహీదగ్ం సర్వమకరోత్. మనోగంధర్వ స్తస్య ఋక్సామా న్యప్సరస ఇతి. మనోహ గంధర్వ ఋక్సామైరప్సరోభి ర్మిథు నేన సహోచ్చక్రామేష్టయో నామేత్యృక్సా మానివా ఏష్టయ. ఋక్సామైర్హ్యాశాసత ఇతి. నోఽ స్త్వి త్థం వోఽ స్త్వితి. సన ఇదం బ్రహ్మక్షత్రం పాత్వితి. తస్యోక్తో బంధుః". — 11-5-2. సాచితి కాండే షష్ఠాధ్యాయస్య తృతీయం బ్రాహ్మణం.

ఇది "ప్రజాపతి ర్విశ్వకర్మా మనోగంధర్వ స్తస్య ఋక్సామాన్యప్సరసో వహ్నాయః" అనెడి యజుర్వేద మంత్రమునకు శతపథము చేసిన వ్యాఖ్యానమని పాఠకులు గ్రహింపవలయును. ఈ మంత్రమున శతపథ బ్రాహ్మణము ప్రజాపతియైన విశ్వకర్మ- అనగా విశ్వకర్మ, ప్రజాపతియై ఈ సమస్త

మునూ సృష్టించినాడని, ఆ జగత్కారణునియొక్క జగత్కర్తృత్వమును విస్పష్టముగానే పేర్కొన్నందున ప్రజాపతి అనగా "విశ్వకర్మయే" అని చెప్పికొనుటలో వేదవిరుద్ధత ఏమియు లేదు. ఇది యంతయు ఋగ్వేద దశమ మండలము నందలి విశ్వకర్మ సూక్తములలోని భావమే కాని దానికి భిన్నమైనదెంతమాత్రమును కాదు. ప్రజాపతి శబ్దమునకు "జగత్ సృష్టికర్త" యని చెప్పికొనుట, విశ్వకర్మ వసురుద్రాదిత్యులను సృష్టించినాడనెడి యజుర్వేద సప్తమకాండ మంత్రమునకు కూడ అనుగుణముగానే యున్నది.

కనుక వసురుద్రాదిత్యులనువారు ప్రతి శరీరము నందును ఉన్నారని తెలియుచున్నదికదా. వేదవేత్త ఈ అంశము నెఱింగి తన శరీరస్థులైన దేవతలను సదుపయోగము చేసికొని కృతార్థుడగునని గ్రహింపవలసియున్నది. ఇట్టి 'వసురుద్రాదిత్యులు' జగత్కారణుడైన విశ్వకర్మ సంతానమే అని యజుర్వేద మంత్రమునుబట్టి ఇప్పుడు తెలిసికొందుము:-

"ఆపో వా ఇద మగ్రే సలిల మాసీ త్తస్మిన్ ప్రజాపతిర్వాయు ర్భూత్వాచ రత్స ఇమా మపశ్య, త్తాం వరాహో భూత్వాహర, త్తాం విశ్వకర్మా భూత్వా వ్యమార్ష్టి త్, సా ప్రథత, సా పృథివ్య భవత్. తత్పృథివ్యై పృథివీత్వం. తస్యాం వ్యశ్రామ్యత్ప్రజాపతి స్సదేవా నసృజత- వసూన్,

రుద్రా, న్నాదిత్యాన్." — యజుః. కాం-7, ప్రప-1-అను వాకము-5.

దీని భావమిది :- కంటికి అగపడు ఈ జగమంతయు మొదట (సృష్టికి పూర్వము) కేవలము జలరూపముగానే యున్నది. అట్టి నీళ్ళయందు నివసింపవీలు లేనందున, 'ప్రజాపతి' వాయురూపుడై ఆ నీటియందు ప్రవేశించి అంతటనూ తిరుగాడెను. ఆయనకు ఆ నీళ్ళలో భూమి కనపడినది. ఆ భూమిని ప్రజాపతి వరాహరూపమును ధరించి నీటిపైకి తెచ్చెను. అటుపిమ్మట ఆ ప్రజాపతి వరాహరూపమును వీడి విశ్వకర్మ రూపమును తాల్చి భూమిమీదనున్న జలములనెల్ల తుడిచివేసి దానిని విస్తరింపజేసినాడు. అనగా 'భూ' సృష్టి జరిగినదన్నమాట. అప్పుడు భూమి సర్వౌషధులకు, ప్రాణులకు నివాసమైన ఇప్పటి పృథివిగా విరివి చెందినది. ఇట్లు ప్రథనము (విస్తృతి) చెందినది కావుననే దానికి 'పృథివి' నామము చెల్లుచున్నది. అప్పుడా విశ్వకర్మ ప్రజాపతి ఆ భూమిపై విశ్రమించి "వసువులు, రుద్రులు, ఆదిత్యులు" అనెడి దేవగణములను సృష్టించినాడు.

ఈ సందర్భమున, 'ప్రజాపతి, పరమేష్ఠి, విశ్వకర్మ' పదములు సమానార్థకములని భాష్యకారుడైన సాయణుని వాక్యము :-

"ప్రజాపతి ర్విశ్వకర్మా పరమేష్ఠీత్యేతే త్రయోప్యే

కస్యైవ మూర్తి భేదాః" అని. ఇంకను "ప్రజాపతి ర్విశ్వ కర్మ" అనెడి శ్రుతికూడ వారి అభేదమును చాటుచునే యున్నది.

విశ్వకర్మ భూమిని నీటినుండి పైకి తెచ్చినాడను విష యమును అథర్వవేదము నందలి పృథివీ సూక్తములోని దిగువ మంత్రముకూడా వివరించుచునే యున్నది.

"యా మన్వైచ్ఛ ద్ధవిషా విశ్వకర్మా
అ న్త రర్ణవే రజసి ప్రవిష్టామ్
భుజిష్యం పాత్రం నిహితం గుహా
యదావి ర్భోగే అభవ న్మాతృ మద్భ్యః."
— అథర్వ. 12-1-60.

తా॥ నీటియందు మునిగిపోయిన యే భూమిని విశ్వ కర్మ అందు మునిగి, వెదికి పైకి తెచ్చెనో, తెచ్చి దానిని జీవ భోగ్యముగా చేసెనో, ఆ భూమి మమ్ము రక్షించుగాక. అనగా మాకు భోగ్యమగుగాక అని భావము. విశ్వకర్మ 'భూ సృష్టి' చేసినాడని ఇందలి సారాంశము. ఈ అంశమునే "అద్భ్యః పృథివీ" అన్న ఉపనిషద్వాక్యమును చెప్పుచున్నది.

జలమగ్నమైన భూమిని నీటినుండి విశ్వకర్మ ఉద్ధరించి నాడని యజుర్వేదమును, అథర్వ వేదములోని ఈ మంత్ర మును చెప్పుచుండగా మన పురాణములు విష్ణుమూర్తి వరా హావతారమెత్తి నీటినుండి "భూమి"ని పైకి తెచ్చినాడని వర్ణిం

చుట ఎంత వేద విరుద్ధతయో ఆలోచింపుడు. కనుక విశ్వకర్మ మహిమను విష్ణువుకు ఆపాదించినారనుటకు ఈ వేద మంత్రములే నిదర్శనము. కనుక వసురుద్రాదిత్యుల సృజించినది జగత్కారణుడైన 'విశ్వకర్మయే' అని దీనినిబట్టి స్పష్టమగుచున్నది. ఆతడు సహస్రాధిక కర్మములనుచేయు విశ్వకర్మ కనుకనే భూమిని సృష్టించినాడు. వసురుద్రాదిత్యులను గూడ సృష్టించినాడనుట ఎఱుగదగిన రహస్యము. విశ్వకర్మ ద్యావాపృథువులను సృష్టించినాడను విషయమును విశ్వకర్మ సూక్తములలో విస్పష్టముగా కాంచవచ్చును.

ఈ సందర్భమున వసువులు, విశ్వేదేవతలు, ఆదిత్యులు అనగా నెవరో బ్రహ్మాండ పురాణము ననుసరించి తెలిసికొందము.

> శ్లో॥ క్రతు, ర్దక్ష, శ్శ్రవ, స్సత్యః, కాలః, కామో,
> మునిస్తథా, పురూరవ, శ్చార్ద్రివశ్చ, రోచమానశ్చ
> తే దశ."— బ్రహ్మాండ పురాణం. 2-3-3-30.

1) క్రతువు, 2) దక్షుడు, 3) శ్రవుడు, 4) సత్యుడు, 5) కాలుడు, 6) కాముడు, 7) ముని, 8) పురూరవుడు, 9) ఆర్ద్రివుడు, 10) రోచమానుడు- అను ఈ పదుగురు విశ్వేదేవతలు.

విశ్వేదేవతలు, వసురుద్రాదిత్యులు ఎనిమిది దేవగణములలోనివారని బ్రహ్మాండ పురాణమే అనుచున్నది.

శ్లో. "ఆదిత్యా, వసవో, రుద్రా, స్సాధ్యా, విశ్వే,
మరుద్గణాః, భృగవోఽంగిరసశ్చైవ, తేఽష్టౌ
దేవగణాః స్మృతాః."

— బ్రహ్మాండ పురాణం. 1-2-38-2.

1) ఆదిత్యులు, 2) వసువులు, 3) రుద్రులు, 4) సాధ్యులు, 5) విశ్వేదేవతలు, 6) మరుత్తులు, 7) భృగువులు, 8) అంగిరసులు- వీరే అష్టదేవ గణములు. వీరిలో వసువు లేవో-

శ్లో॥ "ధరో, ధ్రువశ్చ, సోమశ్చ, సావిత్రోఽథానిలోఽ
నలః, ప్రత్యూషశ్చ, ప్రభాసశ్చ, వసవోఽష్టౌ
ప్రకీర్తితాః."

— వ్యాసభారతాను శాసనికం 150-16-17.

1) ధరుడు, 2) ధృవుడు, 3) సోముడు, 4) సావిత్రుడు, 5) అనిలుడు, 6) అనలుడు, 7) ప్రత్యూషుడు, 8) ప్రభాసుడు- అనువారేవెూ అష్ట వసువులు. ఈ అష్ట వసువులు భౌతిక పదార్థములని శతపథ బ్రాహ్మణమనగా, వీరు దేవగణాంతర్భూతులని పురాణాదులు చెప్పినవి. అయినను రెండును సమంజసములే. పంచ భూతాదులు ప్రకృతిలోని పదార్థములు. అవి అష్టవసువుల ఆధిభౌతిక రూపములు. పురాణములు చెప్పిన ఈ ఎనమండుగురు మూర్తులు ఆధిదైవిక స్వరూపములని మనము సమన్వయించుకొనవచ్చును.

"అజైకపా, దహిర్బుధ్న్యో, స్త్వష్టా, రుద్రో, హర స్తథా
శంభుశ్చ, త్ర్యంబకశ్చైవ, ఈశానశ్చాపరాజితః,
ఖ్యాతా స్త్రిభువనశ్చేతి రుద్రా ఏకాదశస్మృతాః.

ఇపుడు ఏకాదశ రుద్రులను చూతము :- 1) అజుడు, 2) ఏకపాదుడు, 3) అహిర్బుధ్న్యుడు, 4) త్వష్ట, 5) రుద్రుడు, 6) హరుడు, 7) శంభుడు, 8) త్ర్యంబకుడు, 9) అపరాజితుడు, 10) ఈశానుడు, 11) త్రిభువనుడు. వీరిలో త్వష్ట అనువాడు ఏకాదశ రుద్రులలోను, ద్వాదశాదిత్యుల లోను, ఉండుట గమనింపదగియున్నది. ఇది విశ్వకర్మ తత్త్వము యొక్క శివకేశవాభేద భావమునకు నిదర్శనము. బ్రహ్మ, విష్ణు, రుద్రులు, ఆయన బిడ్డలే కదా! త్ర్యంబక శబ్దము ఏకాదశ రుద్రులలో ఒకనికి చెల్లుటయేకాక, "త్రయాణాం, బ్రహ్మ, విష్ణు, రుద్రాణామంబకం- పితరమ్" అను వసిష్ఠ వాక్యమును బట్టి త్రిమూర్తులకు తండ్రియైన విశ్వకర్మకుగూడ, ప్రసిద్ధమైయుండుట గమనింపదగియున్నది.

ఇక కాశ్యప శిల్పము ఏకాదశ రుద్రులను ఇట్లు పేర్కొన్నది :-

1 2 3 4 5
శ్లో॥ "మహాదేవ, శ్శివో, రుద్ర, శ్శంకరో, నీలలోహితః,
6 7 8 9 10
ఈశానో, విజయ, స్త్వష్టా, దేవదేవో, భవోద్భవః,

11
కపాలీ శ, స్త్వితిజ్ఞేయా, రుద్రా ఏకాదశస్స్మృతాః."

1) మహాదేవుడు, 2) శివుడు, 3) రుద్రుడు, 4) శంకరుడు, 5) నీలలోహితుడు, 6) ఈశానుడు, 7) విజయుడు, 8) త్వష్ట, 9) దేవదేవుడు, 10) భవోద్భవుడు, 11) కపాలీశుడు. ఇక ద్వాదశాదిత్యులను చూతము.

శ్లో॥ "భగశ్చైవా ర్యమాంశశ్చ, మిత్రోవరుణ ఏవచ,
ధాతా చైవ విధాతాచ, వివస్వాంశ్చ, మహాద్యుతిః
త్వష్టా, పూషా, తథైవేంద్రో ద్వాదశో విష్ణు
రుచ్యతే."

— బృహద్దేవత, 5వ అధ్యాయం, 147వ శ్లోకము.

1) భగుడు, 2) అర్యముడు, 3) అంశుడు, 4) మిత్రుడు, 5) వరుణుడు, 6) ధాత, 7) విధాత, 8) వివస్వంతుడు, 9) త్వష్ట, 10) పూష, 11) ఇంద్రుడు, 12) విష్ణువు. ద్వాదశాదిత్యులలో మిత్రావరుణ, వివస్వంతులు, ధాతృవిధాతలు, ఇంద్రాదులు ఉన్నారు కాన వారుకూడా విశ్వకర్మ తనయులే. ఆయనతో అభేదరూపులే. ఈ విషయమును విశ్వకర్మ సూక్తమే ఇట్లు చెప్పుచున్నది.

"ధాతా విధాతా పరమోత సంధృక్" అని.

ఈ ద్వాదశాదిత్యులలో పేర్కొనబడిన త్వష్ట, విశ్వకర్మ తనయుడని, పురుషసూక్తము నందలి "విశ్వకర్మణ

స్సమవర్తతాధి. తస్య త్వష్టా విదధద్రూపమేతి." అనెడి మంత్రమే స్పష్టీకరించుచున్నది. ఇది ప్రతి వేదపాఠకుడు పఠించునట్టి సూక్తమే. ఇందుకు మూలము "విశ్వకర్మాహ్యజనిష్ఠ దేవః" అనెడి విశ్వకర్మ సూక్తమంత్రమే. అందలి దేవుడు చతుర్ముఖ బ్రహ్మయని సాయణులన్నారు. కనుక బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, ధాతృ, విధాతలను, వసు, రుద్రాదిత్యులును, విశ్వకర్మ నుండి కలిగిన ఆయన సంతానమే అని వేద ప్రమాణమునుబట్టి మనకు స్పష్టమగుచున్నది కనుక "విశ్వకర్మ మయమ్ జగత్" అనెడి మాటకు వేద ప్రామాణ్యము సిద్ధమగుచున్నది. దీనికి విరుద్ధముగానున్న పురాణాదుల వాక్యములు ఎంతవఱకు సత్యములో వేదప్రమాణవాదులైన పాఠకులు ఊహింపవచ్చును.

వేదములు విశ్వకర్మ సృష్టికాగా, భగవద్గీత విశ్వకర్మ పుత్రుడే అయిన విష్ణుదేవుని యొక్క సృష్టి అగుచున్నది. భగవద్గీత విష్ణుని అవతారమైన కృష్ణభగవానుడు చెప్పినదని మనమెఱుగుదుము. ఆ విష్ణుమూర్తి విశ్వకర్మ తనయుడే. కనుకనే ఆయన భగవద్గీత 10, 11 అధ్యాయములలో విశ్వమంతయు, తన స్వరూపమే అనియు, తన విభూతియే అనియు చెప్పెను! వసురుద్రాదిత్యులను గూర్చిన భగవద్వాక్యములు ఇట్లున్నవి :-

"ఆదిత్యానా మహం విష్ణుర్జ్యోతిషాం రవి రంశుమాన్," — 11-21.

నేను ద్వాదశాదిత్యులలో విష్ణుమూర్తిని. జ్యోతిర్గోళములలో సూర్యుడను. ఈ "విష్ణు-సూర్యులు" విశ్వకర్మ స్వరూపములే కదా. పిమ్మట "రుద్రాణాం శంకరశ్చాస్మి, విత్తేశో యక్షరక్షసామ్, వసూనాం పావకశ్చాస్మి, మేరుశ్శిఖరిణామహం." — 11-23.

ఏకాదశ రుద్రులలో శంకరుడను, అష్ట వసువులలో పావకుడను. యక్షులలో కుబేరుడను, కొండలలో మేరు పర్వతమును నేనే కదా! కనుక రుద్రులలో సర్వశ్రేష్ఠుడగు శంకరుడు తన స్వరూపమే అని తేలినది. శంకరుడనగా సుఖమును (ఆనందమును) కలిగించువాడని భావము. ఈవిధముగా గీతకూడా 'విష్ణు-రుద్రులు' విశ్వకర్మ స్వరూపులే అని చెప్పినది. గీత వేదార్థమునే అనువదించునుకదా!

వసు, రుద్రాదిత్యులకు బ్రహ్మాండమునందును, వేదములలోను ఇంత ప్రాధాన్యము ఉన్నందువల్లనే బ్రహ్మైక్యమునందిన మహాత్ములు వారిని, తమకు అభేదరూపులుగాను, తామే వారయినట్లుగాను అనుభూతి పొందుచున్నారు. ఇందుకు ఋగ్వేదములో అంభృణ మహర్షి కూతురైన వాగ్దేవి చెప్పిన సూక్తములోని "అహంరుద్రేభిర్వసుభిః" అనెడి మంత్రమును దృష్టాంతముగా తీసికొనవచ్చును. (చూడు- 33వ పుట).

ఈ సందర్భమున వసురుద్రాదిత్యులు, బ్రహ్మ, విష్ణు, రుద్రాదులు, ఇంకా సర్వదేవతలు 'విశ్వకర్మ' నుండియే పుట్టి నారను విషయమును విశ్వకర్మోపనిషత్తు మనకు స్పష్టము చేయగలదు.

వసురుద్రాదిత్యులు అనువారు పితృ, పితామహ, ప్రపితామహ స్వరూపులని కూడ శ్రాద్ధకల్పమును బట్టి తెలియుచున్నది. భూమిమీదనుండ వసువులు తన్నుగన్న తల్లి దండ్రుల వంటివారు. అంతరిక్షమునందు గల రుద్రులు తన తాతలవంటివారు. అనగా 'పితామహులన్న'మాట. ఆ పైన సువర్లోకమునగల ఆదిత్యులు ప్రపితామహుల వంటివారు. అనగా 'ముత్తాతలన్న'మాట. ఈవిధముగా దేవ, పితృ తత్త్వములన్నియు "విశ్వకర్మ పరమేశ్వరుని" నుండి కలిగినవే అని చెప్పుట మన వేద హృదయము.

త్రిభువనముల సృష్టికర్త :

"యదేదన్తా అదదృగ్ంహ న్తపూర్వ
ఆదిద్యావా పృథివీ అప్రథేతామ్." — వి. సూ. 9.

ఆ విశ్వకర్మ ద్యావా పృథువులను విస్తరించి వ్యాపించెను. ఈవిధముగా విశ్వకర్మ చేసిన భూదివముల సృష్టి విశ్వకర్మ సూక్తములలో బహువిధముల వర్ణింపబడినది. ఈ భూదివములు, మొదటిదైన ఆధార చక్రమునకును, చివరిదైన సహస్రారమునకును సూచకములని పాఠకులు మఱువరాదు.

సప్తలోకములకు ఆధారాది సప్తచక్రములు సంకేతములని పాఠకులు పూర్వగ్రంథములో చదివియేయున్నారు.

"పృథివ్యన్తరిక్షం ద్యౌర్దిశోఽవాన్తరదిశాః" అని తైత్తిరీయోపనిషత్తు పృథివీ, అన్తరిక్ష, ద్యులోకములను పేర్కొన్నది. వాటి సృష్టినిగూర్చి శతపథ బ్రాహ్మణమిట్లు పలుకుచున్నది :-

"ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీదేక ఏవ." సోఽకామయత స్యాం ప్రజాయేయేతి. సోఽశ్రామ్య త్సతపోఽతప్యత. 1) త్రయోలోకా అసృజన్త- పృథివ్యన్తరిక్షం ద్యౌః. స ఇమాం స్త్రీన్ లోకా నభితతాప. తేభ్యస్తప్తేభ్యః త్రీణి జ్యోతింష్యజాయన్తాగ్ని, ర్యోఽయం పవతే, సూర్యః. స ఇమాని త్రీణిజ్యోతింష్యభితతాప, తేభ్యస్తప్తేభ్యః. 3) త్రయోవేదా అజాయన్తాగ్నే ఋగ్వేదో, వాయోర్యజు వేదః, సూర్యా త్సామవేదః. స ఇమాన్ త్రీన్ వేదా నభితతాప. తేభ్యస్తప్తేభ్యః 4) త్రీణి శుక్రాణ్యజాయన్త-భూరితి ఋగ్వేదా, ద్భువ ఇతి యజుర్వేదా త్స్వ రితి సామవేదా త్తదృగ్వేదేనైవ హోత్ర మకుర్వత,యజుర్వేదే నాధ్వర్యవగ్ం, సామవేదేనోద్గీథం. యదేవ త్రయ్యై విద్యాయై శుక్రం తేన బ్రహ్మత్వ మథోచ్చక్రామ. 5" — అష్టాధ్యాయీ కాండం-5వ అధ్యాయము-8వ బ్రాహ్మణం.

తా॥ సృష్ట్యాది యందుగల "ప్రజాపతి" (విశ్వకర్మ)

సృష్టిని చేయదలచి పృథివ్యన్తరిక్ష ద్యులోకములను, వాటి నుండి అగ్ని, వాయు, సూర్యులను, వారినుండి ఋగ్యజు స్సామములను, వాటినుండి భూర్భువ స్వర్గములను (వాటి నుండి అకార, ఉకార, మకారాత్మక ప్రణవమును) సృజించెను. ఋగ్వేదమునకు హోతను, యజుస్సునకు అధ్వర్యుని, సామమునకు ఉద్గాతను పాఠకులను చేసెను. అనగా వరుసగా మూడు వేదములనుండి 'హోత్రము, అధ్వర్యవము, ఉద్గీథము' అనునవి కలిగి బ్రహ్మత్వము, వేదత్వము సిద్ధమైనవన్న మాట. ఇది అంతయు "ప్రజాపతి ర్విశ్వకర్మా" అని చెప్పబడిన విశ్వకర్మయొక్క సృష్టియే.

వసురుద్రాదిత్యులకుగాని, బ్రహ్మ, విష్ణు, రుద్రాదులకుగాని జనకుడును, శక్తిప్రదాతయు విశ్వకర్మ పరమాత్మయే అను సంశమును కృష్ణ యజుర్వేద మంత్రమును బట్టి గూడ తెలిసికొందము :-

"యేన దేవా జ్యోతిషోర్ధ్వా ఉదాయన్,
యేనాదిత్యా, యేనవసవో, యేనరుద్రాః,
యేనాంగిరసో, మహిమాన మానశుః,
తేనైతు యజమానః స్వస్తి- స్వర్గాయ
వా ఏష లోకాయ."

— కాండము-5, ప్రశ్న-7, అను-5.

తా॥ బ్రహ్మ, విష్ణు, రుద్రాది దేవతలు ఏ అనంత

శక్తిచేత తేజోమయులై ఊర్ధ్వలోకములందు ఉన్నారో, ఏ శక్తిచేత రుద్రులు, వసువులు, ఆదిత్యులు, అంగిరఃప్రభృతి మహర్షులు మహిమలు కలవారైనారో ఆ మహాశక్తిచేత ఈ యజమానుడు శుభములనంది ఉత్తమ లోకములను పొందు గాక! ఇట్లనుటచేత ఏ విశ్వకర్మ నామకశక్తి, వారలను కన్నదో, ఆశక్తి వారికంటె అధికమైనదని తోచుచున్నది కదా! ఇక్కడి అంగిరసులు అనుమాటచేత, పంచర్షి సప్తర్షి గణములను కూడా గ్రహింపవలయును.

## అంగిరసులు - భృగువులు - అథర్వాణులు

భృగువులను, అంగిరసులను, అథర్వాణులను దశమ మండలము నందలి 14వ సూక్తములోని 6వ మంత్రము ఇట్లు పేర్కొన్నది.

"అంగిరసో నః పితరో నవగ్వా
అథర్వాణో భృగవః సోమ్యాసః,
తేషాం వయం సుమతౌ యజ్ఞియానా
మపి భద్రే సౌమనసే స్యామ." — ఋ. 10-14-6.

ఈ సూక్తమునకు ద్రష్ట 'సరణ్యు (సంజ్ఞా)-వివస్వాంతుల' కుమారుడైన యముడు.

తా॥ అంగిరసులు, అథర్వాణులు, భృగువులు అను వారు మనకు పితరులును, ప్రీతిని కలిగించువారును, సోమ పానమునకు తగినవారును అగుచున్నారు. యజ్ఞార్హులగు అట్టి వారియొక్క మంచి మనస్సులో మనము నివసింతుము గాక. అనగా వారు మనలను మఱువకుందురుగాక యని భావము. వారి మంచి మనస్సులోనున్న శుభము, లేక శుభవాంఛ మనకు చేకూరుగాక! అని సారాంశము. ఈ 14వ సూక్త మున పితృదేవతల ప్రశంస కలదు. అందు అంగిరసులను 3, 4, 5 సంఖ్యల మంత్రములు కూడా పేర్కొన్నవి. ఇప్పుడు అథర్వాణులను చూతము

ముండకోపనిషత్తులోని మొదటి మంత్రము ఇట్లను చున్నది. "బ్రహ్మాదేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్యగోప్తా. స బ్రహ్మావిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ 1. అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మా అథర్వాతాం పురోవాచాంగిరే బ్రహ్మా విద్యామ్. స భారద్వాజాయ సత్యవహాయ ప్రాహ, భారద్వా జోంగిరసే పరావరామ్." 2.

తా॥ 'బ్రహ్మ' దేవతలలో మొదటివాడై ఉండెను. ఆయన విశ్వమునకు కర్తయు, లోకములకు రక్షకుడును. ఆ బ్రహ్మదేవుడు సర్వవిద్యలకు మూలమైన బ్రహ్మవిద్యను తన పెద్దకుమారుడైన 'అథర్వునికి' ఉపదేశించెను. ఆ అథర్వ

ణుడు ఆ బ్రహ్మవిద్యను 'అంగిరునికి' ఉపదేశించెను. ఆతడేమో భరద్వాజ వంశీయుడైన 'సత్యవహునికి' ఉపదేశించెను. ఆ సత్యవహుడు 'అంగిరసునికి' దానిని ఉపదేశించెను దీనినిబట్టి సృష్టికర్త కుమారుడు 'అథర్వుడని' తెలియుచున్నది. ఆ అథర్వుని కుమారులే 'ఆథర్వణులు'. కనుక అథర్వణులనువారు "విశ్వకర్మ సంతానమే" అన్నమాట. ఈ ఉపనిషత్తు మొదటి బ్రహ్మవిద్యాచార్యుని 'బ్రహ్మ' అని చెప్పినది. బృహదారణ్యకోపనిషత్తు చెప్పిన మొదటి బ్రహ్మవిద్యాచార్యుడు 'స్వయంభు బ్రహ్మ'. స్వయంభు బ్రహ్మ అనగా "విశ్వకర్మయే". ఇందుకు మూలస్తంభ పురాణము ప్రమాణము. అందలి మొదటి శ్లోకములివి :

"న భూమి ర్న జలం చైవ, న తేజో న చ వాయవః
న చ బ్రహ్మా, న విష్ణుశ్చ, న రుద్రో, నచ తారకాః
సర్వశూన్యే విశ్వకర్మా స్వయంభూ రభవత్తదా."

ఈ శ్లోకమున విశ్వకర్మ 'స్వయంభువుగా' చెప్పబడినాడు. బ్రహ్మ-విశ్వకర్మలకు వేదములలో అభేదమే కావున స్వయంభు బ్రహ్మ అనగా "విశ్వకర్మయే" అని తెలియవలెను. ఆ స్వయంభు బ్రహ్మ ముండకోపనిషత్తులో బ్రహ్మగా పేర్కొనబడినాడు. బృహదారణ్యకోపనిషత్తు స్వయంభు బ్రహ్మ తరువాత, సానగ సనాతనులతోపాటు అథర్వణునికూడ బ్రహ్మవిద్యోపదేశికునిగా పేర్కొన్నది. కనుక ముండక, బృహదారణ్యకములు పేర్కొన్న అథర్వ

ఋడు విశ్వకర్మ సంతానములోనివాడనుటలో ఆక్షేపము లేదు.

ఈ అథర్వ్వణుని పేరనే అథర్వ్వణ వేదము బయలుదేరినది. అతడు "విశ్వకర్మ" సంప్రదాయమువాడు కనుకనే, అథర్వ వేదమును వాచస్పతి సూక్తముతో ప్రారంభించినాడు. వాచస్పతి అనగా "విశ్వకర్మయే" అని, "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అనెడి ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్త మంత్రము చెప్పుచున్నది. కనుక "విశ్వకర్మ మయం జగత్" అనెడి మా మాట సత్యేతరము కాదు.

వేదములందు భృగువులు, అంగిరసులు, అథర్వ్వణులు, అత్రి, వసిష్ఠ భరద్వాజులు, ప్రముఖ ఋషిగణములోనివారు. వారిలో అంగిరసులను గూర్చి ఋగ్వేదము 4వ మండలము నందలి 15వ మంత్రము ఇట్లనుచున్నది.

"అధామాతు రుషసః సప్త విప్రా
జాయేమహి ప్రథమా వేధసో నౄన్,
దివ స్పుత్రా అంగిరసో భవేమాద్రిం
ఋజేమ ధనినం సం శుచంతః." — ఋ. 4-2-15.

దీనికి సాయణుల భాష్యము :- వామదేవో అన్యైః షడ్భిరంగిరోభిస్సహ బ్రూతే - మాతు ఋషస స్సకాశాత్ సప్త విప్రాః ప్రాజ్ఞా వయం స్మః. ప్రథమాః=శ్రేష్ఠావయం, వేధసో అగ్నేః పరిచారికాన్ నౄన్, వేధసో విధాతౄన్ రశ్మీన్వా జాయేమహి- వయం జనయామః. దివో ద్యోతక

మాన స్యాదిత్యస్య పుత్రా వయం అంగిరసో భవేమ. భూతి మంతః స్యామ. శుచన్తో దీప్యమానావయం ధనిన ముదక వంత మద్రిమ్ మేఘం ఋజేమ."

తా॥ వామదేవుడీ మాటలను తక్కిన ఆర్గురు అంగిరసులతోను అనుచున్నాడు. తల్లియైన ఉషస్సు నుండి ప్రాజ్ఞులమును, శ్రేష్ఠులమును మరియు విధాతలము లేదా కిరణములము అయిన మనము జన్మించితిమి. ప్రకాశించు చున్నట్టి ఆదిత్యుని పుత్రులమైన మనము అంగిరసుల మగుదుము. భూతిమంతుల మగుదుము. నీటితో నిండిన మేఘమును వానలు కురియుటకై (మనము) భేదింతుము. ఇక్కడ "సప్తవిప్రాః" అనుటచేత అంగిరసులు ఏడుగురు అని తెలియుచున్నది. వారు సూర్యకిరణ స్వరూపులని కూడ భావము. ఈ ఏడ్గురినీ ఆధారాది సప్త చక్రములకు ప్రతీకలుగా సైతము ఎన్నవచ్చును. మహాభారతములోని ఆనుశాసనిక పర్వము అంగిరసులు ఎనమండుగురని చెప్పుచున్నది.

"అష్టౌచాంగిరసః పుత్రా ఆగ్నేయా స్తే ప్యుదా
హృతాః, బృహస్పతి, రుచశ్యశ్చ, పయస్య,
శ్శాంతిరేవచ, ఘోరో, విరూప, స్సంవర్త, స్సుధన్వా
చాష్టమఃస్మృతః."

— భారతానుశాసనికం (83) అధ్యాయము.

తా॥ అంగిరసునికి 1) బృహస్పతి, 2) ఉచథ్యుడు, 3) పయస్యుడు, 4) శాంతి, 5) ఘోరుడు, 6) విరూపుడు, 7) సంవర్తుడు, 8) సుధన్వుడు అను ఎనమండుగురు కొడుకులు కలరు. వీరందరును 'అగ్ని' నుండియే పుట్టినవారని "ఆగ్నేయాః" అనెడి మాట చెప్పుచున్నది. వీరు ఆగ్నేయులెట్లో ఇప్పుడు తెలిసికొందము.

అంగిరులు అగ్నిపుత్రులనెడి విషయము ఋగ్వేద ప్రథమ మండలము నందలి 31వ సూక్తములోని మొదటి మంత్రముకూడ చెప్పుచున్నది.

"త్వ మగ్నే ప్రథమో అంగిరా ఋషి
ర్దేవో దేవానా మభవః శివః సఖా,
తవ వ్రతే కవయో విద్మనాపసోఽ
జాయంత మరుతో భ్రాజదృష్టయః."

— ఋ. 1-31-1.

తా॥ "ఓ అగ్నీ, నీవు అంగిరసులను కన్నతండ్రివి కనుక, మొట్టమొదటి అంగిరో ఋషివి. అట్లే స్వయముగా దేవుడవై తక్కిన దేవతలకు శుభములను గూర్చు మిత్రుడవై నావు. నీ కర్మయందు మేధావులును, కర్మజ్ఞానము కలవారును, ప్రకాశించు ఆయుధములతో కూడినవారును అగు మరుత్తులు జన్మించినారు." ఇట్లే రెండవ మంత్రములోకూడ అగ్ని, శ్రేష్ఠుడైన 'అంగిరసుడని' పొగడబడినాడు.

"త్వ మగ్నే ప్రథమో అంగిర స్తమః, కవిర్దేవానాం పరిభూషసి వ్రతం" అని. ఈవిధముగా ఈ సూక్తము అగ్ని యొక్క సర్వాత్మకత్వమును చెప్పుచున్నది. ఇచ్చట నాల్గవ మండలము, రెండవ సూక్తములోని పదునైదవ మంత్రము 'అంగిరసులు', దివము (సూర్యుని) పుత్రులని చెప్పుచుండగా ప్రథమ మండలములోని ముప్పదిఒకటవ సూక్తము 'అగ్ని' అంగిరసుల తండ్రియని చెప్పినది కదా! ఇది ఒకదానికొకటి విరుద్ధము కాదా అనుకొనపనిలేదు. అగ్నికినీ- సూర్యునకును, అభేదము పాటింపబడినది. ఇద్దరును అగ్నిస్వరూపులే కదా. సూర్యుడు విశ్వకర్మ తనయులలో ఐదవవాడును, విశ్వజ్ఞ బ్రహ్మస్వరూపుడును కనుక అంగిరసులు "విశ్వకర్మ వంశము" వారే అని తేలుచున్నది. ఇక పదవ మండలములోని అరువది రెండవ సూక్తము ఏమనుచున్నదో చూతము.

"యే అగ్నేః పరిజజ్ఞిరే, విరూపాసో దివస్పరి,
నవగ్వో ను దశగ్వో అంగిర స్తమ స్సచా దేవేషు
మంహతే." —— ఋ. 10-62-6.

తా॥ వివిధ రూపములుగల అంగిరసులు ద్యులోక సంబంధమగు 'అగ్ని' నుండి పుట్టినారని మంత్రముయొక్క 1, 2 పాదము లనుచున్నవి. కాగా అగ్నికి- విశ్వకర్మకు గల సంబంధమును నిరూపించినగాని మన ప్రయత్నము పూర్ణము కాదు. విశ్వకర్మ కుమారుడు 'త్వష్టయని' పురుష సూక్తము చెప్పుచున్నదికదా! ఆ త్వష్టయొక్క కుమారుడే 'అగ్ని

అని వేద ప్రమాణము.

"మహిత్వాష్ట్రి మూర్జయంతీ రజుర్యం
స్త భూయమానం వహతో వహంతి,
వ్యంగేభి ర్దిద్యుతానః సధస్థ
ఏకా మివ రోదసీ ఆవివేశ." — ఋ. 3-7-4.

భాష్యం:- "ఊర్జయన్తీ- రబలం బలినం కుర్వంత్యో, వహతో-వహనపరా నద్యో, మహి-మహాంతం, త్వాష్ట్రిం-త్వష్టుః సుత మజుర్యం-జరయితు మనర్హం, స్తభూయమానం-లోకానాం స్తంభనం ధారణ మిచ్ఛంత మగ్నిం వహంతి-ధారయన్తి సధస్థేఽపాం సమీపే అంగేభి రవయవై ర్దిద్యుతానో- దీప్యమానాస్సన్- అగ్ని- రోదసి ద్యావా పృథివ్యా వివేశ-వివిధం ప్రవిష్టవాన్."

తా॥ త్వష్టయొక్క కుమారుడును, మహానుభావుడును అగు అగ్నిని దుర్బలుని బలవంతుని చేసెడి నదులు ముసలితనము లేనివానినిగా చేయుచున్నవి. అనగా నీటిచేత విద్యుద్రూపమైన అగ్ని వృద్ధి పొందుచున్నదని భావము. నీటివద్ద అవయవములచే ప్రకాశించు నీ యగ్ని భూమ్యాకాశములం దెల్లెడల అనేక రీతుల ప్రకాశించుచున్నాడు. అనగా భూమిపై కాష్ఠాగ్నిగాను, నీళ్ళయందును అంతరిక్షమునను-విద్యుద్రూపముగాను, శరీరమున జఠరాగ్నిగాను వ్యాపించుచున్నాడని భావము. అగ్ని 'త్వష్ట' పుత్రుడు కావున, అతని

నుండి కలిగిన అంగిరసులుకూడ 'త్వష్ట్ర దేవుని' వంశమువారే అగుచున్నారు. అంగిరః పుత్రుడే అయిన సుధన్వాచార్యుడును, ఆయన కుమారులైన ఋభువులునూ 'త్వాష్ట్ర వంశీయులే' అని తెలియవలెను, అంతియేకాదు- మంటలనుండి పుట్టిన భృగ్వాదులును 'త్వష్ట' అంశమువారే. ఇంకొక మంత్రము అగ్నిని సాక్షాత్తు 'త్వష్టయే' అని అనుచున్నది.

"త్వ మగ్నే త్వష్టా విధతే సువీర్యం." — ఋ 2-1-5

ఓ అగ్నీ! నీవు త్వష్టవై గొప్ప వీర్యమును (ఫలమును) ఇచ్చుచున్నావు. అగ్ని 'త్వష్టపుత్రుడే' కనుక, "ఆత్మా వై పుత్రనామాసి" అనెడి వేదవాక్యమును బట్టియు, పితాపుత్రుల అభేదమును బట్టియు, అగ్ని 'త్వష్ట్ర స్వరూపుడే' అగుచున్నాడు. కనుక నే-

"ఇహాత్వష్టార మగ్రియం
విశ్వరూప ముపహ్వయే
అస్మాకమస్తు కేవలః." — ఋ. 1-13-10.

భాష్యము :- "త్వష్టారం = త్వష్ట్ర నామక మగ్ని మిహాకర్మణ్యుపహ్వయే" అనుట పొసగినది. ప్రథముడును, విశ్వరూపుడును అగు త్వష్ట్ర రూపాగ్నిని ఈ యజ్ఞమును రక్షించుట కొఱకు పిలుచుచున్నాము. ఆతడొక్కడే మమ్ము రక్షించుగాక!

ఈ విధముగా అగ్ని 'త్వష్ట' పుత్రుడనియు, వారిరు

వురు అభేదరూపులనియు కూడ వేదమున ప్రమాణములుం డుటచేతను, 'త్వష్ట' విశ్వకర్మ కుమారుడే కనుకను, ఆ త్వష్ట కుమారుడైన అగ్ని, అగ్నికి పుట్టిన 'అంగిరసులు' విశ్వ కర్మకు పౌత్ర ప్రపౌత్రులు కాగలరు. ఉపనిషత్తులను బట్టి చూచినను అగ్ని 'విశ్వకర్మీయుడని' స్పష్టము కాగలదు. తైత్తిరీయోపనిషత్తు ఇట్లున్నది.

"... ఆత్మన ఆకాశ స్సంభూతః. ఆకాశాద్వాయుః. వాయో రగ్నిః. అగ్నేరాపః. అద్భ్యః పృథివీ." ఈ మంత్రము ఆత్మనుండి ఆకాశాది క్రమమున అగ్నిపుట్టెనని పంచ భూతముల ఉత్పత్తిని వర్ణించుచున్నది. ఉపనిషత్తులు ఆత్మ, పరమాత్మ, సత్తు, చిత్తు, ఆనందము అని వర్ణించిన వస్తువు "విశ్వకర్మ స్వరూప జగత్కారణమే" కాని భిన్నము కాదు. ఎట్లో చూతము. ఋగ్వేదమునందలి నాసదీయ సూక్తము జగత్కారణమును "నాసదాసీన్నో సదాసీత్" అని 'సత్' అనికాని, 'అసత్' అని కాని చెప్ప వీలుకాని అనిర్వచనీయ మన్నది.ఆ జగత్కారణమునే, అది- విశ్వములను సృజించినది కావున సూక్తము "విశ్వకర్మ" అని వర్ణించినది. పిమ్మట పురుషసూక్తము ఆ విశ్వకర్మను పురుష శబ్దముతో పేర్కొన్నది. యజురారణ్యక పురుష సూక్తమే వా ఆ పురుషుడు ఎవరో కాదు "సాఔద్విశ్వకర్మయే" అని "విశ్వకర్మణ స్సమ వర్తతాధి. తస్య త్వష్టా విదధద్రూపమేతి" అని నిస్సందేహముగా స్పష్టీకరించినది. ఈ 'విశ్వకర్మ' అనెడి జగత్కారణ

మునే ఉపనిషత్తులు బ్రహ్మము, పరబ్రహ్మము, ఆత్మ, పరమాత్మ, సచ్చిదానందము, ఇత్యాది పదములతో పేర్కొని సృష్టివిధానమును వర్ణించినవి. కనుక వేదములనుబట్టి చూచినను, వేదాంతములను (ఉపనిషత్తులను) బట్టి చూచినను, 'విశ్వకర్మ-పరమాత్మలకు' అభేదమేకాని భేదము కన్పడదు. సాయణులు తన భాష్యమున అటనట ఈ విషయములను స్పష్టము చేయుచునే యుండును. కనుక 'విశ్వకర్మ' అనగా లోకములోని 'ఏ శిల్పిమాత్రుడో' యని కాని, 'ఏ దేవ శిల్పియో' అనికాని పాఠకులు భ్రాంతిపడరాదు. ఎంతటి సవిమర్శముగానో వేదోపనిషత్తులను అర్థము చేసికొనెడి బుద్ధి పాటవము మనకు అవసరము. ఇక అంగిరసుల విషయము బ్రాహ్మణాది గ్రంథములలో ఎట్లున్నదో చూతము.

భృగువుల, అంగిరుల జన్మమును గూర్చి ఐతరేయ బ్రాహ్మణము తృతీయ పంచికలోని 33వ ఖండము "తస్య యద్రేతసః ప్రథమ ముదదీప్యత, తదసావాదిత్యోఽభవద్య ద్వితీయ మాసీత్తద్భృగురభవత్తం వరుణో న్యగృహ్ణీత, తస్మాత్స భృగు ర్వారుణి, రథ య త్తృతీయ మదీప్యత, త ఆదిత్యా అభవన్. యేఽంగారా ఆసం స్తేఽంగిరసోఽభవన్. యదం గారాః పునరవశాన్తా ఉదదీప్యన్త త ద్బృహస్పతి రభవత్."

తా॥ ప్రజాపతి, తన పుత్రిని కామించి భోగింపగా, ఆ రేతస్సు క్రిందపడినదనియు, దానిని మరుత్తులు అగ్ని

లోనికి నెట్టగా, మొదటి భాగమునుండి ఆకాశమున వెలుగు నట్టి 'ఆదిత్యుడు' (సూర్యుడు), రెండవ భాగమునుండి 'భృగువును', మూడవ భాగమునుండి 'దేవతలును', అంగారముల మీద (నిప్పులమీద) పడినదానినుండి 'అంగిరులును', అవ శాంతములైన నిప్పులనుండి 'బృహస్పతియును' జన్మించినారని చెప్పుచున్నది. "బృహద్దేవత" అనెడి గ్రంథమేమో దిగువ రీతిగా పలుకుచున్నది.

శ్లో॥ త్రి సాంవత్సరికం సత్రం, ప్రజాకామః ప్రజాపతిః,
ఆ హారత్సహిత స్సాధ్యై ర్విశ్వై ర్దేవై స్సహేతిచ. 97

తత్ర వాగ్దీక్షణీయాయాం, ఆజగామ శరీరిణీ,
తాం దృష్ట్వా యుగపత్తత్ర, కస్యాథ వరుణస్యచ. 98
శుక్రం చస్కంద తద్వాయు రగ్నౌ ప్రాంస్య
ద్యదృచ్ఛయా, తతోర్చిభ్యో భృగుర్జజ్ఞే, అంగారే
ష్వంగిరా ఋషిః. 99
ప్రజాపతిం సుతౌదృష్ట్వా, దృష్టావాగభ్యబాషత-
ఆభ్యాం ఋషి స్తృతీమోపి, భవేదత్రైవ మే సుతః.
ప్రజాపతి స్తథేత్యుక్తః, ప్రత్యభాషత భారతీం,
ఋషిరత్రి స్తతోజజ్ఞే, సూర్యానల సమ ద్యుతిః. 101
యోఽంగారేభ్య ఋషిర్ జజ్ఞే, తస్య పుత్రో
బృహస్పతిః, బృహస్పతే ర్భరద్వాజో, విదధీతి య
ఉచ్యతే." 102.

తా॥ ప్రజాసృష్టిని కోరిన ప్రజాపతి సాధ్యులను, విశ్వే దేవతలను కలుపుకొని మూడు సంవత్సరముల యజ్ఞమును చేసినాడు. అక్కడకు వాగ్దేవి శరీరమును దాల్చి వచ్చినది. ఆమెను కాంచిన వాయువునకు, వరుణునికి రేతఃపతనమైనది. ఆ రేతస్సు గాలిచేత అగ్నిలో పడినది. ఆ హోమకుండాగ్ని మంటల నుండి "భృగు మహర్షి" జన్మించినాడు. అంగారముల (నిప్పుల) నుండి "అంగిరో ఋషి" పుట్టినాడు. అప్పుడు వాగ్దేవి ఆ ఇద్దరు సుతులను గాంచి, ప్రజాపతితో నాకు మూడవ కుమారుడుకూడ కావలెనని అన్నది. ప్రజాపతి "తథాస్తు" అనినాడు. అంతట సూర్యాగ్నులతో సమాన తేజస్సుగల 'అత్రి' అనెడి మూడవ కుమారుడు కలిగినాడట. నిప్పుల నుండి పుట్టిన అంగిరుని నుండియే "బృహస్పతి" కలిగినాడు. ఆ బృహస్పతికి "భరద్వాజు" డుదయించినాడు. ఇయ్యది బృహద్దేవతా గ్రంథము చెప్పిన భృగ్వంగిరోఽత్రి మునుల ఉత్పత్తి ప్రకారము. ఇందు చెప్పబడిన వరుణుడు ఎవ్వడోకూడ తెలిసికొనుట ముఖ్యము. ఇతడు ఋగ్వేదమున కొన్ని సూక్తములలో వర్ణింపబడిన దేవుడని మన మెఱుంగవలయును. మిత్రా వరుణులు ద్వాదశాదిత్యులలోనివారు. ఆ ద్వాదశాదిత్యులను కన్నది "విశ్వకర్మ" యని లోగడ ప్రకరణములో మనము చదివియే ఉన్నాము. ఇక బృహద్దేవత ఈ వరుణుని గూర్చి ఇట్లు చెప్పుచున్నది.

"ప్రాజాపత్యో మరీచిర్హి మారీచః కశ్యపో మునిః,
తస్య దేవ్యోఽభవన్ జాయా దాక్షాయణ్య
స్త్రయోదశ, తత్రైకాత్వదితిర్దేవీ, ద్వాదశాఽజనయ
త్సుతాన్, భగ, శ్చైవార్యమాం, శశ్చ, మిత్రో,
వరుణ ఏవ చ, ధాతా చైవ, విధాతా చ, వివస్వాం
శ్చ మహాద్యుతిః. త్వష్టా, పూషా, తథై వేంద్రో,
ద్వాదశో విష్ణు రుచ్యతే, ద్వంద్వం తస్యాస్తు తజ్ఞజ్ఞే
మిత్రశ్చ వరుణశ్చహ." — 148.

తా॥ ప్రజాపతికి (విశ్వకర్మకు) "మరీచియను" కుమారుడు కలడు. ఈ మరీచి సప్త ఋషులలో ఒకడని మనము "యత్రసప్తర్షీన్ పరఏక మాహుః" అని విశ్వకర్మ సూక్తములో చదివియే యున్నాము. అనగా సప్తఋషులు విశ్వకర్మ తనయు"లని పూర్వగ్రంథమునుబట్టి మన మెఱిగిన విషయమే. ఆ మరీచికి 'కశ్యపుడు' ఉదయించినాడు. ఆ కశ్యపునికి దక్ష పుత్రికలైన 'అదితి' మున్నగువారు పదముగ్గురు భార్యలు కలరు. వారిలో "అదితి" అను ఆమెకు 1) భగుడు, 2) అర్యముడు, 3) అంశుడు, 4) మిత్రుడు, 5) వరుణుడు, 6) ధాత, 7) విధాత, 8) వివస్వంతుడు, 9) త్వష్ట, 10) పూష, 11) ఇంద్రుడు, 12) విష్ణువు- అనెడి పన్నిద్దఱు కుమారులు కలిగినారు. వీరిలో మిత్రుడును, వరుణుడును కవలపిల్లలుగా పుట్టినారు, ఈ మిత్రావరుణులకే ఊర్వశి యందు 'వసిష్ఠుడును', 'అగస్త్యుడును' జన్మించినారని బృహ

ద్దేవత చెప్పుచున్నది-

"ద్వంద్వం తస్యాస్తు తజ్జజ్ఞే, మిత్రశ్చ, వరుణశ్చహ- 148

తయో రాదిత్యయో స్సత్రే, దృష్ట్వాప్సరస
మూర్వశీమ్ రేతశ్చస్కంద తత్కుంభే, న్యపత
ద్వాసతీవరే. 149.

తేనైవ తు ముహూర్తేన వీర్యవన్తౌ తపస్వినౌ,
అగస్త్యశ్చ, వసిష్ఠశ్చ తత్రర్షీ సంబభూవతుః. 150.

బహుధా పతితే శుక్రే, కలశేఽథ జలే, స్థలే,
స్థలే వసిష్ఠ స్తు ముని, స్సంభూత ఋషిసత్తమః. 151.

కుంభేత్వగస్త్య స్సంభూతో, జలే మత్స్యో మహా
ద్యుతి." — 5వ అధ్యాయము.

తా॥ కవలుగా జన్మించిన మిత్రావరుణులు ఒక యజ్ఞ సందర్భమున ఊర్వశిని గాంచి మోహావిష్టులై వీర్య స్ఖలనము నొందినారు. ఆ రేతస్సు చెదరి స్థల, జల, కుంభములయందు పడినది. అప్పుడు కుంభమునుండి అగస్త్యుడును, స్థలమునుండి వసిష్ఠుడును, జలము నుండి మత్స్యమును (చేప) జన్మించుటయైనది. ఈ అంశము బృహద్దేవతతో పాటు మన పురాణాది వాఙ్మయముకూడ చెప్పుచునే యున్నది. వసిష్ఠ మహర్షి యొక్క ఈ జన్మప్రకారమును ఋగ్వేదముకూడ "ఉతాసి మైత్రావరుణో" అను మంత్రమున (32వ పుట

చూడుము) దాని తాత్పర్యమిది :-

వసిష్ఠ పుత్రులు ఈ మంత్రముచేత తండ్రి యగు వసిష్ఠుని స్తుతించుచున్నారు. "ఓ వసిష్ఠ మహర్షి! నీవు మిత్రావరుణులయొక్క పుత్రుడవైతివి. "ఈ వసిష్ఠుడు మాకు పుత్రుడగు గాక!" అని సంకల్పించుకొన్న మిత్రావరుణులకు ఊర్వశీ దర్శనముచేత రేతస్సు జారిపడినది. ఆ వీర్యమునుండి నీవు పుట్టినావని భావము. విశ్వేదేవతలు దైవసంబంధమైన వేదములతో నిన్ను పుష్కరమునం దధివసింపచేసిరి." మిత్రావరుణుల సుతుడు కనుకనే వసిష్ఠునికి "మైత్రావరుణి" అని పేరు కలిగినది. తరువాతి మంత్రము వసిష్ఠ ప్రభావమును ఇట్లు చెప్పుచున్నది-

"స ప్రకేత ఉభయస్య ప్రవిద్వాన్
త్సహస్రదాన ఉత వా సదానః,
యమేన తతం పరిధిం వయిష్య
న్నప్సరసః పరిజజ్ఞే వసిష్ఠః." — ఋ. 7-33-12.

తా॥ మహాజ్ఞానసమైన ఆ 'వసిష్ఠుడు' భూ స్వర్గలోకములను లెస్సగా నెఱింగినవాడై సహస్రదానములు చేసినవాడే కాక, సర్వదానములు చేసినవాడుకూడ ఆయెను. ఈ వసిష్ఠుడు సర్వమును నియమించు కారణరూపుడైన యమునిచేత సంసార ప్రవాహమున అప్సరసయైన "ఊర్వశి" నుండి జన్మించినాడు. ఈ మంత్రము వసిష్ఠుడు, ఊర్వశీగర్భ సంభూతు

డగుట విధివిహితమని చెప్పుచున్నది. దీని తరువాతి మంత్రము-

"స ప్రేహ జాతా విషితా నమోభిః
కుంభే రేతః సిషిచతుః సమానం,
తతో హ మాన ఉదియాయ మధ్యా
త్తతో జాత మృషి మాహు ర్వసిష్ఠమ్." 7-33-13.

తా॥ యజ్ఞదీక్షితులైన మిత్రావరుణులు (ఊర్వశీ దర్శనమోహులై) ఒకేసారి కుంభమునందు, రేతో విసర్జనము నొనర్చినారు. అప్పుడా కుంభమునుండి శమీప్రమాణులైన అగస్త్యుడును, వసిష్ఠుడును పుట్టినారు. ఈ ఋజ్మంత్రములకు తగినట్లుగానే బృహద్దేవతా గ్రంథము వసిష్ఠాగస్త్యుల జన్మప్రకారములను వివరించినది. అనేక ఋషుల జన్మప్రకారములు ఈ విధముగా నున్నందువలననే "ఋషుల జన్మవృత్తాంతములను తడవరాదని" మనవారనుచుందురు. భృగ్వంగిరుల జన్మ సందర్భమున వాగ్దేవిని గాంచిన వాయు వరుణులకు రేతస్ఖలనమగుటయు, ఆ రేతస్సు మంటలలోపడి ఆ మంటలనుండి భృగువులును, నిప్పులనుండి (అంగారముల నుండి) అంగిరులును, జన్మించుటయు, అట్లే మిత్రావరుణుల వంటి మహానుభావులకు ఊర్వశీ దర్శనముచేత శుక్రము జారి పడుటయు మన దృష్టికి వింతగానే తోపవచ్చును. సామాన్యుల దృష్టికి "ఇవి కట్టుకథలా" అనిపించుటలో ఆశ్చర్యము

లేదు. అందుకే 12వ మంత్రమున "యమేన తతం పరిధిం వయిష్యన్నప్సరసః పరిజజ్ఞే వసిష్ఠః."

భగవంతుని సృష్టి విధానమునుబట్టి సంసారమున వసిష్ఠుడు, అప్సరసకు పుత్రుడైనాడని చెప్పబడినది.

ఇట్టిదే మఱియొక కథ- బృహస్పతికి 'దీర్ఘతముడును', ఆయనకు 'కక్షీవంతుడును' పుట్టినారన్నది మనకు వింతగానే తోచుచుండును. ఆ కథ మహాభారతము నందును చదువ గలము. బృహద్దేవత ఆ కథ నిట్లు చెప్పినది. 'ఉచథ్యుడు, బృహస్పతి' అని ఇద్దరు సోదర ఋషులు కలరు. వారిలో ఉచథ్యునకు 'మమత' యను భార్య కలదు.ఆమె గర్భవతియై యుండగా 'బృహస్పతి' ఆమెతో సంభోగించినాడు. శుక్రము పడబోవు సమయమున ఇతఃపూర్వమే గర్భములోనున్న శిశువు శుక్ర సంకరము చేయవలదని 'బృహస్పతిని' నివారించెను. అందుకు బృహస్పతి ఆగ్రహించి ఆ శిశువును "జాత్యంధుడవవుదువుగాక" యని శపించెను. అట్లే, పుట్టిన పిమ్మట ఆతడు గ్రుడ్డివాడై దీర్ఘతముడుగా పిలువబడెను. ఆ కుఱ్ఱడు దేవతలను స్తోత్రము చేసి తదనుగ్రహముచేత తన గ్రుడ్డితనమును పోగొట్టుకొనుటయేకాక, తపశ్శక్తిచే మహర్షియై పెక్కు వేద సూక్తములను వ్రాసినాడు. ప్రథమ మండలమున 149 నుండి 164 వఱకు గల 25 సూక్తములు ఇతడు వ్రాసినవే. ఇతడు "మమతకు" పుట్టినందున "మామతేయుడనియు" పిలువబడెను. ఈ దీర్ఘతముని వల్లనే అంగరాజ

దాసియగు 'ఉశిజ' అనునామె యందు "కక్షీవంతుడు" మొదలైన పలువురు పుత్రులు జన్మించినారు. కక్షీవదాదులు గూడ వేదమంత్ర నిర్మాతలే. ఈ కథ అంతయు బృహద్దేవత నాల్గవ అధ్యాయమున 11వ శ్లోకము నుండి 25 వఱకు వర్ణింపబడి యున్నది. ఇక తక్కిన దేవతలు, విశ్వము, ఎట్లు కలిగినవో "విశ్వకర్మ సూక్తముల" ద్వారా తెలిసికొందము.

## విశ్వకర్మ సూక్త తత్త్వార్థము

కృష్ణ యజుర్వేదము నాల్గవ కాండములోని ఆఱవ ప్రపాఠకమున ద్వితీయానువాకమునందుగల (రెండు సూక్తముల) మంత్రములలోని "విశ్వకర్మ భగవానుని" స్వరూప స్వభావ మహిమలను గూర్చి ఇప్పుడు తెలిసికొందము. ఈ "విశ్వకర్మ సూక్తములు" ఋగ్వేద దశమ మండలములో 81, 82 సూక్తములుగా ఉన్నవి. అందు 14 మంత్రములు మాత్రమే కలవు. తైత్తిరీయ సంహితలో 16 మంత్రములును, 17 వ దిగా "సముద్రాయ వయునాయ" అనునదియు కలవు. ఈ 17 మంత్రములకు గల తత్త్వార్థమును సంగ్రహముగా పరిశీలింతము.

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ
దృషిర్హోతా నిషసాద పితా నః." — వి. సూ. 1.

టీక :- "యః=ఏ విశ్వకర్మ పరమేశ్వరుడు, ఇమా విశ్వాభువనాని=ఈ సమస్తలోకములను, జుహ్వత్=ప్రళయ కాలమున తనయందు ఆహుతివలె వేసికొని లీనము చేసి కొనునో, అట్లు తనలో ఇముడ్చుకొని, ఋషిః=సర్వద్రష్టయు అనగా సర్వజ్ఞుడును, హోతా = సంసారహోమకర్తయు (జగములను తనలో హోమము చేసికొన్నవాడు) అయి, నః = మనకు, పితా=జనకుడై, నిషసాద=ఉండెనో, ప్రళయ కాలమున సర్వలోకములను సంహరించి, మనకుకు సంహార కుడై, మరల సృజించువాడై, సర్వము నెఱింగిన ఋషియై ఉండెనో" అని భావము.

వివరణ :- "హోత" అనుటచేత సంహారకుడైన రుద్రునియొక్క స్వరూపమును, "పితా" అనుటచేత మరల సృష్టి చేసెడు 'కర్త లేక తండ్రి' అనియు, "ఋషి" అనుట వలన సర్వజీవులయొక్క పుణ్యాపాపకర్మల నెఱింగి వారికి పున ర్జన్మల నొసంగెడి 'సర్వజ్ఞుడనియు' వ్యక్తమగుచున్నది. సృష్టి, స్థితి, లయములని క్రమము ఉండగా ఈ సూక్తారంభమున లయముతో జగత్తులు పేర్కొనబడినవి. ఇట్లు పేర్కొన బడుటచేత సృష్టి యనుదానికి ఆది లేదనియు, అది చక్రము వలె ప్రారంభము లేక, కొనసాగుచుండుననియు తెలియ వలెను. ఈ రహస్యమును ఇతర సృష్టి చరిత్రలయందు కాంచము. "యతోవా ఇమాని భూతాని జాయన్తే" అన్న తైత్తిరీయోపనిషత్తు కూడా జగద్వర్ణనమును సృష్టితోనే

ప్రారంభించనది. దానినే భాగవతము "ఎవ్వనిచే జనించు జగము" అని అనుసరించినది. ఈ విశ్వకర్మ సూక్తమనుసరించిన శ్రోవ 'లయముతో' జగద్వర్ణనము చేయుట అనునది ప్రత్యేకమైనది సంసారమును 'అనాది' అనియు, 'సాంతము' అనియు, మనవారు చెప్పుచుందురు. ఇక సంసారహేతువైన భగవంతుడు లేదా బ్రహ్మ పదార్థము అనాది, అనంతము అయినట్టిది. కనుక 'లయముతో' ప్రారంభించుటచేత సంసారమునకు ఆది లేదనియు, భగవత్సాక్షాత్కారము పొందినచో సంసారము నివర్తించును గాన, జీవులు ముక్తులగుదురనియు వేదాంత సిద్ధాంతము. ముక్తులు కానివారు సంసార చక్రమునబడి మోక్షము చిక్కువరకు తిరుగుచుండవలసినదే. ఈ రహస్యమునే మనము సంసారము కాని, బ్రహ్మము కాని, అనాదులే అనియు. ఆ రెంటిలో సంసారము అంతము కలది కాగా, బ్రహ్మము అనంతమైనదనియు చెప్పుకొనుచున్నాము.

"స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః
పరమచ్ఛదోఽవర ఆవివేశ." — వి. సూ. 1.

టీక :- సః = అట్టి విశ్వకర్మ పరమేశ్వరుడు, ఆశిషా = తిరిగి సృష్టింపవలెననెడి సంకల్పముచేత, ద్రవిణం ఇచ్ఛమానః = ధనమని చెప్పతగిన జగత్తుల యొక్క భోగమును కోరినవాడై, పరమచ్ఛదః = స్వకీయమైన పారమార్థిక రూపమును,

ఆవరించినవాడై, అవరే=శ్రేష్ఠము కానటువంటి, నశ్వరమైన శరీరమున, ఆవివేశ = ప్రవేశించెను. అనగా జగత్తులను సృష్టింపనెంచిన "విశ్వకర్మ" ఏ జగములలోని పిండాండము లను సృష్టించెనో వాటిమధ్యమునచే తాను జీవరూపుడై ప్రవేశించెనన్నమాట.

వివరణ :- జీవుల యొక్క పూర్వజన్మల పుణ్యపాప ఫలములు వారిచేత అనుభవింపచేయబడుటకు పునఃసృష్టి అనునది, సర్వజ్ఞుడగు భగవంతునిచేత చేయబడుచున్నదని ఇక్కడ గ్రహింపవలయును. జీవుల కర్మ ఫలానుభవము కోసమే పరమేశ్వరునికి సంకల్పముకాని, స్వయముగా ఆతడు తానై సృష్టిని కోరలేదు. అట్లు కోరినచో 'ఆతడు' ప్రకృతి లోని సామాన్య ప్రాణులవంటివాడే కావలసి వచ్చెడిది. ఈశ్వరునకు అట్టి అహంకార మమకారములు ఎంతమాత్ర మును లేవు. ఎవరు చేసిన కర్మఫలములను వారిచే అనుభవింప చేయుటయే ఆయన సృష్టియొక్క రహస్యము- తత్త్వము. ఈ మంత్రమున ఏ దేవుడు లయము చేసెనో ఆతడే మరల జీవ రూపుడై ఉపాధుల యందు ప్రవేశించినాడనుటచేత అద్వైత సిద్ధాంతము స్పష్టమగుచున్నది."ఆతడే ఈతడు," అన్నప్పుడు 'ఆతడేమో' భగవంతుడు, 'ఈతడేమో' జీవుడు. జీవునికి ఉపాధి (శరీర) సంయోగము వలన అహంకార మమ కారము లేర్పడుచున్నవి. భగవంతునికి ఉపాధి ఉన్ననూ, లేకున్నను అహంకార మమకారములు ఉండవు. ఆతడు

నిష్కలుడు, నిస్సంగుడును! జీవుడు కూడ ఆ దేవుని ఉపా సించి తన ఉపాధి సంబంధమును తొలగించుకొన్నచో ఆ జీవుడు సాక్షాత్తు దేవుడే అగుచున్నాడు. ఇదియే జీవాత్మ పరమాత్మలకు గల భేదము. కనుక ఇట్టి అద్వైత సిద్ధాంత మును 'విశ్వకర్మ సూక్తము' మొదటి మంత్రములోనే చెప్పి నది. ఈ తత్త్వమునే తరువాత 'ఉపనిషత్తులు', 'శాస్త్రములు' అనుసరించినవి. కనుక అద్వైతము "విశ్వకర్మ సూక్తము" లోనేఉన్నదని ఎల్లరూ గ్రహింపవలయును.

"విశ్వకర్మా మనసా యద్విహాయా
ధాత విధాత పరమోత సందృక్,
తేషా మిష్టాని సమిషా మదన్తి
యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః." — వి. సూ-2.

టీక :- యత్ = ఎందువలన, విశ్వకారణుడైన విశ్వ కర్మ. మనసా=తన సత్యసంకల్పముచేతనే, విహాయా=విశేష ముగా తాను సృష్టించినవాటిని సంహరించువాడును, ధాతా = పుట్టించువాడును, విధాతా = పోషించువాడును అయి నాడో, అందువలననే- విశ్వకర్మా=సమస్తమైన సృష్టి, స్థితి, లయాదులైన కర్మలనుచేయు "విశ్వకర్మ" అనెడి మాటచేత చెప్పదగిన యోగ్యత కలవాడైనాడు. ఇచ్చట హరి, హర, బ్రహ్మేంద్రాది శబ్దములకంటె "విశ్వకర్మ" శబ్దము సమస్త కర్మార్థములనూ చెప్పునట్టిదై, జగత్కారణ వస్తువునకు సరి యైన నామధేయమగుచున్నదని తత్త్వజ్ఞుల భావము. ఉత=

ఇంకను, ఆ విశ్వకర్మ, పరము = తాను సృష్టించిన. అందరి కంటెను. అన్నింటికంటెను, శ్రేష్ఠుడును, సందృక్ = అన్నింటినీ దర్శించునట్టి సర్వ ద్రష్టయు, సర్వజ్ఞుడును అయి నాడు. యత్రపరే=ఏ సర్వశ్రేష్ఠ పరమ పురుషునియందు, సప్తర్షిన్=మరీచి మొదలైన సప్తఋషులను, ఏకం ఆహుః= ఒక్కటే అని తత్త్వవేత్తలు చెప్పుదురో అనగా 'ఆయన' నుండియే సప్త ఋషులు కలిగినారని చెప్పెదరో అట్టి "విశ్వ కర్మ ప్రభువు", తేషాం=ఆ సప్త ఋషులయొక్క, ఇష్టాని= కోరికలను, ఇషా = తన సంకల్ప మాత్రముచేతనే తీర్చు చున్నాడు. తమ కోరికలు తీరిన ఆ ఋషులు అందుచేత, సమ్మదంతి = ఎక్కువగా సంతసించుచున్నారు. ఇక్కడ ఈ దిగువ రహస్యము గమనింపదగియున్నది.

వివరణ :- సృష్ట్యాది సర్వకర్మలకు, దేవమనుష్యాది సర్వజీవులకు బీజభూతుడైనవాడు (విత్తనము వంటివాడు) "విశ్వకర్మ" పరమేశ్వరుడే. బీజమునుండి కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, పండ్లతో కూడిన వృక్షము విస్తరించినట్లు సమస్త జగద్బీజమైన "విశ్వకర్మ" నుండియే దేవ, మనుష్య, తిర్యగాదులుగాని, పంచ, సప్త ఋషులుకాని జన్మించు చున్నారని ఈ మంత్రము నుడువుమన్నది. ఈ రహస్యమునే భగవద్గీత "బీజం మాం సర్వభూతానామ్ విద్ధి పార్థ సనాత నమ్" (7-10) అని చెప్పినది. ఈ బీజము సనాతనమనుటచేత అది భూత, భవిష్యద్వర్తమానములనెడు త్రికాలముల యం

దను సిద్ధమైయుండు వస్తువని తెలియవలెను! సప్త ఋషులను సృష్టించినవాడు "విశ్వకర్మయే" అని మనము అథర్వవేద మంత్రమునకూడ చదివియున్నాము. ఈ సప్త ఋషులను పిండాండపక్షమున తాత్త్విక దృష్టితో చూచినచో ఆధార, స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములని చెప్పుకొనవలసియున్నది. ఈ "సప్తచక్రములు" పరాత్పరుడైన "విశ్వకర్మ" నుండి పుట్టినవే. సప్త సంఖ్యయొక్క సృష్టిని గూర్చి ముండకోపనిషత్తు ఇట్లున్నది.

"సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్
సప్తార్చిషః, సమిధ, స్సప్త హోమాః,
సప్త ఇమేలోకా యేషు చరన్తి ప్రాణాః
గుహాశయా నిహితాస్సప్త సప్త." — 2-8.

ఇందు సప్తప్రాణములనగా పంచ జ్ఞానేంద్రియములు, ప్రాణము, అంతఃకరణము. గాయత్ర్యాదులు ఛందస్సులు. సప్తార్చిస్సులు- అగ్నియొక్క కాళీ, కరాళీ మొదలైన సప్త జిహ్వాలు (నాలుకలు), సూర్యుని సప్త కిరణములు కూడను. తత్త్వ సాధకులు ఈ సప్త ప్రాణములచేత చేయతగిన సాధన ఎంతయో కలదు. అట్లే సప్త చక్రముల మీదుగా కుండలినీ శక్తిని సహస్రారమునకు చేర్చి ముక్తిపొందెడు విధానమును కుండలినీ యోగము చెప్పుచునేయున్నది. "ధేనుర్వాక్" వేదవాక్కు కామధేనువు వంటిదని చెప్పిన మంత్రభావమును

మనము ఇన్ని అర్థములు భావించిననే కాని సార్థకము కాదు.

ఈ రెండవ మంత్రములో "విశ్వకర్మ" విహాయా-సంహర్త (అనగా శివుడు), ధాత (అనగా బ్రహ్మ), విధాతా (అనగా పోషకుడైన విష్ణువు) అయినాడని చెప్పినందువలన ఆయన త్రిమూర్తి స్వరూపుడని శ్రుతియే చెప్పినట్లైనది. అట్లే 'పరమ' శబ్దమును వాడినందువలన "విశ్వకర్మ" బ్రహ్మాదుల కంటే శ్రేష్ఠుడనియు, వారికి 'తండ్రి' యనియు కూడా స్పష్టమగుచున్నది. 'సందృక్' శబ్దమేమో ఆయనయొక్క 'సర్వజ్ఞత్వమును' చాటుచున్నది. ఆయన సప్తఋషులను కని వారికోరికలను తీర్చినందున తన బిడ్డలను, జీవులను, ఉద్ధరించుటకు ఆయన నహుము కట్టుకొని యుండునని తేలుచున్నది. మంత్రముయొక్క సంపూర్ణార్థమును అవగాహన చేసికొన్నచో ఆ దేవుడు సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వేశ్వరుడు అనియు, సమస్తమును ఆయన స్వరూపమే అనియు తేటతెల్లమగుచున్నది. ఇట్టి దేవుని వేదముద్వారా తెలిసికొని అర్చించి సంసారబంధముల నుండి ముక్తుడు కావలసినదని జీవకోటికి ఈ మంత్రము సూచించుచున్నది. ఈవిధముగా ఆలోచించినకొలదీ ఎన్నెన్నో భావములు "విశ్వకర్మ సూక్త మంత్రముల" నుండి పాఠకులకు తెలియగలవు. అట్టివాటి నన్నింటినీ వ్రాసినచో గ్రంథము పెరిగిపోవునను భయముచే కొన్నింటిని మాత్రమే వ్రాసి తక్కినవాటిని ఊహించుకొనవలసినదని పాఠకులకు, సాధకులకు, తత్త్వచింతకులకు వదలు

చున్నాము. వేద మంత్రములలో ఇంతటి గంభీర విశేషార్థములు ఉండునని మాత్రము ఎవరునూ మఱువరాదు. అవి భావించువారి భావనాశక్తినిబట్టి తోచుచుండును. అట్లు కానిచో "వేదవాక్కు కామధేను" వనెడి మాట వ్యర్థము కావలసి వచ్చును.

"యోనః పితా జనితా యో విధాతా,
యోన స్సతో అభ్యాస జ్జజాన,
యో దేవానాం నామధా ఏక ఏవ,
తం సంప్రశ్నం భువనా యన్త్యన్యా." — వి. సూ-3

టీక : యః=ఏ విశ్వకర్మ, నః=మనకు, పితా=పాలకుడును, కేవలము పాలకుడే కాదు, జనితా=మనలను పుట్టించిన దేవుడునూ, అంతియే కాదు, యః = ఏ విశ్వకర్మ, విధాతా=సమస్త జగత్తులకును ఉత్పాదకుడును అయి ఉండెనో, యః=ఏ విశ్వకర్మ, నః=మనకు కావలసిన అనుభవ యోగ్య వస్తు సమూహములను, సతః=సత్తునుండి, జజాన= కలిగించినాడో, అనగా తననుండి కలిగిన పృథివీ, జల, ఓషధులనుండి సృష్టించినాడో, ఇంకనూ యః = ఏ విశ్వకర్మ, ఏకః ఏవ=ఒక్కడే అయ్యును, దేవానాం=ఇంద్ర, అగ్ని, మిత్ర, యమ, వరుణాది దేవతలయొక్క, నామధాః=నామ రూపములను ధరించుచున్నాడో, ఆ "విశ్వకర్మ" ఒక్కడే-బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్రాది దేవతల నామరూపములను

తాల్చి ఆయా కార్యములను చేయుచున్నాడని భావము. తమ్=అట్టి విశ్వకర్మను, అన్యాభువనా=ఆయనచే సృజింపబడి, ఆయనకు భిన్నాభిన్నములైన లోకములు, సంప్రశ్నం= ఆయనను ప్రశ్నించుచున్నట్లుగా, యన్తి=ప్రళయకాలమున ఆయనలో లీనమగుచున్నవి. అనగా ఆ "విశ్వకర్మ తత్త్వము" నందే ఏకీభవించుచున్నవన్నమాట. ప్రళయ కాలమున "భువనములు ఏవి? విశ్వకర్మ ఎవరు ?" అని అడుగుటకు వీలు లేకుండా అగుచున్నదని సారాంశము. అప్పటిది "ఏకమేవా ద్వితీయమ్" అనెడి స్థితి అన్నమాట. దీనినే ఇంకొక మంత్రము "నాసదాసీత్ నోసదాసీత్" అని వర్ణించినది.

వివరణ : ఈ మంత్రమున విశ్వకర్మ "పిత" అనియు, 'జనిత' అనియు, 'విధాత' అనియు వర్ణింపబడినాడు. ఈ మాటలు రెండవ మంత్రమున కూడా లేకపోలేదు. ఒకసారికి రెండుసార్లుగా విషయమును బోధించుట- అది ముమ్మాటికీ సత్యమని చెప్పుటకే. మనమనుభవించవలసిన ప్రపంచము లోని వస్తువులన్నియు ఆ భగవంతుడు ఒసంగినవే అని మంత్రములోని రెండవ పాదము చెప్పినది. కనుక భగవంతు డిచ్చిన వస్తువులను మనము సద్వినియోగము చేసికొనవలెనే కాని వ్యర్థము చేయరాదని గ్రహింపవలసియున్నది. మూడవ పాదము సమస్త దేవతల రూపములు, నామములు ఆ "విశ్వకర్మ" నుండియే ఆయన 'రూపాంతరములుగానే' ప్రవర్తించు చున్నవని చెప్పినది. ఇదే విషయమును మోక్షసూక్తము

నందలి "ఇంద్రం, మిత్రం, వరుణ, మగ్ని మాహుః... ఏకం సద్విప్రా బహుధావదన్తి" అనెడి మంత్రము కూడా వక్కాణించినది. ఒకే ఒక జగత్కారణ సద్వస్తువును (విశ్వకర్మను) మేధావులు బహునామ రూపములతో ఇంద్రుడనియు, మిత్రుడనియు చెప్పుచుందురు- అని దాని భావము. ఈ పరమాద్వైత భావమును మన వేద దర్శనములు అడుగడుగునను వాకొనుచునే యున్నవి. కనుక మోక్షసూక్త మంత్ర భావమును ఈ మూడవ మంత్రముయొక్క ఉత్తరార్థమును ఒక్కటే యని పాఠకు లెఱుంగవలసియున్నది. ఋగ్వేదములోని పెక్కు సూక్తములలోను, మంత్రములలోను ఇట్టి సాదృశ్యములు, సమానార్థములు ఉండుట గమనింపదగిన విషయము.

"యో దేవానాం నామధా ఏక ఏవ" అను మంత్రముయొక్క భావమునే పురుషసూక్తములోని "పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం, యచ్చభవ్యం" అన్న వాక్యము చెప్పినది. అనగా ఇదివరకు పుట్టిన విశ్వముగాని, ఇంక ముందు పుట్టబోవు జగత్తుగాని "విశ్వకర్మ స్వరూపు" డగు పురుషుడే కాని వేఱుకాదని అర్థము. దేవ మనుష్యాదులతో గూడిన చరాచరాత్మక విశ్వమంతయు "విశ్వకర్మ" (పురుష) స్వరూపమే కాని భిన్నము కాదని సారాంశము. "విశ్వకర్మ-పురుష సూక్తములు" రెండును బింబ ప్రతిబింబ

ములవలె ఇట్లు కొనసాగుచుండును. అట్లే సూర్య-చంద్రాది సర్వదేవతలు, వేదములు, దిక్కులు, దేశకాలములు సర్వమును "విశ్వకర్మ" (పురుష) నుండి కలిగి తత్స్వరూపములే అయి ప్రకాశించుచున్నవని ఉభయ సూక్తముల భావము.

"త ఆయ జన్త ద్రవిణం సమస్మై
ఋషయః పూర్వే జరితారో న భూనా,
అసూర్తా సూర్తా రజసోవిమానే
యే భూతాని సమ కృణ్వన్నిమాని." — వి సూ-4.

టీక : యే=విశ్వకర్మచే సృష్టింపబడిన మొట్టమొదటి ఏ సృష్టికర్తలు, ఇమాని భూతాని= ఈ ప్రాణులను, సమ కృణ్వన్=సృజించినారో, తే పూర్వే = ఆ పూర్వులైన సృష్టికర్తలు, అనగా మనుయాది పంచ బ్రహ్మలు, లేదా బ్రహ్మ విష్ణు, రుద్రాది పంచమూర్తులు, సానగాది పంచ ఋషులు (ఈ ముగ్గురికీ అభేదమని తెలియవలెను), అస్మై =తమచే సృజింపబడిన ఈ జగత్తు కొఱకై, ద్రవిణం=ధన మని చెప్పదగిన, భోగ్యవస్తు సమూహమును, సమాయజంత =సృష్టించిరి, లేక సంసిద్ధము చేసినారని భావము. ఆ ఆదిమ బ్రహ్మల విశేషములను మంత్రము ఇట్లు చెప్పుచున్నది : ఋషయః=అతీంద్రియ జ్ఞానము గల (సర్వజ్ఞులైన), తే=ఆ ఋషులు లేక బ్రహ్మలు. భూనా=తమ మహిమచేత ఎప్పుడు కూడ. జరితారఃన=జీర్ణులు కారు- వారు జరామరణాద్యవస్థలు లేని శాశ్వతులన్నమాట. ఎన్ని సృష్టులు, ప్రళయములు

కలిగినను వారు శాశ్వతులై ప్రతి కల్పమునందును, పంచ భూతములు సృష్టిని నెరవేర్చినట్లు, వారు ప్రాణులకు కావల సిన వాటినన్నింటిసీ సమకూర్తురని భావము. ఇక ఆ భూతము లెట్టివో వివరింపబడుచున్నవి- అసూర్తా=ప్రాణములు కలిగి నట్టివియు, రజసోవిమానే సూర్తాః = రంజనాత్మకములైన తమ తను కర్మలచే ప్రేరేపింపబడినవియును.

వివరణ : ఈ నాల్గవ ఋక్కునందు విశ్వకర్మ యొక్క సద్యోజాతాది పంచముఖములనుండి కలిగినారని చెప్పబడు చున్న మను, మయ, త్వష్ట్ర, శిల్పి, విశ్వజ్ఞుల యొక్కయు లేదా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్ర, సూర్యులయొక్కయు, లేదా సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ ఋషుల యొక్కయు సృష్టికార్యములు జీవులకు ఎట్లు ఉపయోగపడు చున్నవో గంభీరముగా వర్ణింపబడుట ఎఱుగదగిన విశేషము. అందుకే వారు "విశ్వకర్మ" యొక్క పంచముఖములవంటి వారనియు, పంచక్రియలకు ప్రతీకలు, కర్తలు అనియు, వేదాంత సంప్రదాయ గ్రంథములైన స్కాంద, బ్రహ్మాండ, మూలస్తంభాది పురాణములు వర్ణించినవి. వారెప్పుడును జీర్ణులు కారనియు, సర్వజ్ఞులనియు, మహిమకలవారనియు పేర్కొనబడినది. ఇక విశ్వకర్మచే సృజింపబడిన లౌకిక జీవులు ప్రాణములతో కూడినివారై తాము తాము చేసికొన్న రంజ నాత్మక కర్మలను అనుభవింప సంసిద్ధులై యున్నారనుటచేత వారు దైవానుగ్రహమునకు పాత్రులు కావలసియున్నా

రనియు, తమ కర్మల ఫలములను అనుభవింపవలసియున్నా రనియు సూచింపబడినది.

ఈ మంత్రమునందు "పూర్వే ఋషయః" అన్నందు వలన ఈ పంచ ఋషులు ప్రాచీనులు, ప్రథములు అని తెలియుచున్నది. వీరు ఐదుగురు అను విషయమును, సానగాదులను విషయమును, తైత్తిరీయ సంహితలోని "ప్రాచీ దిశామాది" మంత్రములలో ఇంతకుముందు చదివియే యున్నాము. భృగువు, అంగిరుడు, వసిష్ఠుడు మొదలగువారు, వీరికి పిమ్మట కలిగిన సప్తఋషులు. పంచఋషులు పంచ సంఖ్యకు గుర్తులు కాగా, సప్త ఋషులు సప్త సంఖ్యకు సంకేతములగుచున్నారు. పంచభూతముల పుట్టుకకు పిమ్మట కాని, 'ప్రాణి సృష్టి' అనునది లోకమున జరిగియుండదు కదా. కనుక పంచభూత సంకేతములగు పంచఋషులే పూర్వులనుట వేద హృదయము.

"న తం విదాథ య ఇదం జజానాన్య
ద్యుష్మాక మంతరం భవాతి,
నీహారేణ ప్రావృతా జల్ప్యా
చాసు తృప ఉక్థశాస శ్చరన్తి." — వి.సూ-5.

టీక : యః=ఏ విశ్వకర్మ, ఇదం=ఈ కనపడు జగత్తును, జజాన=సృష్టించెనో, తం = ఆ విశ్వకర్మను, ఓ మానవులార! న విదాథ=మీరు ఎరుగకున్నారు. యుష్మ

కం=మీకు, అన్యత్=మీ శరీరేంద్రియ మనోబుద్ధ్యాదుల కంటే భిన్నమైన ఆత్మతత్త్వమొకటే, అంతరం=లోపలిదై-(తెలియదగినదై) భవాతి=ఉన్నది. దానినే మీరెరుంగలేక ఉన్నారని భావము. ఈ విశ్వకర్మ తత్త్వమే సూక్తారంభమున "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదోవర ఆవివేశ" అని పిండ బ్రహ్మాండములను సృష్టించి వాటిలోపల ప్రవేశించెనని చెప్పబడినది. అట్టిదానిని ఎఱుంగలేకపోవుటకు కారణమును తరువాతి మంత్రభాగము చెప్పుచున్నది. జీవులు, నీహారేణ=మంచువంటి అజ్ఞానముచే, ప్రావృతాః = కప్పబడినవారై, జల్ప్యాచ=నేను దేవుడను,మనుజుడను, అనుకొనుచు, బ్రతుకుతెరువుకై అబద్ధములాడుచు, అసుతృపః = తమ ప్రాణ సంరక్షణమే శ్రేష్ఠమని తలంచి ప్రవర్తించుటేకాక, ఉక్థశాసః చరన్తి=స్వర్గాది పరలోక భ్రాంతిచే యజ్ఞాదులను చేయుచు, పరలోకమునకు రాకపోకలు జరుపుచు, పరమేశ్వర తత్త్వమును ఎఱుంగలేకున్నారని ఇందలి సారాంశము.

వివరణ : ఇక్కడ అజ్ఞానమును నీహారము (మంచు)తో పోల్చినందున అది జ్ఞానమనెడి ఎండచేత నశించునని సూచన. ఈ విషయమును మదీయ 'మిత్ర సాహస్రి' ఇట్లు చెప్పినది.

"మంచు వంటి మాయ మనుజులపై గప్పి,
తెలియనీయదయ్యె దివ్య పథము;

ఎండవంటి తెలివి హెచ్చ నద్ది నశించు;
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర."

ఈ అజ్ఞానమును నాసదీయ సూక్తము తమస్సని పేర్కొన్నది (తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే). యజ్ఞములు చేసెడివారి స్వర్గాది పరలోక సుఖములు అశాశ్వతములని గీతయు, ఉపనిషత్తులును చెప్పుచున్నవి. పరమేశ్వర జ్ఞానము, అనుభవమును అశాశ్వతములు కావు. అవి శాశ్వత మోక్ష ప్రదములు. ఈ విషయమునే పురుష సూక్తము "తమేవం విద్వా నమృత ఇహ భవతి." ఆ భగవంతు నెఱింగినవాడు అమృతుడగునని చెప్పినది. ఈ మంత్రమున శ్రుతి, ప్రాణులు భగవంతు నెఱుంగక మోక్షమునకు దూరులై ప్రపంచ సుఖములలో పడి చావుపుట్టుకల నందుచున్నారని వారిని గూర్చి జాలిపడినది. అట్టి జాలితోనే శాశ్వతుడైన ఈశ్వరు నెఱుంగవలసినదని హెచ్చరికకూడా ఇందులో గర్భితమై యున్నది.

"పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్గుహా యత్,
కం స్విద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే." — వి. సూ-6.

టీక : ఏ విశ్వకర్మ తత్త్వము, గుహా=హృదయమనెడి గుహ యందు కలదో (సదా జనానాం హృదయే సన్ని

విష్టః) అది, దివా = స్వర్గమునకంటె, పరః = శ్రేష్ఠమైనది. దూరముగా నున్నట్టిది. ఏనా పృధివ్యా పరః = ఈ భూలోక మున కంటే పరమైనది. దేవేభిః, అసురైః పరః = దేవతల కంటెను, అసురుల కంటెను పరమైనది. అనగా వీటి అన్నింటికంటెను భిన్నమైనదని భావము. కాగా వారికి కూడ అందరానిదని సారాంశము. కంటికగపడు సమస్తమున కన్నను విపరీతమైన చైతన్య స్వభావము కలదని తెలియ వలెను. యత్ర = ఏ గర్భమునందు, విశ్వే దేవాః = సమస్తమైన దైవశక్తులూ, సమగచ్ఛంత = ఇమిడి ఉన్నవో, అట్టి కంస్వి ద్గర్భం = ఒకానొక గర్భమును (కారణరూప జగద్బీజమును), ప్రథమమ్ = మొదట, ఆపః = ఉదకములు, దధ్రే = ధరించినవి.

వివరణ : మొదట ఉదకములు తాల్చిన ఆ గర్భము నందు సమస్త దేవ మనుష్య తిర్యగ్జడాది రూప జగత్తు విల సిల్లినదని భావము. దీనినిబట్టి ఉదకములలోనే సమస్త జగ ద్బీజములు ఉన్నవని తేలుచున్నది. దీనిచేత సృష్టిలో ఉద కములకు గల ప్రాధాన్యము తేటతెల్లము. జగత్కారణ బ్రహ్మము (విశ్వకర్మ) సర్వజగత్తులకు విలక్షణమనియు, అట్లైనను ఆత్మరూపమే అనియు సాధకులు గ్రహింపవలసి యున్నది. అట్టి గర్భమును గూర్చి "కంస్విత్" అన్నందున అది మనోబుద్ధులకు అందని అనిర్వచనీయ మాయాశక్తి అని తెలియుచున్నది. కంటికగపడు స్థూలమైన జగత్త్వత్తమే

అంతుపట్టనప్పుడు సూక్ష్మమైన బీజరహస్య మెట్లు తెలియ గలదు!

"త మి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో
యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే,
అజస్య నాభా వధ్యేక మర్పితం
యస్మి న్నిదం విశ్వం భువన మధిశ్రితమ్."

— వి. సూ-7.

టీక : యత్ర విశ్వే = బ్రహ్మాండములను పొట్టలో నుంచుకొన్న ఏ విశ్వమునందు (ఏ విశ్వకర్మ యందు), దేవాః సమగచ్ఛన్త= దేవతలు కూడియున్నారో, తమిత్ = ఆ గర్భమునే, ఆపః=ఉదకములు, ప్రథమమ్= మొట్టమొదట, దధ్రే= తాల్చినవి. అజస్య=జన్మము లేని, విశ్వకర్మ యొక్క, నాభా=నాభిస్థానమందు (నడుమ) అనగా భగవత్స్వరూప తత్త్వమున, ఏకం=ఒకానొక, బీజము (జగత్కారణము) అధి+అర్పితం=ఉంచబడినది. యస్మిన్ =ఏ బీజమున, ఇదం విశ్వం, భువనమ్= ఈ సమస్త భువనము, అధిశ్రితమ్=ఆశ్ర యింపబడియున్నదో- అట్టి బీజమన్నమాట.

వివరణ : ఈ మంత్రమున చెప్పబడిన గర్భమనునదే బీజమన్నమాట. ఆ బీజము ఆత్మతత్త్వమునం దంతటా నిం డియే యున్నది. అది వాఙ్మనస్సుల కందనిది. అందుకనియే దానిని అనిర్వచనీయము అన్నారు. అయినను అది తాత్త్వి

కులకు అగోచరమే కాదు. కొంద ఱు ధీరులు (కశ్చిద్ధీరః) దానిని తెలిసికొని జగద్రహస్య విజ్ఞానులు కాగలరు.

"అజస్య, నాభౌ" అనునవి రెండూ విడి విడి పదములు. ఆ రెంటినీ కలిపి సమాసము చేసినచో, "అజనాభము" అని రూపమేర్పడును. మన దేశమునకు మొదటి పేరు 'అజనాభ' దేశమనియే. ఈ సంగతిని భాగవతము "అట ము న్నజనాభం బను పేరం బరగు దేశంబు భరతుండు పాలించు కతన భారతంబునా బరగె" అని. దీనినిబట్టి మనది "అజునికి"- సృష్టికర్త అయిన "విశ్వకర్మకు" నాభివంటిదైన దేశమని భావము. కాగ సృష్టియొక్క ఆరంభము ఇక్కడనే జరిగిన దని కూడా భావింపవచ్చును. ఋగ్వేద మంత్రము నందలి "అజ, నాభి" పదములు కలసి "అజనాభముగా" రూపొం దుట గమనింపతగిన రహస్యము. ఈ విషయమే విష్ణుమూర్తి నాభికమలమునుండి బ్రహ్మ పుట్టి, సృష్టిచేసినాడని పురాణా దులలో వ్రాయబడినది. ఈరీతిగా వేద భావములు పురా ణాదులలో పలురీతులుగ మార్చబడి వర్ణింపబడినట్లు తేలు చున్నది. ఇంతకూ వేదములలోని విశ్వకర్మయు, పురాణ ములలోని విష్ణుమూర్తియు, వర్ణనలనుబట్టి ఒక్కరే అని తెలియుచున్నది. ఇక తరువాతి మంత్రము విశ్వకర్మావ తారములను గూర్చి ఇట్లు వివరించుచున్నది.

"విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆది

ద్గంధర్వో అభవ ద్ద్వితీయః,
తృతీయః పితా జనితౌషధీనా
మపాం గర్భం వ్యదధా త్పురుత్రా." — వి.సూ-8.

టీక : విశ్వకర్మా=విశ్వకర్మ, దేవః=దేవుడై (అనగా త్వష్ట్ర దేవుడై లేక బ్రహ్మయై) అజనిష్ఠ=ఉండెను. సాయణులీ సందర్భమున "దేవ" శబ్దమునకు సత్యలోకనివాసియైన బ్రహ్మదేవుడు ఆ 'విశ్వకర్మ' నాభినుండి కలిగెనని వ్రాసినారు. ఈ భావమే, విష్ణుమూర్తి నాభి కమలము నుండి బ్రహ్మ పుట్టినాడనెడి పురాణకథకు మూలమైనది. ఆదిత్=పిమ్మట, ద్వితీయః=రెండవవాడైన, గంధర్వః=గంధర్వుడు, అభవత్=అయినాడు. పిమ్మట, పితా=పోషకుడును, ఓషధీనామ్=ఓషధులకు, జనితా=ఉత్పాదకుడైన సోముడు, తృతీయః=మూడవ వాడుగా, అభవత్=అయినాడు. పిమ్మట, అపాం గర్భం=నీటిలోని బీజమునుండి వెలువడు బ్రహ్మాండమును, పురుత్రా=అనేక రీతులుగా, వ్యదధాత్=సృష్టించెను.

వివరణ : ఈ మంత్రమున మొదట "విశ్వకర్మ" దేవుడగు 'బ్రహ్మ' అయినాడనియు, ఆ "విశ్వకర్మయే" రెండవ వాడుగా 'గంధర్వుడైనా' డనియు చెప్పుచున్నది. పిమ్మట మూడవ వాడు ఓషధీశుడైన 'సోముడని' (చంద్రుడని) చెప్పినందున అన్నమునకు, తద్వారా ప్రాణులకు మూలకారణమైన ఓషధులు, వాటి పాలకుడు— తెలియబడుచున్నారు.

గంధర్వ శబ్దమునకు సూర్యుడను నర్థమును యజుర్వేదము చెప్పినది- "సూర్యోగంధర్వః తస్య కిరణాన్యప్సరసః" అని. కనుక దీనినిబట్టి గంధర్వ శబ్దము చేత సూర్యుని గ్రహింప వలయును. "విశ్వకర్మ" తాను బ్రహ్మ అయిన పిమ్మట లోకమును వెలిగించెడి సూర్య-చంద్రులుగా తానే అయి నాడని భావము. అనగా 'బ్రహ్మను- సూర్యచంద్రు' లను సృష్టించినాడని తెలుచున్నది. ఈ మంత్రమునకు సంబంధిం చిన తత్త్వార్థ విశేషములు యజుర్వేద దర్శనమున పాఠకులు చూడగలరని ఇచ్చట విరమింపబడుచున్నది. అయినను కొలదిపాటిగా వివరింతుము.'విశ్వకర్మ దేవుడైనా' డనగా జీవు డై నాడనియు,పిమ్మట 'సూర్య-చంద్రులైనా' డనగా పింగళా, ఇడా, నాడుల రూపమైనాడనియు చెప్పికొన్నచో పిండాండ పక్షమున తాత్త్వికార్థము పూర్తియగును. ఆ విశ్వకర్మయే ఉపాధులయందు జీవరూపమున ప్రవేశించినాడని మొదటి మంత్రములో చదివినాము కదా. కనుక బ్రహ్మాండ పక్షమున, పిండాండ పక్షమున ఈ విధముగా అర్థము చెప్పుకొని తత్త్వ సిద్ధిని పొందుట తగియుండును.

"చక్షుషః పితా మనసా హి ధీరో
ఘృత మేనే అజన న్నన్నమానే,
యదే దన్తా అదదృం హన్త పూర్వా
ఆది ద్ద్యావా పృథివీ అప్రథేతామ్." — వి. సూ-9.

టీక :- చక్షుషః=నేత్రాదులైన ప్రాణ సముదాయమునకు అని సాయణులు అర్థము వ్రాసినారు. దానితో పాటు మూడవ కంటికి స్థానమైన ఆజ్ఞాచక్రాదులకు తంద్రి యని చెప్పికొనుట అవసరము. యోగపక్షమున ఇది ప్రయోజనకారి- ఏలయన, సహస్రారము తరువాతివి ఆజ్ఞాది చక్రములే కదా! పితా=ఉత్పాదకుడును (సృష్టికర్త) ధీరః=ధీరుడును అగు విశ్వకర్మ, మనసాహి=నిర్మలమైన తన మనస్సు చేతనే, ఘృతం='నేయి' వలె ప్రాణులకు అనుభవింపతగిన, ఏనే=ఈ ద్యావా పృథువులను (భూమిని, ఆకాశమును) నన్నమానే=ఒకదానికొకటి అనుకూలపడునట్లు, అజనత్ = సృష్టించెను. ఆకాశము వర్షించిననే కాని భూమిపండదు. భూమి పండిననేకాని భూతతృప్తి కలిగి యజ్ఞాది కర్మలు సాగవు. భూ ప్రజలు యజ్ఞములుచేసి దేవతలను ఆరాధింప వలసి యున్నారు. దేవతలేమో ప్రజలను అనుగ్రహింపవలసి యున్నారు. ఇదియే భూమ్యాకాశములకు స్వర్గ మర్త్య లోకములకు గల, పరస్పర ఉపకార భావము. యదేత్ = ఎప్పుడైతే, పూర్వే=మొదటివైనవియు, అంతాః=సప్రాణములై పనిచేయునవియు అగు, చక్షురాది ప్రాణములు (అధారాది చక్రములు), అదదృం హంత = స్థిరతరములైనవో, ఆదిత్ =అప్పుడే, ద్యావాపృథివీ=ద్యావాభూములు, అప్రథేతామ్=విస్తరింపబడినవి. ద్యావా పృథువులకు స్వర్గ మర్త్య లోకములనెడి ప్రసిద్ధి కలిగి అవి అన్నింటిచే పరిపూర్ణము

లైనవన్నమాట.

వివరణ : ఈ మంత్రమున బ్రహ్మాండమునందు జరిగిన ఆకాశాది జీవపర్యంతమైన సృష్టియు, స్థూల, సూక్ష్మ కారణములతోను, సప్త చక్రములతోను కూడిన సృష్టియు, నిగూఢముగా వర్ణింపబడినది. ఇట్లు ద్యావా పృథువుల సృష్టి జరిగి భగవంతుడు విశ్వరూపధరుడైన పిమ్మట, ఆ విశ్వకర్మేశ్వరుని విశ్వరూపము తరువాతి మంత్రమున ఇట్లు వర్ణింపబడుచున్నది.

"విశ్వత శ్చక్షు రుత విశ్వతో ముఖో
విశ్వతో హస్త ఉత విశ్వతః పాత్,
సం బాహుభ్యాం నమతి సంపతత్రై
ర్ద్యావా పృథివీ జనయ న్దేవ ఏకః." — వి. సూ-10.

టీక : ఆ విశ్వకర్మ, విశ్వతః చక్షుః = అంతటను కన్నులు కలవాడు. పరమేశ్వరుడు ఎల్లప్రాణులకు ఆత్మ తానే కనుక అందరికన్నులు ఆయనవే అయి ఆయన విశ్వతశ్చక్షువైనాడు అన్నమాట. ఇంతేకాదు, ఉత = ఇంకను ఆయన, విశ్వతః, ముఖః, హస్తః = అంతటను మోములు, చేతులు కలవాడును, విశ్వతఃపాత్ = అంతటను పాదములు కలవాడును, ఇంత ఏల ? ఆయన అంతటను అన్ని అవయవములు, ఇంద్రియములు కలిగిన విశ్వరూపుడైనాడని సాధకులు భావించి విశ్వమును "విశ్వకర్మ"గా సాక్షాత్కరింప

చేసికొని ఆరాధించి అమృతులు కావలయునని వేదమాత, ఈ మంత్రము ద్వారా జనులను అనుశాసించుచున్నది. ఇట్టి వాడైన, సః దేవః = ఆ దేవుడొక్కడే, ద్యావా పృథివీ = ఆకాశమును, భూమిని, జనయన్ = పుట్టించుచున్నవాడై, బాహుభ్యామ్ = చేతులవంటివైన ధర్మాధర్మముల చేత అనగా జీవుల ధర్మాధర్మ రూప కర్మలను, నిమిత్త కారణముగా చేసికొని, సంనమతి = లోకము నందలి జీవుల నందఱినీ స్వాధీన మొనర్చుకొనుచున్నాడు. వారి వారి కర్మానుసారము వారిని సృష్టించి సంసార చక్రమున త్రిప్పుచున్నాడని భావము. అన్లైః, పతత్త్రైః = నశించు స్వభావము గల ఉపాదాన కారణములైన పంచ భూతముల చేతకూడ జగత్తును లోబపరచుకొని తాను నిమిత్తకారణుడై ఉన్నాడనియు భావము.

వివరణ : ఈ మంత్రమున "దేవః ఏకః" అని చెప్పబడుట చేతను, "యో దేవానాం నామధా ఏక ఏవ" అనుట చేతను "విశ్వకర్మ" ఒక్కడే సర్వేశ్వరత్వాది లక్షణములు గల దేవాది దేవుడని సువ్యక్తమగుచున్నది. బ్రహ్మ-విష్ణు-రుద్రేంద్రాదులు "విశ్వకర్మ" అంశలని తెలియుచున్నది. వేద సూక్తములేవియు "విశ్వకర్మ" ను వర్ణించినంత గొప్పగాను, వివరముగాను, ఆధ్యాత్మికముగాను, ఏ దేవునిగూర్చి కూడ వర్ణించినట్లు కనబడదు. "సహస్ర శీర్షా పురుషః" అనెడి పురుషసూక్తముగాని, "సహస్ర శీర్షం దేవం, విశ్వాక్షం విశ్వశంభువమ్" అనెడి మంత్రపుష్పముగాని ఈ విశ్వకర్మ

సూక్తములలోని మంత్రములను ఆధారము చేసికొనియే వెలువడినవని పరిశీలించి సులభముగానే గ్రహింపవచ్చును.

"కిం స్వి దాసీ దధిష్ఠాన మారంభణం
కతమత్ స్విత్ కి మాసీత్,
యదీ భూమిం జనయన్ విశ్వకర్మా
విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః."

— వి. సూ-11.

టీక : యది = ఆ పరమేశ్వరుడొక్కడే అన్యసహాయత లేకుండా, ద్యావా పృథువులను సృష్టించినచో, ఆయనకు అధిష్ఠానం=నివాసగృహము- లేదా ఆధార స్థలము, కిం స్విత్ ఆసీత్ =ఏదియైనది ? అట్లే, ఆరంభణం = ఉపాదాన కారణ పదార్థము, కతమత్ స్విత్ కిమాసీత్ =ఏది ? ఎట్టిది అయినది? అని అడుగవచ్చును. కాని సర్వశక్తిశాలి అయిన ఆతనికి ఆధార, ఉపాదానాది కారణములతో పనిలేదని దిగువ వాక్యము అనుచున్నది. విశ్వచక్షాః=సర్వద్రష్ట, సర్వజ్ఞుడు అగు, విశ్వకర్మ = 'ఆ విశ్వకర్మ', మహినా = తన మహిమచేతనే, భూమి=భూలోకమును, జనయన్ = కనినవాడై-సృష్టించినవాడై, ద్యామ్ = స్వర్గలోకమును, విఔర్ణోత్ =విశేషముగా సృష్టించి, వ్యాపించినాడు. అనగా వాటన్నింటియందును పరిపూర్ణుడై నిండియున్నాడని సారాంశము.

**వివరణ :** ఇక్కడ నిమిత్తోపాదాన, సహకారి, కార

ణములన్నియు ఆయనయే అనియు, తనకంటె భిన్నమైన దేదియు సృష్టికార్యములో వాడబడలేదనియు, అసలట్టి పదార్ధమేదియు అప్పుడుకాని, ఇప్పుడుకాని లేదనియు, ఇక ముందెప్పుడైనను ఉండదనియు కూడ పాఠకులు గమనింప వలయును. ఈ రహస్యమునే పురుష సూక్తములోని- "పురుష ఏ వేదగ్ం సర్వం, యద్భూతం, యచ్చ భవ్యమ్" ఆయనకంటె భిన్నమైనది ఇదివరకు లేకపోవుటయేకాదు, ఇక ముందుకూడ ఉండదనియు, సర్వమూ "ఆతడే" (విశ్వ కర్మయే) అనియు చెప్పుచున్నది. ఇక్కడ 'మహిమ' అనగా ఆయన యొక్క శక్తి అని తాత్పర్యము. ఆ శక్తినే మనము "గాయత్రిని"గా "ప్రకృతిని"గా "జగన్మాతను" గా ఆరాధించుచున్నాము. ఆ శక్తిని గూర్చి శ్వేతాశ్వతరోప రోపనిషత్తు ఇట్లు చెప్పినది.

"న తస్య కార్యం కరణం చ విద్యతే
న తత్సమ శ్చాభ్యధికశ్చ దృశ్యతే,
పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ." — 6-3.

తా॥ "అతనికి" (విశ్వకర్మకు) శరీరముగాని, ఏ ఇతర సాధనములుగాని లేవు. అతనితో సముడు కాని, అధికుడు కాని లేడు. అతనికి స్వాభావికమైన పరశక్తి (మాయ) వివిధ రీతులు కలదై జ్ఞానబలక్రియలతో ఒప్పుచుండును. ఇట్టి

మహిమ లేదా శక్తియే జగత్క్రీడకు మూలభూతము. శక్తి కినీ,శక్తిగలవానికినీ భేదము లేదని ఇక్కడ పాఠకులు భావింప వలసియున్నది. వీరినే "గాయత్రీ-విశ్వకర్మ"లనియు, "శివ శక్తులనియు" కూడ అనుచుందురు."సర్వం ఖల్విదం బ్రహ్మ" అనెడి ఉపనిషద్వాక్యము ఈ 11వ మంత్రము ఆధారముగా వెలసినట్టిదే. మరియు ఋగ్వేద దిగ్దర్శనము రెండవ భాగము ఈ తత్త్వమునే వివరించుచున్నది. 11వ మంత్రము యొక్క అర్థమునే 12వ మంత్రము కూడ కొంచెముపాటి భేదముతో వివరించుచున్నది. వేదమాత పునరుక్తి అని చూడదు. పాఠకులకు జగత్తత్త్వమును వివరించుటకు ఎన్నిసార్లో, ఎన్ని రీతులుగానో ఆ వేదమాత ప్రయత్నించుచుండును. ఆమెకు తన బిడ్డలయందు గల దయ అట్టిది!

"కిం స్విద్వనం క ఉస వృక్ష ఆసీ
ద్యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః,
మనీషిణో మనసా పృచ్ఛతే దు
తద్య దధ్య తిష్ఠ ద్భువనాని ధారయన్.

— వి. సూ-12.

టీక : హే మనీషిణః = ఓ పండితులారా! మీరు, మనసా = మీ మనస్సుతో పర్యాలోచించి, ఆ విశ్వకర్మ, యతః = దేనినుండి, ద్యావాపృథివీ = ఆకాశమును భూమిని, నిష్టతక్షుః=(శిల్పముచే) సృజించెనో, అట్టి, వనం = అడవి, కిం

స్విత్ =ఏది? సః వృక్షః=అట్టి వృక్షము, ఉ ఆసీత్ =ఏదై ఉం డును ? భువనాని=లోకములను-ప్రాణులను, ధారయన్ = సృష్టించుచు, యత్ = దేనిని, అధ్యతిష్ఠత్ =అధివసించినాడు. అనగా ఏ తావున ఉండి వేటితో ఈ సృష్టినంతటినీ చేసెనో, అవి ఏవి ? అని, పృచ్ఛతేదు=అడుగదలచినచో, అడుగుడు అని భావము.

వివరణ : దీనికి సమాధానముగానే 11వ మంత్ర మున, "విశ్వచక్షుః-విశ్వకర్మా మహినా ద్యాం వి ఔర్ణోత్" సర్వద్రష్ట (అన్నిటినీ చూచువాడు), సర్వజ్ఞుడు, సర్వశక్తి అయిన "విశ్వకర్మ" తన మహిమచేతనే తానే అను పదార్థముతోనే ద్యావా భూములను, అందలి సర్వమును సృష్టించినాడని చెప్పబడినది. ఏ సాధనముల అపేక్షలేని పర మేశ్వరునికి సృష్టి విషయమున తనకంటె భిన్నమైనది ఏదియు అక్కరలేదని సారాంశము.

11, 12 మంత్రముల సారాంశమును మిత్రసాహస్రి ఇట్లు పేర్కొన్నది.

"కనులు లేక చూచు, విను కర్ణములు లేక,
అవయవములు లేక అన్ని పనులు,
చేయు నీశ్వరుండు- చిత్రమాతని స్థితి!
విశ్వహిత చరిత్ర వినర మిత్ర." — 414

"సాధనములు లేక సాధింప కార్యంబు,

లెవని కగునో వాడె ఈశ్వరుండు-
చోద్య మతని మహిమ చూడ నాలోచింప
విశ్వహిత చరిత్ర వినర మిత్ర." — 415

సాధనములచేత పనులను సాధించువాడు సామాన్యుడు. సాధన సామగ్రితో, అక్కరలేకయే పనులు చేయగలవాడు విశిష్టుడు. అట్టివాడు భగవంతుడే. అందుకే అతనిని గూర్చి "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః" అని సంకల్ప మాత్రముచేతనే పనులు చేయువాడని వేదము అన్నది.

"యా తే ధామాని పరమాణి యావమా
యా మధ్యమా విశ్వకర్మ న్నుతే మా,
శిక్షా సఖిభ్యో హవిషి స్వధావః
స్వయం యజస్వ తనువః జుషాణః." — వి. సూ-13.

టీక : విశ్వకర్మన్ = ఓ విశ్వకర్మ, తే = నీయొక్క, పరమాణి = శ్రేష్ఠములైన (దేవాదుల), ఉత = ఇంకను, మధ్యమా = నడిమి రకములైన (మానవాదుల) అవమా = అధమములైన (తిర్యగాదుల), ధామాని = స్థానములు (శరీరములు) ఏవి కలవో, ఇమా = ఇట్టి వీటినన్నింటిని, సఖిభ్యః = నిన్నారాధించుటచే, నీకు మిత్రులవంటి వారమైన మాకు, యజించు నిమిత్తమై, హవిషి = హవిర్దానమునకై, శిక్షా = ఉపదేశింపుము- ఇమ్ము. హేస్వధావః = స్వధా లక్షణమైన, హవిస్సనెడి అన్నము కలవాడా! నీవు, స్వయం = స్వయముగా,

తనువంజుషాణః = యజమాన శరీరమును పొందినవాడవై, యజస్వ=యజింపుము. యజ్ఞకర్మములు చేయుమని భావము.

వివరణ : ఈ మంత్రమున మంత్రద్రష్ట అయిన 'భౌవన విశ్వకర్మ' ఋషి "విశ్వకర్మ భగవానుని" యజమాన శరీరమున ప్రవేశించి స్వయముగా నీవే యజింపుమని చెప్పుటచేత, యజమానునకు విశ్వకర్మానుగ్రహము కలుగుటయేకాక, అతనితో అభేదము కూడ కలుగుచున్నదని తెలియవలెను. భగవదనుగ్రహము లేనిదే ఎవడు కాని సత్కార్యములు చేయజాలడనియు, భగవంతునితో ఐక్యము కానిది, సంసారము నుండి ముక్తుడు కాదనియు, దీని చే సూచిత మగుచున్నది. ఇంకను లోతుగా ఆలోచించినచో, శరీరమున జీవరూపుడై ప్రవేశించినది, ఈశ్వరుడే కావున సూక్తారంభమున చెప్పబడిన అద్వైతానుభవము కూడ ఇక్కడ సూచితమగుచున్నది. దేవ మానవ తిర్యగ్జడాదులైన ఉత్తమ, మధ్యమాధమ, శరీరములన్నింటియొక్క తృప్తి కోసమై మేముచేయు యాగాది సత్కర్మలు విశ్వరూపుడవైన నీసేవయే అనియు తెలుపబడినది. అనగా జీవుల ప్రవర్తన విశ్వమునందలి సకల చరాచరముల యొక్క క్షేమము కోసమై ఉపయోగింపవలయుననియు ఇందలి పరమార్థము. ఒక్క యజ్ఞమే అననేల ? వైదికములు గాని, ఈ లోక సంబంధములు గాని అయిన సర్వకర్మలు విశ్వమంగళకరములు కావలయుననుట ఈ "విశ్వకర్మ సూక్తము" యొక్క

లక్ష్యమైనట్లు ఇందువలన తెలియుచున్నది. ఈ ద్వితీయ సూక్తము యొక్క మొదటి మంత్రమున ముల్లోకముల సృష్టిని చెప్పి రెండవ మంత్రమున ఆ విశ్వము యొక్క విరాడ్రూప వర్ణనము చేసి ఈ మంత్రమున ఆ విశ్వము నారాధించి తరింప వలసిన పద్ధతిని పేర్కొనుటచే ఈ సూక్తములు మానవ జీవితము సార్థకమగుటకు ఎంతగా ఉపయోగించుచున్నవో గ్రహింపవచ్చును. ఇట్టి సూక్తములను మనకు ప్రసాదించిన శ్రుతిమాత, వాటిని దర్శించిన 'భౌవన విశ్వకర్మ' ఋషి ఎంతటి దయావంతులో చెప్పజాలము. ఇంకను ఈ మంత్రము లోని మరికొన్ని విశేషములను గమనింతము.

ఈ మంత్రమున ఉత్తమ, మధ్యమ, అవమము లనెడి మూడు స్థానములను పేర్కొనుటచేత- స్వర్గ, మర్త్య, పాతాళ లోకములు లేదా పృథివ్యంతరిక్ష ద్యులోకములు సూచితము లగుచున్నవి. అట్లే సత్వగుణ ప్రధానములైన దేవతా శరీరములు, రజోగుణ ప్రధాన మానవ శరీరములు, తమః ప్రధానములైన మృగ, పక్షి, క్రిమి, కీట, స్థావరాది శరీరములు సూచితములైనవి. ఇవి అన్నియు భగవంతుని సృష్టియే. వీటి అన్నిటియందును భగవంతుడు నివసించియే యున్నాడు. కనుక ఈ మూటిచేతను సృష్టినంతటిని పేర్కొన్నట్లే అగుచున్నది. ఇవి తప్ప అవయవములు లేని పరమేశ్వరునికి వేరు శరీరావయవము లేవియు లేవు. ఈ అంశమునే "నతస్య ప్రతిమా అస్తి" ఆ పరమేశ్వరునికి దేహము (విగ్ర

హాము) లేదు. అంతేకాదు, అతనికి ప్రతిమ = సాటియైన వస్తువుకూడ లేదని ఇందలి భావము. చైతన్యరూపుడైన భగవానునికి విపరీత లక్షణము కలది జడమే. జడము సాధనమే కాని సాధ్యము కాదు గదా. ఈ మూడు ధామములనే విష్ణు మంత్రములలో-

"ఇదం విష్ణు ర్విచక్రమే
త్రేధా నిదధే పదమ్." — ఋ. 1-22-17.

"త్రీణి పదా విచక్రమే." — ఋ. 1-22-18.

అని చెప్పబడినది. విష్ణువు ముల్లోకములను మెట్టినాడని ఇందలి బాహ్యార్థము. ఈ వర్ణనము వలన విష్ణు-విశ్వకర్మలకు అభేదము, ఏకత్వము సిద్ధమగుచున్నవి.

తాత్త్వికదృష్టితో చూచినప్పుడు, ఈ పరమ, మధ్యమాధమ స్థానములు- సహస్రారము, ఆజ్ఞా, అనాహతములని భావింపవలయును. యోగసాధకుడు ప్రాణాయామాదులను అనాహతము నుండియు, ధ్యానాదులను ఆజ్ఞాచక్రము నుండియు అసంప్రజ్ఞాత సమాధిని, సహస్రారమునను కొనసాగింపవలసియున్నది. కనుక ఇవి మూడే జీవుని ఉన్నత భూమికారోహణమునకు సాధనములగుచున్నవి. ప్రాణాయామాదులచేత నీచ స్థితిని వదలటయు, ధ్యానాదులచేత విజ్ఞాన ప్రధాన స్థానమునకు ఏగుటయు, సమాధి వలన అనగా సహస్రార విహారము వలన అతిదేవ మానవస్థాయినే గాక, పర

బ్రహ్మ ఐక్యమును అందుటయు తటస్థించును. ఈ స్థితి సాధకులలో ఈశ్వరాభివ్యక్తి కలిగిననేగాని సంభవింపదు.

ఇంకొక రహస్యమేమనగా, పరమ స్థానమనగా కారణ శరీరమనియు, మధ్యమ స్థానమనగా సూక్ష్మ శరీరమనియు, అవమ స్థానమనగా స్థూల శరీరమనియు భావించుట. వీటిలో కారణము, కారణమే గనుక అది పరమము. అనగా సత్వ గుణము కలది. సూక్ష్మ దేహమేమో మధ్యమ స్థానము గనుక అది సత్వరజోగుణములతో గూడినట్టిది. ఇక స్థూల దేహమన్నచో తమోగుణమయములైన పంచీకృత పంచ భూతములతో ఏర్పడిన భోగ శరీరము. కావున అది చచ్చుచు పుట్టుచు ఉండును. కనుక దానిని 'అవమము' అనుటయైనది. ఈ మూటియందును భగవంతుడే ప్రవేశించి వాటిని చైతన్య వంతము లొనర్చి, తాను వాటితో ఏకమైపోయి జీవుడని చెప్పబడుచున్నాడు.

కనుక జీవుడుగా వేషము వేసికొనిన ఈశ్వరునికి కారణ, సూక్ష్మ, స్థూల దేహములు- పరమ, మధ్యమాధమ స్థానము లగుచున్నవి. ఈ శరీరములలో జీవుడు సుషుప్తికి కారణముతోను, స్వప్నమును సూక్ష్మముతోను, జాగ్రద వస్థను స్థూలముతోను అనుభవించుచున్నాడు. ఈ మూడు ధామముల (శరీరముల) యందును జీవభావము నశించి ఈశ్వర భావము కలిగిననే గాని నాల్గవదైన తురీయ దశ

(సమాధి) చేకూరదు. అప్పుడుగాని జీవునికి అమృతత్త్వము ప్రాప్తించదు. ఈ అంశమునే మంత్రము యొక్క తుది రెండు పాదములు ఇట్లు చెప్పినవి- "ఓ విశ్వకర్మా! నీవు స్వయముగా సాధకుని శరీరమున ప్రవేశించి (అనగా వ్యక్తమై) అతని జీవభావము నణచివైచి అతనిచేత తురీయమైన ఆనందమును అనుభవింపచేయమనుటయేగాక, ఆ ఆనందరూపునిగానే అతనిని శిక్షింపుము (తీర్పుము)" అనుట లోని పరమార్థము అది గంభీరమును, రహస్యమును అయినది. కనుక తాత్త్విక దృష్టితో చూచినప్పుడు, "విశ్వకర్మ" (జీవుడు) అధిష్ఠించిన స్థానములు మూడు దేహములేకాని భిన్నములు కావు. మంత్రము చివరనున్న "యజస్వ" అన్న మాటకు బాహ్య యజ్ఞమును చేయుట అని అర్థము చెప్పికొని తృప్తిపడరాదు. శివజీవైక్య రూప తాత్త్విక యజ్ఞమును చేయుమనెడి అర్థమును చెప్పికొనుమని శ్రుతిమాత యొక్క నిక్కమైన ప్రబోధము. అట్లుగాక లౌకికార్థమును మాత్రమే చెప్పికొన్నచో భోజనసిద్ధి కలుగునేగాని మోక్ష సిద్ధి మాత్రము కలుగదు. ఇంతటి లోతైన అర్థమును సమర్పించిన "విశ్వకర్మ సూక్త" మంత్ర మహిమను ఏమని స్తుతింపగలము! పిమ్మటిదైన 14వ మంత్రము "విశ్వకర్మను" "వేద జనకుడని" చెప్పుచున్నది.

"వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే
మనోయుజం వాజే అద్యాహువేమ,

స నో నేదిష్ఠా హవనాని జోషతే
విశ్వశంభూ రవసే సాధు కర్మా." — వి. సూ-14.

టీక : అద్య=ఈనాడు, వాజే='అన్న' విషయమైన కార్యము జరుగుచుండగా, వాచఃపతిం = వేదమంత్ర రూప వాక్కులకు పాలకుడైనవాడును, మనోయుజం = మన మనస్సులకు యోగమును కూర్చువాడును, లేక మనలను యోగ్య మనస్సులు కలవారిని చేయువాడును అయిన- విశ్వ కర్మాణం=విశ్వకర్మ పరమేశ్వరుని, ఊతయే = సర్వము యొక్క రక్షణార్థమై, ఆహువేమ = పిలుతుముగాక! విశ్వ శంభూః = విశ్వమునకు సుఖమును కూర్చువాడును, లేక సమస్త సౌఖ్యముల నిచ్చువాడును, సాధుకర్మా = జగత్సం బంధములైన, సృష్టి మొదలగు యోగ్య కర్మలు గలవాడును అగు సః=ఆ విశ్వకర్మ, అవసే=మన రక్షణకోసమై, నేదిష్ఠా హవనాని=మనకు సమీపము నందుగల- ఇప్పుడు మనము ఆచరించుచున్న యజ్ఞాది కార్యములను, జోషతే = సేవిం చును. ఇప్పుడు మనము చేయుచున్న సత్కార్యములన్నిటిని ఆమోదించి తగిన ఫలములను ఒసగుగాక! యని భావము.

వివరణ : వేదపాలకుడును, (వేదకర్త) విశ్వమునకు సుఖమును కలిగించువాడును, సాధుకార్యశీలుడును అయిన 'విశ్వకర్మ'- జీవులైన మనము తనను తెలిసికొనుటకు చేయు

నట్టి ప్రతి సత్కార్మమును ప్రోత్సహించుచు మన మనస్సుల యోగయుక్తము లగునట్లు చేసి మనలను రక్షించుగాక! ఇ ఇందలి పరమార్థము. పూర్వ మంత్రమున ఏ యోగకార్య సూచింపబడినదో, దానిని రక్షించుట కోసమై భక్తుడు భ వానుని ఈ మంత్రమున సవిశేషముగా ప్రార్థించినాడ మాట. ఈశ్వరుడెప్పుడును మా హృదయములందు సించుచు, మమ్మ ప్రేరేపించుచు, మమ్ము తత్త్వజ్ఞాన పన్నులను చేయుగాతమని సారాంశము. తరువాతిదైన 1 మంత్రమునకూడ ఇట్టి ప్రార్థనయే చేయబడుచున్నది.

"విశ్వకర్మన్ హావిషా వావృధానః
స్వయం యజస్వ తనువం జుషాణః,
ముహ్యన్త్వన్యే అభిత స్సపత్నా
ఇహాస్మాకం మఘవా సూరి రస్తు." — వి. సూ.

టీక : విశ్వకర్మన్=ఓ విశ్వకర్మా, నీవు, హావిషా మేమర్పించెడి హావిస్సులచే, వావృధానః=వృద్ధి పొందుచున వాడవై, తనువం = నా శరీరమును, జుషాణః = పొంది వాడవై, స్వయం=నీవే స్వయముగా (నేనై), యజస్వ= యజ్ఞమును చేయుము- ఆరాధింపుము. ఇహ = ఈ సత్కా ర్యమునందు, అస్మాకం=మాయొక్క, అన్యేసపత్నాః=మ భావములకు విఘ్నములను కల్పించు శత్రువులు, అభితః అంతటా, అన్ని విధములా, ముహ్యంతు=మోహాము చెంద

దురుగాక! అనగా పరాజయము పొలగుదురు గాక! అని భావము. యోగ విఘ్నకరములైన ప్రతీప శక్తులు నశించు గాక! అని సారాంశము. మఘువా=ధనవంతుడును, సూరిః = జ్ఞానవంతుడును అగు పుత్రుడు, అస్మాకం అస్తు=మాకు కలుగుగాక! ఇక్కడ లౌకిక పుత్రుడనియేగాక, జ్ఞానపుత్రుడనియు, తాత్త్వికార్థమునుగూడ భావింపవలయును. మే మొనర్చిన ఈ సత్కార్యము మాకు జ్ఞాన లాభమును చేకూర్చుగాక! అన్నమాట.

"విశ్వకర్మన్ హవిషా వర్ధనేన
త్రాతార మింద్ర మకృణో రవధ్యం,
తస్మై విశ స్సమనమ న్త పూర్వీ
రయ ముగ్రో విహవ్యో యథా సత్."

— వి. సూ-16.

టీక : విశ్వకర్మన్=ఓ విశ్వకర్మ పరమేశ్వరా, హవిషా =మేమర్పించు హవిస్సుచేత, వర్ధనేన = వృద్ధిపొందినవాడవై, అనగా మా మనస్సులలో ఎడబాయక తోచుచున్నవాడవై ఈ యజమానుని, లేదా యోగసాధకుని, త్రాతారం=ఇతరులను రక్షించువానినిగాను, అనగా లోకారాధనకు త్రికరణములను అర్పించువానినిగాను, ఇంద్రం = పరమైశ్వర్యము గలవానినిగాను, అవధ్యం=ఇతరులకు లోబడనివానినిగాను, అకృణోః=చేయుము. తస్మై=ఇతనికొఱకు, పూర్వీః విశః= గొప్ప గొప్పవారుకూడ, సమనమన్త=లోబడుదురు గాక!

ఇతనికి శిష్యభూతులై, ఇతని మార్గములను అనుసరింతురు గాక అని భావము అయం=ఈ యజమానుడు, లేదా సాధకుడు, ఉగ్రః = ఇతరులకు అణపరానివాడును, విహావ్యః = విశేష యజ్ఞ (సత్) కార్యములు చేయువాడును, యథా సత్ =ఎట్లు కాగలడో, అట్లు చేయుమని తాత్పర్యము.

యజుర్వేదము యజ్ఞకర్మలు ప్రధానముగా గలది కావున, యజ్ఞకారులకు కావలసిన ఐహికాభ్యుదయము ఈ రెండు మంత్రములలో (15, 16) కోఁబడినది. ఇంకొక చివరి మంత్రము "సముద్రాయ వయునాయ" అనునది. విశ్వకర్మ జగద్బీజమును జలములందే ఉంచినాడు కావునను ఆ బీజము నుండియే ద్యావా పృథువులు మొదలైన బ్రహ్మాండము కలిగినది కావునను, అట్టి జలములకు నివాసమైన నదులకు-సముద్రమునకు తండ్రి "విశ్వకర్మ" యని ఇందు జలాధిదేవతగా "విశ్వకర్మ" ప్రార్థింపబడుచున్నాడు.

"సముద్రాయ, వయునాయ సింధూనాం పతయే నమః,
నదీనాం సర్వాసాం పిత్రే జుహౌతా విశ్వకర్మణే
విశ్వాహా మర్త్యగ్ం హవిః." — వి. సూ-17.

టీక : సింధూనామ్=ప్రవహించుచున్నట్టి నదములకు, పతయే=పాలకుడును, సముద్రాకారుడై వాటిని భరించు భర్త అన్నమాట. విశ్వకర్మాకారుడై, సర్వాసాం నదీనాం= సమస్త నదులకు, పిత్రే=తండ్రియైనవాడును, వయునాయ

=కాంతుడును, (అనగా చిత్స్వరూపు డన్నమాట), సము
ద్రాయ=జలరాశి స్వరూపుడైన (విశ్వకర్మకు), నమః=నమ
స్కారము. ఈ లక్షణములు గల విశ్వకర్మ ప్రభువునకు ఓ
మానవులారా! విశ్వాహా = ఎల్లవేళలయందును, (ప్రతి
క్షణమునను) అమర్త్యం=నాశము లేనట్టి, హవిః = పూజా
ద్రవ్యమును, జుహుత = హోమము చేయుడు- అర్పింపుడు
అని భావము.

సాయణులు విశ్వకర్మ సూక్తములు రెంటికీ భాష్య
ములు వ్రాసి కడపట వినియోగ విధానమును ఇట్లు సంగ్ర
హించినారు.

"య ఇమా, చక్షుషో ద్వాభ్యాం
సూక్తాభ్యా మాహుతి ద్వయం,
సముద్రేతి జలే హోమా
మంత్రా స్సప్త దశేరితాః."

తా॥ "య ఇమా విశ్వా భువనాని..." తో ప్రారం
భించి "అపార గర్భం వ్యదధాత్ పురంత్రా" వరకు ఒకటవ
సూక్తము. "చక్షుషః పితా" అను దానినుండి "విహవ్యో
యథాసత్" వరకు రెండవ సూక్తము. వీటితో 16 హోమ
ములు చేయవలెను. ఆవల "స ముద్రా య వయునాయ"
అనెడి మంత్రముచేత జలములందు హోమము చేయవలెనని,
ఇవి మొత్తము 17 మంత్రములని చెప్పినారు.

శుక్ల యజుర్వేద సంహితలోకూడ పూర్వవింశతిలో 17వ అధ్యాయమున విశ్వకర్మను గూర్చి, రెండు సూక్తములు ఉన్నవి. ఆ రెంటియందు కూడ ఎనిమిదేసి చొప్పున 16 మంత్రములే కలవు. అందలి మంత్రములు ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్త మంత్రములతో పోలిక కలనై యున్నవి. సృష్టి స్వరూపమును, విధానమును తెలుపు "విశ్వకర్మ సూక్తములు" ఋగ్వేదమునను, శుక్ల, కృష్ణ యజుర్వేదములందును, అథర్వ వేదమున కొన్ని మంత్రములును ఉండుట-వైదిక ఋషులకు "విశ్వకర్మ భగవానుని" యెడగల భక్తిప్రపత్తులకు నిదర్శనము. ఇంతవఱకు మనము కృష్ణయజుర్వేదీయ విశ్వకర్మ సూక్తముల యందలి మంత్రముల అర్థ విశేషములనుపరిశీలించి కొంత తెలిసికొన్నాము. ఇప్పుడు విశ్వకర్మ యొక్క రూప నామ క్రియలను గూర్చి స్వానుభవమును జోడించి యథాశక్తి తెలిసికొందము. ప్రతిదానికి సూక్ష్మమైన ఒక కారణమనునది ఉండితీరును. ఆ కారణము నుండి స్థూల రూపమైన కార్యము ఏర్పడుచుండును. ఈ కార్యకారణ భావము చేతనే జగత్తు ప్రవర్తించుచుండును.

## విశ్వకర్మ పూర్ణ రూపము

విశ్వకర్మ మయమె విశ్వమెల్ల నటంచు
విస్తరించి చెప్పె వేదవాణి;

విశ్వకర్మ సూక్త విజ్ఞానము నెఱింగి
విశ్వవేత్త వగుము, విజ్ఞ మిత్ర.

"విశ్వకర్మ సూక్తములు" రెంటిలోను విశ్వకర్మ భగవానుని తత్త్వము, ఆయనయొక్క విశ్వరూపము, విశ్వాతీత స్వరూపము, ఆ తత్త్వమును ఉపాసించి ఆరాధించు రీతులు అత్యద్భుతముగా వర్ణింపబడినవి. జగత్కారణ వస్తువు ఎన్ని రీతులుగా భాసించునో ఈ సూక్తములు చెప్పినట్లు ఇంక ఏ వేద మంత్రములును చెప్పలేదేమో అనిపించును. అయితే, "విశ్వకర్మ" స్వరూపోద్ఘాటన చేయుటకే బయలుదేరిన పురుష సూక్తము సైతము కొంతవఱకు విశ్వకర్మ తత్త్వమునే ఇంక కొన్ని క్రొత్త విషయములతో విస్తరించి దీనికి పూరణగా నున్నది. అందుకే మేము నాసదీయ, విశ్వకర్మ, పురుష సూక్తములకు తత్త్వ విద్యా విషయమున క్రమమును సూచించి ప్రథమ, ద్వితీయ, తృతీయ స్థానముల నిచ్చి వివరించినాము. ఈ వివరణము "ఋగ్వేద రహస్యాలు" అను గ్రంథమున పాఠకులు, సాధకులు కాంచవచ్చును. ఈ ప్రకరణమున "విశ్వకర్మ భగవానుని" మంత్రము లెట్లు విచిత్రముగా చిత్రించినవో పరిశీలింతము.

చిత్ర, విచిత్ర శబ్దములకు నానావిధములు, అశ్చర్యకరములు అని భావము. మూల వస్తువు ఒక్కటే అయ్యును, అది తనకంటె భిన్నాభిన్నములు, విపరీతములు, విలక్షణములు అయిన నానా రూపములను తాల్చి భిన్న భిన్న

క్రియలను తానే (విశ్వకర్మయే) నిర్వహించుటయే ఇందలి విచిత్రము కాని, ఆశ్చర్యము కాని. ఇది నామాట కాదు. వేదమే "ప్రజాపతి శ్చరతిగర్భే అంతః. అజాయమానో బహుధా విజాయతే" గర్భస్థుడయిన "విశ్వకర్మ" పుట్టకుండగనే నానారీతులుగా పుట్టినట్లు కనబడగలడు అన్నది.

మూడవ మంత్రములో "యో దేవానాం నామధా ఏక ఏవ" అన్నది. దీని భావము ఆ "విశ్వకర్మ" తాను ఒక్కడే రుద్రాది సర్వ దేవతల నామములను దాల్చి, వారు చేసెడి పనులను తానే చేయుచున్నాడని. ఈ యర్థమును తక్కిన మంత్రములు ఎట్లు వివరించినవో చూతము.

1వ మంత్రములో ముందుగా రుద్రుని కార్యమైన 'లయ కర్మ'ను తీసికొని "య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషిర్హోతా" అని లయకర్మ నొనర్చెడి 'రుద్రుడు తానే', 'తన స్వరూపమే' అని చెప్పబడినది. (1) తరువాత ఆ మొదటి మంత్రములోనే "స ఆశీషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదోఽవర ఆవివేశ." ఆయన జీవుల కర్మఫలములను వారనుభవించు నిమిత్తమై జగదుపాధులను సృష్టించి వాటిలో తానే జీవరూపమున ప్రవేశించెనన్నది. సృష్టించిన దేవుడే ఉపాధులలో ప్రవేశించి జీవుడైనాడన్నందున "అద్వైత సిద్ధాంతమును" వేదమాత చెప్పినట్లయియినది. ఈ సూత్రమే పిమ్మట ఉపనిషత్తులలో ప్రచారమయినది. గీత యేమో "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత" అని ఈ

భావమునే చెప్పినది. "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి" అను వాక్యములకు ఈ మంత్ర వాక్యమే మూలము.

2వ మంత్రములో "విశ్వకర్మా మనసా యద్విహాయా" అన్న వాక్యములోని "విహాయా" అనెడి మాట చేత తాను సృష్టించిన లోకములను హరించువాడని మొదటి మంత్రములో చెప్పిన రుద్రుని మఱల పేర్కొన్నది. ఇకపోగా పునస్సృష్టి జరుగవలసియున్నది. అది జరిగినట్లు మొదటి మంత్రమే చెప్పినది కదా! కాగా దాని కర్తను "ధాత" అను పదముచే పేర్కొనినాడు. ధాత యనగా సృష్టి చేసెడు త్వష్ట గాని, లేక బ్రహ్మగాని. ఆ బ్రహ్మ 'తన' స్వరూపమే. 'తానే' అన్నమాట. ఇకపోగా పోషణ జరుగవలసి యున్నది. ఆ పోషించువాడు విష్ణువు (మయబ్రహ్మ). ఈ విష్ణువు 'విధాత' అను మాటచేత పేర్కొనబడినాడు. ఇట్లు రెండవ మంత్రమున బ్రహ్మ-విష్ణు-రుద్రులు పేర్కొనబడుట గమనింపదగి యున్నది. అంతియేకాక, సప్త చక్రములకు సంకేతము వంటి వారైన సప్త ఋషుల సృష్టికూడ జరిగినట్లు "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అను వాక్యము చెప్పినది. ఆ సప్త ఋషుల వాంఛలను ఆ "విశ్వకర్మ" తీర్చుట, వారు హర్షించుట కూడ రెండవ మంత్రములోని విషయమే.

3వ మంత్రములో త్రిమూర్తులను, సప్త ఋషులను సృష్టించిన "విశ్వకర్మ" ఆయనకు తండ్రి యని యు,

మనలను పుట్టించినవాడనియు ఇంకొకసారి స్పష్టముచేసి ఆ సర్వ దేవతలును 'తన స్వరూపమే' అని "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడి వాక్యము ద్వారా స్పష్టపరుపబడినది. ఈ వాక్యమునకు ప్రతిబింబమే "ఏకం సద్విప్రా బహుధా వదన్తి" అనెడి మంత్రముకూడ.

4వ మంత్రములో వైశ్వకర్మణులైన సానగ సనాతనాది పంచర్షుల విషయము- వారు పూర్వ ఋషులనియు, జరామరణ రహితులనియు చెప్పాటయైనది. వారే బ్రహ్మ-విష్ణు-రుద్రాది మూర్తులై లోకముల సృష్ట్యాదులను వారు అవాంతరముగా జరుపుచున్నారని కూడ వక్కాణింపబడినది.

5వ మంత్రములో ఇట్లు జగములను సృష్టించిన "విశ్వకర్మ"ను ఓ మానవులారా మీరెఱుంగరని వేదమాత ప్రాణులపై తనకు గల జాలిని, దయను వ్యక్తము చేసెను. ఆ "విశ్వకర్మ తత్త్వము" మీ హృదయములలోనే ఉన్నను మీరు ఐహిక, పారలౌకిక భోగముల కలవాటుపడి అజ్ఞానావృతులై జీవించుచున్నారని కూడ శ్రుతిమాత అన్నది.

6వ మంత్రములో మీరు ఆశించి అనుభవించెడి ఇహ పర లోకములే కాక, ఆ లోకములకు కారణమైన మూలతత్త్వము మీలోనే ఉన్నదనియు, అది పైకగపడు వాటికంటె ఆంతరమైన పరవస్తువనియు, "పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభి రసురై ర్గుహాయత్" అనెడి వాక్యముచేత- అది దృశ్యమానమగు సర్వమున కంటెను

అతీతము, పరము అని దాని రహస్యమును ఉగ్గడించినది.

6వ మంత్రములో జగద్బీజమును జలములు తమలో దాల్చినవనియు, ఆ బీజమునందే దేవ మనుష్యాది సమస్త విశ్వమును అవ్యక్తముగా నున్నదనియు చెప్పినది. ఈ విషయమునే "భగవద్గీత" "బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్" అని పేర్కొన్నది.

7వ మంత్రములో జన్మరహితుడైన "విశ్వకర్మ" నాభియందు గల బీజమున సమస్త విశ్వమును ఆధారపడి యున్నదని "అజస్యనాభా వధ్యేకమర్పితం" అని పల్కినది.

ఇక 8వ మంత్రములో "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవః" విశ్వకర్మ బ్రహ్మదేవుడు (త్వష్ట) అయినాడనియు, అటుపిమ్మట సూర్య-చంద్రులుగా రూపుదాల్చి లోక వ్యవహారమునకు కారణమైనాడనియు చెప్పబడినది. ఈ సందర్భమున బ్రహ్మాండపరమైన అర్థమే కాక, జీవపరమైన అర్థమునుకూడ మనము భావించి తత్త్వార్థ లాభమును పడయవలసి యున్నది. "విశ్వకర్మ" దేవుడైనాడనగా జీవుడైనాడని రెండవ అర్థము. ఇందుకు నిదర్శనముగా దిగువ శ్లోకమును తీసికొనవచ్చును.

"దేహో దేవాలయః ప్రోక్తః, జీవో దేవ స్సనాతనః". ఈ దేహమే ఒక దేవాలయము. అందున్న జీవుడే సనాతనుడైన దేవుడు. ఈ భావమును "విశ్వకర్మ సూక్తము" యొక్క మొదటి మంత్రమే చెప్పినది కదా. అనగా "విశ్వ

కర్మయే" శరీరమున ప్రవేశించి జీవుడైనాడని భావము. అట్టి జీవునికి సూర్య, చంద్రులు- అనగా కుడి ఎడమ నాసా రంధ్రములు ప్రాణ వాయువు సంచరించుటకు మార్గములు. కనుక ఆ సూర్య-చంద్రులు ఉన్ననేకాని శరీరమున జీవుని ఆట సాగదు. అందువలన ఇది జీవపరమైన, పిండాండపరమైన అర్థము. ఇంత గంభీరార్థము ఎనిమిదవ మంత్రములో ఇమిడి యున్నది. సాధకులు దీనిని లెస్సగా భావించి ప్రాణాయామాదులాచరించి ధన్యులు కావలసి యున్నది.

ఇక 9వ మంత్రములో కన్నులు మొదలగు ఇంద్రియములకు ప్రాణములకు సృష్టికర్త, తండ్రి, ధీరుడగు ఆ "విశ్వకర్మయే" అనియు, ఆ "విశ్వకర్మయే" భూ దివములను సృష్టించి వ్యాపించినాడనియు చెప్పబడినది. (ద్యావా పృథివీ అప్రథేతామ్" బ్రహ్మాండ పక్షమున ప్రయోగింపబడిన ఈ 'ద్యావా పృథివీ' శబ్దములు పిండాండ (శరీర) పక్షమున ఆధారము, సహస్రారము ఈ రెంటి మధ్యనున్న 'పంచ చక్రము'లకు సూచకములు. వీటియందే కుండలినీ శక్తియొక్క సంచారము. ఇంతవరకు చేసిన వర్ణనము వలన పిండ బ్రహ్మాండముల సమస్త సృష్టియు జరిగిపోయినది.

ఇక 10 వ మంత్రమున ఆ "విశ్వకర్మేశ్వరుని" యొక్క విశ్వరూపము, "విశ్వత శ్చక్షురుత విశ్వతో ముఖః ... " అను వాక్యముల ద్వారా- ఆయన అంతటా కన్నులు, మోములు, హస్తములు, పాదములు, ఇంక తక్కిన సర్వేం

ద్రియములు కలవాడని చెప్పి, అట్టి విశ్వ స్వరూపుని ఆరాధించి, సేవించి తరింపవలయునని సాధకులకు సూచించుటయైనది. అదియే భగవంతుని "విరాట్ స్వరూపము." ఇట్లు బ్రహ్మాండమును సృష్టించిన ఒకే ఒక దేవుడు జీవులను పాప పుణ్యము లనెడి హస్తములచేత లోబరచుకొని వారి వారి కర్మ ఫలములను అనుభవింపచేయుచున్నాడనియు ఇందు చెప్పబడినది.

ఇక 11వ మంత్రములో సాధకులు, విశ్వకర్మ ఇట్టి సృష్టి చేయుటకు అధిష్ఠానము (basis) ఏది? ఉపాదాన కారణ ద్రవ్యమేది? ఇదంతయు ఎట్లు చేయగలిగినాడు? అని ప్రశ్నింపగా, ఆ "విశ్వకర్మ" సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వేశ్వరుడు అగుటచేత తన మహిమచేతనే భూమ్యాకాశములను సృష్టించి ఈ విశ్వమును విస్తరింపచేసినాడని 12వ మంత్రము వరకు సమాధానము చెప్పబడినది. అనగా ఏ ఆధారము లేక, ఏ కారణము లేక వెలుగుచున్న పరమేశ్వరుడు అంతయు, అన్నియు, తానే అయి విశ్వరూపముగా తోచకలడని, పాఠకులుగాని, తత్త్వ సాధకులు గాని అర్థము చేసికొని అనుభూతికి తెచ్చుకొనవలసియున్నది. ఈ ఘట్టమున వేదము చేయు వర్ణన పునరుక్తితో కూడి ఒకవిధముగా నుండును. అందలి సారమును మాత్రమే పాఠకులు గ్రహింపవలయును.

ఇక 13వ మంత్రములో సాధకుడు "ఓ విశ్వకర్మా, నీ యొక్క పరమ ధామములు (దేవాది శరీరములు), మధ్యమ ధామములు (మానవాది శరీరములు), అవమ

ధామములు (తిర్యక్ జడాదుల శరీరములు) ఏవియో మాకు ఉపదేశింపుము." అని కోరి, మేము చేయు యోగాది సాధనముల చేత నీవు మా శరీరములందు వికసించినవాడవై నీవే ఆ యోగాది యజ్ఞమును కొనసాగింపుమని ప్రార్థింపబడినది. ఇందలి మూడు స్థానములను ఆధార, అనాహత, ఆజ్ఞా చక్రములనియు లేదా ఆధార, ఆజ్ఞా, సహస్రారములనియు కూడ చెప్పికొని తత్త్వార్థ లాభమును పడయవచ్చును. అంతేకాక స్థూల (అవమ), సూక్ష్మ (మధ్యమ), కారణ (పరమ), శరీరములనియు భావించి ఆ స్థూల సూక్ష్మ కారణములను యోగ మార్గమున శిక్షించి, చక్కజేసి పరమేశ్వర దర్శనమునకు (ప్రాప్తికి) యోగ్యములుగా మలచుకొనుట శ్రేష్ఠమగు అర్థము కాగలదు. ఇట్టి విశేషములు మా యొక్క యోగదర్శన, తత్త్వసాధన, ఆత్మ దర్శనాది గ్రంథములలోను, తత్త్వ సూక్తులలోను, లెస్సగా వివరింపబడినవి. పాఠకులు వాటిని సైతము ఉపయోగించుకొనవచ్చును. ఈ మంత్రమున "శిక్షా సఖిభ్యః" అని ఒక మాట ఉన్నది. నీకు స్నేహితులవంటివారమైన మాకు తత్త్వానుభవమును నేర్పుమని దీని భావము. జీవునికి, దేవుడు (పరమాత్మ) ప్రియసఖుడేగాని భిన్నుడు కాదు. ఈ విషయమును "ద్వా సుపర్ణా సయుజా, సఖాయా" అనెడి మోక్షసూక్త మంత్రము, జీవాత్మ-పరమాత్మలు మిత్రులవంటివారని చెప్పుట గమనింపతగినది. అట్లే విష్ణు మంత్రమొకటి

"ఉరుక్రమస్య స హింబంధు రిత్థా భవతి" విష్ణు భక్తుడు ఆ విష్ణువునకు చుట్టమే అగుచున్నాడు అని చెప్పినది. ఆ యా మంత్రములలోని ఈ సాదృశ్యమును గమనించి భగవంతునికి మిత్రులము, బంధువులము అగుటకు యత్నింపవలసి యున్నది.

ఇక 14వ మంత్రములో "విశ్వకర్మ" వేద జనకుడని 'సరస్వతి' పతియని, 'గాయత్రీ' ప్రాణనాథుడని "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అనెడి వాక్యముచేత చెప్పబడినది. ఇందలి వాక్కు ప్రకృతియే. ఆ ప్రకృతికి పురుషుడే (పతియే) ఈ "విశ్వకర్మ" (జగత్కారణ వస్తువు). కనుక ఆయనను 'వాచస్పతి' యని వేదము పేర్కొన్నది. అట్టి ప్రకృతి, పురుష స్వరూపుడగు "విశ్వకర్మ"ను మనసు నందు ప్రవేశింప, ఆహ్వానింపుమని కూడ ఇందు సూచన యున్నది. ఆయన మనస్సులో ప్రవేశించినచో మన మనోవాక్కాయ కర్మలు చక్కబడుననియు, అప్పుడు ఆ దేవుడు మనలను అంగీకరించి ఉద్ధరించుననియు హెచ్చరిక. ఏలయన, ఆయన విశ్వసుఖమును కాంక్షించు విశ్వ శంభువు. మనలను రక్షింపజాలిన సాధుకర్మలు కలవాడును కనుక. ఇక్కడ, మనము కూడ మంచి కార్యములను ఒనర్చుచూ విశ్వకల్యాణమును, సుఖమును సంపాదించుటకు పాటుపడవలెనని సూచన కలదు. ఇట్లు ఈ 14వ మంత్రము పెక్కు విశేషములతో కూడి యున్నది.

15వ మంత్రము కూడ ఆ "విశ్వకర్మ"ను తమ మనస్సులో వికసించి తమను నడుపవలసినదనియు, తమ కార్య కలాపమును, ఆయననే జరుపుమనియు, ఇట్టి తమకు విరోధులైనవారి కృత్యములు కొనసాగనీయవలదనియు, తమకు యోగ్యుడైన జ్ఞాన పుత్రుడు పుట్టవలెననియు ప్రార్థింపబడినది.

ఇక 16వ మంత్రములో ఉత్తమ యోగాది క్రియల చేత "విశ్వకర్మ" తమలో వృద్ధి చెంది తమ్ము లోకోపకారులను గాను, ఓటమి లేనివారినిగాను చేయవలెనని ప్రార్థించుటయైనది ఇట్టి విశ్వజనకుడు, విశ్వరక్షకుడు, విశ్వోద్ధారకుడు అయిన "విశ్వకర్మ"ను ఎల్లప్పుడు ఆరాధించి తరించవలసినదని మానవులను హెచ్చరించుచున్నది వేదము!

చివరిదైన 17వ మంత్రముతో రెండవ సూక్తము ముగియుచున్నది. ఈ మంత్రమున ఆయనను సముద్ర స్వరూపుడనియు, నదీనదములకు జనకుడు, భర్త అనియు చెప్పుట గమనింపవలసియున్నది. ఆయన జగద్బీజమును ఉంచినది ఉదకముల యందే కనుక ఇట్టి వర్ణన ఎంతయో సముచితముగా నున్నది. ఈ విషయమునే "అపోవా ఇదం సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణావా" అనెడి మంత్రమును (జల ప్రాధాన్యమును) సూచించుచున్నది కదా! ఈ విధముగా విశ్వకర్మ నుండియే సమస్త విశ్వమును విస్తరించి, "విశ్వకర్మ మయం జగత్" "విశ్వకర్మా జగద్గురుః" "విశ్వకర్మణోఽ

న్యన్నకించన" అనెడి సూక్తులు సార్థకములగుటకు ఈ "విశ్వ కర్మ సూక్త" ద్వయము తన విశ్వ స్వరూపమును ఇట్లు ప్రకటించుచున్నది. ఏ వేదసూక్తములుగాని ఇట్లు, ఈ విధముగా లౌకిక, పారమార్థిక, యోగసాధనాది అర్థములను చెప్పినట్లు కన్పట్టదు. ఇంకను బుద్ధిమంతులగువారు, తరచి తరచి విశ్వకర్మ సూక్తార్థ విశేషములను వెలికి తెచ్చి లోకమునకు అర్పించి విశ్వోపకారము చేయుదురని ఆశించుచున్నాము.

## 1. కారణ స్వరూపము :

విశ్వకర్మ కారణ స్వరూపమును గూర్చి "పరో దివా, పర ఏనాపృథివ్యాః" అనెడి ఆరవ మంత్రము, ఆ "విశ్వకర్మ" భూమి-అన్తరిక్ష - దివములకంటెను, దేవాసుర మనుష్యాది ప్రాణులకంటెను, అప్రాణులకంటెను భిన్నమైనవాడు, పరుడు అని చెప్పినది. అనగా కార్యరూపములైన వాటికంటెను అతని స్వరూపము విలక్షణమని చెప్పినదన్న మాట. అట్లని వీటికి వేఱుగా ఎక్కడనో ఉన్నదనుకొందురేమో అని అట్టి "విశ్వకర్మ" కారణ స్వరూపము ఎక్కడనో లేదు, మీ హృదయములోనే ఉన్నదని "గుహాయత్" అనెడి మాటచేత చెప్పినది. అట్లు దగ్గఱనే ఉన్నను "నతం విదాథ" ఆ తత్త్వమును జీవులెఱుంగకున్నారని అన్నది. కనుక మనలోనే ఉన్న భగవత్తత్త్వమును మనమెఱుంగకున్నామన్నమాట. ఈ సంగతినే శ్రీ వీరబ్రహ్మేంద్రులు "తనలోన నున్న తత్త్వమెవ్వరు తలచి గనరన్నా!" అని గానము చేసినారు. ఈ

ఆ కారణ స్వరూపమును సత్తని కాని, అసత్తనికాని, చెప్ప వీలుకాదని నాసదీయ సూక్తము "నాసదాసీన్నో సదాసీత్" అని చెప్పినది. గీత యేమో "న సత్త న్నాస దుచ్యతే" అన్నది. మూలస్తంభ మనెడి తాత్త్విక గ్రంథమేమో- "న భూమి ర్న జలం చైవ" అని విశ్వకర్మను స్వయంభువని చెప్పినది. (చూడు 95వ పుట).

ఇక శ్వేతాశ్వతరోపనిషత్తు ఇదే భావమును- "న సన్న చాసత్ శివ ఏక కవలః" అని చెప్పనే చెప్పినది. (చూడు- 25వ పుట,)

అది- ఆదిమ తత్త్వము, సదసత్తులు కానిదని యే పేరొ్కన్నది. బుద్ధుడేమో దానిని "సత్తూ కాదు. అసత్తూ కాదు. ఆ ఉభయము కాదు. అనుభయమూ కాదు. ఎటూ చెప్పజాలని శూన్యమని"నాడు. "ఆదిమ విశ్వకర్మ" యొక్క మూలకారణ స్వరూపము ఇట్టిదన్నమాట. ఈ తత్త్వమును ఋక్కు "ఏకం సత్" అనికూడ అనకపోలేదు.

ఇక ఉపనిషత్తులు దానిని- "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్ కించన మిషత్", "స దేవ సోమ్యే దమగ్ర ఆసీదేక మేవా ద్వితీయం", "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" ఇత్యాది వాక్యముల ద్వారా అది సచ్చిదానంద మని అన్నవి. ఈ స్థితిలో విశ్వకర్మకు సాధకుల అనుభవము నకు గోచరించు స్థితి కలిగినది. దానినే "తత్త్వమసి", "అహం బ్రహ్మాస్మి" మొదలగు వాక్యములు ప్రవచించినవి. ఇట్టి కారణరూప విశ్వకర్మ తత్త్వమే విశ్వము పుట్టిన తర్వాత

ఆకాశాది భూతములుగాను, వాటి సంయోగముచే కలిగిన, చరాచరములుగాను రూపొందినది. ఈ స్థితిని విశ్వకర్మ సూక్తము- "ద్యావా పృథివీ జనీయన్దేవ ఏకః", "ద్యావా పృథివీ అప్రథేతాం" ఇత్యాది వాక్యములతో వ్యక్తము చేసినది.

## II. కార్య స్వరూపము :

అప్పుడు పృథివ్యంతరిక్ష దివములు, భూ, ర్భువ, స్సువర్లోకములు పుట్టి సృష్టి విస్తరించినదన్నమాట. ఈ విశ్వ స్వరూప "విశ్వకర్మ"నే మంత్రము "విశ్వతశ్చక్షురుత, విశ్వతో ముఖో, విశ్వతో హస్త ఉత విశ్వతః పాత్" అని వర్ణించి ఉపాసకులకు విశ్వరూపోపాసన కర్తవ్యమని బోధించినది. పురుష సూక్త మీ "విశ్వకర్మ సూక్త" మార్గమునే అనుసరించి "సహస్ర శీర్షా పురుషః, సహస్రాక్ష స్సహస్రపాత్". అని ఆ "విశ్వకర్మ" సాకార విశ్వరూపమును పొగడినది ఇంకను పురుష సూక్తము "విశ్వకర్మ" యొక్క అవయవములను ఏ యే దేవతలుగా ఎంచి ఆరాధింపవలయునో కూడ చెప్పకపోలేదు. ఈ విధముగా నాసదీయ, విశ్వకర్మ పురుష సూక్తములు మూటిని క్రమముగా సమన్వయించుకొనుచు పోయినచో విశ్వకర్మ యొక్క 'కారణ రూపము', 'కార్య రూపము' సాధకులకు బోధపడగలవు. విశ్వకర్మ సూక్తము- "విశ్వకర్మా హ్యజనిష్ట దేవ ఆదిద్గంధర్వో, అభవ ద్ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనాః" అనగా, పురుష సూక్తము "చంద్రమా మనసోజ్జాతః, చక్షో సూర్యో అజాయత."

ఇత్యాదిగా పలికినది. ఇట్టి సాదృశ్యములను సాధకులు భావింపవలయును. విశ్వకర్మేశ్వరుని యొక్క విశ్వాకార భావనను ముండకోపనిషత్తు ఇట్లు వర్ణించినది.

"అగ్నిర్మూర్ధా, చక్షుషీ చంద్ర సూర్యౌ,
దిశః శ్రోత్రే, వాగ్వివృతాశ్చ వేదాః,
వాయుః ప్రాణో, హృదయం విశ్వమస్య,
పద్భ్యాం పృథివీ హ్యేష సర్వ భూతాంతరాత్మా."

తా॥ విశ్వాకారుడగు ఆ "విశ్వకర్మ"కు అగ్ని శబ్దముచే చెప్పదగిన జ్యోతిర్లోకములే (జ్యోతిర్మండలములు) 'శిరస్సు'. చంద్ర-సూర్యులే "కన్నులు". దిక్కులే 'చెవులు'. వేదములే 'వాక్కులు'. గాలియే 'ఆయన ప్రాణము'. విశ్వమే 'ఆయన హృదయము'. భూమియే 'పాదములు'. ఇట్టి విశ్వ పురుషుడు సర్వ భూతములకు అంతరాత్మ. ఈ తుది వాక్యమును దృఢపఱచుచు శ్వేతాశ్వతర మంత్రము "ఏషదేవో విశ్వకర్మా..." ఎల్లభూతములకు అంతరాత్మ "ఆతడే" నన్నది. (చూడుము పుట 23). "విశ్వకర్మ" యొక్క విశ్వరూపమును వేదోపనిషత్తులు ఇట్లు గానము చేసినవి. "హృదయం విశ్వమస్య" అన్న వాక్యము 'విశ్వ హృదయము నెఱింగినచో, పరమేశ్వర హృదయము నెఱింగినట్లె' అని చెప్పుచున్నది కదా. కనుక ఈశ్వర సాక్షాత్కారమునకు విశ్వమును వదలిపోనక్కఱలేదని తెలియుచున్నది.

పంచ సంఖ్యా ప్రాధాన్యమును బట్టి చూచినచో, పంచ భూతములు లేని దీ సృష్టియే ఉండదు. ఆ పంచ

భూతములకు సంకేతముగానే "విశ్వకర్మ"కు పంచ శిరస్సులు కల్పింపబడినవి. దశేంద్రియములు, దశ ప్రాణములు లేనిదీ జీవుల ఆట సాగదు. కనుక ఆ పదియే దశ బాహువులుగా ఎన్నబడినవి. ఈరీతిగా విశ్వకర్మ భగవానుని యొక్క పూజార్హమైన అర్చా రూపము ఏర్పడినది. దీనిని పురాణాది గ్రంథములు లెస్సగానే వర్ణించినవి.

## III. అర్చా స్వరూపము :

విశ్వకర్మ యొక్క అర్చా మూర్తిని ఎట్లు ఆరాధింప వలసినది వాయు పురాణ భూఖండములోని విశ్వకర్మో పాఖ్యాన మిట్లు చెప్పుచున్నది :-

శ్లో॥ చింతయే ద్విశ్వకర్మాణం శివే వటతరో రథః
దివ్య సింహాసనాసీనం మునిబృంద నిషేవితమ్॥
ఉపాస్యమాన మమరైః స్తూయమానం మహర్షిభిః
పంచవక్త్రం దశ భుజం బ్రహ్మచారి వ్రతేస్థితిమ్॥
లక్ష్మీ సరస్వతీభ్యాంచ సంక్షాళిత పదద్వయమ్
వక్షస్థలేచ బిభ్రాణం బ్రహ్మవిద్యా ముమాతనుమ్॥
హార కేయూర కటక కుండలాద్యై స్సుశోభితమ్
భస్మాంగరాగం దేవేశం వరదం సుస్మితాననమ్॥
కుద్దాల కరణీ వాస్యాపామీా యంత్రం కమండలుమ్
బిభ్రాణం దక్షిణైర్హస్తై రవరోహ క్రమాత్ప్రభుం॥
మేరుంటంకం స్వనం భూషాం వహ్నించ దధతంకరైః
అవరోహ క్రమేణైవ వామైర్వామ విలోచనే॥

ఏవం ధ్యాయే న్మహాదేవి, విశ్వకర్మాణ మవ్యయం॥

— వాయుపురాణ భూఖండము

(విశ్వకర్మోపాఖ్యానము)

తా॥ పార్వతిని గూర్చి శివుడు చెప్పుచున్నాడు. ఓ పార్వతీ, మఱ్ఱిచెట్టు కింద దివ్య సింహాసమున కూర్చుండి మహర్షులు సేవించుచుండగా పూజింపబడినవాడగుచు, ఐదు మొగములు, 10 బాహువులు కలిగి లక్ష్మి సరస్వతులచే కడుగబడుచున్న పాదములు కలవాడగుచు, వక్షస్థలమున బ్రహ్మవిద్యను దాల్చి, రత్నమాలలు, భుజకీర్తులు, కంకణములు, కర్ణభూషణములు డాల్చిన శరీరమున, విభూతి నద్దుకొని మొగముల యందు చిరునగవు వెలయుచుండగా, కుద్దాలమును, కరణిని, వాస్యను, ఘటికా పాత్రను, కమండలువును, మేరువును, టంకమును, స్వనమును, భూషను, అగ్నిని వరుసగా కుడి ఎడమ హస్తపంక్తుల యందు పై నుండి క్రిందికి, క్రింది నుండి పైకి తాల్చి ఎంతగానో ప్రకాశించుచున్న "విశ్వకర్మ"ను ధ్యానించుము. ఇట్లనుటచేత విశ్వకర్మకు ఐదు ముఖములు, 10 చేతులు మొదలగు విశేషము లున్నట్లు "విశ్వకర్మ" యొక్క అర్చా రూపము అనగా పూజింపతగిన ఆకారము స్పష్టమగుచున్నది. ఈ స్వరూపమే ఒక్క శ్లోకములో ఇముడ్చబడి సాధకులకు ధ్యానయోగ్యమై పై పురాణ భాగమునందే ఇట్లున్నది.

శ్లో॥ పంచాననో, దశభుజో, వ్రతబంధ దీక్షః,
కేయూర, హార, మణికుండల, చండ తేజాః,

భస్మాంకితో, మణిమయాసన సంస్థితో సౌ,
సర్వేశ్వరో వసతు మే హృది విశ్వకర్మా."

తా॥ అయిదు మోములు, పది చేతులు కలవాడును, యజ్ఞోపవీతమును తాల్చి, భుజకీర్తులు, కిరీటము, మణికుండలములు, హారములు ధరించి ప్రకాశించువాడును, శరీరమున విభూతిపూత కలవాడును, మణిమయ సింహాసనమున కూర్చున్నవాడును అగు, సర్వేశ్వరుడగు "విశ్వకర్మ" భగవానుడు నా హృదయమునందు నివసించుగాక! ఈ పై శ్లోకము సాకారుడైన "విశ్వకర్మ"ను ధ్యానించుటకు పనికి వచ్చును. నిరాకార "విశ్వకర్మ" ధ్యానమునకు దిగువ శ్లోకము తగినదై యుండును.

శ్లో॥ "సహస్రార పద్మాంతరే భాసమానమ్,
చిదానంద సన్మాత్ర మోంకారలీనమ్,
సమధా మహాయోగిభి ర్గమ్యమానమ్,
భజే విశ్వకర్మాణం మానంద కందం." — 1

"మహానంద రూపమ్, హృషీ కై ర్దురాపం,
విపన్మేఘవాతం, భవాంభోధిపోతం,
జగజ్జన్మహేతుం, దిగాద్యై రతీతం
భజే విశ్వకర్మాణం మానంద కందం." — 2

ఈ రెండును గ్రంథకర్త రచించినట్టివి. వీటి భావమిది. 1) సహస్రార పద్మమునందు వెలుగువాడును, సచ్చిదానంద స్వరూపుడును, ఓంకారమునందు లీనమై, ఆ "ఓంకార" ఉపాసన చేత గోచరించువాడును, మహాయోగులచేత

సమాధి సమయమున పొందబడువాడును అగు "విశ్వకర్మ"ను భజించుచున్నాను.

(2) మహానంద స్వరూపుడును, ఇంద్రియముల చేత పొందరానివాడును, ఆపద లనెడి మబ్బులను పోగొట్టెడి 'గాలి' అయినవాడును, సంసార సముద్రమును దాటించుటకు 'నౌక' వంటివాడును, జగత్తుల యొక్క జన్మాదులకు హేతు వైనవాడును, దిక్కులు, కాలము, వస్తువులు మున్నగువాటిని దాటి ప్రకాశించువాడును అగు "విశ్వకర్మ భగవానుని" భజించుచున్నాను. ఈ రెండు శ్లోకములను కారణోపాస కుల, నిర్గుణారాధకుల ధ్యానమునకు ఉపయోగించుకొనదగి నవి. "విశ్వకర్మ" స్వరూపమనునది కారణ రూపముగాను, కార్యరూపముగాను, అర్చా రూపముగాను (పూజింపదగిన స్వరూపము) మూడు విధములుగా నుండునుగాన సాధకు లగువారు ఆరాధించుకొనుటకు తగినట్లుగా ఈ విషయములు సంగ్రహముగా ఇచ్చట క్రోడీకరింపబడినవి. ఇంకను గల పలు భేదములను, విశేషములను సాధకులగువారు ఇతర గ్రంథ ముల నుండి కూడ స్వీకరించుటకు ప్రయత్నింపవచ్చును. అన్నింటియొక్క లక్ష్యము పరమాత్మతో (విశ్వకర్మ భగ వానునితో) ఏకీభావము నందుటయే!

# విశ్వకర్మ నామములు

"విశ్వకర్మ సూక్తములు" రెండుగా ఋగ్వేదమునందు ఉదాహరింపబడినవి. ఒక్కొక్క సూక్తమునందు ఏడేసి మంత్రములు కలవు. ఈ ఏడు మంత్రములు, ఆధారాది సప్త చక్రములకు, సప్త ఋషులకుకూడ సంకేతము లని గ్రహింపవలయును. యజుర్వేదములోని "విశ్వకర్మ సూక్తము" పదునారు మంత్రములతో ఒప్పుచున్నది. "సముద్రాయ వయునాయ" అనెడి మంత్రము పదునేడవదిగా నున్నది. పై 16 మంత్రములు షోడశ (16) వికారములకు గుర్తులని భావింపవచ్చును విశ్వకర్మ సూక్తములోని, విశ్వకర్మ మంత్రములలో "విశ్వకర్మ భగవానునకు" కొన్ని విశేషణములు, లేదా పర్యాయపదములు వాడబడినవి. వాటి అర్థమును విచారించినచో ఎన్నో తాత్త్విక రహస్యములు మనకు తెలియగలవు. ఇప్పుడు వరుసగా వాటిని పరిశీలింతము. అందు మొదటి మంత్రము "య ఇమా విశ్వాభువనాని జుహ్వదృషి, ర్హోతా, నిషసాద, పితా నః" అనునది. 2వ పాదమున ఋషి, హోత, పిత అను పదములు కలవు.

1) ఋషిః : "ఋగతౌ". ఋధాతువునకు గమన మర్థము. అనగా 'పొందుట' అని భావము కూడ రాగలదు. మనము గమనము (నడక) చేయునప్పుడు ఏదో ఒక గమ్యమును చేరుదుము కదా! కనుక 'ఋషి' అనగా సమస్తమైన జ్ఞానముల గమ్యములను పొందినవాడని భావము. జ్ఞానము

యొక్క కడపటి హద్దును పొందినవాడని సారాంశము. ఇంద్రియములకు విషయములగునట్టి వానిని అందరూ ఎఱుంగ గల్గుదురు. భగవంతుడు (జగత్కారణము) బాహ్యేంద్రియములనేకాక అంతరింద్రియములైన మనోబుద్ధులకు కూడ అందనట్టివాడు. అట్టివానిని అతీంద్రియుడు (ఇంద్రియములకు అందనివాడు) అందురు. అనగా 'ఋషి' అట్టి ఇంద్రియముల కందని భగవంతునికూడ చూడగలడన్నమాట. కనుక 'ఋషి' శబ్దమునకు "అతీంద్రియ ద్రష్ట" అని భావము. అతీంద్రియమునే చూచువాడు ఇంద్రియములకు గోచరించు వాటిని సులభముగానే తెలియగలడు. కనక 'ఋషి' యనగా సర్వజ్ఞుడని తేలుచున్నది. ఇట్టి సర్వజ్ఞత్వము ఒక్క భగవంతునికే కలదు. కనుక ఆయనను (విశ్వకర్మ భగవానుని) 'ఋషి' అని మంత్రము పేర్కొన్నది. ఈ 'ఋషి' శబ్దమును కొంత జ్ఞానమును సంపాదించిన మనుష్యులకు కూడా మనము వాడుచున్నాము. భగవంతుని 'ఋషి' అనుటలో ఇంతటి అమూల్యార్థము ఉన్నదన్న మాట.

2) హోతా : 'హోత' అనగా హోమము చేయువాడని అర్థము. "విశ్వకర్మ" ప్రళయకాలమున జగములనన్నిటినీ తనలో ఆహుతిగా వేసికొని హోమము చేయుచున్నాడు (లీనము చేసికొనుచున్నాడు) కావున 'హోత' అను శబ్దము ఆయనకు వాడబడినది. ఈ భావమునే "విశ్వా భువనాని జుహ్వత్" అనెడి వాక్యము కూడ చెప్పుచున్నది. 'హోత' అనగా యజ్ఞమునందు హోమముచేయువాడని

భావముకాన "సృష్టి యజ్ఞము జరుపునట్టి హోత" అనికూడ చెప్పికొనవచ్చును. అనగా అప్పుడు 'హోతృ' శబ్దము "సృష్టి రూప ఫలము నాశించి యజ్ఞముచేయు హోత" యను అర్థము నిచ్చును.

3) పితా : 'పిత' అనగా తండ్రియని అందరికినీ తెలిసిన విషయమే. ఆ 'పిత', మాతయందు బీజము (గర్భము) నుంచి సంతానము యొక్క పుట్టుకకు హేతువగుచున్నాడు కదా! కనుక సంతాన విషయమున బీజప్రదాత 'పితయే' అగుచున్నాడు. "విశ్వకర్మ" కూడా "అపాం గర్భం వ్యదధాత్ పురుత్రా" అను మంత్రమును బట్టి నీటియందు జగద్బీజమును ఉంచినాడు కదా! దీనినిబట్టి లోకములోని తండ్రి వంటివాడేకాక జగద్బీజ ప్రదాతకూడ అగుచున్నాడీ "విశ్వకర్మ భగవానుడు". తండ్రి బిడ్డలను కనుటయేకాక వారిని పోషించి పెద్దవారినిచేసి లోకమున జీవించుటకు, లోక కల్యాణము చేయుటకు, సమర్థుల నొనర్చుచున్నాడు. అట్లే భగవంతుడునూ జగములను కని వాటి పోషణకు (స్థితికి) హేతువగుచున్నాడు కాన, పోషణచేయు విష్ణువుకూడా ఆ త డే అన్నమాట. కనుటచేత, 'జనకుడు' (బ్రహ్మ) కాగా, పోషణ చేత 'విష్ణువగు' చున్నాడు. 'పితృ' శబ్దములో ఇన్ని విశేషములున్నవి. కనుకనే ఈ సూక్తములందు 'పితృ' శబ్దము 3, 4 సార్లు వాడబడినది. 3వ మంత్రములో "యోనః పితా జనితా" అని చదువుదుము. 8వ మంత్రములో "తృతీయః పితా జనితౌషధీనామ్" అని చదువుదుము. 9వ మంత్రములో

"చక్షుషఃపితా" అని చదువుగుము. కనుకనే భగవంతుని గూర్చి ఒక కవి "త్వమేవ మాతాచ పితా త్వమేవ, త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ, త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ, త్వమేవ సర్వం మమదేవదేవ" అని తల్లి, తండ్రి, చుట్టము, మిత్రుడు, విద్య, ధనము, ఇదియది అననేల, సర్వమూ నీవే అని పొగడినాడు. ఈ భావమునే "నీవే తల్లివి, తండ్రివి, నీవే నాతోడునీడ, నిజమగు సఖుడా" అను పద్యముకూడ చెప్పుచున్నది.

4) విశ్వకర్మా : సమస్తములైన కార్యములు (పనులు)- అనగా సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాది రూపము లైన పంచకర్మలే కాక, చలనాది (కదలిక) సమస్త కార్య ములు ఎవనికి కలవో యాతడు "విశ్వకర్మ" అన్నమాట. దీనికే- సమస్తమైన పని ఎవనికి కలదో, ఆ సర్వశక్తి "విశ్వ కర్మ" యని భావము. బ్రహ్మ-విష్ణు-రుద్రాదులు, సృష్టి, స్థితి, లయాదులైన ఒక్కొక్క-పనిని చేయువారై యుండగా "విశ్వకర్మ భగవానుడు" అందరు చేసెడి పనులను చేయగలి గినవాడగుచున్నాడు. కనుక ఆ బ్రహ్మాది పదములకంటే "విశ్వకర్మ" పదము సంపూర్ణార్థమును ఇచ్చునదై యున్నది. సంస్కృత పదముల వ్యుత్పత్తులను పట్టిచూడగా "విశ్వకర్మ" పదము యొక్క ప్రత్యేకత మనకు గోచరింపగలదు. ఈ విష యము పదములయొక్క ధాత్వర్థమును బట్టియు, అవయవార్థ మును బట్టియు తెలియగలదు. ఈ అంశమునే మిత్ర సాహస్రిలో ఇట్లు వ్రాయుట అయినది.

"విశ్వకర్మములను విస్తరించుట జేసి
విశ్వకర్మ యనగ విశ్వస్రష్టు
శ్రుతుల పొగడబడియె సూనృతోక్తులచేత
విశ్వహిత చరిత్ర వినర మిత్ర. — 839

"బ్రహ్మ కేశవాది పదములకంటెను
విశ్వకర్మ పదమె విశ్వ స్రష్టు
చేయుపనులనెల్ల చెప్ప సమర్థంబు,
చింతచేసిచూడు చిరము మిత్ర." 841

"విశ్వకర్మ" పదమునందు ఇంత విశేషము ఉండుట చేతనే యజుర్వేదము "ఓం నమో విశ్వకర్మణే స ఉ పాత్వస్మాన్" విశ్వకర్మకు నమస్కారము. ఆతడు మమ్ము రక్షించుగాక! అన్నది. ఇదియే విశ్వకర్మాష్టాక్షరీ మంత్రముగా భగవదుపాసకులచేత నేడు జపింపబడుచున్నది.

5) <u>విహాయా</u> : విశేషముగా తాను సృష్టించిన జగములను సంహరించువాడని దీని భావము. ఇంతవరకు స్థితి కాలమున ఆ జగములయొక్క లోపల, వెలుపల, అంతటా నిండియుండినవాడు వాటిని తనలోనే లీనము చేసికొని వదలుచున్నాడు. లేదా విడిచి పెట్టుచున్నాడు అని తెలియవలెను. ఇదే భావము "య ఇమా విశ్వా భువనాని జుహ్వత్" అను వాక్యము కూడ పూర్వము చెప్పినది. ఈ మాటచేత "విశ్వకర్మ భగవానుడు" జగములకు సంహారకుడై 'రుద్రుడు' చేయవలసిన పనిని చేయుచున్నాడని గ్రహింపవలయును.

అనగా రుద్రరూపుడు, మనుబ్రహ్మ స్వరూపుడు అయి ప్ర
ర్తించు చున్నాడన్నమాట.

6) <u>ధాతా</u> : "ధాత" యనగా పుట్టించువాడని అర్థమ
"ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః" అనెడి వాక్యము
బట్టి ద్యావా పృథువులను, చరాచరములను సృష్టించిన ధా
"ఆయనయే" అని తెలియుచున్నదికదా. అనగా సృష్టిచేసె
బ్రహ్మ "ఆయనయే" (విశ్వకర్మ భగవానుడే) అయినాడన
మాట. ఈ బ్రహ్మయు, త్వష్టయు ఒక్కరే అని మ
మెఱుంగుదుము. కనుక దీనిచేత "విశ్వకర్మ"కు బ్రహ
స్వరూపము సిద్ధము. "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవః" అనె
వాక్యము కూడ ఆ "విశ్వకర్మ"యే 'బ్రహ్మ' (త్వష్ట) అం
నాడని చెప్పుచున్నది కదా!

7) <u>విధాతా</u> : 'విధాత' అనగా తాను కన్న ప్రాణుల
జగములను, వృద్ధియగుటకు పోషించువాడని భావము. జగవ
లను కనుటయేకాక, పోషించునదియు ఆ "విశ్వకర్మ"యే అ
తెలియవలెను. ఈ పోషణక్రియ వ్యష్టిలో విష్ణుదేవునిది అ
('మయుని'దని) మనము భావించుచుందుము. కనుక "విశ
కర్మ" విష్ణువుకూడా అన్నమాట. "వి హో యా, ధాతా
విధాతా" అనుటచేత త్రిమూర్తులను చెప్పినట్లైనది. కాగ
సృష్టి, స్థితి, లయములను చేయునది "విశ్వకర్మ"యే అ
తెలుచున్నది.

(విశ్వకర్మ) సృష్టించిన బ్రహ్మ రుద్రాదులందరికంటెను, అన్నిటికంటెను శ్రేష్ఠుడని భావము. ఆతనికంటె శ్రేష్ఠమైనది ఏదియు లేదన్నమాట. కనుకనే ఉపనిషత్తు "న తత్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే" ఆయనతో సమానుడు కాని, అధికుడు కాని లేడని పొగడినది. ఈ 'పరమ' శబ్దమునకు 'ఆత్మ' శబ్దమును జోడించుటచేతనే 'పరమాత్మ' శబ్దము తయారైనది. ఈ సందర్భమున 'పర', 'పరమ' శబ్దములను గూర్చి మరి కొన్ని విశేషములను మరియు వాటి అర్థములను తరువాతి ప్రకరణములలో తెలిసికొందుము.

9) సంధృక్ : "సమ్యక్ పశ్యతీతి సంధృక్" అని వ్యుత్పత్తి. అనగా లెస్సగా చూచువాడని అర్థము. మనము మన బాహ్యేంద్రియములతో స్థూలమైన వస్తువుల యొక్క విశేషములను మాత్రమే చూచికాని, తాకిగాని, అనుభ వించిగాని తెలియగలుగుదుము. వెలుపలి ఇంద్రియములకు గోచరముకాని విషయములను మనోబుద్ధులతో కొంతవరకు ఆలోచింపగలము. కాని మనోబుద్ధులకు కూడ అందని ఇంద్రియాతీత విషయములు ప్రకృతిలో అనేకములున్నవి. కాగా లెస్సగా చూచుటలో లోపల, వెలుపల, అంతటా నున్న రహస్యములను తెలిసికొన్ననేకాని చూచుటకాని, లేక జ్ఞానముకాని పూర్తికాదు. అట్లు లోపల, వెలుపల, అంతటా చూచుచు విషయములయొక్క బాహ్యాంతరము లను చూడగలుగునదియే సమ్యగ్దృష్టి. అట్టి సమ్యగ్దృష్టి

గలవాడు భగవంతుడే. ఆయన సర్వజీవులయొక్క మనస్సం కల్పములను, పూర్వాపర జన్మలయందు వారు చేసికొన్న కర్మ విశేషములను తెలిసికొనవలసియున్నాడుకదా! అందువల్ల ఆయనకు 'సంద్రృక్' అనెడి పేరు వాడబడినది. దీనికి సర్వజ్ఞు డని అర్థము. కనుకనే భగవంతుని సర్వజ్ఞుడు, సర్వశక్తి, సర్వేశ్వరుడు అనుచున్నాము. ఈ భావమును భగవద్గీత "వేద్యంచ, వేత్తాచ, పరంచధామ" అని, భగవంతుడు మనకు తెలియదగినవాడనియు, అందరిస్థితిని తెలిసికొనువాడనియు (వేత్తా), పరంధామ = శ్రేష్ఠమైన నివాసమనియు చెప్పినది. గీత ఇంకను "పరమాప్నోతి పూరుషః" అనికూడ వాడినది.

10) <u>జనితా</u> : "జనీ ప్రాదుర్భావే" జని ధాతువునకు పుట్టుట అని అర్థము. 'జాయతే' అనగా పుట్టుచున్నాడు, పుట్టుచున్నది అని భావము. 'జనిత' అనగా పుట్టించువాడని అర్థము. జగములను, జీవులను, సర్వమును పుట్టించువాడు భగవంతుడే కనుక ఆయనకు 'జనిత' అను పేరు సార్థకమగు చున్నది. ఈ మాట 'పిత', 'ధాత' అను పదములను పోలి నట్టిదే. వాటికి పర్యాయపదమే. "జన్మాద్యస్య యుతః" అనెడి బ్రహ్మసూత్రము ఈ జగమునకు జన్మ, స్థితి, నాశ ములు ఎవనివలన కలుగునో వాడు (అది) భగవంతుడని చెప్పుచున్నది.

11) <u>పరః</u> : ఈ "పర" శబ్దమును గూర్చి తరువాత తెలిసికొందము.

12) <u>అజః</u> : "న జాయతే ఇతి అజః" ఏ వస్తువునకు, లేక ఎవనికి పుట్టుక (జన్మము) అనెడి వికారము లేదో (ఉండదో) అది లేక, వాడు 'అజము', 'అజుడు' అని చెప్ప బడును. ప్రకృతికినీ, ప్రకృతిలోని త్రిగుణమయములైన పదార్థములకును పుట్టుట, ఉండుట, పెరుగుట, పరిణమించుట (మార్పులు చెందుట) క్షీణించుట, నశించుట అనెడి 6 వికారములు ఉండును. వీటినే షడ్భావ వికారము లందురు. ఇట్టి వికారము లేవియు లేనటువంటిదే జగత్కారణము, లేక జగత్కారణరూప భగవంతుడు (విశ్వకర్మ). కనుక ఆ భగ వంతునికి 'అజుడు' అనెడి పేరు సార్థక మగుచున్నది. ఆ భగ వంతునియొక్క ప్రతిబింబమే అయిన జీవుడు కూడ అజుడే అని భగవద్గీత చెప్పుచున్నది. "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో, నహన్యతే హన్యమానే శరీరే". జీవాత్మ పుట్టుక లేనివాడు, శాశ్వతుడు, పురాణుడు (సనాతనుడు). అంతే కాక చచ్చిపోవునట్టి శరీరమునందున్నప్పటికినీ చావులేనివాడు అనియు భావము. అద్వైత శాస్త్రము, జీవేశ్వరులను ఒక్కరే అని చెప్పుచున్నందువలన 'అజ' శబ్దము అట్లే 'అమృత' శబ్దము కూడ సార్థకములగుచున్నవి. చచ్చుట, పెరుగుట, పుట్టుట అనెడి వికారములు శరీరమునకేగాని ఆత్మకు లేవు గదా! ఆత్మను పరమాత్మని చేసికొనుటయే జీవుల లక్ష్యము.

13) <u>చక్షుషః పితా</u> : అనగా "ప్రాణాదులైన ఇంద్రియ సముదాయమునకు తండ్రి- అనగా వీటిని కన్నవాడు" అని

సాయణులు వ్రాసినాడు. అది మంచిదే. తృతీయ చక్షు స్థానమున ఉండునది ఆజ్ఞాచక్రము. అదియే అవ్యక్త మహదహంకారములకు, అందలి జీవునకు నివాసము కావున చక్షుశ్శబ్దముచేత ఆజ్ఞా చక్రమును గూడ చెప్పుకొనుట యోగపక్షమున తగియుండును. సహస్రారస్థ పరమాత్మ నుండియే ఆజ్ఞాది షట్చక్రములు కలిగినవి గదా! కనుక ప్రాణాదింద్రియములకే కాక 'ఆజ్ఞ' నుండి గల చక్రములకు గూడ "విశ్వకర్మ"యే అధిపతి అగుచున్నాడు. కావున ఆతడు "చక్షుషః పిత" అగుచున్నాడు. ఆ పదమును విభక్తి లోపము చేసి "చక్షుష్పిత" అనవచ్చును. లేక 'చక్షుః పిత' అనీ అనవచ్చును.

14) ధీరః : "ధియం = బుద్ధిం, రాతీతి ధీరః" ఎవడు తన బుద్ధిని స్వాధీనపరచుకొని, పరిజ్ఞానము గలదానిని, శక్తిమంతము, ఏకాగ్రము చేయగలడో వాడు ధీరుడని చెప్పబడుచున్నాడు. ధైర్యశాలి అనునది దానికి సామాన్యార్థము. భగవంతుడు బుద్ధినే కాక సర్వమును శాసించి వశము చేసికొను సమర్థుడు కనుక ఆయనను ధీరుడని వేదము వ్యవహరించినది. ఆయనకు మించిన ధీరుడెవడును లేడు. ఈ పదము ఈశ్వర సాక్షాత్కారమును పొందు వారికి కూడ ఉపనిషత్తులు వాడినవి.

"కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్
ఆవృత్త చక్షు రమృతత్త్వ మిచ్ఛన్."

ఒకానొక ధీరుడు మాత్రమే మోక్షము పడయగోరి ఇంద్రియ విషయములకు దూరుడై పరమాత్మ సాక్షా

త్కారమును పొందుచున్నాడని భావము.

16) విశ్వతః చక్షువు : అంతటా కన్నులు కలవాడు ఎవడో వాడే విశ్వతశ్చక్షువు కాగలడు. పరమేశ్వరునికి అంతటా కన్నులున్నవి. అనగా అందరి కన్నులూ తనవే అని అందరి స్వరూపము తానే అని భావమును గ్రహింపవలయును. అప్పుడుకాని సర్వాత్మ భావము ప్రకటము కాదు. "విశ్వకర్మ సూక్తము" వాడిన "విశ్వతశ్చక్షువు" అనెడి పదమే తరువాత పురుష సూక్తములో "సహస్రాక్షః" అని వాడబడినది. అట్లే "సహస్ర శీర్ష", "సహస్రపాత్ " అను పదములు కూడ పురుష సూక్తములో కలవు. మంత్రపుష్పమేమో "సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం" అన్నది. ఇందలి సహస్ర శబ్దమునకు 'వేయి' అని మాత్రమే అర్థము కాదు. అనేకము, అపరిమితము, అసంఖ్యము, అనంతము అయిన కన్నులు కలవాడని భావము. తనను చెందుటకు అనేక మోక్షమార్గములు కలవాడని కూడ విశాలార్థమును చెప్పికొనవచ్చును.

భగవద్గీత భగవంతుని విశ్వరూపమును వర్ణించుచు ఇట్లన్నది. "అనేక వక్త్ర నయన మనేకాద్భుత దర్శనమ్" (11-10) అనేకములైన మొగములు కలవాడని వర్ణించినది. అట్లే 11వ శ్లోకమున "అనంతం విశ్వతోముఖమ్" అన్నది. ఈ 'విశ్వతోముఖ' శబ్దము "విశ్వకర్మ సూక్తము" లోని "విశ్వతోముఖః" అను మాటకు ప్రతిబింబమే.

16) విశ్వతోముఖుడు : అంతటా ముఖములు గల

వాడని అర్థము. అనగా అందరి ముఖములు తనవే అని పై విధముగానే దీని భావమును గ్రహింపవలయును.

17) విశ్వతోహస్తుడు : పరమేశ్వరుడు అంతటా చేతులు కలవాడని భావము. అనగా ఎన్నో చేతులు గలవాని వలె ఆతడు సృష్ట్యాది కార్యములను నెరవేర్చునని ఎన్న వలెను. ఈ భావమే తక్కిన పదములకును చెప్పికొనవచ్చును. ఈ విషయమును భగవద్గీత "అనేక బాహూదర వక్త్ర నేత్రం, పశ్యామిత్వా సర్వతోఽనంతరూపమ్, నాంతం న మధ్యం న పున స్తవాదిమ్, పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప" (11-16). అన్నది.

ఓ స్వామీ, నిన్ను ఎన్నో బాహువులు, ఉదరములు, ముఖములు, కన్నులు గలవానినిగా చూచుచున్నాను. నీకు ఆది, మధ్యము, అంతము అనునవి లేవు. ఇంత ఏల. ఈ విశ్వమే నీ స్వరూపము. దానికి ఈశ్వరుడవు (ప్రభుడవు) నీవే అని యున్నది. ఈ శ్లోకములోని 'విశ్వరూప' అను పదమును "విశ్వకర్మన్" అని చదువుకొన్నను ఛందోభంగము కాదు.

18) విశ్వతఃపాదుడు : అంతటను పాదములు కల వాడని భావము. దీనికికూడ పైవానివలె ఆ "దేవదేవుడు" అనేక పాదములున్నవానివలె అన్నిచోట్లకు నడచి ఆ యా కార్యములను నెరవేర్చునని భావము. వీటి నన్నింటికినీ భగ వంతుని అందరి పాదములు, చేతులు, తలలు, ఇంద్రియ ములు తనవే అయిన ఒకే వ్యక్తిగా ఆరాధించవలసినదని తత్త్వార్థము. అందుకే అనేకులు, తత్త్వజ్ఞులు, విశ్వమును

"విశ్వకర్మ" భగవానుని స్వరూపముగానే భావించి, కొలిచి, ఆరాధింతురు. ఈ విషయమునే 'బ్రహ్మసత్యమ్ జగద్బ్రహ్మ' అనెడి వాక్యము జగత్తును బ్రహ్మస్వరూపముగానే భావించి దానిని సేవించి తరించుమని చెప్పుచున్నది. ఈ విధముగా విశ్వకర్మ సూక్త, పురుషసూక్త, మంత్రపుష్ప వర్ణనలు ఒకే లక్ష్యమును నిర్దేశించుట గమనింపవలసియున్నది. ఈరీతిగానే సర్వ దేవతల సూక్తములకు, మంత్రములకు మరియు ఆ దేవతలకు ఐక్యమును, అద్వైత భావమును భావించి సాధకులు ముక్తి పడయవలయునేగాని భిన్నదృష్టులై ప్రవర్తించరాదు. ఈ భావమును భాగవతము "సర్వము న్నతని దివ్యకళామయమంచు, విష్ణునందుల్లము చేర్పు" డని ప్రబోధించినది.

వస్తుతః భగవంతుని- అవయవములు, ఇంద్రియములు లేనివాడని వేదోపనిషత్తులు వర్ణించినవి. ఇందుకు "అపాణి పాదః జవనో గ్రహీతా", "అప్రాణోహ్యమనాః శుభ్రః, అక్షరాత్ పరతః పరః" ఇత్యాది మంత్రములు దృష్టాంతములు. అయినను ఎన్నో కన్నులు, శిరములు, చేతులు, కాళ్ళు కలవాడని వర్ణించుట కంటికగపడు ఈ బ్రహ్మాండమును (విశ్వమును) దృష్టిలో నుంచుకొనియే అని సాధకులు గ్రహింపవలసియున్నది. విశ్వమును చూచియేకదా, విశ్వములోని మానవుడు దానియొక్క తత్త్వమును, బాహ్యాంతర స్వరూపములను తెలుసుకొనవలసియున్నాడు. అంతియేకాక మంత్రపుష్పము "విశ్వం నారాయణం హరిమ్" అనియు,

"విశ్వమే వేదం పురుషః" అనియు అనుటచేత విశ్వమే భగవంతుని స్వరూపము కాన, ఈ వర్ణనము అనుచితముకాక, సాధకులను మోక్షమార్గమునకు చేర్చునట్టి సాధనమే అని ఎన్నవలసియున్నది. అనగా ఒకటి సగుణ స్వరూప వర్ణనము కాగా, ఇంకొకటి నిర్గుణ స్వరూప భావన అని సారాంశము.

నిరాకార, నిర్గుణోపాసనము కష్టము గావున, శాస్త్రములు సామాన్యాధికారుల కోసమై సగుణోపాసనను విధించినవి. ఈ విషయము కులార్ణవ తంత్రములోని దిగువ శ్లోకములను బట్టి స్పష్టమగుచున్నది-

"చిన్మయస్యా ద్వితీయస్య, నిష్కలస్యా శరీరిణః,
ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా".

తా॥ వస్తుతః జగత్కారణ బ్రహ్మము చిన్మయము= జ్ఞాన స్వరూపము, తనవంటిది ఇంకొకటి లేనట్టిది (అద్వితీయము), అవయవములు గాని, ఇంద్రియములు గాని, శరీరముకాని లేనట్టిది. అట్టిదానికి ఉపాసకుల ప్రయోజనము కోసమై రూపకల్పన చేయబడినది. కనుక నిర్గుణ బ్రహ్మమునకు రూపము కల్పనయేకాని, సత్యము కాదన్న మాట. ఈ విషయమునే ఇంకొక శ్లోకము "సాధకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా" సాధనచేయువారి మేలు కోసమై బ్రహ్మమునకు రూపకల్పన చేయవలసి వచ్చినది. విగ్రహారాధన అంతయు అట్టి రూపకల్పనమే. దేవతలకు అనేక శిరోహస్తాదులను కల్పించుట కూడ ఏదో ఒక ప్రయోజనమునుద్దేశించియే. విశ్వకర్మకు, శివునికి, గాయత్రికి అయిదేసి

మొగములు కల్పించుట సృష్టి హేతువులైన పంచభూతములను, పంచమూర్తులను, పంచేంద్రియములను, పంచావస్థలను, పంచ ఋషులను- మొదలగువాటిని గ్రహించుటకేకాన, అవి సంకేతమాత్రములే అన్నమాట. ఆ తత్త్వజ్ఞానమును కలిగించిన పిమ్మట ఇక మిగులునది నిరాకార, నిర్గుణమైన అఖండ బ్రహ్మమే! ఈ రహస్యమును ప్రతి సాధకుడును మెలకువతో నెఱుంగవలయును. నానా దేవతల రూప, నామ, క్రియలయొక్క అంతరార్థములను ఇదేవిధముగా ఎఱుంగవలసియున్నది.

19) <u>దేవుడు</u> : ఈ మాట "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవః" అన్న వాక్యము లోనిది. అనగా "విశ్వకర్మ" బ్రహ్మ దేవుడైనాడని భావము. కాగా ఈ 'దేవ' శబ్దము బ్రహ్మ దేవునికి (త్వష్టకు) విశేషణముగా వాడబడినది. ఆ పదము 'దివ్' అను ధాతువునుండి పుట్టినది. "దివిభవమ్ దివ్యం" అని కూడ దాని తాత్పర్యము. అనగా భూ సంబంధములేని దేవలోకమున ఉండువారిని, 'దేవతలు', 'దేవులు' అనుచుందురు. భూలోక లక్షణములు కాక, 'ద్యు' (దేవ) లోక లక్షణములు కలవారని దీని భావము. కనుకనే దేవతలు నిద్రా జరాదులు లేని 'అస్వప్నలు', 'అమృతులు' అనికూడ చెప్పబడినారు. ఇక సచ్చిదానంద స్వరూపుడగు "విశ్వకర్మ" ఈ దివ్యలక్షణములకు కూడ అతీతుడని ఎఱుగవలసియున్నది. ఏల యన ఆయన దివము (స్వర్గము)ను, అందలి దేవతలను, భూమిని, భూలోకవాసులను సృష్టించిన మహాశక్తి అని

"ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః" అని "విశ్వకర్మ సూక్త" మంత్రము చెప్పినది కదా! ఈ మంత్రమున "విశ్వకర్మ' కు విశేషణముగా 'దేవ' శబ్దముకూడ వాడబడినది. ఆ 'దేవ' శబ్దమునకు దివ్య లక్షణములేకాక సచ్చిదానందాది లక్షణములు కూడ కలవాడని ఎఱుంగవలసియున్నది. కనుకనే "నతం విదాథ" ఆతని నెఱుంగలేకున్నారు అని, ఇంకొక "విశ్వకర్మ సూక్త" మంత్ర వాక్యము అనుచున్నది. కనుక 'దేవ' శబ్దమునకు 'దివ్యుడని' యేకాక, ఆ దివ్యులను కూడ సృష్టించిన "దేవదేవుడని" అర్థము చెప్పికొనవలయును. అప్పుడే ఆయన (విశ్వకర్మ భగవానుడు) దేవతలకు కూడ తండ్రియైన మహాదేవుడు, జగత్ పితృదేవుడు కాగలడు. ఆయనను పిత అన్నప్పుడు సామాన్య పిత అనికాక 'జగత్పిత' అని భావించినట్లే ఇచ్చటను 'దేవ' శబ్దమునకు సర్వకారణమైన "మహాదేవుడు", "దేవదేవుడు" అని భావించుట మిక్కిలి సమంజసము.

20) <u>విశ్వచక్షుః</u> : "విశ్వచక్షుః" అనగా సర్వమును చూచువాడు, ఎఱుంగువాడు అని అర్థము. అనగా సర్వద్రష్ట, సర్వజ్ఞుడు అని సారాంశము. ఇది 11వ మంత్రములోని మాట. అందలి భావము ఇట్లున్నది. "ఆ విశ్వకర్మ ఈ భూ-దివములను సృష్టించి ఆవరించుటకు అధిష్ఠానము (ఆధారము) ఏది? పదార్థమేది? వీటిని ఎట్లు చేసినాడు ?" అని ప్రశ్నింపబడగా, దానికి "మహినా విశ్వచక్షుః" సర్వజ్ఞుడైన

ఆ "విశ్వకర్మ" తన మహిమచే తానే ఉపాదాన, నిమిత్త కారణుడై భూ-దివములను సృష్టించి అంతటా తానే వ్యాపించినాడని పూర్తి మంత్రము యొక్క భావమై యున్నది. కనుక "విశ్వచక్షుః" అనగా విశ్వజ్ఞానము గల మహాశక్తి యని ఎఱుంగవలసియున్నది. ఇట్టి భావమునే 12వ మంత్రము కూడ చెప్పుటను గమనింతుము.

21) <u>వాచస్పతి</u> : ఈ పదము "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అనెడి 14వ మంత్రము లోనిది. వేద రూపమైన వాక్కునకు, అనగా వేదవాణికి పాలకుడు లేక సృష్టికర్త అని భావము. అట్టి వాచస్పతి అయిన అనగా వేదములను సృష్టించి రక్షించువాడైన "విశ్వకర్మ"ను మా రక్షణార్థమై పిలుచుచున్నామని మంత్రముయొక్క మొదటి, రెండు పాదముల తాత్పర్యము. ఇదే భావము "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం, యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" అను మంత్రము కూడ బ్రహ్మను సృష్టించి ఆయనకు వేదముల నొసంగినది "విశ్వకర్మ"యే అని 2వ ప్రకరణములో విస్తరముగా చదివియే యున్నాము.

22) <u>విశ్వ శంభువు</u> : 'శంభు' శబ్దమునకు సుఖస్వరూపుడై సుఖమును కలిగించువాడని భావము. విశ్వశంభువనగా ఐహిక, ఆముష్మిక, పారమార్థికములైన సమస్త సుఖములను (ఆనందములను) కలిగించువాడన్నమాట. కనుక "విశ్వకర్మ" కేవలము 'శంభుడే' కాక 'విశ్వశంభువు' అగుచున్నాడని

ఈ మాట యొక్క తాత్పర్యము. ఇదే మాటను మంత్ర పుష్పము "విశ్వాక్షుం విశ్వ శంభువమ్" అని ప్రయోగించి నది. కనుక మంత్రపుష్పము, విశ్వకర్మ సూక్తము, ఉద్దే శించిన జగత్కారణ తత్త్వము ఒక్కటే అని సాధకులు గ్రహింపవచ్చును.

23) సాధుకర్మ : 'సాధు' శబ్దమునకు యోగ్యము, మంచిది అని అర్థము. యోగ్యములైన అనగా జీవులకు ఉపయోగించు ఉత్తమములైన సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్ర హాది కర్మలను విస్తరించువాడనీ, వాటిని సమకూర్చువాడని భావము. తన భక్తులు చేసెడు మంచి పనులకు తగిన ఫలము లను ఇచ్చువాడని సారాంశము. ఇట్లనుటచేత దుష్కర్మలను చేయువారికి దుష్టఫలములు కూడ ఆయనయే కలుగజేయునని తెలిసికొనుట సులభమే. ఈ పదము మనుష్యులను ముఖ్య ముగా భగవద్భక్తులను మంచికర్మలు చేయువారై ఆ "విశ్వ కర్మ" వలె తాముకూడ "సాధుకర్ములు" కావలయునని హెచ్చరించుచున్నది. అట్లే 'విశ్వశంభు', 'విశ్వచక్షు' అనెడి మాటలు సైతము జనులు విశ్వమునకు సుఖము కూర్చువారు, సర్వ వస్తువుల జ్ఞానము కలవారు కావలయునని హెచ్చరించు చున్నవి. ఇంత ఏల? ఈ సూక్తము నందలి "విశ్వకర్మ" యొక్క పర్యాయ పదము లన్నియు, ఆ యా లక్షణములను భక్తులు పొందవలయునని ప్రోత్సహించుచున్నట్లు గుర్తింప వలయును. అప్పుడే మానవుడు "విశ్వకర్మ" స్వరూపుడై 'అహం బ్రహ్మాస్మి' నేను బ్రహ్మమునైతిని అనెడి అమృత

స్థితికి (మోక్షమునకు) చేరినవాడు కాగలడు. లోకసృష్ట్యాది కర్మలు మాత్రము మానవులకు అసాధ్యములు కావున అట్టి వాటి నెవరును అపేక్షింపకూడదు.

24) <u>సముద్రాయ</u> : "సముద్రాయ వయునాయ సింధూనామ్ పతయేనమః నదీనాం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వకర్మణే విశ్వాహా మర్త్యం హవిః" అను మంత్రములో మొదటిది 'సముద్ర' శబ్దము. దీనికి సాయణులు సముద్ర స్వరూపుడని అర్థము వ్రాసినారు. సముద్రము జలమయము కదా. పంచ భూతములలో జలములు, చరాచరములు పుట్టుటకును, నిలుచుటకును ఆధారమైనవి. కనుకనే 'నీరే ప్రాణాధారము' అన్నాడొక కవి. ఈ జల ప్రాధాన్యమును గూర్చి మా దర్శనములు తెస్సగా వివరించియే యున్నవి. ఋగ్వేద దిగ్దర్శన ద్వితీయ భాగమున విస్తరమును కాంచవచ్చును. ఈ నీటిని గూర్చి త్వష్ట పుత్రుడగు విశ్వరూపాచార్యుడు ఎన్నో పరిశోధనలు చేసి ఎన్నో మంత్రములను వ్రాసి "అపోవా ఇదమ్ సర్వమ్, విశ్వభూతాన్యాపః, ప్రాణావా..." ఇత్యాదిగా సర్వము జలమే అనియు అది ప్రాణము కూడ అనియు, ఎంతో వ్రాసినాడు. అంతేకాక "విశ్వకర్మ" జగద్బీజమును జలముల యందే ఉంచినాడని "అపాం గర్భం వ్యదధాత్పురుత్రా" అనెడి మంత్రము చెప్పుచున్నది. ఈ విషయమును కూడ మనము పూర్వము చదివియే యున్నాము. అట్టి జలములను తనయందు అపారముగా ఇముడ్చుకొన్న సముద్రమని "విశ్వకర్మ" స్వరూపమే అని

చెప్పుట వేదమునకు ఇష్టమని "విశ్వకర్మ సూక్తము" వక్కాణించుచున్నది. తరువాత వివరింపబోయెడి పదములు కూడ ఈ అర్థమునే చెప్పుచున్నవి. దీని తరువాత "వయునాయ" అనెడి పదము కలదు. దీనికి "కాంతాయ" అని సాయణులర్థము వ్రాసినారు. అనగా చిత్స్వరూపుడు, జ్ఞానాకారుడు అన్నమాట.

25) <u>సింధుపతి</u> : పడమరగా ప్రవహించునట్టి నదములకు 'సింధువులని' పేరు. అనగా పడమటి సముద్రములో కలియునట్టివన్నమాట. అట్టి సింధువులకు సృష్టికర్త, అధిపతి, అయినవాడే "సింధూ నాంపతిః సింధుపతిః" అన్నమాట. 'సముద్ర' శబ్దము అఖండ జలరాశిని చెప్పుచుండగా, ఈ 'సింధు', 'నదీ' శబ్దములు ఖండములైన జలములను గూర్చి వచించుచున్నవి.

26) <u>నదీపిత</u> : నదు లనునవి తూర్పు సముద్రములో కలియునట్టివి. ఇవి గంగ, యమున, గోదావరి, కృష్ణ, నర్మద, కావేరి ప్రభృతులు. ఇట్టి నదులను సృష్టించినట్టి తండ్రి నదీపిత "విశ్వకర్మ" యని ఈ పదమునకు తాత్పర్యము. సముద్రములోని ఉదకములే సూర్యకిరణముల ద్వారా పీల్చబడి మేఘములై వర్షించుట, ఆ వర్షములు నదీ నదరూపములై సముద్రము నందు కలియుట మనమెఱింగిన విషయమే. కనుక సూర్యుడు నదులకు సృష్టికర్త అనుకొనవచ్చును. జలరాశి అయిన సముద్రమునకు సృష్టికర్త "విశ్వకర్మ" కాగా నదీనదములకు సృష్టికర్త "సూర్యుడగు"

చున్నాడు. ఈ సూర్యుడు (సవిత) "విశ్వకర్మ" స్వరూపుడే అని మన గ్రంథములు పేర్కొనుచున్నవి. సాయణులును "ఆదిత్యాత్మకాయ విశ్వకర్మణే" అని తన భాష్యమునందు వ్రాయుచుండును. విశ్వకర్మ నుండి సముద్రము పుట్టినదను టకు "అతస్సముద్రా, గిరయశ్చ సర్వే, అస్మాత్ స్యందంతే సింధవ స్సర్వరూపాః." ఆ పరమాత్మ నుండి పూర్వ పశ్చిమ, దక్షిణ సముద్రములు, మేరు, హిమవదాది సమస్త పర్వత ములు పుట్టినవని చెప్పెడి ఉపనిషద్వాక్యములుకూడ ప్రమా ణములే. కనుక "విశ్వకర్మ మయం జగత్" అనెడి మాట ముమ్మాటికినీ సత్యము.

పురాణములలో నారాయణ శబ్దమునకు వ్యుత్పత్తి ఇట్లు చెప్పబడినది :-

"ఆపో నారా ఇతి ప్రోక్తా, ఆపో వై నర సూనవః,
తా యదస్యాయనం ప్రోక్తా స్తేన నారాయణః స్మృతః."

ఉదకములకు 'నారములని' పేరు. అవియే ప్రాణుల ఉత్పత్తికి మూలములు. అట్టి నారములు- జలములు, అయ నం=నివాసముగా ఎవనికుండునో వాడు నారాయణుడన్న మాట. కనుక "విష్ణువు" జలములు నివాసముగా గలవాడయి నందున "నారాయణు" డైనాడని సారాంశము. ఈ భావము "సముద్రాయ వయునాయ" అనెడి మంత్రములోనిదే. దాని ననుసరించి పుట్టినదే అన్నమాట. "అపో వై నర సూనవః" అన్నమాట జలములు ప్రాణుల ఉత్పత్తికి మూలములని చెప్పుచున్నది గదా! ఈ భావము "అపాం గర్భం వ్యదధా

త్పురుత్రా" అనెడి వాక్యము నుండి గ్రహింపబడినదే. "విశ్వకర్మ సూక్త" మంత్రము జల స్వరూపుడు "విశ్వకర్మ" అనియు, ఆ జలములే సృష్టికి ఉపాదాన కారణమనియు చెప్పగా, అదే భావమును "అపో నారా ఇతి ప్రోక్తాః" అనెడి శ్లోకము స్వీకరించి, దానిని నారాయణునకు అన్వయింపజేసినది. ఈ భావము "విశ్వకర్మ తత్త్వము" నకు విరోధమేమియు కాదు. పంచమూర్తులకును పంచ భూతముల తోడ సంబంధము ఇట్లు పేర్కొనబడినది :

పృథివికి బ్రహ్మ (త్వష్ట), జలములకు విష్ణువు (మయుడు), అగ్నికి రుద్రుడు (మనుబ్రహ్మ), వాయువునకు ఇంద్రుడు (శిల్పి బ్రహ్మ), ఆకాశమునకు సూర్యుడు (విశ్వజ్ఞ బ్రహ్మ) అధిపతులు. ఈ భూతములు, ఈ బ్రహ్మాదులే వరుసగా ఆధార, స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ చక్రములందు కలరని తత్త్వశాస్త్ర మనుచున్నది. కనుక దీనినిబట్టి విష్ణువునకు- విశ్వకర్మకు గల ఐక్యము తేటతెల్లమగుచున్నదిగదా. అనేక విషయములందు విష్ణు- విశ్వకర్మల ఐక్యమును మా దర్శనములు చెప్పుచునేయున్నవి. విశ్వకర్మ సూక్తము జలాధిపతి "విశ్వకర్మ" అని చెప్పగా తరువాతి వేదాది వాఙ్మయము జలములకు అధిపతి వరుణుడని చెప్పినది.

<u>వివరణ</u> : యజుర్వేదీయ విశ్వకర్మ సూక్తములోని 16 మంత్రములలోను 23 పర్యాయ పదములలో "విశ్వకర్మ భగవానుడు" పేర్కొనబడినాడు. 17వ మంత్రమైన "సము

ద్రాయ వయునాయ" అనుదానిలో 'సముద్రాయ' అను మాట మొట్టమొదటిది. దానికి పిమ్మట 'వయునాయ' అను పదము ఉన్నను అది జ్ఞానవాచక మగుటచే 'సందృక్', 'విశ్వ చక్షుః' అనెడి పదముల వంటిదే. ఇక 'సింధుపతి', 'నదీపిత' అను పదములకు ప్రత్యేకత చూపనక్కరలేదు. ఆ నదీ నదములు సముద్రము నుండి పుట్టి అందే అస్తమించునవి కావున ప్రత్యేకముగ పరిగణింపక సముద్ర శబ్దములో అంతర్భవింప చేసికొనుట న్యాయముగా నుండును. సముద్రము గాని, నదులు గాని, నదములు గాని, జలస్వరూపములే గదా! కావున ఆ 17వ మంత్రము నుండి 'సముద్రాయ' అను పదము వరకు గ్రహించినచో, మొత్తము 24 పదములు కాగలవు. అంతేకాక ఈ సముద్రాయ అను మంత్రముతో జలముల యందు ఆహుతులను అర్పింపవలసియున్నది. కనుక జలరాశిని (సముద్రమును) గ్రహించిన చాలును. ఈ 24 పదములు 24 అక్షరములు గల గాయత్రీ మంత్రములోని అక్షరములకు సంకేతములని భావింపవలయును. అనగా "విశ్వకర్మ సూక్తము" 24 పర్యాయ పదములతో, 24 అక్షరములు గల గాయత్రీ మంత్రమును చెప్పుచున్నదని భావము. గాయత్రీ మంత్రాధి దేవత అయిన "సవిత"యు, విశ్వకర్మ సూక్త అధిదేవత అయిన "విశ్వకర్మ"యు ఒక్కరే కావున రెంటికీ ఇట్టి సాదృశ్యము భావింపతగినదై యున్నది. శరీరము చతుర్వింశతి (24) తత్త్వములతో కూడినదని తత్త్వశాస్త్రము కదా! కనుక ఈ 24 పదములు వాటికిగూడ

సూచకములే! కనుక సూక్ష్మదృష్టితో ఆలోచించినకొలదిని ఇట్టి రహస్యము లనేకములు, "విశ్వకర్మ సూక్తమున" కనుపట్టుచున్నవి. కనుక "విశ్వకర్మ సూక్త" పఠనము, అర్థ భావన అనునవి మహా ప్రయోజనకారులని తేలుచున్నది. "విశ్వకర్మ" మంత్ర జపముకూడ అట్టిదే. కనుకనే యజుర్వేదము "ఓం నమో విశ్వకర్మణే, స ఉపాత్వస్మాన్" అని విశ్వకర్మాష్టాక్షరీ మంత్రమును ఉపదేశించినది. మనము సంధ్యావందనములో ప్రారంభమున పఠించు శ్లోకము "విశ్వకర్మ" స్మరణమే మహోపకారి అని చెప్పుచున్నది కదా! దానినొక్కసారి చూతము :-

"అపవిత్రః పవిత్రోవా, సర్వావస్థాం గతోఽపివా,
యః స్మరేద్విశ్వకర్మాణం, స బాహ్యాంభ్యంతర శ్శుచిః".

తా॥ పవిత్రుడైనను, అపవిత్రుడైనను అనగా పాపియైనను, పుణ్యాత్ముడయినను ఇంకా ఎట్టి అవస్థ (దశ)లో నున్నవాడైనను, ఎవడు "శ్రీ విశ్వకర్మ భగవానుని" స్మరించునో, అట్టివాడు బాహ్యాభ్యంతరముల యందు (లోపల వెలుపల కూడ) పరిశుద్ధుడై యొప్పును. ఇట్టి మహా మహిమ జగత్కారణుడైన "విశ్వకర్మ భగవానుని" స్మరణ, ధ్యాన, పూజనార్చనాదులలో ఉన్నదన్నమాట. వేదవేత్తలో సర్వ దైవశక్తులు ఉన్నట్లు, విశ్వకర్మారాధకునిలో ఆ "విశ్వకర్మ భగవానుడు" ఎల్లప్పుడు సన్నిహితుడై యుండి అతనిని కాపాడుచుండుననుటలో ఎట్టి సందేహమును లేదు. ఇందుకు సందేహించువానికి "సంశయాత్మా వినశ్యతి" అని గీత చెప్పిన గతియే పట్టును.

"యః స్మరే ద్విశ్వకర్మాణం" అను మాటను విష్ణువు నందభిమానము గలవారు "యః స్మరేత్ పుండరీకాక్షం" అని చదువుచుందురు. అట్లే శైవమతము వారు "యః స్మరేత్ శంకరం దేవం" అని శివ పర్యాయ పదమును జోడించుచుందురు. ఇది వారి వారి అభిమానముల కొలది జరుగుచున్నట్టి మార్పు. ఈ నామముల యందు అభిమానము, అనాదరము కలవారు "యః స్మరేత్ లోక కర్తారమ్" అని పఠించినచో ఆ విశేషణము అందరు దేవతలకును చెల్లును. నామ, రూప భేదమును పాటించుట సామాన్యుల స్వభావము. అందుకే మనవారు సహస్రనామ స్తోత్రములలో ఎల్ల దేవతల పదములను చేర్చుచుందురు.

ఇంకొక ముఖ్య విషయము : సంధ్యా వందనమున మొదటగా చెప్పుకొనెడి 24 నామములకు "కేశవ నామము" లని వాడుచున్నారు. శైవులేమో "శివ నామము" లందురు. ఇవి శైవ, వైష్ణవ మత భేదములను బట్టి ఏర్పడిన భేదములు. న్యాయముగా ఆ 24 నామములు సృష్టిలోని చతుర్వింశతి (24) తత్త్వములకు సంకేతములు. ఈ చతుర్వింశతి తత్త్వములతోనే సృష్టి ఏర్పడినది. ఆ తత్త్వములు ఇవి. పంచ మహాభూతములు, అవ్యక్త మహదహంకారములు, షోడశ వికారములు మొత్తము 24 అగుచున్నవి గదా! షోడశ వికారము లనగా జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచ

కము, ప్రాణపంచకము, అంతఃకరణము అనునవి. వీటిని కొందఱు వేరువిధముగా కూడ చెప్పుకొనుచుందురు. ఎట్లు చెప్పుకొన్నను ముఖ్యార్థము ఒక్కటే. కనుక ఈ చతుర్వింశతి తత్త్వములను సూచించుటకే ప్రతి వైదిక కర్మయందును ప్రారంభమున 24 భగవన్నామములను పఠించుచున్నారు. కాబట్టి కేశవ, శివాది పదములతో ఈ నామములను పేర్కొనుటకంటే "చతుర్వింశతి" నామములని వీటిని పేర్కొనుట శైవ, వైష్ణవాది మతముల వారికందరికి యుక్తముగా నుండును. 'చతుర్వింశతి' శబ్దమును గూర్చి ఎవరికినీ విరోధము లేదుగదా. గాయత్రీ మంత్రముకూడ 24 అక్షరములతో ఉండుట సృష్టి హేతువులైన 'చతుర్వింశతి' తత్త్వములను సూచించుటకే. ఈ తత్త్వములకు తగినట్లుగానే "విశ్వకర్మ సూక్తము" లోని 17 మంత్రములలో 24 పర్యాయ నామములుండుట ఎంత విచిత్రమో ఆలోచింపుడు. "విశ్వకర్మ సూక్త" ద్రష్ట అయిన 'భౌవన విశ్వకర్మ మహర్షి' ఇంతటి తత్త్వ దృష్టితో ఆ సూక్తమును వ్రాసి లోకమునకు మహోపకారము చేసియున్నాడు.

<u>ఇంకొక రహస్యము</u> : "విశ్వకర్మ సూక్తము" లోని 'సింధుపతి', 'నదీపిత' అను రెండు పదములను వదలి తక్కిన ఇరువది నాల్గింటినీ (24) స్వీకరించి మనము చతుర్వింశతి తత్త్వములకు అవి సంకేతములని చెప్పికొన్నాము. ఆ సింధుపతి,నదీపిత అనెడి రెంటినిగూడ కలుపుకొన్నచో ఇరువదిఆరు (26) అగుచున్నవి కదా. ఆ పక్షమునకూడ మనకు తత్త్వా

ర్థము కుదురకపోదు. చతుర్వింశతి తత్త్వములు ప్రకృతి నుండి కలిగినట్టివి. ఇవి ప్రాకృతము లన్నమాట. ఇవి జడములు. వీటిని ప్రకాశింపచేయు సచ్చిదానంద స్వరూప తత్త్వమే "విశ్వకర్మ". ఆతడే (విశ్వకర్మయే) అంతఃకరణోపాధి యందు జీవుడైనాడు కావున ఆ జీవేశ్వరుల నిరువురను కలుపుకున్నచో మొత్తము షడ్వింశతి- ఇరువది ఆరు (26) తత్త్వములు కాగలవు. ఇట్టి దృష్టితో చూచినప్పుడు 26 పర్యాయ పదములును సార్థకములు కాగలవు. జలరూపములే అయిన నదీనదములు రెండును సముద్రమేయై మూటికినీ ఐక్యము, అద్వైతము సిద్ధించినట్లు జీవేశ్వరుల కిరువురికినీ ఐక్యము సిద్ధింపగలదు. అజ్ఞానుల దృష్టిలో తత్త్వములు 26 కాని, జ్ఞానుల దృష్టిలో అవి మొత్తము 25. ప్రకృతి నుండి కలిగినవి 24. మరియు పరమేశ్వరుడు ఒక్కనిని (పరమాత్మ) కలుపుకొనగా మొత్తము "పంచవింశతి" (25) తత్త్వములు కాగలవు. వీటినే శ్రీ వీరబ్రహ్మ దేశికేంద్రుడు "పంచ వింశతి తత్త్వ భావమ్ము తానయ్యె" అని ఒక తత్త్వములో ప్రవచించినాడు. కనుక "విశ్వకర్మ సూక్తము" లందలి ఈ పరమార్థమును తాత్త్వికులు మఱువరాదు.

యజుర్వేదము ననుసరించి చూచినచో "విశ్వకర్మ"కు "ప్రజాపతి" అనెడి నామముకూడ కలదని స్పష్టమగుచున్నది.

"ప్రజాపతి ర్విశ్వకర్మా, మనోగంధర్వ,
స్తస్య ఋక్సామాన్యప్స రసోవహ్నాయః."

"విశ్వకర్మ" ప్రజాపతి. అంతేకాదు ఆతడు మన

స్సనెడి 'గంధర్వుడు' కూడ. ఆ గంధర్వునికి ఋక్కులు, సామములే భార్యలైన అప్సరసలు- అని మంత్రభావము. 'ప్రజాపతి' అనగా ప్రజాపాలకుడే గాక సృష్టికర్త కూడను. ఈ 'ప్రజాపతి' పదము లౌకిక సంస్కృతమున 'బ్రహ్మ'కు పర్యాయ పదముగా వాడబడినదని "స్రష్టా ప్రజాపతిర్వేధా, విధాతా, విశ్వసృడ్విధిః" అను అమరకోశము వలన తెలియు చున్నది. ఇందుకు మూలము కూడ "ప్రజాపతి ర్విశ్వకర్మా" అనెడి మంత్రమే. కనుక ప్రజాపతి అనగా ప్రజలను సృష్టించు 'ఆది దేవుడ'న్నమాట. అట్టివాడు "విశ్వకర్మయే" గదా! ఈ "విశ్వకర్మ" జీవుల యొక్క మనస్సనెడి 'గంధర్వుడు' కూడ అయినాడట. "విశ్వకర్మ" చేత సృష్టింపబడినదే కదా మన స్తత్వము. కాన "విశ్వకర్మ"ను 'మనోనామక గంధర్వు' డనుట తగియున్నది. గంధర్వులు భోగలాలసులు. మనస్సు కూడ అట్లే భోగములను ప్రేమించునట్టిదిగాన, దానిని గంధర్వునితో పోల్చుట యుక్తమే. అట్టి భోగలాలసుడైన మనోగంధర్వునకు భార్యలేమో ఋగాది వేదములట. వేదములుజీవులను కర్మలు చేయుడని ప్రేరేపించి సుఖముల నొసంగును గాన అవి భార్యలవంటివని వేద భావము.

"ప్రజాపతి", "విశ్వకర్మ" శబ్దములు పర్యాయ పదములనుటకు "ప్రజాపతి శ్చరతి గర్భే అన్తః" అనెడి "పురుష సూక్త" వాక్యము కూడ ప్రమాణమే. సర్వజీవుల లోపల ఉన్నది 'ప్రజాపతియే' అట. శ్వేతాశ్వతర మంత్ర మేమో హృదయ స్థితుడైన దేవుడు "విశ్వకర్మ" అని-

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః" అను మంత్రము ద్వారా చెప్పినది. రెండు మంత్రముల భావములను సమన్వయించినచో జీవుల హృదయ స్థితుడైనవాడు ఈశ్వరుడే కాన, ఆ ఈశ్వరునికి "ప్రజాపతి", "విశ్వకర్మ" అను పదములు వాడబడినవి. కనుక "ప్రజాపతి", శబ్దముకూడ "విశ్వకర్మ" నామమే అని పాఠకులు గ్రహింపవలయును. శ్వేతాశ్వతర మంత్రములో "విశ్వకర్మ"కు "మహాత్మా" అనెడు పదముకూడ విశేషణముగా వాడబడినది. మహాత్ =గొప్పదైన ఆత్మ = చైతన్యశక్తి, ఎవడో వాడు మహాత్ముడని వ్యుత్పత్త్యర్థము. కాగా 'మహాత్మ' శబ్దము, 'పరమాత్మ' పదము వంటిదన్నమాట. 'ఆత్మ' పదమునకు 'మనస్సు'నికూడ అర్థము ఉన్నందున గొప్ప మనస్సు కలవాడుకూడ మహాత్ముడు కావచ్చును. గొప్పవారైన వ్యక్తుల విషయమున ఈ విధముగా మహాత్మ పదమును వాడుదుము. అనగా మహానుభావుడని తాత్పర్యము. గొప్ప ఆత్మ కలవాడన్నప్పుడు ఉపాధిని పొందిన జీవాత్మ కాక, జీవ జగత్తులకు హేతువైన, నిరుపాధిక అఖండాత్మ అని భావము. అట్లయిననే ఆతడు (విశ్వకర్మ) ద్యావాపృథువులకును, సురాసురాదులకు పరుడైన పరమాత్మ కాగలడు. ఈ పరిశీలన వలన "విశ్వకర్మ"కు "ప్రజాపతి", "మహాత్మ" పదములు కూడ పర్యాయములే అని తేలినది. కనుకనే ఆ "విశ్వకర్మ స్వరూప ప్రజాపతి" పుట్టకుండగనే పుట్టినట్లు("అజాయమానో బహుధా విజాయతే") అగు (తోచు)

చున్నాడు. అందుకే జగత్కారణము నెఱుంగదలచిన ధీరులు (విజ్ఞానులు) ఆయనను (విశ్వకర్మ భగవానుని) ఎఱుంగ యత్నించుచున్నారు. ఎఱింగినవారేమో సంసార బంధము నుండి వేఱై అమృతులగుచున్నారని ("తమేవ విద్వానమృత త్వమేతి") పురుష సూక్త మనుచున్నది.

"పురుష సూక్తమును" బట్టి చూచినచో 'త్వష్ట' మరియు 'పురోహిత' పదములు "విశ్వకర్మ"కు పర్యాయ పదములే అని తెలియగలము. "యో దేవేభ్య ఆతపతి, యో దేవానాం పురోహితః, పూర్వో యో దేవేభ్యో జాతః" "దేవతలను శాసించి ఆ యా పనులు చేయించువాడును, వారికి పురోహితుడైనవాడును, వారికంటె ముందే అనాది సిద్ధుడై యున్నవాడును ఆ "విశ్వకర్మ పరమేశ్వరుడే" అని పై మంత్ర వాక్యముల భావము. 'పురోహితు'డనగా తమ యజమానులకు ముందుండి వారి మేల్కొళ్ళను తెలిపి, వారిచే సత్కార్యములు చేయించువాడని భావము. జీవులకు మేలు గూర్చు పురోహితుడు భగవంతుడు కాక ఇంకెవ్వరు! దీనిని బట్టి మనము భగవంతుని శాసనములను ఎట్లు పాలించవలయునో తెలియుచున్నది కదా! ఆయన శాసనము వేదమే కదా! మంత్రమున "దేవానాం పురోహితః" అని ఉన్నందున దేవతలకే పురోహితుడైనవాడు మానవులకేల కాడని తెలిసి ఆ "దేవదేవుని" (విశ్వకర్మ భగవానుని) పౌరోహిత్యమును జనులు పాటించి ధన్యులు కావలయును. అగ్నిని కూడ 'పురోహితు'డని ఋగ్వేద ప్రథమ మంత్రమనుట

గమనింపవలసియున్నది. "అగ్నిమీళే పురోహితం, యజ్ఞస్య దేవమృత్విజం, హోతారం రత్న ధాతమం." ఇందలి అగ్ని కేవల భౌతికాగ్నికాక, పరమాత్మ రూపాగ్ని అని మేము వ్రాసియున్నాము. 'హోత' అను మాటను "విశ్వకర్మ సూక్త" ప్రారంభమున "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషిర్హోతా" అని మనము చదివియే యున్నాము. "విశ్వకర్మ" పుత్రుడు త్వష్ట అనియును, 'త్వష్ట' కొడుకు 'అగ్ని' అనియును మన దర్శనములు చెప్పియేయున్నవి. ఇట్లు వైదిక దేవతల సంబంధ బాంధవ్యములు, వారియొక్క రూప నామములు వేద సిద్ధములే.

## విశ్వకర్మ క్రియలు

విశ్వసంబంధులైన సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములనెడి పంచకార్యములేకాక, ఇంకా క్రియా శబ్దముచే చెప్పతగిన ఏ ఏ పనులు కలవో అట్టివన్నియు ఈ విశ్వశబ్దము క్రిందికే రాగలవు. అట్టి పనులు ఎవనిచేత చేయబడునో (నిర్వహింపబడునో) ఆతడు, "విశ్వకర్మ" యని 'విశ్వకర్మ' శబ్దమునకు అవయవార్థము. దీనిని సాయణులు "విశ్వం కర్మ సృజ్యం యస్యసః విశ్వకర్మా" ఈ విశ్వము ఎవనికి సృజింపతగినదైనదో ఆతడు "విశ్వకర్మ" అనికూడ వ్రాయుచుందురు. విశ్వమునకు సంబంధించిన, సృష్ట్యాది కర్మలు ఎవనిచేత నిర్వహింపబడునో ఆతడు "విశ్వకర్మ"

అనికూడ వ్యుత్పత్త్యర్థమును చెప్పవచ్చును. అప్పుడు 'విశ్వ' శబ్దమునకు సర్వమను అర్థముగాక 'బ్రహ్మాండము' అను అర్థము చెప్పుకొన్నట్లగును. చలన మాత్రమును, లేదా రూపాంతరమును (మరియొక రూపమును) కర్మకు అర్థమని చెప్పుకొన్నచో సృష్టిలోని సర్వవికారములును, అణు, పరమాణ్వాదులను, 'కర్మ' శబ్దము క్రిందికే అర్థముగా రాగలవు. అప్పుడు సాకారములును, దానికి కారణమైన నిరాకారము కూడ "విశ్వకర్మ" శబ్దమునకు అర్థముగా భావింపబడును. ఆ స్థితిలో కర్మరూపము తాల్పనున్న కార్యమును కూడ, కార్య కారణములకు అభేదమును పాటించి 'కర్మ' శబ్దము చేతనే చెప్పికొన్నట్లు కాగలదు. కనుక జగత్కారణము, జగద్రూప కార్యము రెండును "విశ్వకర్మ" శబ్దముచేతనే చెప్పతగినవి అగుచున్నవని తెలియవలెను. కాగా "కారణరూప విశ్వకర్మ" నుండి కలిగిన కార్యరూప విశ్వమంతయు, "విశ్వకర్మ"యే కాగలదు. దీనికి దృష్టాంతముగా మట్టిని-కుండను, బంగారమును-భూషణాదులను మొదలగువానిని గ్రహింపవచ్చును. మనమింతకు పూర్వము అర్థము చెప్పుకొన్న 17 మంత్రములలోను "విశ్వకర్మ" నుండి జరిగిన అనేక క్రియలు వాకొనబడినవి. వానినికూడ "విశ్వకర్మ భగవానుని" క్రియలుగానే ఎన్ని ఈ ప్రకరణమున పరిశీలన జరుపుదము.

1) <u>జుహ్వాత్</u> : "విశ్వకర్మ సూక్తము"లో మొట్ట మొదటగా మనకు అగపడునట్టి క్రియ "జుహ్వాత్" అనునది. దానికి హోమము చేసినాడు అని అర్థము. అనగా "విశ్వకర్మ

భగవానుడు" ప్రళయకాలమున లోకముల నన్నింటినీ తనలో ఆహుతిగా వేసికొని (లీనము చేసికొని) హోమము చేసినాడని భావము. ఈ క్రియను బట్టి సృష్ట్యాది కార్యములు ఒక మహా యజ్ఞమనియు, ఆ కార్యములకు కర్త "విశ్వకర్మ" అనియు తెలియుచున్నది. అందుకే ఆయనను "హోతా" అని తరువాతి మంత్రము పేర్కొన్నది.

2) నిషసాద :- తరువాత మనకు అగపడు క్రియ "నిషసాద" అనునట్టిది. దీనికి 'ఉండెను' అని అర్థము. అనగా జగత్కర్తయైన భగవంతుడు సర్వకాల సర్వావస్థలయందు, భూత భవిష్యద్వర్తమానములయందు కారణరూపుడయియే కాక కార్యరూపుడై కూడ ఉన్నాడని దీని భావము. దీని వలన భగవద్రూపము "అస్తి" అనగా సత్తని తేలుచున్నది.

3) ఆవివేశ :- అనగా అంతటా గాని, జీవోపాధుల యందుగాని ప్రవేశించినాడని భావము. "విశ్వకర్మ" సంకల్పమాత్రము చేత జగత్తులను సృష్టించి, ఆ సృష్టించిన జగములయందు అంతర్యామిగాను, జీవుడుగాను, తానే ప్రవేశించినాడని ఇందలి పరమార్థము. ఈ భావమునే తరువాతివైన ఉపనిషత్తులు "తత్ సృష్ట్వా, తదే వానుప్రావిశత్" జగత్కారణ పదార్థము (బ్రహ్మము) జగత్తును జీవులను కూడ సృష్టించి, ఆ ఉపాధులయందు తానే ప్రవేశించెనని తెలియుచున్నది. దీనినే 'అనుప్రవేశ' రహస్యము అని

వేదాంతులనుచున్నారు. ఈ క్రియవలన సాధకులు సర్వభూత హృదయములందున్న జీవులను పరమాత్మ రూపులుగానే భావించి సేవింపవలయునని తెలియవలయును.

4) జజాన :- అనగా కనెను, పుట్టించెను అని అర్థము. "విశ్వకర్మ పరమేశ్వరుడు" సద్వస్తువు నుండి జగత్తులను 'తండ్రి'యై కనినాడనియు, 'విధాత'యై పోషించినాడనియు దీని భావము. కాగా కారణరూప పరమాత్మ లేనిదే చరాచర స్వరూప జగము వెలువడదని తెలియవలెను. ఇట్లు కలిగిన జగములు ఆయన (విశ్వకర్మ) యందే కడకు అస్తమించుచున్నవని "అన్యా భువనా యన్తి" అనెడి వాక్యములోని 'యన్తి' అను క్రియ చెప్పుచున్నది. దీనినిబట్టి జగములనునవి ఆ తత్త్వమునుండియే వెలువడి, తుదకు దానియందే ప్రవేశించుచున్నవని భావము. బంగారము నుండియే పలు రకములైన నగలు సృష్టింపబడి కడకా బంగారమునందే కలిసి పోవుచున్నవికదా! నగ బంగారు నుండియే పుట్టి దానియందే ఉండి తుదకు దానియందే కలసిపోవునట్లు "విశ్వకర్మ భగవానుని" నుండియే జగములు పుట్టి ఆయనయందే పెరిగి కడకు ఆయనయందే కలసిపోవుచున్నవన్నమాట. ఈ "భువనా యన్త్యన్యా" అనుదానినిబట్టియే తైత్తిరీయోపనిషత్తులోని "యతోవా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశంతి" అనెడి వాక్యము బయలుదేరినది. ఈ వివరణనుబట్టి సృష్టించిన బ్రహ్మయు (త్వష్ట) పోషించిన విష్ణువును (మయుడు), లయము చేసిన

రుద్రుడును (మనుబ్రహ్మ) "విశ్వకర్మ"యే అని ఉపాసకులు గ్రహింపవలయును.

5) సమాజయన్త :- "ఆయజన్త" అనగా సమకూర్చినారని అర్థము. ఆ "విశ్వకర్మ" సృష్టించిన బ్రహ్మ విష్ణ్వాదులు గాని, లేక మనుమయాదులు గాని, సానగాదులు గాని అజరామరులై లోకులకు కావలసిన వస్తుసామగ్రిని సమకూర్చినారని దీని భావము. అనగా తండ్రియైన "విశ్వకర్మ" వలెనే వారుకూడ లోకముల ప్రవృత్తికి అవసరమైన వాటిని సృష్టించి జగత్ప్రవృత్తికి తోడ్పడినారన్న మాట. దీనినిబట్టి భగవంతునివలెనే ఆయన భక్తులును ప్రవర్తింపవలయునని ప్రబోధించినట్లైనది.

6) సమకృణ్వాన్ :- ఈ ధాతువుకూడ 'ఆయజన్త' అను క్రియకు పర్యాయ పదముగానే ఉపయోగింపబడినదని గ్రహింపవలయును.

7) అజనిష్ఠ :- అనగా "అయినాడ"ని అర్థము చెప్పికొనవలయును. పుట్టుట అనునది భగవంతుని విషయమున పొసగనిది కనుక ఈ అర్థము చెప్పికొనక తప్పదు. అయినను వ్యావహారిక దృష్టిలో పుట్టినాడని చెప్పికొనుటకూడ దోషము కాదు. ఆ "విశ్వకర్మ", బ్రహ్మ (త్వష్ట) దేవుడుగాను, సూర్యచంద్రులుగాను అవతరించెను. రూపుతాల్చెను అని 'అజనిష్ఠ' శబ్ద భావము. దీనినిబట్టి బ్రహ్మయు, సూర్యచంద్రులేకాక, సర్వదేవతా స్వరూపములును మనుష్య, తిర్యగ్జడాదుల రూపములను "ఆయనయే" (విశ్వకర్మయే)

అయినాడని సాధకులు, ఉపాసకులు తేలికగానే ఊహించుకొనవచ్చును. "విశ్వకర్మ సూక్తము"లోని క్రియా పదములలో ఇంతింతటి నిగూఢార్థములు కలవని తపస్సుచే తెలియవలసియున్నది. అందుకే "తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ" తపస్సుచేత బ్రహ్మమును తెలిసికొనుము అని ఉపనిషత్తు పలికినది.

8) <u>జనయన్</u> :- కలిగించినాడు, పుట్టించినాడు అని భావము. ఆ "విశ్వకర్మ" ఒక్కడే ఇతర అపేక్ష లేకుండా ద్యావా పృథువులతో కూడిన జగత్తును సృష్టించినాడని భావము. "జనయతి" అనగా పుట్టించుచున్నాడని అర్థము. ఈమాట పరమేశ్వర సంకల్పముతో జీవుల కర్మలను బట్టి జగత్తు సాగుచున్నదని చెప్పినట్లయినది.

9) <u>వి ఔర్ణోత్</u> :- విశేషముగా వ్యాపించెనని భావము. విచిత్రశక్తి గల విశ్వజ్ఞాని అయిన ఆ "విశ్వకర్మ" భూ-దివములను తన మహిమచేత (మాయాశక్తి చేత) వ్యాపించినాడని దీని యర్థము. అనగా "ఇందు కలడందు లేడని సందేహము" వలదన్నమాట. దీనిచేత పరమేశ్వరుని సర్వవ్యాపకత్వము తెలియబడుచున్నది.

10) <u>నిష్టతక్షుః</u> :- (నిస్+తతక్షుః) ఈ క్రియా పదములో "నిస్" అనునది ఉపసర్గ. "తతక్షుః" అనునది క్రియ. రెంటినీ కలుపగా "నిష్టతక్షుః" అగును. "తక్షు, త్వక్షు-తనూకరణే" అనగా తక్షు ధాతువునకు రూపము (శరీరము) లేనిదానికి రూపమును కల్పించుట అని అర్థము. 'తక్ష్ణోతి'

అనగా కొయ్య మొదలగువాటిని చెక్కి రూపము కల్పించు చున్నాడని అర్థము. "తతక్షుః" అనగా రూపము కల్పించెను అని భావము. (ఇది బహువచన క్రియ) ద్యావా పృథువులను సృష్టించినాడని అర్థము. అనగా అదివరకు రూపము లేని ద్యావా పృథువులకు తాను (విశ్వకర్మ భగవానుడు) శిల్పియై రూపములను కల్పించినాడన్నమాట. "విశ్వకర్మ సూక్తము" ద్యావా పృథువులను మాత్రమే పేర్కొన్నను, ఆ సృష్టి సకల బ్రహ్మాండ సృష్టియని మనము గ్రహింపవలయును. 'ద్యావా పృథివీ' శబ్దములచేత విశ్వసృష్టి నంతటినీ చెప్పుట వేద హృదయము. అనగా విశ్వమునునదొక మహా శిల్ప మనియు, దానిని నిర్మించినవాడు ఒక 'విశ్వశిల్పి' అనియు వేదోద్దేశ్యము. కనుకనే సృష్టికర్తను "విశ్వకర్మ" శబ్దముతో వేదము పేర్కొని రెండు సూక్తములతో వర్ణనము కొనసాగించినది. క్రియాపదములలో కూడ తక్షధాతువునే ఎక్కువగా వాడినది. ఇందుకు "తతక్షుః" అను క్రియాపదమేకాక "అధమత్" అనెడి క్రియాపదమును కూడ వాడినది. చూడుడు. "బ్రహ్మణస్పతి రేతా సం కర్మార ఇవాధమత్" సృష్టికర్త ఈ లోకములను కమ్మరి (కర్మారుడు) వలె, అధమత్=సృష్టించినాడు. "ధమతి" అనగా లోహములను కొలిమిలో పెట్టి ఊది కరగించి వస్తువులుగా చేయుచున్నాడని అర్థము. "శిల్పీ అగ్నిం ధమతి" అనగా శిల్పి గొట్టముతో ఊది, నిప్పును రగుల్చుచున్నాడని అర్థము. కనుక 'అధమత్' అనగా శిల్పి నిప్పును ఊది లోహములను కరగ

బెట్టి వస్తువులను (విగ్రహాదులను) తయారు చేయినట్లు పరమేశ్వరుడు (విశ్వకర్మ) జగములను సృష్టించుచున్నాడని వేద హృదయము. ఈ విధముగా చెప్పుటచేత వేదమునకు భగవంతుని 'శిల్పాచార్యు'డనుట ఎంతో ఇష్టమని స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రయోగములు ఋగాది వేదములలో పలుతావుల మనము కాంచగలము. "తక్షన్ ధేనుం కామదుఘాం" ఋభువులు కోరికలను పండించెడి ఆవును- కామధేనువును చెక్కినారు (సృష్టించినారు). ఇత్యాది స్థలముల యందు 'తక్షధాతు' ప్రయోగమును మనము కాంతుము.

11) శిక్ష :- అనగా శిక్షింపుము, నేర్పుము అని అర్థము. ఓ "విశ్వకర్మా!" మే మొనర్చు పూజాధ్యానముల చేత నీవు వృద్ధిపొందినవాడవై మమ్ములను సత్కార్యములను చేయునట్లు ప్రేరేపించుమని భావము. భగవంతుని యందు భక్తి కలవారు మాత్రమే సత్కార్యములు చేయుదురు. అట్టి మంచి పనులు చేయుటకు భక్తుడీమాటచేత భగవంతుని (విశ్వకర్మను) ప్రార్థించుచున్నాడు.

12) యజస్వ :- యజ ధాతువునకు మంచిపనిని చేసి పూజింపుము అనియు, యజ్ఞము చేయుమనియు అర్థములు. భక్తుడు భగవంతుని తన శరీరమునందు ప్రవేశించి తన బుద్ధులను మార్చి ఆయననే (విశ్వకర్మ భగవానునే) సత్కార్యము నెఱవేర్పుమని ప్రార్థించుట ఈ క్రియద్వారా జరిగినది. ఇట్లనుటచేత ప్రతివాడును తానొక యజ్ఞకర్త వలె సత్కార్యములు చేయవలెనని సూచితమగుచున్నది.

13) <u>వ్యదధాత్</u> :- "వ్యదధాత్" అనగా 'ఉంచినాడని' భావము. "విశ్వకర్మ" నీటియందు నానారూపమైన జగద్బీజమును ఉంచినాడని సారాంశము. జగత్తు ఏకరూపమైన తననుండి నానారూపములుగా భాసిల్లునట్లు చేయుటకు ఆయన సంకల్ప బీజమే హేతువని ఇందలి పరమార్థము. తరువాతి క్రియ "అజనన్" అనునది. ఇది "అజనిష్ఠా" అను క్రియా పదము వంటిదే. అట్లే "అదద్రృం హాంత" అను క్రియాపదము కూడ 'విస్తరించినాడు' అను నర్థమున ప్రయోగింపబడినది. ఇది 'స్థితి' లేక 'వృద్ధి అగుట' అను క్రియను చెప్పును.

14) <u>అప్రథేతామ్</u> : అనగా 'సృష్టించెను' అనియు, 'వ్యాపించెను' అనియు లేదా సృష్టించి అందు వ్యాపించినాడనియు చెప్పుకొనవచ్చును. పరమాత్మ (విశ్వకర్మ) తనకు భిన్నముగా తోచెడి జగద్వస్తువులను సృష్టించి వాటియందు, లోపల వెలుపల అంతటా తానే వ్యాపించి వాటి రూపముగా కనబడుచూ, తన రూపమును ఇతరులకు కనబడనీయకున్నాడని తెలియవలసియున్నది.

15) <u>సంనమతి (బాహుభ్యాం)</u> :- ఆ "విశ్వకర్మ" చేతులవంటివైన జీవులు చేయు ధర్మాధర్మ (పుణ్య, పాప) రూప కార్యములచేత వారిని లోబరచుకొనుచున్నాడు. లోకములో ఏ జీవిగాని స్వతంత్రుడు కాడు. ఆతడు తాను చేసికొన్న పూర్వజన్మ కర్మలవలన ఆతని భవిష్యజ్జీవితము కొనసాగుచుండును. ఆ కర్మలను ఆధార

ముగా చేసికొనియే భగవంతుడు జీవులకు సుఖ దుఃఖములను చేకూర్చుచుండును. ఎవడైనను "పుణ్య ఫలములనే అనుభవింతును. పాపఫలములతో నాకు సంబంధము లేదు" అనుటకు వీలులేదు. భగవంతుడు నెత్తిన మొట్టి వారివారిచే వారి కర్మల ఫలములను అనుభవింపచేయుచుండును. ఈ విషయమునే 'సంనమతి' లోబఱచుకొనుచున్నాడు అనెడి క్రియ చెప్పుచున్నది. కనుక సుఖజీవనమును కోరువాడు మంచి పనులనే చేయవలయును కాని చెడ్డపనులను చేయరాదు. జీవితము నంతటినీ ఒక యజ్ఞముగా భావించి నడచుకొనవలయునని తేలినదన్నమాట.

16) <u>ఆహువేమ</u> :- అనగా పిలుతుముగాక! అని అర్థము. మానవులు జీవిత కాలమున ఎందరినో పిలుచుచుందురు. తలచుచుందురుకూడ. కాని భగవంతుని పిలుచువారు, తలచువారు చాలా తక్కువగా నుందురు. అందును మనస్ఫూర్తిగా పిలుచువారు, తలచువారు ఇంకా మిక్కిలి తక్కువ. అయినను భగవంతుడు అందఱి మనసులలోనే ఉండియున్నాడు. ఆయనను పిలుచుటకు, తలచుటకు ఏ ఆర్భాటములు చేయనక్కరలేదు. ఏలయన ఆయన నీ మనస్సులోనే సన్నిహితుడై ఉన్నాడుకదా! (సదా జనానాం హృదయే సన్నివిష్టః.)

17) <u>జోషతే</u> :- అనగా భగవంతుడు నేనుచేయు పనులను అంగీకరించుగాక అని అర్థము. భక్తుడు హృదయపూర్వకముగా పిలిచినప్పుడు (ధ్యానించినపుడు) సాధుశీలు

డును, విశ్వశంభువును అయిన "విశ్వకర్మ భగవానుడు" జాగుచేయక ఆ భక్తుని మొరలు ఆలకించి ఆతడొనర్చు కార్యములకు మెచ్చి ఆతని ననుగ్రహించునని ఇందలి రహస్యము.

18) <u>ముహ్యంతు</u> :- అనగా మోహపడుదురు గాక- ఓడిపోదురు గాక! అని అర్థము. సాధారణముగా దుష్టశక్తులు సత్కార్యములకు విఘ్నములను ఆపాదింప చూచుచుండును. అట్టి దుష్టశక్తులు (లేదా దుష్టులు) ఈ భగవదుపాసకునిపై ప్రవర్తించినచో ఓటమి చెందుగాక అని ఇందలి భావము. అస్తు. దుష్టశక్తులు సన్నగిల్లి, శిష్టశక్తులు విజృంభించిన నాడు, కర్తకు జ్ఞానమనెడి పుత్రుడు పుట్టితీరును. శారీరక ముగా అట్టి సత్పుత్రుడు పుట్టుటయేగాక జ్ఞానపుత్రుడు కూడ ఉదయింపవలెనని "ఇహాస్మాకం మఘవాసూరి రస్తు" అనెడి 15వ మంత్రము యొక్క చివరి పాదము చెప్పుచున్నది.

19) <u>అకృణోః</u> : అనగా చేయుమని భావము. అనగా తనకు జ్ఞానపుత్రుని ప్రసాదించి తనను మోక్షార్హుని చేయు మని ఈ క్రియగల వాక్యమునకు అంతరర్థము. సమనమస్తు= లోబడుదురుగాక! నిన్ను ఉపాసించు భక్తులు ఇతరులకు భయంకరులై వారికి లోబడకుందురుగాక! అంతేకాదు. ఆ ఇతరులు నీ భక్తులకు లొంగిపోయి ప్రవర్తింతురుగాక!

20) <u>జుహుత</u> : "జుహుతా విశ్వకర్మణే విశ్వాహా మర్త్యగ్ం హవిః" అను వాక్యములోనిది ఈ క్రియ. నదీ

నదములకు తండ్రియు, సముద్ర స్వరూపుడును అగు "విశ్వకర్మ పరమాత్మ"కు సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతమైన హవిస్సును ఇచ్చి నిష్కామ కర్మరూప యజ్ఞము చేయుమని ఇందలి భావము. ఇది జీవుల నుద్దేశించి వేదమాత ఇచ్చిన సదుపదేశమన్న మాట. ఈ "యజుర్వేదీయ విశ్వకర్మ సూక్త" మంత్రములు 16 రింటిలోను "సముద్రాయ వయునాయ" అనెడి 17వ మంత్రములోను వాడిన క్రియా పదములు ఈ విధముగా నున్నవి. అందు కొన్ని "విశ్వకర్మ పరమేశ్వరు"నకు ఆయన పుత్రులకు సంబంధించినవి కాగా మరికొన్ని ఇతర కర్తలకు సంబంధించినవి అగుచున్నవి. "విశ్వకర్మ భగవాను"నకు ఆయన సృజించిన బ్రహ్మలకు (పూర్వ ఋషులకు) సంబంధించినవి ఇవి :- 1) జుహ్వత్ 2) నిషసాద 3) ఆవివేశ 4) జనాన 5) సమాయజన్త 6) సమకృణ్వన్ 7) అజనిష్ఠ 8) అభవత్ 9) వ్యదధాత్ 10) అజనన్ 11) అదదృంహంత 12) అప్రథేతామ్ 13) నమాతి 14) జనయన్ 15) ఔర్ణోత్ 16) నిష్ఠతఝః 17) అధ్యతిష్ఠత్ 18) శిక్షా 19) యజస్వ 20) జోషతే 21) యజస్వ 22) అకృణోః.

ఇక ఇతర కర్తలకు సంబంధించిన క్రియా పదములను చూతము :- 1) మదన్తి 2) యంతి 3) న విదాధ 4) చరంతి 5) దధ్రే 7) సమగచ్ఛన్త 7) ఆసీత్ 8) ఆహువేమ 9) ముహ్యంతు 10) అస్తు 11) సమనమన్త 12) జుహుత.

"విశ్వకర్మ పరమేశ్వరు" నకు ఆయన పుత్రు

లకు సంబంధించిన క్రియాపదములలోను, ఇంకను ఇతర కర్త లకు సంబంధించిన క్రియాపదములలోను, ఏకార్థము గల క్రియాపదములు కూడ కలవు. ఉదా :- "ఆసీత్-అభవత్", "సమాయజన్త-సమకృణ్వాన్" ఈ మొదలైనవి. వీటిలో దాదాపు ఇరువది క్రియాపదముల యొక్క అర్థమును "విశ్వకర్మ" క్రియలుగా వివరించినాము. 'జుహుత' అను క్రియ మానవుల నుద్దేశించి చెప్పినట్టిది. అట్లే భగవంతు నుద్దేశించి "శిక్షా" యజస్వ ఇత్యాది క్రియలు వాడబడినవి. వీటిలో 'విశ్వకర్మ కర్తృకముగా' వాడబడిన క్రియలు ఆ దేవుని (విశ్వకర్మ భగవానుని) మహిమలను చెప్పునట్టివి. "యజస్వ", "జుహుతా" ఇత్యాది పదములు ఆయనను పూజించెడి, ధ్యానించెడి భక్తుల నుద్దేశించి చెప్పినట్టివి. ఈ విధముగా విశ్వకర్మ రూప, నామ, క్రియలయొక్క విశేషములను వాటి మననముచే సాధకులు పొందవలసిన ఉన్నత స్థితిని సంగ్రహముగా యథాశక్తి వివరించుటయైనది. మాకు తెలిసిన ఇంక మఱికొన్ని విశేషములను గ్రంథము పెరిగిపోవునను భయముచే వివరింపజాలమైతిమి. ఉత్తమ సాధకులగువారు తమ బుద్ధి కౌశలముచేతను, తాము పయనించెడి తత్త్వ మార్గమునందలి సాధక బాధకముల చేతను ఊహించి, తెలిసికొనుచు, తమ ఆధ్యాత్మిక ప్రయాణమును గమ్యము చేరు వరకు కొనసాగించి ధన్యులు కావలయునని కోరుచున్నాము. ఇట్టి "విశ్వకర్మ పరమేశ్వరు"ని స్తోత్ర, పూజా, జప, ధ్యానాదులను గూర్చి పిమ్మటి అధ్యాయమున తెలిసికొందము.

# విశ్వకర్మ పర స్వరూపము

"పరము, అపరము"- అను రెండు మాటలను మనము ఎక్కువగా వినుచుందుము. అనగా అవి ఒకదానికంటె ఒకటి వేఱైనవని అర్థము. 'అపరము' కంటె పరము, 'పరము' కంటె అపరము వేఱని సారాంశము. ఇహ పరలోకము లన్నప్పుడు కూడ 'ఇహ' మనగా ఈ లోకమునియు, 'పర' మనగా దీని కంటె వేఱై భిన్నముగా ఉన్న లోకమనియు తెలిసి కొందుము. అట్లే 'అపర' మనగా (ఇహము) ఈ లోకము (ఇది) అనియు, 'పర' మనగా దీనికంటె భిన్నమైన మనకు గోచరింపని మఱియొకటనియు తెలియుచున్నది కదా! కనుక "విశ్వకర్మ పర స్వరూప" మనగా మనకంటికగపడు ఈ లోకముకాక, దీనికంటె భిన్నమై మనకు గోచరింపని ఇంకొక 'పర స్వరూప' మని గ్రహింపవలసియున్నది.దీనినిబట్టి "విశ్వకర్మ" యొక్క 'పర', 'అపర' స్వరూపములను ఋగ్యజుర్వేదీయములైన విశ్వకర్మ సూక్తములను బట్టియు, ఉపనిషత్తులను బట్టియు విచారింతము.

"విశ్వకర్మ సూక్తము "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషిర్హోతా నిషసాద పితానః" అని "విశ్వకర్మ" విశ్వ బ్రహ్మాండములను ప్రళయ కాలమున తనలో ఆహుతి వలె లీనము చేసికొనినాడని ప్రారంభమగుచున్నది. వెంటనే "స ఆశిషా ద్రవిణమిచ్ఛ మానః పరమచ్ఛదోవర ఆవివేశ" అట్టి "విశ్వకర్మ" మనస్సంకల్పమాత్రము చేత మఱల జగత్తులను (జీవులను) సృష్టించి వారి హృదయములందు తానే జీవ

రూపముగా ప్రవేశించినాడని చెప్పినది. కాగా ఇక్కడ జీవేశ్వరైక్య రూప అద్వైతము సిద్ధమైనదన్నమాట. ఆవల దివము, పృథివి, ధాత, విధాత, రుద్రుడు, సూర్యచంద్రులు మొదలైన నానా దేవతల సృష్టిని వర్ణించెడి మంత్రములు కలవు. ఇక "విశ్వతశ్చక్షురుత విశ్వతో ముఖో, విశ్వతో హస్త ఉత విశ్వతఃపాత్" అను మంత్రములో జగద్రూపముగా తోచిన "విశ్వకర్మ" యొక్క బాహ్యరూపమంతయు బహు విధములుగా వర్ణింపబడినది. అట్లు వర్ణించి, ఈ నానా దేవతలుకాని, ద్యావా పృథువులు గాని తన స్వరూపమే అని, "యో దేవానాం నామధా ఏక ఏవ" అనియు, తానే వేదస్రష్ట అని "వాచస్పతిం విశ్వకర్మాణమూతయే" అనియు మంత్రములు చెప్పినవి.

పిమ్మట ఇంకొక మంత్రములో "విశ్వకర్మ" యొక్క పర స్వరూపము ఇట్లు వర్ణింపబడినది-

"పరో దివా పర ఏనా పృథివ్యా
పరో దేవేభి రసురై ర్గుహాయత్."

అనగా సర్వులు అనుభూతికి తెచ్చుకొనదగిన "విశ్వకర్మ" యొక్క పర స్వరూపము ఈ భూలోకమున కంటెను, స్వర్గాది లోకములకంటెను, దేవతల కంటెను, అసురుల కంటెను భిన్నమైనది, పరమైనది అని చెప్పబడినది. దానిని పరమనుటచేత మనము అనుభవించెడి భూలోకాది స్వర్గ పర్యంతము గల లోకములు గాని, దేవాసుర మనుష్య క్రిమి కీటక జడములతో గూడిన లోకములుగాని 'అపర' మని

తేలుచున్నది. కనుక "విశ్వకర్మ భగవానుని" జగత్కారణ స్వరూపమును "పరో దివా పర ఏనా పృథివ్యా పరో" అనెడి మంత్రము పేర్కొన్నదన్నమాట. సమస్త సాధక కోటియు పొందదగిన భగవంతుని 'పర' స్వరూపము ఇదియే అన్న మాట. సర్వ జగత్తులకంటె విలక్షణమైన యిట్టి పరమేశ్వరుని 'పర స్వరూపమే' మనము పొందదగినదన్న మాట. దీనిని గూర్చియే విశ్వకర్మ సూక్త మంత్ర మింకొకటి "న తం విదాథ, య ఇదం జజానాన్య ద్యుష్మాక మంతరం భవాతి" ఓ మానవులారా! ఏ జగత్కారణము, ఈ జగద్రూప కార్యమును తోపింపచేసినదో, ఏది మీలో జీవ స్వరూపముగా వెలుగుచున్నదో దానిని మీ రెఱుంగకున్నారయ్యా, అన్నది. ప్రతి వ్యక్తియు విశ్వకారణ వస్తువు యొక్క ఈ పర స్వరూపమును ఎఱింగిననే కాని ముక్తుడు, అమృతుడు కాడన్న మాట. విష్ణు మంత్రమొకటి "విశ్వకర్మ" యొక్క ఈ పరమ స్వరూపమును ఇట్లు పేర్కొన్నది-

"తద్విష్ణోః పరమం పదం
సదాపశ్యన్తి సూరయః
దివీవ చక్షు రాతతమ్." ఋగ్వే. 1-22-20.

విష్ణుని యొక్క పరమపదమైన ఆ తత్త్వమును సూరులైనవారు ఏ అడ్డంకి లేకుండా ఎల్లప్పుడు చూచుచుందురు. అదే తామైయుందురని భావము. ఇక్కడ "విశ్వకర్మ" యొక్క పరస్వరూపము, విష్ణువునకు పరమపదమని చెప్పుట చేత అది విష్ణునకుగూడ కారణము, జన్మహేతువని తెలియు

చున్నది. కనుక విష్ణుని యొక్క పరమ పదమనగా "విశ్వకర్మ" యొక్క పర స్వరూపమే అని గ్రహింపవలయును. ఇందుకు ఉదాహరింపబోవు "ధాతా విధాతా పరమోత సందృక్" అను మంత్రమే కాక, యజుర్వేదము నందలి వసు రుద్రాదిత్యులను కన్నది "విశ్వకర్మయే" అనెడి మంత్రమును ప్రమాణమే. దానిని మదీయ యజుర్వేద దర్శనమునను, ఋగ్వేద దర్శనములందును గూడ కాంచవచ్చును. ఇప్పుడు "విశ్వకర్మ సూక్త" మంత్రమును చూతము. "విశ్వకర్మా మనసా యద్విహాయా, ధాతా, విధాతా పరమోత సందృక్" అన్న "విశ్వకర్మ సూక్త" మంత్రములో పేర్కొనబడిన, విహాయా (రుద్రుడు), ధాతా (బ్రహ్మ), విధాతా (పోషకుడైన విష్ణువు) అనువారు త్రిమూర్తులే. కావున త్రిమూర్తులకు గాని, పంచ బ్రహ్మలకుగాని, సూర్య చంద్రాదులకుగాని సృష్టికర్త "విశ్వకర్మయే" అని సూక్తము చెప్పుచున్నందున, విష్ణువునకు జననకారణమైన పరమ పదము- "విశ్వకర్మ" యొక్క పరస్వరూపమే. ఈ సందర్భమున విష్ణు, విశ్వకర్మ సూక్త మంత్రములు ఏకీభవించుట పాఠకులు గమనింపవలయును. ఉపనిషత్తులు గూడ (కఠవల్లి) విష్ణుని యొక్క పరమ పదమును పేర్కొనుట గమనింపదగును. "విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః, సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్" (కఠవల్లి అ-1, వల్లి-3, మంత్రం-9) విష్ణు-విశ్వకర్మలకు అభేదము కూడ మా దర్శనములందు నిరూపింపబడుట పాఠకులు గమనింపదగును.

ఇక తైత్తిరీయ బ్రహ్మానందవల్లి ఏమనుచున్నదో చూతము-

"ఓం బ్రహ్మవిదా ప్నోతి పరం, తదేషాభ్యుక్తా-
సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ. యో వేద నిహితం
గుహాయాం పరమేవ్యోమన్. సోఽశ్నుతే సర్వా
న్కామాన్ బ్రహ్మణా సహ విపశ్చి తేతి."

తా॥ బ్రహ్మవేత్త పరమును పొందును. బ్రహ్మ మనగా సత్యము, జ్ఞానము, అనన్తము అయి సర్వుల యొక్క హృదయ గుహలోను, సర్వమునందును ఆకాశమువలె ఉన్నట్టిది. అట్టి బ్రహ్మము నెఱింగినవాడు సమస్త కామములు పొందినవానివలె ఆనందించును అని భావము. "విశ్వకర్మ సూక్తము" విశ్వకర్మ యొక్క పర స్వరూపము, భూ-దివముల కంటెను, దేవాసురుల కంటెను పరమైనదని చెప్పగా అట్టి "విశ్వకర్మ పర స్వరూపము"నే బ్రహ్మవేత్త పొందునని తైత్తిరీయోపనిషత్తు చెప్పినది. కాగా 'బ్రహ్మ జ్ఞానము' కాని, 'విశ్వకర్మ జ్ఞానము' గాని ఒక్కటే అనియు, రెంటిచేతను సాధకులు పొందునది 'పరమే' అనియు తెలియు చున్నది. విశ్వకర్మ మంత్రము "గుహా యత్" హృదయ గుహలోనున్నది, విశ్వకర్మ తత్త్వమని చెప్పగా, తైత్తిరీయోప నిషత్తు "యో వేద నిహితం గుహాయామ్" అని బ్రహ్మ తత్త్వముకూడ హృదయ గుహలో నున్నదే అని చెప్పినది. కాన బ్రాహ్మణారణ్యక ఉపనిషదాదులకు మూలము (మొదటిది) "విశ్వకర్మ సూక్తమే" అని తెలియవలసి

యున్నది. ఇందుకెన్నియో మంత్రములను ఉదాహరింప వచ్చును. ఇప్పుడు ముండకోపనిషన్మంత్రమును చూతము—

"దివ్యోహ్యమూర్తః పురుషః,
స బాహ్యాభ్యంతరో హ్యజః,
అప్రాణో హ్యమనా శ్శుభ్రో
హ్యక్షరా త్పరతః పరః." — 2-1-2

తా॥ జగత్కారణ వస్తువైన విశ్వకర్మ లేక పురుషుడు, బ్రహ్మము దివ్యుడు. మూర్తి (ఆకారము) లేనివాడు. లోపల వెలుపల అంతట నిండిన అజుడు (పుట్టుక లేనివాడు). ప్రాణము కాని, మనస్సు కాని ఇంద్రియాదులు కాని లేని స్వచ్ఛుడు. అంతేకాదు. అక్షరుడైన జీవుని కంటెను, పరలోకములకంటెను పరుడైనవాడు. "పరతః పరః" అనుటచేత సామాన్యుల దృష్టిలో ఏది పరమో, పరుడో దానికంటెను పరమును, పరుడు అయినది ఆతడే. ఆ విశ్వకర్మయే అన్నమాట. ఈ మంత్రము- 'పర' శబ్దమును, 'పురుష' శబ్దమును గూడ ప్రయోగించి "విశ్వకర్మ సూక్త, పురుష సూక్తములు" రెంటిని కూడగట్టుకొన్నది. "గుహాయత్", "నిహితం గుహాయాం" అన్న మాటలు రెండును శ్వేతాశ్వతర మంత్రమున ఇట్లు దర్శనమిచ్చును.

"ఏష దేవో విశ్వకర్మా మహాత్మా
సదా జనానాం హృదయే సన్నివిష్టః."

ఆ మంత్రములలోని గుహాయే ఇందు హృదయ

మైనది. హృదయమన్నను, హృదయ గుహాయన్నను ఒకటియే. 'గుహా' శబ్దమునకు "పంచకోశము" లనెడి గుహాయనియు అర్థము చెప్పినారు. ఆ కోశములే అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములైన అయిదును. అనేకోపనిషత్తులు 'పర' శబ్దమును వాడినవి. ఇక "భగవద్గీత" ఎట్లు దానిని వాడినదో పరిశీలింతము.

"అవజానన్తి మాం మూఢా, మానుషీం తనుమాశ్రితమ్,
పరం భావమజానన్తో మమభూతమహేశ్వరమ్" — 9-11

తా॥ సర్వభూతములకు కారణమును, శాసకమును అయిన నా పరభావము నెఱుంగక మానవ శరీరమును ధరించిన నన్ను అజ్ఞానులు అవమానించుచున్నారు. ఇందలి పరభావము "విశ్వకర్మ సూక్తము" లోని "విశ్వకర్మ" యొక్క పరస్వరూపమే కాని భిన్నము కాదు. పరమేశ్వరునికి పరస్వరూపమొకటీ, జగత్స్వరూపమొకటీ రెండు రూపములుండును. జగద్రూప మెప్పుడును మోహమును కలిగించి సంసార కారణమగుచుండును. పరస్వరూపమేమో ముక్తి హేతువగుచుండును. "విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖః" అని చెప్పినది, భగవంతుని జగద్రూపము కాగా, "పరో దివా" అన్న మంత్రములో చెప్పినది 'పర' స్వరూపము. ఇంకను గీత-

"పురుష స్స పరః పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా,
యస్యాన్తఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్".
— 8-22.

తా॥ ఎవనిలోపల జగములన్నీ యున్నవో, ఎవనిచేత అంతయు వ్యాపింపబడియున్నదో ఆ పరపురుషుడు అనన్య భక్తిచేత మాత్రమే పొందదగినవాడు. ఈ పరపురుషుడు విష్ణు-విశ్వకర్మల స్వరూపుడే. గీత 14వ అధ్యాయము నారంభించుచు భగవానుడు ఇట్లనినాడు.

"పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమం
యద్ జ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితోగతాః"
— 14-1.

తా॥ ఓ అర్జునా జ్ఞానములలోనికెల్ల ఉత్తమమైన 'పర' జ్ఞానమును గూర్చి నీకు చెప్పుచున్నాను. ఈ జ్ఞానము నెఱింగి మునులందఱు 'పర' సిద్ధి నందినారు.

"నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టాఽనుపశ్యతి,
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి."
— 14-19.

తా॥ శరీర ద్రష్ట అగువాడు 'గుణములే' కర్తలనియు, 'తాను' కాడనియు ఎప్పుడెఱుగునో, గుణములకంటె పరుడనయిన నన్నెప్పు డెఱుంగజాలునో, అప్పుడే నా భావమును పొందుచున్నాడు. జీవు డీశ్వరుడు, ఆత్మ పరమాత్మ, జనుడు "విశ్వకర్మ" అగుచున్నాడన్నమాట. కనుక బ్రహ్మ విష్ణ్వాదులతో గూడిన గుణమయ ప్రపంచము అంతయు 'అపర' మనియు, గుణములకు పరమైన తత్త్వమొక్కటే 'పర స్వరూప' మనియు తెలియుచున్నది. ఇట్టి గీతోపనిషత్తుల భావములన్నింటికి విశ్వకర్మ సూక్తములోని "పరోదివా పర

వనా పృథివ్యా పరః" అనెడి మంత్రమే మూలమని గ్రహింపవలసి యున్నది.

విశ్వరూప సందర్శన యోగములో సదసత్తులకు రెంటికీ గూడ పరమైన తత్త్వము "నీవే" అని దిగువ శ్లోక మన్నది-

"అనన్త దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్." — 11-37

తా॥ ఓ అనన్తా! దేవతాప్రభూ! జగములకు నివాస మైనవాడా! ఉన్నట్లుగా, లేనట్లుగా తోచెడి యే సదసత్తులు గలవో ఆ సదసత్తులు రెంటికీ కారణమూ, పరమూ అయిన అక్షరుడవు (శాశ్వతుడవు) నీవే! ఇట్లనుటచేత "నాసదీయ సూక్తము" లోని "నాసదాసీ న్నో సదాసీత్" అనెడి భావము చెప్పబడినట్లయినది. ఈ విధముగా "విశ్వకర్మ" యొక్క పరస్వరూపము విశ్వకర్మ సూక్తములో చెప్పబడి నదే, గీతోపనిషదాది గ్రంథములలో విస్తరింపబడి పున రుద్ఘాటింపబడినది. అంతేకాదు ఈ పర-అపర స్వరూపము లకు గూడ అతీతమైనది "విశ్వకర్మ" స్వరూపము, తత్త్వము. అది ఇట్లు శ్వేతాశ్వతరములో ప్రవచింపబడినది-

"యస్మాత్పరం, నా పరమస్తి కించిత్
యస్మాన్నాణీయో న జ్యాయోస్తికశ్చిత్
వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః
తేనేదం పూర్ణం పురుషేణ సర్వం. — 3-9.

తా॥ ఏ జగత్కారణ వస్తువునకంటె పరము కాని,

అపరముకాని లేదో, దేనికంటె చిన్నదికాని పెద్దదికాని లేదో అట్టి పురుషునిచేత సర్వము పూర్ణమై యున్నది. ఈ చెప్పబడిన తత్త్వము సర్వాతీత మైనది. జాగ్రత్, స్వప్న, సుషుప్తులను కడకు సమాధిని కూడ దాటి సర్వాతీతమై ప్రకాశించుచునట్టిది. అదే "విశ్వకర్మ తత్త్వము". తత్త్వమసి = అదే నీవు. సోఽహం = అదే నేను. "అహం బ్రహ్మాఽస్మి, అహం విశ్వకర్మాఽస్మి" నే నా బ్రహ్మమునే, జగత్కారణ జగత్స్వరూప విశ్వకర్మనే. "య ఏ తద్విదు రమృతా స్తే భవన్తి" ఈ విధముగా ఎఱుంగువారు అమృతు లగుదురు.

ఋగ్వేద ప్రథమ మండలము నందలి 164వ సూక్తము నకు మోక్ష సూక్తమని పేరు. అందలి దిగువ మంత్రము కూడ "విశ్వకర్మ" యొక్క 'పర-పరమ' స్వరూపములను గూర్చి యిట్లు చెప్పుచున్నది. వాటి సాదృశ్యములను పరిశీలింతము :-

"ఋచో అక్షరే పరమే వ్యోమన్
యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః,
యస్తన్న వేద కిమృచా కరిష్యతి?
య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే."

— ఋ. మండ-1, మంత్ర-39,

టీక : ఋచః = వేదముల పుట్టుకకు హేతువైనదియు. అక్షరే = నాశరహితమైనదియు, వ్యోమన్ = ఆకాశము వలె సర్వవ్యాపకత్వము కలదియునగు, యస్మిన్ పరమే = ఏ విశ్వ

కర్మ నామక పరవస్తువునందు- పరమాత్మయందు, విశ్వేదేవా =సమస్త దైవశక్తులు, అధినిషేదుః=నివసించి (ఆధారపడి) యున్నవో; తత్ =అట్టి జగత్కారణమును, యః=ఎవడు, న వేద=ఎఱుగడో; అట్టివాడు, ఋచా = ఆ ఋక్కుచేత (వేదవాఙ్మయము చేత), కింకరిష్యతి = ఏమి చేయగలడు! జగత్కారణము నెఱుంగుటకు వేదమును సాధనముగా చేసి కొనకున్నచో, అది వానికి నిష్ప్రయోజనమని భావము. అనగా వేదము నీకు అక్షరతత్త్వము నెఱింగించిననే సార్థక మనియు, కర్మ మార్గమున ప్రవేశపెట్టినచో నిష్ఫలమనియు రహస్యము. యే ఇత్ =ఎవరయితే, తద్విదుః = అక్షర పర తత్త్వమును ఎఱుంగుదురో, త ఇమే = అట్టివారు, ఆ జగ త్కారణ స్వరూపమునందు, సమాసతే = ఉందురు. తద్రూపులేయై దానియందే లీనులై అమృతులగుదురని భావము.

ఇక ఈ మంత్రమునకును, విశ్వకర్మ సూక్తమునకును గల సాదృశ్యము (పోలిక) లను పరిశీలింతము.

ఈ మంత్రము ఋక్కుల (వేదముల)కు 'భగవంతుడు' జన్మస్థానము (కారణము) అన్నది. విశ్వకర్మ సూక్తమేమో "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" వాక్కులకు- అనగా వేదములకు "విశ్వకర్మ" అధిపతి (జనకుడు) అన్నది. మంత్రము జగత్కారణమును 'పరమము' అనగా, సూక్తమేమో "పరోదివా పర ఏనా పృథివ్యాః" ఆ "విశ్వకర్మ" భూ-దివము లకు, సురాసురులకు 'పరుడని' అన్నది. 'పర' శబ్దమును

సూక్తము వాడగా, 'పరమ' శబ్దమును మంత్రము వాడినది. "పర-పరమ" అను రెండు మాటలకును అవ్వలిది, శ్రేష్ఠమైనది అనియే అర్థము. కనుకనే విష్ణు మంత్రము కూడ "తద్విష్ణోః పరమం పదం, సదాపశ్యన్తి సూరయః" అన్నది. ఇంకొక మంత్రములో "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" అన్నది. "వ్యోమన్" శబ్దమును మంత్రము వాడగా, తైత్తిరీయము- "యో వేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్" అన్నది. కాగా "ఋచో అక్షరే" అను మంత్రము విశ్వకర్మ సూక్తమునకును, తైత్తిరీయోపనిషత్తునకును అనుగుణముగా కొనసాగినదన్నమాట. "యస్తన్న వేద కిమృచా కరిష్యతి" అని మంత్రమనగా విశ్వకర్మ సూక్తమేమో "న తం విదాథ య ఇదం జజాన" అన్నది. "య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే" అని మోక్షసూక్త మంత్రమునగా, పురుష సూక్తమేమో "తమేవం విద్వా నమృత ఇహాభవతి, నాన్యః పంథా అయనాయ విద్యతే" అనియు, "తమేవ విదిత్వా అతి మృత్యుమేతి" అని రెండుమారులన్నది. ఈ విధముగా మోక్ష, పురుష, విశ్వకర్మ సూక్త మంత్రములకు, ఉపనిషన్మంత్రములకు గల సాదృశ్యములను సాధకులు గమనించి "జగత్కారణ విశ్వకర్మ తత్త్వమును" పరిపూర్ణముగా ఆకళించుకొనవలసి యున్నది.

మోక్ష సూక్తములోని మఱియొక మంత్రమునకును, విశ్వకర్మ సూక్త మంత్రమునకును గల అద్వైత పరత్వమును గూడ పరికింతము-

"ద్వాసుపర్ణా సయుజా సఖియా
సమానం వృక్షం పరిషస్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి,
అనశ్నన్నన్యో అభిచాకశీతి." — 1-164-20.

ఈ మంత్రము సంసార వృక్షము నాశ్రయించి యున్న జీవేశ్వరులను రెండు 'పక్షులుగా' వర్ణించినది. దీనికి ద్వైతాద్వైత, విశిష్టాద్వైత పరములుగా, వేరువేరు అర్థములను చెప్పుకొన్నారు. కాని అద్వైతార్థమే "విశ్వకర్మ సూక్తము" నకు ఇష్టమైనది.

"యస్మిన్ పరమే, విశ్వే దేవా, అధినిషేదుః" ఏ పర వస్తువు నందు 'ఎల్ల దేవతలు నివసించియున్నారో' అని యుండగా, విశ్వకర్మ సూక్తం 6, 7 మంత్రములలో "యత్ర దేవాః స్సమగచ్ఛన్త విశ్వే" ఏ విశ్వకర్మ తత్త్వమున 'సర్వ దేవతలు కూడియున్నారో' అని యున్నది. ఇదే మాట 6, 7 మంత్రములలో నుండి, జగత్కారణ తత్త్వము ఒక్కటే అని తెలుపుచున్నది. అట్లే "యో దేవానాం నామధా ఏక ఏవ" అనెడు విశ్వకర్మ సూక్త వాక్యము కూడ ఒకే "విశ్వకర్మ" సర్వ దేవతల నామ రూపములను తాల్చుచున్నాడన్నది. ఈ భావమునే మోక్ష సూక్తములోని "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు రథో" (చూడుము 11వ పేజి) అనెడి మంత్రమును చెప్పినది. ఇట్టి సాదృశ్యములు పర తత్త్వముయొక్క ఏకత్వమును స్పష్టము చేయుచున్నవి కదా!

"విశ్వకర్మా దిశాంపతి స్సనః ప్రజాన్పాతు, సోఽస్మే

న్నాతు తస్మైనమః" అని యజుర్వేద మనుచున్నది. దిక్కు లను ఎనిమిది అని (అష్ట దిక్కులు) అందఱకు తెలుసు. అవియే తూర్పు మొదలైనవి. "దిశాం పతిః" అనగా దిక్కులమయమైన ప్రపంచమునకు ప్రభువని అర్థము. ఒక్కొక్క దిక్కు ఎంతదూరము పోయినను అంతము కాదు. కనుక అష్ట దిక్కులకు లోబడియే ప్రపంచమనునది ఉండును. కాగా "విశ్వకర్మ" దిఙ్మయమైన జగమును సృష్టించి పాలించు ప్రభువని భావము. ఊర్ధ్వమును (పైని), అధర మును (దిగువను) కలుపుకొన్నచో అప్పుడు దశ దిక్కులు కాగలవు. అట్లయిననే "విశ్వకర్మ" దశ దిక్కులకు అధి పతియై మనకు ఉపాస్యుడగుచున్నాడు. పురుష సూక్తము దీనిని "అత్యతిష్ఠ ద్దశాంగులమ్" అని దిక్కులను అంగుల శబ్దముతో పేర్కొన్నది. ఇది వెలుపలి బ్రహ్మాండమునకు సంబంధించిన అర్థము. కాగా ఇక పిండాండమునకు సంబం ధించిన అంతరర్థమును, ఆధ్యాత్మికార్థమును చూతము. "విశ్వకర్మ" సహస్రార పద్మస్థితుడు (సహస్రార పద్మాంత రే భాసమానం) అని మనము ధ్యానించుచుందుము. సహ స్రారమున వేయి దళములు ఉండునని అందఱెఱుంగుదురు. అయినను వీటిలో ఎనిమిది దళములు మాత్రమే ప్రధాన ములు. అందుకనే దానిని 'అష్టదళ పద్మ' మందురు. ఒక్కొక్క దళము మీద 125 చిఱు దళములుండును. అప్పుడది సహ స్రార పద్మమగుచున్నది. మంత్రము చెప్పిన దిక్కులకును,

ఈ అష్ట దళములకును సంబంధ మున్నది. కనుకనే సహా స్రారము నందున్న తత్త్వము "విశ్వకర్మ" అని వేదమనుట. ఈ అష్ట దళములు అవ్యక్తము, మహాత్తు, అహంకారము, పంచ తన్మాత్రలు అనెడి అష్ట ప్రకృతులకు గుర్తులు, జ్ఞాపకములున్ను. ఈ అష్ట ప్రకృతుల నధిష్ఠించియే భగవంతుడైన "విశ్వకర్మ" యొక్క జగత్క్రీడ. ఈ సహాస్రారమునకు (అష్టదళ పద్మమునకు) చేరిననేకాని జీవుడు "విశ్వకర్మ స్వరూపుడై" ఆయనలో ఐక్యము కాడు. ఇక్కడకూడ ఊర్ధ్వ, అధర దిక్కులను కలుపుకొన్నచో దశ దిక్కులు కాగలవు. కనుక "విశ్వకర్మా దిశాంపతిః" అన్నప్పుడు ఇంతటి అంతరార్థమున్నదని వేద పురుష హృదయము, మంత్రభావము. సాధారణముగా నానా దేవతలను ఈ అష్టదళ పద్మమున నున్నట్లే చిత్రింతురు. అష్టదళములలో అయిదు మనకగపడును. మూడేమో అగపడవు. ఆ మూడే సూక్ష్మములైన అవ్యక్త, మహా, దహంకారములు. అయిదేమో పంచ భూతములు.

"విశ్వాన్వేషణలో ఎక్కడున్నాం" అనే వ్యాసంలో హేతువాది సంపుటి-12 (8, 9, 10లో) ఎన్. ఇన్నయ్య గారు ఇలా వ్రాశారు.

"15 బిలియన్ సంవత్సరాల క్రితం బిగ్ బ్యాంగ్‌తో నేటి ప్రకృతికి ప్రారంభ దశ పట్టింది. అప్పుడు- ఆకాశం, కాలం, శక్తి, పదార్థాలు అనే తేడాలు లేవని గుర్తుంచుకోవాలి. స్టీఫెన్ హాకింగ్ ప్రభృతులు ఈ విషయాన్ని

స్పష్టంగా వ్రాశారు. ఈ విషయం "నా సదా సీన్నో సదా సీత్" అనేదానికి, "న భూమి ర్నజలం చైవ ... " అనే మూలస్తంభ శ్లోకార్థమునకు సరిపడుతున్నది.

ముందు శక్తి పుట్టి ఆవల పదార్థం విస్తరిల్లింది. న్యూట్రాన్లు, ప్రోటాన్లు, ఎలెక్ట్రాన్లు అవతరించినాయి. అటు తరువాత పాలపుంత, నక్షత్రాలు మొదలైనవి కలిగాయి.

పర, పరమ శబ్దములు :

పరుడన్నను, పరమన్నను "విశ్వకర్మ"యే అని మనకు వేదోపనిషత్తులు సాక్ష్యమిచ్చుచున్నవి. అందుకు ముఖ్యముగా విశ్వకర్మ సూక్త మంత్రము యొక్క ప్రామాణ్యమును చూతము- "పరో దివా పరఏనా ... గుహాయత్" (చూడుము-21వ పుట). ఈ మంత్ర ప్రమాణమును బట్టి "విశ్వకర్మ" పరుడు, పరము అయిన జగత్కారణ వస్తువగుచున్నాడు. ఈ విషయమునే తైత్తిరీయానందవల్లి ఇట్లు చెప్పినది. "బ్రహ్మవి దాప్నోతి పరం... విపశ్చి తేతి" (చూడుము- 216 పుట) 'బ్రహ్మము నెఱింగినవాడు, ఆ బ్రహ్మతో కూడా సమస్త వాంఛలను పొందినవాడు- అనగా తీర్చుకొన్నవాడు అగుచున్నాడని' అన్నది.

ఈ విషయమునే భగవద్గీత "గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి" (14-19). అనగా రజస్సత్త్వ తమో గుణముల కంటే పరమైన తత్త్వమును ఎఱింగినవాడు, భగవద్భావమును పొందినవాడు, పరతత్త్వమును పొందునని భావము. "విశ్వకర్మ సూక్తము" చెప్పిన 'పర' శబ్దమునే ఉపనిషత్తులును, గీతయు చెప్పుట ఇచ్చట పాఠకులు గమ

నింపవలసిన విషయము. ఇంకను గీత "అసక్తో హ్యాచరన్ కర్మ పర మాప్నోతి పూరుషః (3-19)". నిష్కామ కర్మ చేయువాడు పరమును పొందును అన్నది.

"క్షేత్ర క్షేత్రజ్ఞయో రేవ మంతరం జ్ఞాన చక్షుషా,
భూత ప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరం."
— 13-14.

క్షేత్ర క్షేత్రజ్ఞులను వారికి గల భేదమును, భూతముల యొక్క స్వభావమును, వాటి నుండి కలుగు మోక్షమును, ఎఱింగినవాడు పరమును పొందునని భావము. "విశ్వకర్మ సూక్తము" చెప్పిన 'పర పురుషు'నే ఈ గీతోపనిషత్తులు 'పరవస్తువ'నియు, 'పరబ్రహ్మ' మనియు, 'పరమాత్మ' యనియు చెప్పుటను కూడ పాఠకులు గమనించి తీర వలయును.

"పరంజ్యోతి" శబ్దము కూడ ఇట్టి మహిమ కలదే. అగ్ని, సూర్య, చంద్ర, నక్షత్రాదుల జ్యోతులు భౌతిక ములు. అనగా అగ్ని భూతమునకు సంబంధించి ప్రాణులకు ఉపయోగించునట్టివి. ఆ జ్యోతులకు పరమైనదే అనగా ఆ లక్షణములు లేనట్టిదే పరంజ్యోతి. అందుకే పరమేశ్వరునికి "పరంజ్యోతి స్వరూపుడ"ని పేరు కలిగినది. వెలుపలి కంటి కగపడు జ్యోతులనే కాక, లోపల హృదయములో వెలుగు ఈ పరంజ్యోతిని దర్శించినప్పుడే తత్త్వ సాధకులకు మోక్షము. మన కన్నులు బాహ్య జ్యోతులను (వెలుపలి వెలుగులను) చూచుటకును, వాటిని మన మనోబుద్ధులు

గ్రహించుటకును ఈ 'పరంజ్యోతి'యే మూలము. ఈ 'పరం జ్యోతి' దేహమును వదలినప్పుడు మన కన్నులు చూడ జాలవు. ఏ ఇంద్రియములు కాని పనిచేయలేవు. ఆ దశనే స్థూల శరీరమునకు మరణమని పేర్కొనుచున్నాము. గీత ఇంకను ఇట్లనుచున్నది

శ్లో॥ "త్వమక్షరం పరమం వేదితవ్యమ్
త్వమస్య విశ్వస్య పరం నిధానం
త్వమవ్యయశ్శాశ్వత ధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే." — 11-18.

ఈ శ్లోకములో భగవంతుని "పరం నిధానం" అనుట గమనింపతగి యున్నది. 'నిధాన' మనగా నిధి (Bank). నిధి నుండి మనము ధనమును తీసికొనుచు, వేయుచు ఉందుము. అది తరుగనట్టిది. పరమేశ్వరుడు ఎప్పటికీ, ఏ మాత్రము తరుగనట్టి పరనిధానము, శ్రేష్ఠమైన నిధి అని భావము. ఈ శ్లోకమున 'పర' శబ్దముతో పాటు 'పరమ' శబ్దమును కూడ వాడుట గమనింపదగినది. అట్లే "సనాతనః, పురుషః" అను పదములు కూడా వాడబడినవి. ఈ 'పురుష' శబ్దము పురుష సూక్తము లోనిదే. ఇంకను 11వ అధ్యాయము, 38వ శ్లోక మున, పరమేశ్వరుడు ఇట్లు పేర్కొనబడినాడు.

శ్లో॥ "త్వ మాదిదేవః, పురుషః పురాణ
స్త్వమస్య విశ్వస్య పరం నిధానం,
వేత్తాఽసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప." — 11-38.

నీవు మొట్టమొదటి దేవుడవు. పురాణ పురుషుడవు. ఈ వాక్యమునకు నిధివంటివాడవు. అన్నింటినీ ఎఱుగు వాడవు. అందరిచే తెలియదగిన వాడవును, పరంధాముడవును. అనంతుడవగు నీచేతనే ఈ విశ్వమంతయు నిండియున్నది. ఈ శ్లోకమున "విశ్వ, విశ్వస్య" అని రెండుసార్లు 'విశ్వ' శబ్దము ప్రయోగింపబడుట "విశ్వకర్మ" సూచకమే. ఇంకను

శ్లో॥ "మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ."
— 7-7.

అనెడి శ్లోకములో కూడ నాకంటే పరమేదియు లేదనియు అన్నింటికీ నేనే పరుడననియు, ఇట్టి నా యందు దారమునందు పూసలువలె జగములన్నియూ (సర్వమును) ఆధారపడి (కూర్చబడి) యున్నవని గీత చెప్పినది. ఈ 'పర' శబ్దముల కన్నింటికీ 'పరో దివా పర ఏనా' అనెడి "విశ్వకర్మ సూక్తము"లోని మంత్రమే మూలము. కనుక 'పర' శబ్దములో ఇంత గంభీరార్థము కలదు. ఈ 'పర' శబ్దము "విశ్వకర్మ స్తూకము" నుండియే ఉపనిషదాది గ్రంథములును, గీతాదులును స్వీకరించినవి.

ఈ 'పర' శబ్దము వేద పురుషునికి ఎంతో ఇష్టమైన దిగా కన్పట్టుచున్నది. కనుకనే "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అను వాక్యములో కూడ, సప్త ఋషులు "ఏ పరమేశ్వరుని యందు ఐక్యమగుదురో, ఏకీభూతులై యుందురో" అని అన్నది. ఈ 'పర' శబ్దమువలె 'పరమ' శబ్దము

కూడ సూక్తకారునికి ఇష్టమైనదే. కనుకనే "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ" అని, అట్లే ఇంకొకచోట విశ్వకర్మ భగవానుని పరముడని కూడ చెప్పి యున్నాడు. "పరమోత సంధృక్" (పరమ+ఉత+సంధృక్). ఆ 'పరమ' శబ్దముతోనే 'ఆత్మ' శబ్దములు జోడింపగా 'పరమాత్మ' పదము సిద్ధమగుచున్నది. కనుక పరమ+ఆత్మ=పరమాత్మ. అనగా "విశ్వకర్మ"యే అని వేదపురుషుడు తనకు 'పరమాత్మ' నామము కలదని తానే నిర్వచించినట్లయినది కదా! అందుకే తరువాత "యాతే ధామాని పరమాణి యావమా యా మధ్యమా" అని తన ధామములు అనగా నివాసములు- పరమములు (శ్రేష్ఠములు), మధ్యమములు (నడిమి రకమువి), అవమములు (తక్కువ రకమువి), అధమములు అని చెప్పికొన్నాడు.

## విశ్వకర్మ - గాయత్రి

దార్శనిక దృష్టితో చూచినప్పుడు జగత్తునకు కారణమైన తత్త్వములను ప్రకృతి అనియు, పురుషుడనియు వేదాదులు చెప్పుచున్నవి. ఈ ప్రకృతినే "మాయ, మూల ప్రకృతి, అవ్యక్తము" అని కూడా అన్నారు ఇక పురుషుని గూర్చి "విశ్వకర్మ, పరమాత్మ, పరబ్రహ్మము" ఇత్యాది పదములతో పేర్కొన్నారు. సంస్కృతములో ప్రకృతి శబ్దము 'స్త్రీ' లింగముగాను, పురుష శబ్దము 'పుంలింగముగాను' ఉన్నవి. ఆ రెంటి సారస్యమును బట్టియే ప్రకృతి

పురుషులకు కావ్యదృష్టితో భార్యా భర్తృ భావము ఆరో పింపబడుచున్నది. పురుషుని యొక్క శక్తియే 'పకృతి'. పరమాత్మ యొక్క శక్తియే 'మాయ'. ఈ జంటను "గాయత్రీ-విశ్వకర్మల"నియు, "శివ శక్తులని"యు (శక్తి-శివులు) అనుట మనవారికి ఇష్టమే. జగత్సృష్టి జరుగుటకు ఈ రెంటి యొక్క సంయోగమే ముఖ్యము. కనుకనే "శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి" అన్నారు శంకరులు సౌందర్యలహరిలో. అందు జగత్తునకు ఉపాదానకారణమైన ప్రకృతినే "గాయత్రిని"గా వేదవాఙ్మయము పేర్కొన్నది. గాయత్రి అనునది 24 అక్షరములు, 3 పాదములు గల ఛందస్సు ఒకటి కలదు. అంతియేగాక జగత్కారణభూతమైన దివ్యశక్తి స్వరూపిణినిగాను, ఒక దేవతనుగాను కూడ, ఆమెను వైదిక వాఙ్మయము వర్ణించినది. మన సంస్కృత వాఙ్మయము సగుణారాధన కోసమై "విశ్వకర్మ"ను ఐదు మొగములు గల దేవునిగా వర్ణించినది. ఈ 5 మోములు, పంచభూతములకు, మనుమయాది పంచబ్రహ్మలకు, బ్రహ్మ, విష్ణు, రుద్రాది పంచమూర్తులకు సానగ, సనాతనాది పంచ ఋషులకు జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, తురీయము (సమాధి), తురీయాతీతము అను పంచావస్థలకు, సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహములకు సంకేతములని తాత్త్వికుల భావము. "విశ్వకర్మ" వలె గాయత్రికూడ ఐదు ముఖములు గల దేవతయే.అవి కూడా ఆకాశాదులైన పంచ

భూతములు మొదలగు వాటికే సంకేతములు (గుర్తులు). సృష్టిలో ఈ పంచసంఖ్యా ప్రాధాన్యమును గూర్చి చెప్పుటకే సృష్టికర్త మన కాలుసేతులకు ఐదేసి వేళ్ళను సృష్టించి సూచించియే యున్నాడు. కాగా "గాయత్రీ-విశ్వకర్మ"లు ప్రకృతి-పురుష స్వరూపులన్నమాట. ఇరువురికీ స్త్రీ-పురుష భేదము తప్ప, ఇంక ఏ భేదమును లేదు. పంచసామ్యములు కూడ ఉభయులకూ కలవు. ఆ ఉభయులు జగత్ప్రవృత్తికి కారణభూతులైన ఆదిమ దంపతులన్న మాట. మన పురాణములలో వర్ణితుడైన శివుడు తన సతికి (పార్వతికి) అర్ధ శరీరమును మాత్రమే ఒసంగి ఆమెను అర్ధాంగిని చేసికొనగా "విశ్వకర్మ" భగవానుడు ఒక పుంస్త్వమును (మగతనము) తప్ప తన సర్వస్వమును ఆమెనుగానే చేసి, దాంపత్య మను నది అద్వైతమేకాని, ద్వైత మెంతమాత్రమును కాదని లోకమునకు చాటినాడు. ఈ గాయత్రీ-విశ్వకర్మల పరమాద్వైత భావమును యజుర్వేదము లోని దిగువ మంత్రము ఇట్లు వక్కాణించుచున్నది. గాయత్రీ మాత, "విశ్వకర్మ" నామముతో పిలువబడిన సందర్భమును ఇచ్చట కాంచగలము.

"దేవాసురా స్సంయత్తా ఆసన్. తేషాం గాయత్ర్యోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూన్, సంగృహ్యాదాయాపక్రమ్యాతిష్ఠత్. తేఽమన్యన్త-యతరాన్వా ఇయ ముపావ ర్త్స్యతి, త ఇదం భవిష్య న్తీతి. తాం వ్యహ్వాయ న్త-విశ్వకర్మన్నితి దేవా, 'దాభీ త్యసురాః. సానాన్య

తదాంశ్చ నోపావర్తత, తే దేవా ఏతద్యజు రపశ్యన్నో జోఽసి, సహోఽసి, భ్రాజోఽసి, దేవానాం ధామనామాసి, విశ్వమసి, విశ్వాయుః, సర్వమసి, సర్వాయురభిభూ రితి వా అసురాణా మోజో, బల, మింద్రియం, వీర్యం, ప్రజాం, పశూ నవృంజత." — (యజుః కాండం-2, ప్రశ్న-4, అనువాకము-11).

గాయత్రీష్టి లేక సంవర్గేష్టి సందర్భములోనిది ఈ మంత్రము. సోదరులకు కలహము వచ్చినప్పుడు ఈ యజ్ఞమును చేసి విజయసిద్ధి నందుదురు.

దేవాసురు లొకసారి యుద్ధమునకు సిద్ధమైనారు. అప్పుడు గాయత్రీదేవి దేవాసురుల- "ఓజస్సు, బలము, ఇంద్రియశక్తి, ఉత్సాహము, ప్రజ, పశుసంపద"- అను ఆఱింటిని హరించి వైచెను. అప్పుడు దేవాసురు లిరువురూ "గాయత్రీదేవి"ని స్తోత్రము చేసిరి. ఆ స్తోత్రములో దేవతలు ఆమెను "విశ్వకర్మ" అనెడి మాటతోను, అసురులు "దాభి" అను మాటంతోను ఆమెను పిలిచినారు. దేవతలింకను, 'ఓజస్సు' మొదలైన దివ్యశక్తులు ఆ తల్లియొక్క స్వరూపములే అని తలంచి ఆమెను అట్లే స్తుతించి, ఆమె అపహరించిన తమ ఓజోబలాదు లాఱింటినీ మరల సంపాదించుకొని అసురులను శక్తిహీనులను చేసి వారిని గెలిచినారు. దీనినిబట్టి, గాయత్రి ఓజోబలాదుల నిచ్చు తల్లియని తెలియుచున్నది. అందుకే సంధ్యావందనము చేయుచునప్పుడు- "ఓజోఽసి, సహోఽసి, బలమసి, భ్రాజోఽసి, దేవానాం, ధామ

నామాసి”- ఇత్యాదిగా మనము ఆ తల్లిని ప్రార్థించుచున్నాము. ఈ మంత్రమునందలి “విశ్వకర్మ, దాభి” అను మాటలకు సాయణులు ఈ విధముగా భాష్యము వ్రాసియున్నారు.

“హే విశ్వకర్మన్నితి, దేవానా మాహ్వానం, దాభీత్య సురాణా మాహ్వానం. విశ్వాని కర్మాణి యస్యాః సా విశ్వకర్మా, తత్సంబోధనం హే విశ్వకర్మన్నితి. దభ్నోతి= విరోధినో, హినస్తీతి దాభీ, తత్ సంబోధనం హే దాభీతి”.

విశ్వమునకు సంబంధించిన సమస్తములైన కర్మములు ఏ తల్లి చేయునో, ఆమె “విశ్వకర్మ” అన్నమాట. ఇది దేవతల పిలుపు. శత్రువులను హింసించునది కనుక “దాభి”. ఇదేమో అసురుల పిలుపు. సాయణులు విశ్వకర్మ సూక్తములలోని “విశ్వకర్మ” శబ్దమునకు భాష్యము వ్రాయుచు- “విశ్వవిషయాణి, సృష్టి, స్థితి, సంహారరూపాణి యస్యాసా విశ్వకర్మా” అని వ్రాసినారు,

వేదములో ఎచ్చట “విశ్వకర్మ” పదము వచ్చినను దానికి సమస్త కర్మాధినాథుడైన పరమేశ్వరుడే అని సాయణులు భాష్యము వ్రాయుచుందురు.

యజుర్వేదములోని ఈ మంత్రము గాయత్రిని, “విశ్వకర్మ” యని సంబోధించి, “గాయత్రీ-విశ్వకర్మ”లకు గల పరమైక్య స్థితిని, జగన్మాతా పితృభావమును మహాగంభీరముగా, వ్యంగ్యరీతిలో వక్కాణించినది. వేదమెప్పుడును ఇట్టి రహస్యములను వ్యంగ్య మార్గముననే బోధించుచుండునని వేద

వేత్తలకు చెప్పనవసరము లేదు. దీనినిబట్టి "గాయత్రీ-విశ్వకర్మ" లకు స్త్రీ-పురుష భేదము తప్ప ఇంక ఏ ఇతర భేదము లేదని బుద్ధిమంతులు, సాధకులు, ఉపాసకులు ఎఱుంగవలసియున్నది. ప్రకృతి స్వరూపిణి యగు "గాయత్రి"యు, పురుష పదముచే చెప్పబడిన "విశ్వకర్మ"యు, విశ్వ సృష్ట్యాది సమస్త కర్మలను చేయువారేనని దీనినిబట్టి గ్రహించి మనము వారిని ఆరాధించి కృతార్థులము కావలయును.

"గాయత్రీ-విశ్వకర్మ"ల ఐక్య (దాంపత్య)మునకు ఇంకొక ప్రమాణమును గూడ చూతము. "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అని రెండవ విశ్వకర్మ సూక్తమునందలి 6వ మంత్రములో మనము చదువగలము. దానికి-మంత్రానుగైన వాక్కులకు, అధినాథుడైనవాడని అర్థము. ఆ మాటకు భాష్యము వ్రాయుచు సాయణులు- "మంత్ర రూపాయాః వాచః పాలకం" అనినారు. ఇక్కడ వాక్కులనగా లౌకిక వాక్కులేగాక, తొలి పలుకులనియు గ్రహింపవలయును. తొలి పలుకులనగా వేదములే. కాగా వాచస్పతి అనగా 'వేదాధిపతి' అన్నమాట. అట్టి వేదాధిపతి వాచస్పతి యగు "విశ్వకర్మ"యే అని మంత్ర భావము.

గాయత్రికి, సావిత్రి, సరస్వతి అనికూడ నామాంతరములు కలవు. మూడు సంధ్యలయందు, మూడు నామములతో ఒప్పెడి ముర్వురమ్మలను ఆరాధించుచుందుము. కాన గాయత్రి అనగా "సరస్వతి" అనికూడా తెలియవలెను. వాక్కు సరస్వతీ స్వరూపమని దిగువ నుదాహరించిన యజు

"వాగ్వై సరస్వతీ సరస్వదీమేవ స్వేన భాగధేయే
నోపధావతి. సై వాస్మి న్వాచం దధాతి. ప్రవదితా
వాచో భవత్యపన్నదతీ భవతి. తస్మా న్మనుష్యా
స్సర్వాం వాచం వదన్తి."

— (తైత్తి-కాండం-2, ప్రశ్న-1, అనువాకము-3)

ఈ మంత్రము వాక్కును, సరస్వతి యని చెప్పు చున్నది. అట్టి సరస్వతికి భర్తయే వాచస్పతి. ఈ సరస్వతిని గూర్చి ఋగ్వేద దిగ్దర్శనము 2వ భాగమున 175వ పుట నుండి 189 వరకు ఋగ్వేద మంత్రముల ద్వారా సవిస్తరముగా వ్రాయబడి యున్నందున ఇచ్చట విస్తరింపబడలేదు. అయినను ముఖ్యమైన ఒక మంత్రమును ఉదాహరింతుము.

"ప్రణో దేవీ సరస్వతీ, వాజేభి ర్వాజినీవతీ,
ధీనా మవిత్ర్యవతు." — (ఋగ్వే. 6-61-4.)

తా॥ తనను ధ్యానించువారిని రక్షించునదియు, జ్ఞానరూపమైన అన్నదానము చేయునదియు అగు సరస్వతీదేవి జ్ఞానదానము చేత, అన్నదానముచేత మమ్ములను రక్షించుగాక! "ధీనాం అవిత్రీ" అనుట వలన ఆమె మన బుద్ధులను రక్షించునట్టి తల్లియని గ్రహింపవలయును. అనగా బుద్ధులకు ప్రేరకురాలని భావము. ఇక "గాయత్రీదేవి"యే సమస్తము అనెడి విషయమును ఛాందోగ్య మంత్రము ద్వారా తెలిసికొందము.

"గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం య దిదం

కించ. వాగ్వై గాయత్రీ. వాగ్వా ఇదగ్ం సర్వం
భూతం గాయతి చ త్రాయతే చ.”

— (3వ అధ్యాయం, 12వ ఖండము)

చరాచరాత్మకమగు జగమంతయు “గాయత్రి”యే. ఈ భావమునే “సర్వం ఖల్విదం బ్రహ్మ” అనికూడ అన్నారు. “విశ్వకర్మ” కూడ సర్వవ్యాప్త పరబ్రహ్మమే కావున రెండు తత్త్వములు (గాయత్రీ-విశ్వకర్మలు) ఒక్కటే అన్నమాట. ఇక గాయత్రి వాగ్రూపిణియై అన్నింటిని పేర్కొనుచున్నది. రక్షించుచున్నది కూడ. ఛాందోగ్య మంత్రమునకు భాష్యము వ్రాయుచు శంకరులు- “గాయత్రి ఛందో రూపముగానే కాక, వాగ్దేవతా రూపముగ కూడ ఉండి, గాన, త్రాణము లనెడి కార్యములను చేయుచున్నది” అనినారు. దీనినిబట్టి గాయత్రి- పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపములతో నున్న వాగ్దేవి, లేక సరస్వతియే అని స్పష్టమగుచున్నది. కనుకనే ఆమె వేదమాత కూడ. కనుకనే “నమామి వేద మాతరం” అనుట పరిపాటి యైనది. అట్టి వాగ్దేవికి పతి కనుకనే విశ్వకర్మను “వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే” అని ఋగ్యజుర్వేద మంత్రములు పలికినవి. కనుక గాయత్రి అనగా ‘వాక్కు’. ఆ వాగ్దేవికి పతి వాచస్పతి విశ్వకర్మ. వారి సంబంధము ప్రకృతి-పురుషుల సంబంధమే కాని ఇతరము కాదు. వారు జగజ్జనకులు భువన పితలు. వారి ఉపాసనము, పూజా పురస్కారాదులు, శ్రవణ, మనన, నిదిధ్యాసలు- జగత్తత్త్వమును తెలుపుచు ముక్తిహేతువు లగుచున్నవి.

"గాయత్రీ-విశ్వకర్మ"ల తత్త్వమును గూర్చి యజురారణ్యక మంత్రముల ద్వారా ఇంకను ఆలోచించి చూతము.

**చతూష్పాద్విభూతి :**

జగత్ప్రసిద్ధమగు పురుష సూక్తము నందు ప్రస్తుతింప బడిన దేవుడు ఈ "విశ్వకర్మ"యే అని ఎల్లరూ ఎఱింగిన విషయమే. పురుష సూక్త ప్రారంభము నుండి పలుసార్లు పురుషుడని పేర్కొనబడిన ఈ జగత్కారణ తత్త్వము చివరకు-

"విశ్వకర్మణ స్సమవర్తతాధి,
తస్య త్వష్టా విదధద్రూపమేతి."

అని "విశ్వకర్మ" యనెడి విశేష నామముచే పేర్కొనబడినది. ఈ "విశ్వకర్మ" నాలుగు పాదముల విభూతి (ఐశ్వర్యము) కలవాడు అగుచున్నాడు. ఈ నాలుగు పాదములు మాండూక్యోపనిషత్తులో ఓంకారమునకు చెప్ప బడిన పాదములనియు భావింపవచ్చును. అనగా ఇది పిండాండ పక్షమున జీవులు తరించుటకు ఉపయోగించునట్టి స్థితి. పురుషుని నాలుగు పాదములలో సమస్త బ్రహ్మాండములు కూడ ఒక్క పాదము మాత్రమే. ఈ అంశమే "పాదోఽస్య విశ్వా భూతాని" అని మంత్రములో చెప్పబడినది. ఈ పాద మాత్రమైన బ్రహ్మాండము భగవంతుని యొక్క వాస్తవ (ఋత) స్వరూపము కాదు. ఇంతకంటెను ఘనతరమైనదియు, సత్యమైనదియు, అనంతమైనదియు ఆయన (విశ్వకర్మ) స్వరూపము. తైత్తిరీయానందవల్లి "సత్యం జ్ఞాన మనంతం

బ్రహ్మ" అని చెప్పినది. దానిని పురుష సూక్త వాక్య మేమో "త్రిపాదస్యామృతం దివి". ఒక్క పాదమైన బ్రహ్మాండము కాక, తక్కిన 3 పాదములు స్వర్గమును, దానికి మించిన అమృతమును అయి ఉన్నవి అన్నది. దీనిని సృష్టి సూక్తము "నాసదాసీ న్నో సదాసీత్" అని వర్ణించినది. విశ్వకర్మ సూక్తమేమో- "పరో దివా పర ఏనా...గుహా యత్" అన్నది (చూడుము, పుటలు-213, 216).

అది ద్యావా పృథువుల కంటెను, దేవాసుర మనుష్య మృగ, పశు, పక్షి, క్రిమి, కీట, జడాదుల కంటెను పరమైన దని అన్నది. ఏతావతా తేలిన సారాంశము- అట్టి శాశ్వతా ఖండ, నిర్వికార, చిదచిదతీత పరమాత్మ రూపమును 4 పాదములని చెప్పుట పురుష సూక్త హృదయము. యథార్థ మాలోచించిన పరమాత్మ స్వరూపమును 4 పాదములుగా వర్ణించుట అజ్ఞానమే. ఏలయన అది పరిమాణము (కొలత)ల కందనంతటి అపరిమితము, అపరిమేయము, అనంతము. అయి నను సాధకుల బోధ సౌకర్యమునకై బ్రహ్మ స్వరూపమును దృష్టిలో ఉంచుకొని చూచినప్పుడు బ్రహ్మాండము ఒక పాదమే, స్వల్పమే అని సూచించుటకు అట్లు చెప్పబడినదని పాఠకులు గమనింపవలయును. శ్రుతి తాత్పర్యమును అదియే.

జగము తనలోని ఒక అంశము మాత్రమే అనెడి ఈ విషయమును గీతలో భగవానుడు- "విష్టభ్యాహ మిదం సర్వ మేకాంశేన స్థితో జగత్". నే నీ జగత్తున నా ఒక్క

అంశము (పాదము)తో మాత్రమే వ్యాపించియున్నాను అని స్పష్టము చేసినాడు. ప్రణవము యొక్క 4 పాదములు లేక మాత్రలు- (అకార, ఉకార, మకార, అమాత్రలు) జాగ్రత్స్వప్న, సుషుప్తి, సమాధులకు సంకేతములు. ఏ తద్రూప చతుష్పాద విభూతి కలవాడు పరమాత్మ కాగా, ఒక్క పాదము మాత్రమే సమస్త బ్రహ్మాండములు అన్నప్పుడు- మొదటి పాదమైన జాగ్రదవస్థ సూచింపబడుచున్నది. జీవుడు సుఖ దుఃఖాదిక సంసారము ననుభవించునది జాగ్రద్దశలోనే కావున, ఆ జాగ్రదవస్థ జగత్తునకు సూచకమని తత్త్వార్థమును భావింపవలెను. అయితే స్వప్నమునందు కూడ సుఖ దుఃఖాదులు కలవు కదా! అన్నచో అవి కేవలము ప్రతిభాస మాత్రములు, మనోమయములు మాత్రమే కావున మిథ్యాభూతములే.

"విశ్వకర్మ" యొక్క ప్రతిరూపమే అయిన గాయత్రీ దేవియు చతుష్పాదములతో (4 పాదములతో) ఒప్పునట్టిదే అని ఛాందోగ్యోపనిషత్తు పలుకుచున్నది.

"సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ,
తదేతదృచాభ్యుక్తం- తావా నస్యమహిమా
తతో జ్యాయాగ్ంశ్చ పూరుషః, పాదోఽస్య
సర్వా భూతాని, త్రిపాదస్యామృతం దివి."

— (3వ అధ్యాయం-12వ ఖండము)

"గాయత్రి"ని బ్రహ్మ సమ్మిత (బ్రహ్మమయి) అగు

చతుష్పాద దేవతగా దర్శించినప్పుడు విశ్వభువనములన్నియు ఒక పాదముగను, తక్కినదంతయు 3 పాదములుగను ఎన్నవలయును. శ్రీమద్గాయత్రీ మంత్రము 24 అక్షరములు కలది కావున ఆరేసి అక్షరములను ఒక పాదముగా ఎన్నుకొన్నచో, 4 పాదములు ఏర్పడగలవని శ్రీ శంకరులు తన ఛాందోగ్య మంత్ర భాష్యములో విశదీకరించినారు.

బ్రహ్మసూత్ర శ్రీ భాష్యమునందు జ్యోతిరధికరణములో శ్రీ రామానుజులు ఈ విధముగా వ్రాసినారు- "ఇచ్చట గాయత్రి అనునది సర్వాత్మకముగా చెప్పబడుచున్నది. ఇట్లు సర్వాత్మకముగా నుండుట ఛందో రూపమగు గాయత్రికి అసంభవము గాన ఫలమునకై పరబ్రహ్మమును "గాయత్రీ సదృశుని"గా ధ్యానింపవలయునని ఈ పై శ్రుతి విధించుచున్నది. "పాదోస్య సర్వాభూతాని" ఇత్యాది వాక్యములచే పరబ్రహ్మము 4 పాదములతో కూడుకొనినది గాను చెప్పబడుచున్నది. గాయత్రీ ఛందస్సునకు 4 పాదములును కలవు కాబట్టి, ఈ విషయమున- పరబ్రహ్మమునకు, గాయత్రి (ఛందస్సు)తో సామ్యము సంభవమే. ఏల యనిన, వేదముల యందు కొన్ని తావుల గాయత్రీ ఛందస్సునకు 4 పాదములు కనబడుచున్నవి-

"ఇంద్ర శ్శచీపతిః, వలేన పీడితః,
దుశ్చ్యవనో వృషా, సమిత్సుసాసహిః."

ఛందోగులు- 1) భూత 2) పృథివీ 3) శరీర 4) హృదయములను నిర్దేశించి "సైషా చతుష్పదా" అను వాక్య

మున ఆ నాల్గింటిని "గాయత్రి"కి పాదములనుగా పఠించి యున్నారు. అట్లు భూతాదులను పాదములుగా కలిగియుండు నది కేవల ఛందస్సు కాదు. కాబట్టి ఈ తావున "గాయత్రీ" శబ్దము పరమాత్మ పరమని చెప్పుట యుక్తము." (ఆంధ్రీకృత శ్రీ భాష్యము.)

రామానుజులు పేర్కొనిన ఈ పరమాత్మ "విష్ణువు కాని, విశ్వకర్మ"గాని అనుటలో ఎవ్వరికినీ అభ్యంతరముండ నక్కరలేదు. శంకరులు బ్రహ్మసూత్ర భాష్యములో ఈ అధికరణమును 'జ్యోతిశ్చరణాధికరణ' మనినారు. తన భాష్యములో శంకరులు కూడ గాయత్రిని చతుష్పాదయుక్త బ్రహ్మముతో తుల్యమే- బ్రహ్మమే అని నిర్వచించినారు. విస్తరము నెఱుంగదలచినవారు ఆ యా భాష్యములను తిలకించి పూర్ణతత్త్వమును గ్రహింపవచ్చును. దీని కంతటికీ సారాంశము 4 పాదములను కలిగియుండుట "గాయత్రీ-విశ్వకర్మ"లకు సమానమే అని. ఒక పక్షమున "గాయత్రి"ని త్రిపదగా ఎన్నినను ఆ జగన్మాత సాక్షాత్తు త్రిపాద విభూతిమయి అయిన పరబ్రహ్మమే కాగలదు. ఆమె సాకారమున "విశ్వకర్మ స్వరూపమే" అని పంచశీర్షాది లక్షణములు తెల్లము చేయుచున్నవి.

<u>సావిత్రి :</u>

గాయత్రీ నామములలో "వాచస్పతిం విశ్వకర్మాణం" అనెడి మాటనుబట్టి గాయత్రి వాగ్రూపిణి అయిన "సరస్వతి" అని తెలిసికొన్నాము. గాయత్రీ నామ చర్చకూడ ఇప్పుడు

చేసినాము. ఇకపోగా, "సావిత్రి" అనెడి మాటను గూర్చి విచారింపవలసియున్నది. "సవితృ" దేవునికి సంబంధించినది 'సావిత్రి' అని భావము. గాయత్రీ మంత్రములో "ఓం తత్ సవితుః వరేణ్యం" అని 'సవిత' వినబడుచున్నాడు. ఈ సవిత సహస్రారము నందలి "విశ్వకర్మ బ్రహ్మమే" అని ఋగ్వేద దిగ్దర్శనము 2, 3 భాగముల యందు వివరింపబడియే యున్నది. ఇట్టి సవితృ సంబంధము గల సావిత్రిని గూర్చి ఇప్పుడు విచారింతము. వైఖానసాగమము 20వ పటలమున, తృతీయావరణములో గంగాది దేవతల స్థానములను చెప్పుచు, త్వష్టృ దేవుని గూర్చి ఇట్లు చెప్పబడినది-

"త్వష్టా ఫ్లోతవస్తోత్తరీయాది సంచయః, స్థానే హేమాభ, శ్శుక పింఛాంబరధర, శ్చతుర్భుజః, కలశాక్ష మాలా పాణి, ర్జటాధరో, హంసవాహనో, రూపాద్యక్షురబీజ, స్సావిత్రీపతి, రభిజజ్ఞాతః, కమండలుధ్వజో, హుంకారరవ, స్త్వష్టా...త్వష్టారం రూపజాతం నిధిజం ఫ్లోతాధిపతి మితి."

ఇందు త్వష్టృదేవుని స్వరూపాది విశేషములను చెప్పుచు ఆయన (త్వష్టృదేవుడు) "సావిత్రీపతి" అని చెప్ప బడినది. త్వష్ట అనగా "విశ్వకర్మ" అనికూడ వేద హృద యము. భాష్యకారులు కూడ అట్లు భావించియేయున్నారు. పురుష సూక్త మంత్రముచు ఈ ప్రకరణారంభమున చదివియే యున్నాము.

ఇందును గూర్చి మిత్రసాహస్రి పద్యములను కూడ చూచితిమి. కనుక ఇక సావిత్రి అనగా "గాయత్రి" యని

సుస్పష్టమే కదా! కనుక "గాయత్రీ-విశ్వకర్మల"కు (ప్రకృతి-పురుషులకు) పత్నీపతి ధర్మము, జగత్పితృత్వమును సుస్పష్టము. ఈ అంశమును వైఖానసాగమము కూడ వాచ్యముగానే చెప్పి శ్రుతి మార్గమును బలపరచినది. "గాయత్రీ-విశ్వకర్మ" లిద్దరును పంచముఖములు, దశ బాహువులు కల వారగుట మొదలగు విషయములు కూడ సరిపోవుచున్నవి. పై ఆగమనములో "త్వష్ట్ర దేవుడు" హంసవాహనుడనుట కూడ ఆయన యొక్క సావిత్రీ పతిత్వమునకు సూచికమే. బ్రహ్మయు-విశ్వకర్మయు ఇద్దరును హంసవాహనులే. ఇక్కడ ఉచ్ఛ్వాస, నిఃశ్వాస రూప ప్రాణమే 'హంస' అనగా. ఏలయన, ఆ హంసను ఎక్కియే జీవాత్మ ప్రయాణము చేయుచున్నాడు. ప్రాణమేమో సూక్ష్మ శరీరములోని భాగము. అది రజోగుణము వల్ల కలిగినట్టిది. స్థూల దేహము నందలి ప్రాణము తమోగుణమయము. జీవుడా స్థూల దేహమును వీడి చనునప్పుడు ఆ పంచప్రాణములతో సహా ప్రయాణము చేయును. కావుననే జీవస్వరూప "విశ్వకర్మ"కు (త్వష్ట పరమాత్మకు) ప్రాణమే వాహనమని తత్త్వజ్ఞులు తెలియవలసియున్నారు. ప్రాణము లేకుండా ఏ జీవి యొక్క జీవుడును వేఱై యుండడు. హంస యనగా జీవుడనియు, మనస్సనియు కూడ వేదాంతులు భావింపకపోలేదు. "రావే పోదాము, మానస హంసా రావే పోదాము." ఇత్యాది తత్త్వములలో మనస్సును 'హంస' అని బ్రహ్మముగారి శిష్యుడు సిద్దప్ప భావించినాడు. "హంస లేచిపోయినది" అన్నప్పుడు జీవు

డనియే భావము. "విశ్వకర్మ" మేఘవాహను డనియెడి భావము వేదసమ్మతమే అయినను అది పురాణ కాలమున ఎక్కువగా ప్రచారమైనది. "అపాం గర్భం వ్యదధాత్పు రుత్రా" విశ్వకర్మ నీటియందు జగద్బీజము నుంచినాడు-అనెడి అర్థము గల మంత్రము యొక్క భావము "విశ్వకర్మ" మేఘవాహనము నెక్కి తిరుగుచున్నాడనుటకు మూలమైనట్లు కన్పట్టుచున్నది. అస్తు. ఈ విధముగా మూడు నామములచే పేర్కొనబడిన "గాయత్రీ-సావిత్రీ-సరస్వతులు" విశ్వకర్మ పరమేశ్వర తత్త్వమున అంతర్భవించి జగన్మాతలు, వేద మాతలు అయి "నమామి వేద మాతరమ్" అనెడి సూక్తికి లక్ష్యమైనారు.

పంచవిధ సామ్యములు :

"గాయత్రీ-విశ్వకర్మ"లకు పంచవిధ సామ్యములు కూడ ఉన్నవి.

1) నామసామ్యము : విశ్వకర్మ పదము "గాయత్రీ-విశ్వకర్మలకు" ఇద్దరికినీ చెల్లినదని, చెల్లునని యజుర్వేద మంత్రమే చెప్పినది కదా!

2) రూపసామ్యము : 5 తలలు, 10 చేతులు, సచ్చిదానంద స్వరూపములు మొదలైన రూపసామ్యములు ఇరువురికినీ కలవు.

3) అవస్థానసామ్యము : అవస్థాన మనగా సచ్చిదానంద అనంతత్త్వాదులు. ఇవి ఉభయులకును కలవు. ఇరువు

రును అనంత మహిమలు కలవారై తమను ఉపాసించువారిని తరింపచేయుదురు.

4) అనుష్ఠానసామ్యము : అనుష్ఠాన మనగా వారు చేసెడి కర్మలని అర్థము. "గాయత్రీ-విశ్వకర్మ" లిద్దరును జగత్తుల యొక్క సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహాదులను చేయుచునేయున్నారు. కాన, వారికి అనుష్ఠాన (కర్మ) సామ్యము ఉన్నది.

5) అధిష్ఠాన సామ్యము : అనగా ఆధారము సమానమై ఉండుట. "గాయత్రీ-విశ్వకర్మ" లిరువురూ జగత్తులు తోచుటకు ఆధారభూతులే కనుక వారికి అధిష్ఠానసామ్యము కూడ ఉన్నది. ప్రకృతి-పురుష స్వరూపులైన "గాయత్రీ-విశ్వకర్మ"లు అనెడి ఆధారము (అధిష్ఠానము-basis) లేకుండా బ్రహ్మాండములు పుట్టి పెరిగి గిట్టనేరవు కదా! ఈ పంచసామ్యములే కాక, పురుషసూక్త-ఛాందోగ్యోపనిషత్తులు చెప్పిన 'చతుష్పాద్విభూతి సామ్యము' అనునది "గాయత్రీ-విశ్వకర్మ"లకు ఎక్కువ (విశేషము)గా కలదు. యజుర్వేద వాక్యములకు అనుకూలముగా స్కాంద పురాణ నాగరఖండము దిగువరీతిని పలుకుచున్నది.

"ఓంకారస్తు పరంబ్రహ్మా, విశ్వకర్మా పరశ్శివః,
పరాత్పర తరోంకారః, పరాదూర్ధ్వం, పరాత్పరః.
అగ్ని స్తు విశ్వకర్మైవ, తదర్థం వహ్ని దైవతమ్,
తస్య బ్రహ్మ ఋషి శ్చైవ, గాయత్రీ ఛంద ఉచ్యతే.
స్వరూపం పరమాత్మాచ, ప్రణవస్యైవ తస్య హి,

లోకమాతా చ సావిత్రీ, త్ర్యక్షరం బ్రహ్మ సమ్మితం.
వేదశ్చ లోకమాతా స్యా, ద్గాయత్రీ వేద మాతృకా,
జాతాఽసౌ దేవతానామ్నా, విశ్వకర్మేతి కీర్తితా."
— ఇతి స్కాందపురాణే నాగరఖండే బ్రాహ్మణ్య
గాయత్రీ నిర్ణయోనామ చతుర్థశోఽధ్యాయః.)

తా॥ పరమశివుడును, విశ్వకర్మయు, పరబ్రహ్మమును ఓం కారమే అగుదురు. పర స్వరూపమున కంతటికినీ ఊర్ధ్వమున ఉన్నది అదియే. అగ్నికూడ "విశ్వకర్మ" రూపమే. అందుకే అది వహ్ని దైవతం కలదయ్యెను. ఆ ప్రణవమునకు (ప్రణవ రూపము నొందిన గాయత్రికి) 'బ్రహ్మ' ఋషియు,'గాయత్రి' ఛందస్సును, 'పరమాత్మ' స్వరూపమును అగును. లోకమాత అయిన సావిత్రి 3 అక్షరములు కలదియు, బ్రహ్మసమ్మితయు అగుచున్నది. శ్రుతి (వేదము) లోకమాతయే. అట్టి వేదమునకు తల్లి గాయత్రి. ఆ గాయత్రీ దేవత "విశ్వకర్మ" నామముతో కీర్తింపబడినది. ముందు ఉదాహరించిన వేదాదుల అభిప్రాయమునే ఈ పురాణ వాక్యములు ధృడపరచి విస్తరించి చెప్పినవి. దీనినిబట్టి "గాయత్రీ-విశ్వకర్మ"లకు స్త్రీ-పురుష భేదము తప్ప పంచ ముఖ, దశ బాహుత్వాది బాహ్య స్వరూప సామ్యమును, సచ్చిదానంద స్వరూప సృష్ట్యాది క్రియాకరణ ఆంతరంగిక రూపక్రియా సామ్యమును కలిగి, వారు ఉభయులూ అద్వైత స్వరూపులని స్పష్టమగుచున్నది. "బ్రహ్మసత్యం జగద్బ్రహ్మ" అనెడి సూత్రము ననుసరించి బ్రహ్మస్వరూప

గాయత్రియేకాని వేఱుకాదు. ఇదియే "గాయత్రీ-విశ్వకర్మ"ల పరమాద్వైత సిద్ధాంతము.

**గాయత్రీ మంత్రార్థము :**

ఇంకను ఆలోచించినచో గాయత్రీ మంత్రము చేత ఉపాసింపతగినవాడు "విశ్వకర్మ"యే అని తెలియగలము. గాయత్రీ పదము స్త్రీ లింగములో ఉన్నను, గాయత్రీ మంత్రార్థము మాత్రము పుంలింగపరమయ్యే ఉన్నది. ఎట్లో చూతము- గాయత్రీ మంత్రము ఋగ్వేదములో 3వ మండలమున 62వ సూక్తములో 10వ ఋక్కు. ఇది గాయత్రి అనెడి ఛందస్సులోనే ఉన్నది. ఆ మంత్రమిది.

"ఓం తత్సవితు ర్వ రేణ్యం
భర్గో దేవస్య ధీమహి
ధియో యో నః ప్రచోదయాత్."

— (ఋ. 3-62-10)

దీనికి సాయణుల భాష్యము ననుసరించి అర్థమును చూతము.

టీక :- యః సవితా దేవః=ఏ సవితృ దేవుడు, అస్మాకం=మన యొక్క, ధియః=బుద్ధులను లేదా ధర్మాధర్మాది విషయములైన కర్మలను, ప్రచోదయాత్=ప్రేరేపించునో, తత్=ఆ సవితృ దేవునియొక్క, అనగా సర్వాంతర్యామిగా ప్రేరకుడైన, ఆ జగములను సృష్టించిన పరమేశ్వరుని

యొక్క, వరేణ్యం భర్గః = అందరకును ఉపాస్యముగను, జ్ఞేయముగను భజింపతగిన, భర్గమను పేరుగల తేజమును (అవిద్యా తత్కార్యములను అది పొందుటంబట్టి దానికి భర్గమని పేరు కలిగినది) అనగా పరబ్రహ్మాత్మకమును, స్వయంజ్యోతియు నగు తేజమును అని భావము. ధీమహి = ధ్యానించుచున్నాము.

తా॥ ఏ సవితృ దేవుడు మాయొక్క ధర్మాధర్మాది విషయములైన బుద్ధులను ప్రేరేపించుచున్నాడో, ఆ అంతః ప్రేరకుడైన సవితృ దేవునియొక్క శ్రేష్ఠమైన భర్గమను తేజమును ధ్యానించుచున్నాము. అనగా సృష్టికర్తయు, బుద్ధి ప్రేరకుడును అగు భగవంతుని (విశ్వకర్మ భగవానుని) ధ్యానించుచున్నామని భావము.

సవిత :-

సవితృ శబ్దము "షూ ప్రేరణే" అను ధాతువు నుండి పుట్టినది. "సువతి=సుప్తమ్ ప్రేరయతీతి సవితా" నిద్రించువానిని మేలుకొలుపు దేవుడని 'సవితృ' పదమునకు వ్యుత్పత్తి అర్థము. సాయణులు సవితృ శబ్దమునకు 'సూర్యుడని'యు, భర్గ శబ్దమునకు 'అన్న'మనియు కూడ అర్థము చెప్పినారు. అవి కేవలము బాహ్య (ఆధి భౌతికార్థములు) ర్థములు మాత్రమే. అంతరర్థమును పర్యాలోచించినచో నిద్ర నుండి మేల్కొలుపుట అనగా- అజ్ఞాన నిద్రనుండి మేలుకొలుపుట అనియే భావము. అట్లు మెలుకొలుపువాడు వెలుపలి

సూర్యుడు కాక అంతరంగమున ఉన్నవాడును, పరమాత్మయు అగు అంతర్యామి రూప సూర్యుడే కావలయును. అట్టి అంతర్యామి "ఏష దేవో విశ్వకర్మా, సదా జనానాం హృదయే సన్నివిష్టః" అని శ్వేతాశ్వతరమును, "సర్వస్య చాహం హృది సన్నివిష్టః" అని గీతయూ చెప్పిన "విశ్వకర్మ"యే అగుచున్నాడు. వేద మంత్రములకు ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మికములైన మూడర్థములు కూడ ఉండు నని వేదార్థవేత్తలకు చెప్ప పనిలేదు. ఆ పక్షమున ఇచ్చట అంతరమగు ఆధ్యాత్మికార్థము కూడ మనము భావింపవలసి యున్నది. బుద్ధులను ప్రేరేపించు దేవుడు సూర్య, ఇంద్ర, వరుణాదిరూపుడు కాడు. పూర్వము చెప్పికొన్న "విశ్వకర్మ పరమాత్మ"యే ఆతడు. కనుక గాయత్రీ మంత్రోపాస్యుడు సర్వకర్మలకు ప్రభుడును, హృదయములో నున్నవాడును, బుద్ధులను ప్రేరేపించువాడును అగు సవితృ స్వరూప "విశ్వకర్మ పరమాత్మ"యే! కనుక బాహ్యార్థమున గాయత్రీ మంత్రార్థముగా బాహ్య సూర్యుని చెప్పుకొన్నప్పటికీ, అంతరర్థమున అంతఃకరణ వృత్తులను ప్రేరేపించి, సత్కార్యములు చేయించి ముక్తి నిచ్చునట్టి "జ్ఞేయ స్వరూప విశ్వకర్మ"యే అనుట సమంజసము. సాయణులు కూడ తన భాష్యములో 'సవిత'ను సర్వాంతర్యామి అయిన పరమాత్మనుగా పేర్కొన్నారు. వానిని జగత్తులకు 'స్రష్ట, పరమాత్మ' అనియు అన్నారు. అంతియేకాదు. "త ఆయజన్త ద్రవిణం సమస్మా ఋషయః పూర్వే జరితారో నభూనా"

అనెడి మంత్రమునకు భాష్యము వ్రాయుచు, "తే పూర్వ ఋషయో = ద్రష్టారో, రశ్మయో, అస్మా=ఆదిత్యాత్మ కాయ విశ్వకర్మణే, ద్రవిణం= తేజ ఆయజన్త" అని వ్రాసి "విశ్వకర్మ" ఆదిత్య స్వరూపుడే అనినారు కదా! (ఋ-మండలం-10, సూక్తము 81) కావున గాయత్రీ మంత్రము నందు 'సవిత' అను పేరుతో చెప్పబడిన దేవాదిదేవుడు ఈ "విశ్వకర్మ"యే అని సాధకులు భావించి, ఆ జగముల తండ్రిని ఉపాసించి ముక్తి పొందవలసి యున్నది. ఈ విషయము శ్రీ బి. (బింజగనవిలె) నారాయణ అయ్యంగారనెడి కర్ణాటక విద్వాంసుడు 20వ శతాబ్ది ప్రారంభమున INDO-ARYAN MYTHOLOGY అను గ్రంథమును ఆంగ్లమున వ్రాసియున్నారు. ఆయన ఆ పుస్తకము యొక్క ప్రారంభమున గాయత్రీ మంత్రార్థమును వివరించుచూ-

"సవితృ" శబ్దమునకు 'జనకుడని' అర్థమనియు, ఋగ్వేద కాలమున ఈ అర్థము ఎక్కువగా ప్రచారములో ఉన్నదనియు, గాయత్రీ మంత్రములోని 'సవితృ' శబ్దమునకు అండపిండ బ్రహ్మాండములను సృజించిన 'జగజ్జనకు'డని అర్థమనియు, అట్టి జగముల తండ్రి "విశ్వకర్మ"యే అనియు, ఋగ్వేదీయ విశ్వకర్మ సూక్తములోని "యో నః పితా జనితా యో విధాతా", "చక్షుః పితా మనసాహి ధీరో" అనెడి వాక్యములను చూపి, గొప్ప అర్థ వివరణ, సమన్వయములను చేసినారు. శ్రీ నారాయణ అయ్యంగారి వివరణను చదివిన పిమ్మట నా పరిశోధనములో క్రింది సత్యములు బయటపడిన పడినవి.

"షు" అనెడి సంస్కృత ధాతువునకు ప్రేరణము ఒక్కటే అర్థము కాదు. "షు ప్ర సవైశ్వర్యయోః" అని కూడ అర్థములు కలవు. ప్రసవించుట అనగా కనుట అని అందరెఱిగినదే. దీనినిబట్టి సవిత అనగా జగములను కనినట్టి 'జగత్పిత' అని అర్థము సిద్ధమగుచున్నది. ప్రేరణ చేయు వాడను అర్థమేకాక, "అండపిండ బ్రహ్మాండములను కనిన తండ్రి" అని కూడ 'సవితృ' శబ్దమునకు అర్థము లభించును. అప్పుడు "ఏ జగజ్జనకుడు మా బుద్ధులను ప్రేరేపించు చున్నాడో, అట్టి తండ్రి యొక్క సచ్చిదానంద ఘన తేజ మును ధ్యానించుచున్నాము- ఉపాసించుచున్నాము" అని అర్థము సిద్ధించును. కనుకనే 'సవిత' అనగా జనకుడు = ఉత్పాదకుడు, పుట్టించినవాడు అని అర్థసిద్ధి కలుగును. అప్పుడు "యో నః పితా జనితా", "చక్షుః పితా" అన్న మంత్రముల ప్రకారము "సవితయు-విశ్వకర్మయు" ఒకే ఒక దివ్య జగత్కారణ శక్తి కాగలరు. నారాయణ అయ్యంగారు చెప్పిన అర్థమును దిగువ నుదాహరించెడి యాస్కాచార్య నిరుక్త వాక్యములు కూడ బలపరచుచున్నవి. 'సవీమని' పదమునకు అర్థము చెప్పుచు సవితృ శబ్దమును గూర్చి యాస్కాచార్య నిరుక్తము ఇట్లనుచున్నది.

1) "సవీమని ప్రసవే" "దేవస్య వయం సవితుః సవీ మని ఇత్యపి నిగమో భవతి"

— (నిరుక్తం 6వ అధ్యాయము)

<u>వ్యాఖ్య</u>: సవీమని అనవగత మేతత్. ప్రసవే

ఇత్యవగమః. "దేవస్య వయం సవితుః" సవీమని ఇత్యపి నిగమః. సర్వార్థ ప్రసవితుః దేవస్య సవీమని = ప్రసవే-సర్వార్థాభ్యనుజ్ఞానే, వయం సదాస్యామేతి యోజన."

దీని కంఠతటికిని అర్థము- మనము సర్వమునకును ఉత్పాదకు (జనకుడగు) డగు దేవుని యొక్క ఆజ్ఞలో ఉందుముగాక అని. దీనినిబట్టి సవిత అనగా పుట్టించినవాడు, తండ్రి అని స్పష్టమగుచున్నది.

2) "హోతృజప స్త్వగ్ని ర్వైశ్వానరీయో భవతి. "దేవ-సవిత రేతం త్వా వృణతేఽగ్నిం హోత్రాయ సహ పిత్రా వైశ్వానరేణ" ఇతి. ఇమ మేవాగ్నిం సవితారమాహ. సర్వస్య ప్రసవితారమ్..." — (నిరుక్తం, 7వ అధ్యాయం)

వ్యాఖ్య : సవితః దేవ = హే సకల జగదుత్పాదక దేవ! దీనినిబట్టి కూడ సవిత అనగా సకల జగత్తులను కన్న దేవుడని స్పష్టమగుచున్నది కదా! సాయణులు "షూ ప్రేరణే" ధాతువునకు ప్రేరణార్థమును సామాన్యముగా గ్రహించినారు. అందుకు కారణము గాయత్రీ మంత్రములో ప్రచోదయాత్ = ప్రేరేపించునో అని యుండుటయే. కాని వేద మంత్రార్థ నిర్ణయములో అతి పూర్వుడగు యాస్కా-చార్యునిదే మఱియొక ప్రబలతర ప్రమాణమును చూతము-

"దేవ స్త్వష్టా సవితా విశ్వరూపః
పు పోష ప్రజాః పురుధా జజాన,
ఇమా చ విశ్వా భువనా న్యస్య
మహ ద్దేవానా మసురత్వ మేకమ్."

— (ఋ. 3-55-16)

<u>వ్యాఖ్య</u> : సవితా=సర్వేషా ముత్పాదయితా.
— (నిరుక్తం 10వ అధ్యాయము.)

ఈ మంత్రము త్వష్ట్ర సూక్తము లోనిది. దీని భావము ఇది. సర్వమును పుట్టించినవాడును, విశ్వరూప ములు గలవాడును, దేవుడును అగు త్వష్ట (విశ్వకర్మ) నానా విధ ప్రాణులను సృష్టించి పోషించుచున్నాడు. ఈ సమస్త లోకములు ఆ దేవుని ఐశ్వర్యమే. ఆయన సొత్తే అన్న మాట! ఇట్లనుటచేత సవిత "సాక్షాద్విశ్వకర్మ"యే అని తెలుచున్నది కదా! ఈ మంత్రములో త్వష్ట, సవిత- అనెడి రెండు పదములు ప్రయోగింపబడి ఆ ఇరువురు ఒకే తత్త్వ మని చెప్పుట జరిగినది. ఇది ఒక గొప్ప విశేషము. "ఏకం సత్" అనెడి సూక్తికి ఇదికూడ నిదర్శనమే. సవితను గూర్చిన అనేక విశేషములు ఋగ్వేద దిగ్దర్శనము 2, 3 భాగములందు గలవు. ఇంకనూ పరిశోధన కొనసాగుచున్నది.

ఇక్కడ ఒక విశేషము చెప్పవలసియున్నది. కోణార్కలో సూర్య దేవాలయ మున్నదని అందఱికి తెలిసిన విషయమే. రథాకారములో నున్న ఆ దేవాలయమునకు 24 చక్రములను, ఆ మహాశిల్పాచార్యులు ఏర్పఱచినారు. ఈ ఇరువది నాలుగు చక్రములు చతుర్వింశతి తత్త్వములకు, గాయత్రీ మంత్రములోని 24 అక్షరములకు సంకేతములు. పంచమహా భూతములు, అవ్యక్త, మహాదహంకారములు, ఏకాదశేంద్రియములు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ

ధములు అనువాటినే "చతుర్వింశతి తత్త్వము" లందురు. వీటితోనే సృష్టి జరుగుచున్నది. 24 చక్రములు గల ఈ సూర్య రథమును ఏడు గుఱ్ఱములు లాగుచుండును. సూర్య రథమునకు గూడ ఏడే గుఱ్ఱములు. ఈ ఏడు గుఱ్ఱములు, ఆధారాది సహస్రారాంతము గల చక్రములకు సూచకములు. శరీరము కూడ చతుర్వింశతి తత్త్వములతోను, సప్త చక్రములతోను కూడియుండుట గమనింపదగియున్నది. తాత్త్వికులైన మన మహా శిల్పాచార్యులు ఇట్టి ఆధ్యాత్మిక రహస్యముల నెన్నింటినో తమ శిల్పములందు పొందుపఱచి విశ్వ రహస్యమును సర్వజన సులభము చేసినారు.

"గాయత్రీ విశ్వకర్మాణౌ, వచింత్య మహిమాన్వితౌ,
విశ్వశిల్ప ప్రణేతారౌ, పితరౌ జగత స్తుమః."

— గ్రంథకర్త

టీక : అచింత్య మహిమ అన్వితౌ=ఆలోచింప వీలుగాని మహిమ గలవారును, విశ్వశిల్ప ప్రణేతారౌ = బ్రహ్మాండ శిల్పమును నిర్మించినవారును, జగతః=లోకమునకు, పితరౌ = తల్లిదండ్రులయినవారును అగు, గాయత్రీ విశ్వకర్మాణౌ=గాయత్రీ-విశ్వకర్మలను, స్తుమః = స్తుతించుచున్నాము.

# విశ్వకర్మ - త్వష్ట (బ్రహ్మ)

"త్వష్ట విశ్వకర్మ తనయుడే అనియును
ఇరువు రొక్కరూపమే యటంచు
శ్రుతులు, భాష్యములును నుతియించు చున్నవి
విశ్వహిత చరిత్ర, వినర మిత్ర." — 861

యజురారణ్యక పురుష సూక్తములోని ఈ మంత్రము త్వష్ట "విశ్వకర్మ" యొక్క తనయుడని చెప్పుచున్నది.

"విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విధద్రూప మేతి" విశ్వకర్మ నుండి త్వష్ట్ర దేవుడు పుట్టినాడని దీని భావము. విశ్వకర్మ ద్యావా పృథువులను సృష్టించినట్లే 'త్వష్ట' కూడ వాటిని సృష్టించినాడని దిగువ మంత్రము అనుచున్నది.

"య ఇమే ద్యావా పృథివీ జనిత్రీ
రూపై రపింశద్భువనాని విశ్వా
త మద్య హోత రిషితో యజీయాన్
దేవం త్వష్టార మిహ యక్షి విద్వాన్."
— (ఋ. 10-110-9.)

ఏ త్వష్ట్ర దేవుడు ఈ ద్యావా పృథువులను (దివమును, భూమిని), దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాది భేదములతో నిండినవైన స్వర్గ, మర్త్య, పాతాళ లోకములను సృష్టించినాడో, అట్లే సమస్త భువనములను రూపము గల వానినిగా చేసినాడో అట్టి త్వష్టను ఈ యజ్ఞ కార్యమునందు

హావిస్సు మొదలగువానితో యజింపుము అని మంత్ర భావము. హావిస్సుల చేతనేగాక పూజాధ్యాన సమాధుల చేత కూడ ఆ దేవుని ఆరాధించి తరించుమని ఇందలి రహస్యార్థము. కాగా విశ్వకర్మ సూక్తము, "విశ్వకర్మ" భువన సృష్టికర్త అని చెప్పగా అదే భావమును త్వష్ట్ర దేవుని గూర్చి ఈ మంత్రము బోధించుచున్నది. కనుక దీనిచేత "త్వష్ట-విశ్వకర్మ"లు ఇద్దరూ ఒకే పనిని చేయుచు ఒక్కరే అయినారని గ్రహింపవచ్చును గదా! కనుకనే పై పురుష సూక్త మంత్రము ఆ "విశ్వకర్మ" స్వరూపమును త్వష్ట దాల్చినాడని చెప్పుచున్నది. కనుక త్వష్ట "విశ్వకర్మ" తనయుడనియు, ఉభయులును ఒకే వ్యక్తి యనియు మనము అర్థము చేసికొనుటకు అభ్యంతరము ఉండనక్కరలేదు. ఇంకను త్వష్ట సృష్టికర్త అని చెప్పెడి మంత్రములు అనేకములు వేదములందు మనకు అగపడుచున్నవి. ఋగ్వేదము లోనే ప్రథమ మండలము లోని దిగువ మంత్రము కూడ త్వష్ట విశ్వములకు స్రష్ట, సృష్టికర్త అని గంట కొట్టినట్లు చాటుచున్నది.

"త్వష్టా రూపాణి హి ప్రభుః
పశూన్ విశ్వాన్ సమానజే,
తేషాం న స్ఫాతి మాయజ."

— (ఋ. 1-188-9.)

ఈ మంత్రమునకు భాష్యము వ్రాయుచు సాయణులు- "త్వష్టా రూపాణి యోనౌ సృష్టాని రేతాంసి రూపాణి కర్తుం

ప్రఘుణహి" అనినారు. అనగా త్వష్ట గర్భమందుంచబడిన రేతస్సునకు రూప నిర్మాణము చేయుచున్నాడని భావము. ఈ భావమునే దిగువ నుదాహరించెడి గర్భాధాన కాండము లోని మంత్రము కూడ చాటుచున్నది.

"విష్ణు ర్యోనిం కల్పయతు, త్వష్టా రూపాణి పింశతు,
ఆసించతు ప్రజాపతి, ర్ధాతా గర్భం దధాతు తే."
— (ఋ. 10-185-1)

ఓ కన్యారత్నమా! విష్ణుదేవుడు నీ మర్మావయవ మును (యోని) వీర్యధారణకు యోగ్యముగా చేయుగాక! త్వష్ట్ర దేవుడు మీ దంపతుల కర్మ ననుసరించి ఆ వీర్యము నకు స్త్రీ-పురుషాది రూపములను సృజించుగాక. ప్రజాపతి రేతస్సును అండము నందు చేరునట్లు ఒనర్చుగాక. ధాత ఆ రేతస్సును, పిండ రూపముగా పరిణమింప చేయుగాక! అని భావము. దీనినిబట్టి "త్వష్ట" సర్వరూపములకు సృష్టికర్త అని తేలుచున్నది కదా. మంత్రమున "పింశతు" అను క్రియ వాడబడినది. "పిశి అవయవే" అను ధాతువునకు అవయవ నిర్మాణము చేయుట అని అర్థము. 'పింశతు' అనగా అవ యవ నిర్మాణము చేయుగాక అని భావము. ఇదివరకు అవ యవములు లేనిదానికి (వీర్యకణమునకు) కరచరణాది అవ యవములను ఏర్పరచుట అన్నమాట. ఇంకొక మంత్రము ఇట్లనుచున్నది :

"యో వచ్ఛో వై రేతస స్సిక్తస్య త్వష్టా రూపాణి వికరోతి. — (తై. సం. 1-5-9-1.)

ఇంకొక వివాహ మంత్రము భార్యాభర్తలను సృష్టించునది త్వష్టయే అని చెప్పుచున్నది.

"త్వష్టా జాయా మజనయత్, త్వష్టా స్యై త్వాం పతిం
త్వష్టా సహస్ర మాయూగంషి దీర్ఘ మాయుః
కృణోతు వామ్."

— (అథర్వ : కాం-6, సూక్తం-78, మం-3.)

ఈ మంత్రమును పఠించినగాని వివాహ కాండకు పూర్ణత్వము రాదు. దీని భావమిది- ఓ వరుడా త్వష్ట అను దేవుడు నీకీ భార్యను సృజించి ఇచ్చెను. ఆ త్వష్టయే ఈమెకు నిన్ను పతిగా సృష్టించినాడు. అట్టి త్వష్ట వధూవరులగు మీ ఉభయులకు దీర్ఘాయుర్భాగ్యమును ఒసంగుగాక. ఈ భావమే ఈనాడు లోకులు వాడెడు "భార్యాభర్తలు స్వర్గములోనే చేయబడి భూలోకమున పుట్టుచుందురు" అనెడి మాట పుట్టినది. వీనిని ఆంగ్లమున ఇట్లందురు. (Marriages are made in the Heaven.) ఇంకొక మంత్రము భార్యా భర్తృ భావమును గూర్చి ఇట్లు చెప్పుచున్నది.

"గర్భేను నౌ జనితా దంపతీక
ర్దేవ స్త్వష్టా సవితా విశ్వరూపః."

— (ఋ. 10-10-5.)

రూపనిర్మాతయు, సర్వాత్మకుడును, జీవులను ప్రేరేపించువాడును అగు త్వష్ట్ర దేవుడు గర్భము నందుండగనే మనలను దంపతులను చేసినాడు. కనుక దాంపత్య నిర్మాణము చేయునది త్వష్టయే అని వేదమున పలుతావుల చెప్ప

బడినవి. పై మంత్రములో "త్వష్ట, సవితా, విశ్వరూపః" అనెడి పదములు అగపడుచున్నవి. దీనినిబట్టి అవి పర్యాయ పదములని భావింపవచ్చును. ఈ విషయము మన గ్రంథములలో పలుతావుల వివరింపబడుచునే యున్నది. "విశ్వరూపః" అనగా విశ్వమే తన రూపముగా గల "విశ్వకర్మ"యే అని భావము. ఇంకొక యజుర్వేద మంత్రము "త్వష్టా వై పశూనామ్, మిథునానామ్ రూప కృత్" అన్నది. అనగా త్వష్ట ప్రాణులను, వధూవరులను సృష్టించిన దేవుడని భావము. అంతేకాదు. మనకు సంతానమును ఇచ్చునది కూడ త్వష్టయే అని ఋగ్వేద ద్వితీయ మండలములోని దిగువ మంత్రము పలుకుచున్నది.

"పిశంగ రూపః సుభరో వయోధాః
శ్రుష్టీ వీరో జాయతే దేవకామః,
ప్రజాం త్వష్టా విష్యతు నాభి మస్మే
అథా దేవానా మప్యేతు పాథః" — (2-3-9)

తా॥ "ఏ దేవుడు వంశమును నిల్పు సంతానము నిచ్చుచున్నాడో, అట్టి త్వష్ట్ర దేవుని అనుగ్రహము చేత బంగారు కాంతి గలవాడును, యజ్ఞములు (మంచి కర్మలు) చేయగలవాడును, అన్నదాతయు, గుణవంతుడును, దేవతలు మెచ్చువాడును అగు పుత్రుడు మీకు జన్మించుగాక." అని మంత్రభావము. ఇట్టి మంత్రములు ఋగ్వేదమున ఇంకను గలవు. విస్తరభయము చేత వాటిని ఉదాహరింపమైతిమి. విస్తరము కావలసినవారు ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగ

మును చూడవచ్చును. ఈ త్వష్ట బ్రహ్మ దేవునకు ఎంత మాత్రమును భిన్నుడు కాడు. బ్రహ్మయు, త్వష్టయు ఒక్కరే అనుటకు అనేకాధారములు వేదములందు కలవు. ఇరువురకు నామ భేదమే కాని- క్రియాభేదము గాని, వ్యక్తి భేదము గాని లేదు. విశ్వకర్మ సూక్తములోని "విశ్వకర్మా హ్యజనిష్ట దేవః" అనెడి వాక్యములోని దేవశబ్దమునకు బ్రహ్మ అర్థ మని సాయణులు వ్రాసినారు. యజురారణ్యక పురుషసూక్త వాక్యమును బట్టి ఆయన త్వష్ట అని ఇంతకుముందే చదివాము. ఇరువురును "విశ్వకర్మ" తనయులే అని వేదము చెప్పుచున్నది కదా! వారు చేయు పనులుకూడ లోకముల సృష్టియే కదా! ఇవి జీవశరీరముల చరాచరముల సృష్టియే కదా. ఈ త్వష్టయు, బ్రహ్మయు ఒక్కరే అని సాయణులు మున్నగు భాష్యకర్తలు భావించుచున్నారు. వేదము కూడ అట్లే చెప్పుచున్నది.

"తవ వాయ వృతస్పతే,
త్వష్టుర్జామతరద్భుత!
అవాంస్యా వృణీమహే. — (ఋ. 8-27-21)

దీనికి భాష్యము వ్రాయుచు సాయణులు: "హే ఋత స్పతే = ఋతపతే, త్వష్టుర్జామతః = బ్రహ్మణో జామాతః, ఏషాకథా ఇతిహాసాదిభి రవగంతవ్యా. తాదృశా ద్భుత=మహా విచిత్రకర్మన్ హే వాయో!" తవ = త్వదీయాని, అవాంసి=పాలనాని, ఆవృణీమహే=వయమస్మిన్ యాగే సంభజా మహే.

తా॥ సత్యమున కధిపతివిని, త్వష్ట్ర దేవుని అల్లుడవును, అద్భుత కార్యములు చేయువాడవును అగు ఓ వాయుదేవా! ఈ మేము చేయు కర్మమున (యాగమున) నీ నుండి రక్షణ లను కోరుచున్నాము. ఇందు వాయువు త్వష్ట అల్లుడను వృత్తాంతమును ఇతిహాసముల నుండి యెఱుఁగవలసినదని సాయణాభిప్రాయము. ఇందు త్వష్ట శబ్దమునకు అర్థముగా "బ్రహ్మణః" అని సాయణులనుట గమనింపదగినది. అనగా ఆయన దృష్టిలో "త్వష్ట" యనగా 'బ్రహ్మయే' అని భావము. అదే వేయభిప్రాయము కూడ. ఇట్టి వేద వాక్య ములు త్వష్టయు, బ్రహ్మయు ఒక్కరే అని చెప్పుచున్నవి. ఇంకొక మంత్రమును చూతము.

"త్వష్టుం ర్జామాతరం వయు,
మీశానం రాయమీ మహే, సుధావంతం
వాయుం ద్యుమ్నా జనాసః".

— (ఋ. 8-27-22)

భాష్యం : "త్వష్టు ర్బ్రహ్మణో జామాతార మీ శానం సర్వస్యేశ్వరం ఏతాదృశం వాయుం" అని.ఇందుకూడ "త్వష్టుః=బ్రహ్మణః=బ్రహ్మకు" అని వ్రాయుట గమనిం తురుగాక. జామాత అనగా అల్లుడని అర్థము త్వష్ట 'పర మేష్టి' అని లోగడ చదివియే యున్నాము.

"ఆలుమవలుఁ గూర్చునట్టి సత్సంధాత,
సర్వరూప సృష్టి సలుపు ప్రోడ,

దివ్యశిల్పి త్వష్ట అవ్యయా మృతమూర్తి,
అతడె బ్రహ్మదేవు డార్యమిత్ర." — 856

**హిరణ్యగర్భుడు :**

ఈ "త్వష్ట-విశ్వకర్మ"ల వలె హిరణ్యగర్భుడు కూడ సృష్టిచేసిన దేవుడే అని హిరణ్యగర్భ సూక్త మంత్రములు చాటుచున్నవి. ఈ విస్తరము మదీయ ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున కాంచవచ్చును. ఐనను ఒక్క రెండు మంత్రములను మాత్రము ఇచ్చట ఉదాహరింతుము.

"హిరణ్యగర్భః సమవర్తతాగ్రే
భూతస్య జాతః పతి రేక ఆసీత్,
స దాధార పృథివీం ద్యా ముతేమాం
కస్మై దేవాయ హవిషా విధేమ."
— (ఋ. 10-121-1)

తా॥ సృష్టికి పూర్వము హిరణ్యగర్భుడను దేవు డొక్కడే ఉండెను. ఆయన భూ-దివములను సృష్టించి ధరించెను. అట్టి అనిర్వచనీయ దేవుని అర్చింతుము కాక! హవిస్సులతో (కర్మలతో) ఆయనను పూజింతుము గాక. ఇంకొక మంత్రము.

"యస్యే మే హిమవన్తో మహిత్వా
యస్య సముద్రం రసయా సహాహుః,
యస్యేమాః ప్రదిశో యస్య బాహూ
కస్మై దేవాయ హవిషో విధేమ!" — 4

హిమవదాది పర్వతములు ఎవని ఐశ్వర్యమో, నదీ నద సముద్రాదులు ఎవని మహాభాగ్యమని తత్త్వవేత్తలు అనుచుందురో దిక్కులు, మూలలు (విదిక్కులు), ఎవని బాహువులై యున్నవో అట్టి హిరణ్యగర్భుని సేవింతుము గాక! ఇందలి సముద్రము విశ్వకర్మ సూక్తములోని "సముద్రాయ వయునాయ" అను మంత్రములోనిదే. దిక్కులు "విశ్వకర్మా దిశాంపతిః సనః పశూన్ పాతు సోఽస్మాన్ పాతు తస్మై నమః" అనెడి విశ్వకర్మ సూక్త భాగములోనివే. ఈ దిక్కులు "ప్రదిశ శ్చతస్రః" అని పురుష సూక్తములో కూడ పేర్కొనబడినవే. ఇట్టి పెక్కు సాదృశ్యముల చేత ఈ హిరణ్యగర్భుడు విశ్వకర్మకు, త్వష్టకు ప్రతిరూపమే, ప్రతిబింబమే అనుటకు సందేహము లేదు.

## ప్రజాపతి :

ఈ హిరణ్యగర్భ శబ్దము వలె ప్రజాపతి పదము కూడ "విశ్వకర్మ"కు పర్యాయముగా వేద మంత్రములలో వాడబడినది.

"ప్రజాపతి ర్విశ్వకర్మా మనో గంధర్వః" అనెడి యజుర్వాక్యమును శతపథ బ్రాహ్మణము ఎట్లు నిర్వచించినదో చూతము :

"ప్రజాపతి ర్విశ్వకర్మేతి, ప్రజాపతిర్వై విశ్వకర్మా, సహీదగ్ంం సర్వమకరోత్." ప్రజాపతి యనగా "విశ్వకర్మ."

అతడీ సర్వమును (విశ్వమును) సృష్టించినాడు అని చెప్పినది. దీనినిబట్టి ప్రజాపతి యనగా "విశ్వకర్మ" అని చెప్పుట వేదమునకే ఇష్టమన్నమాట. సాయణులిట్టి బ్రాహ్మణాది గ్రంథ ప్రమాణములను ఆధారముగా చేసికొనియే తన భాష్యమున "ప్రజాపతి, విశ్వకర్మ, పరమేష్ఠి" అనెడి పదములు ఒకే తత్త్వముయొక్క భిన్న నామములని వ్రాసినారు. తరువాత నిఘంటువులలోను, వాఙ్మయమునందును ప్రజాపతి, పరమేష్ఠి, హిరణ్యగర్భ పదములు బ్రహ్మదేవునికి పర్యాయములుగా వాడబడినవి (చూడు అమరము). ప్రజాపతి, విశ్వకర్మ, పరమేష్ఠి, హిరణ్యగర్భ, బ్రహ్మణస్పతి- అనెడి దేవతలు చేయు కార్యములు సృష్టి సంబంధములే అని మనము గ్రహింపవలయును.

విశ్వరూపుడు :

వేదములో గొప్ప దేవుడుగాను, మంత్రద్రష్ట గాను అగపడెడి మరొక పురుషుడు విశ్వరూపుడు. ఇతడు త్వష్ట్ర దేవుని కుమారుడని "విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్" అనెడి కృష్ణ యజుర్వేద మంత్రము చెప్పుచున్నది. ఈతడు బ్రహ్మవిద్యాచార్యులలో మధ్యముడని "విశ్వకర్మ సమారంభామ్, విశ్వరూపార్య మధ్యమామ్" అనెడి గురు ధ్యాన శ్లోకము చెప్పుచున్నది. ఇతనిని గూర్చి మన యజుర్వేద దర్శనమున కాంతుము.

ఋభువులు :

"ఋభువు, విభ్వ, వాజః" అను ముగ్గురకు 'ఋభువు'

లని పేరు. సుధన్వాచార్యుని పుత్రులైన వీరు వేదమున గొప్ప శిల్పులు. త్వష్టృదేవుని శిష్యులు. వీరి శిల్ప ప్రభావ మును గూర్చి ఋగ్వేద దిగ్దర్శనము యొక్క ప్రథమ భాగ మున విశేషముగా వ్రాయబడినది. ఇకపోగా ప్రకృతి పురుష స్వరూపులైన "గాయత్రీ-విశ్వకర్మ" లను గూర్చి గత ప్రక రణమున తెలిసికొనియే యున్నాము.

## అశ్వనీ దేవతలు :

వేద పురుషులలో అశ్వినీ దేవతలు కూడ మహాశిల్పా చార్యులే. వీరు దేవ వైద్యులని వాఙ్మయమున ప్రసిద్ధిగన్న వారు. వివస్వంతునికిని, సరణ్యూ (సంజ్ఞా) దేవికిని వీరు పుత్రులు. ఈ సరణ్యూదేవి పురాణాదులలో సంజ్ఞాదేవిగా పేర్కొనబడినది. వీరియొక్క శిల్ప ప్రతిభను గూర్చి, ఋగ్ద ర్శన ప్రథమ భాగమున కొంత వ్రాయుట యైనది. మనము సూక్ష్మముగా పరిశీలించినచో వేద దేవతలలోను, వేద ఋషులలోను శిల్పులు కానివారు మిక్కిలి తక్కువగా నుం దురు. యముడు కూడ త్వష్టకు దౌహిత్రుడని వేద మంత్రము చెప్పుచున్నది.

"త్వష్టా దుహిత్రే వహతుం కృణోతీ
తీదం విశ్వం భువనం సమేతి,
యమస్య మాతా పర్యుహ్యమానా,
మహో జాయా వివస్వతో ననాశ."

— (ఋ. 10-17-1)

"అపా గూహా న్నమృతాం మర్త్యేభ్యః
కృత్వీ సవర్ణా మదదు ర్వివస్వతే
ఉతాశ్వినా వభర ద్యత్త దాసీ
దజహా దుద్వా మిథునా సరణ్యూః".
— (ఋ. 10-17-2.)

తా॥ త్వష్ట్ర దేవుడు "సరణ్యు" వను పేరు గల తన కూతును వివస్వంతు (సూర్యు)న కిచ్చి పెండ్లి చేసెను. ఆమె 'యముడ'ను పుత్రుని, 'యమి' అను కూతును కనిన పిమ్మట ఆ సూర్యుని తేజమును సహింపలేక ఆయనను వీడి (ఉత్తర కురుభూములకు) పోయెను. దేవత లాసమయమున సరణ్యువు వంటిదే యగు ఒక యువతిని నిర్మించి సూర్యునికడ ఉంచిరి. ఉత్తర కురుభూముల కేగిన సరణ్యువు నెఱింగి సూర్యుడు ఆమె దగ్గరకు వచ్చి ఆమెతో కలియగా వారికి అశ్వినీ దేవతలు పుట్టినారు. కనుక అశ్వినీ దేవతలు "విశ్వకర్మ" సంప్రదాయము వారే. ఋగ్వేదములో ఈ పాటిగా మాత్రమే ఉన్న కథ పురాణాదులలో విస్తరించి వ్రాయబడినది. మనువు కూడ ఈ సరణ్యూ. వివస్వంతుల పుత్రుడే. పై మంత్రములలో సరణ్యువును "యమస్య మాతా" అని చెప్పుటచేత ఆమె యమునికి, యమికి కూడ తల్లి అని వేదమే చెప్పినట్లైనది. ఈ యమీయములు కవల పిల్లలు. వీరి సంవాదమును గూర్చి ఋగ్వేదములో ఒక సూక్తము కూడ ఉన్నది. త్వష్ట్ర దేవుని యొక్క కుటుంబము ఎంతో పెద్దదని

వేదమును బట్టి తెలియుచున్నది. అగ్నిదేవుడు కూడ త్వష్ట పుత్రుడే అని పూర్వము చదివియే యున్నాము.

"యంత్వా ద్యావా పృథివీ యం త్వాప
స్త్వష్టా యం త్వా సుజనిమా జజాన,
పంథా మను ప్రవిద్వా న్పితృయాణం
ద్యుమదగ్నే సమిధానో విభాహి."

— (ఋ. 10-3-7.)

భాష్యము : "కించ హే అగ్నే సుజనిమా శోభన జనన స్త్వష్టా ప్రజాపతి ర్యం త్వాం, జనాన=జనయామాస" దీనిసబట్టి మంచి సృష్టికర్త యైన త్వష్ట నిన్ను (అగ్నిని) కన్నాడని తేలుచున్నది కదా! త్వష్ట ఒక్క అగ్నిని మాత్రమే కనుట కాదు. ఇతఃపూర్వ మాతడు ద్యావా పృథువులను, అందలి సర్వ ప్రాణులను కని వాటిని పోషించుచున్నాడని తెలిసికొనియే యున్నాము. అయినను పై మంత్రములు ప్రత్యేకించి సందర్భమును బట్టి "ఓ అగ్నే నీవు త్వష్ట పుత్రుడవు కాన పితృ దేవతల మార్గమున వెలుగులను నింపు" మని చెప్పుచున్నది. కావున అతని తండ్రి యోగ్యతను కూడ జ్ఞప్తి చేయుచున్నదన్నమాట. "త్విష దీప్తౌ" అను ధాతువు నుండి కూడ త్వష్టృ శబ్దము పుట్టవచ్చును. కావున అగ్నిని కన్న త్వష్ట దీప్తిశాలి కావున అగ్నికూడ తనను ఆరాధించువారికి దీప్తిని ఒసంగుటకు విశ్వసింపతగి యున్నాడని జ్ఞప్తి చేయుటకు ఇట్లు చెప్పబడినది. ఇచ్చట భాష్యకారుడు త్వష్టను ప్రజాపతి అనుట కూడ గమనింప

తగినదే. త్వష్టకు, అగ్నికి పితాపుత్ర సంబంధము ఉండుట చేతనే వారికి అభేదమును కూడ "ఇహ త్వష్టార మగ్రియం విశ్వరూప ముపహ్వాయే" అనెడి మంత్రము వచించినది. "ఆత్మా వై పుత్ర నామాసి" తన ఆత్మయే పుత్ర స్వరూపమని కదా శ్రుతి యనుట. 'త్వష్ట' విశ్వ నిర్మాత యను విషయమును సాయణులు ఋగ్వేద భాష్యమున సుస్పష్టముగానే ప్రవచించి యున్నారు. యజుర్వేద భాష్యమున త్వష్టను చతుర్ముఖుడని పలికినాడు (చూడుము-130 పుట ఋగ్దర్శనము). తరువాతి వాఙ్మయమున "విశ్వకర్మ" విష్ణువుగాను, "త్వష్ట" బ్రహ్మగాను చిత్రింపబడుట మనము గమనింపగలము. ఇక పురాణములు ఎన్ని పోకడలు పోయినవో, వేదాది వాఙ్మయ నిశిత పరిశీలనచే తెలియగలదు.

## బ్రహ్మణస్పతి :

బ్రహ్మణః= వేదమునకు, పతిః = అధిపతి లేక సృష్టికర్త అని ఈ శబ్దము యొక్క అర్థము. ఈ బ్రహ్మణస్పతి పదము సృష్టికర్త పరముగా కూడ వేదమున వాడబడినది.

"బ్రహ్మణస్పతిరేతా సంకర్మార ఇవా ధమత్."

— (ఋ. 10-72-2.)

సృష్టికర్త ఈ లోకములను, లేదా దేవ, మనుష్య తిర్యగాదులను, కర్మారుని (కమ్మరి-శిల్పి) వలె, అధమత్ = సృష్టించెను అని భావము. ఇట్టి బ్రహ్మణస్పతి త్వష్ట్ర దేవుని రుడే అని దిగువ ఋగ్వేద మంత్రము చెప్పుచున్నది.

"విశ్వేభ్యో హి త్వా భువనేభ్య స్పరి
త్వష్టాఽజన త్సామ్నః సామ్నః కవిః,
స ఋణచి దృణయా బ్రహ్మణస్పతిః
ద్రుహో హన్తా మహ ఋతస్య ధర్తరి."

— (ఋ. 2-33-17.)

ఇది బ్రహ్మణస్పతి సూక్తములోని మంత్రము. దీని భావము : ఓ బ్రహ్మణస్పతీ! త్వష్ట్ర దేవుడు నిన్ను సమస్త భూతజాతముల కంటెను శ్రేష్ఠునిగా సృజించినాడు. కావున నీవు సర్వసామ మంత్రములకును కవివి, కర్తవు. అనగా సృష్టికర్త వన్నమాట. అట్టి బ్రహ్మణస్పతి యజ్ఞము చేయు యజమానునికి ద్రోహ మొనర్చెడి అసుర స్వభావము గల వారిని చంపును. ఈ బ్రహ్మణస్పతి కూడ తన తండ్రియైన త్వష్టవలెనే జగములను సృష్టించినవాడే అని "బ్రహ్మణస్పతి రేతా స్ంకర్మార ఇవాధమత్" అనెడి మంత్రము చెప్పు చున్నది. వేదములను పరిశీలింపగా "విశ్వకర్మ, త్వష్ట, బ్రహ్మణస్పతి, హిరణ్యగర్భుడు, ప్రజాపతి" అనువారు అభేదరూపులై వేద సృష్టిని, భువన సృష్టిని చేసినట్లు తెలిసి కొనగలము. ఇది వేదమాతకు నామరూప భేద రహితమైన ఒకే తత్త్వము జగత్కారణమనుట ఇష్టమనుటకు నిదర్శనమై ఒప్పుచున్నది. ఈ "బ్రహ్మణస్పతి"యే గణపతిగా పేర్కొన బడి వైదికములైన శుభాశుభ కార్యములందు విఘ్నములను, చెఱుపులను పోగొట్టు దేవుడుగా అర్చింపబడుచున్నాడు. ఒక బ్రహ్మణస్పతి సూక్తములోని మొదటి మంత్రమును,

గణపతిని ఆహ్వానించెడి మంత్రముగ పురోహితులు వాడు చుందురు.

"గణానాం త్వా గణపతిం హావామహే
కవిం కవీనా ముపమ శ్రవ స్తమమ్,
జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత
ఆనః శృణ్వ న్నూతిభిః సీద సాదనమ్."
— (ఋ. 2-23-1.)

దీని యర్థము సాయణ భాష్యానుసారము ఈ విధముగా నున్నది. బ్రహ్మణఃపతే=మంత్రములకు స్వామివగు ఓ దేవా! గణానాం=దేవాది గణములకు, గణపతిం=ప్రభుడవును, కవీనాం = దూరపు చూపు కలవారికి (కవులకు)-భూత, భవిష్యద్వర్తమాన విషయ విజ్ఞానము కలవారికి కూడ, కవిం=కవీశ్వరుడవును (అనగా కవులకెల్లా కవి యని భావము.) ఉపమశ్రవ స్తమం=సర్వాన్నములకు, ఉపమానమైన శ్రేష్ఠాన్నము కలవాడవును, బ్రహ్మణాం=మంత్రములకు పతివినీ, జ్యేష్ఠరాజం=జ్యేష్ఠుడుగా ప్రకాశించువాడవును అగునట్టి, త్వా=నిన్ను, హావామహే = ఈ కర్మయందు ఆహ్వానించుచున్నాము. కనుక, నః=మాయొక్క, (స్తుతీః= స్తోత్రములను) శృణ్వాన్=వినుచు, ఊతిభిహి=పాలనముల చేత (రక్షణాల చేత), సాదనమ్=యజ్ఞ గృహమును (మా హృదయమును), ఆసీద=ప్రవేశింపుము.

ఈ మంత్రము బ్రహ్మణస్పతి దేవతగ కలది. ఇందు స్తుతింపబడిన దేవత బ్రహ్మణస్పతి నామము కలవాడ్నన

మాట. ఈ మంత్రములో బ్రహ్మణస్పతి, గణపతి రెండు పదములు వినపడుచున్నవి. ఆ రెంటిలో "బ్రహ్మణస్పతే" అనునది సంబోధనము (పిలుపు). 'గణపతి' పదము ఆ దేవుని యొక్క సర్వదేవ గణాధిపత్యమును చెప్పెడి విశేషణము. 'జ్యేష్ఠరాజ' పదము ఇతని దేవతా జ్యేష్ఠత్వమును సూచించుచు ఇంద్రాదుల కంటే ఈతడు మిన్నయని తెలుపునట్టిది. ఈ మంత్రములో 'గణపతి' అను మాట యున్నను ఈయన పేరు మాత్రము "బ్రహ్మణస్పతి" అనియే. ఐనను గణపతి, గణాధిపతి పదములను కూడ మనము పేర్లుగానే భ్రాంతి పడుచున్నాము. 'బ్రహ్మణాం బ్రహ్మణస్పతే' అని మంత్ర ద్రష్ట వాడుట గమనింపదగియున్నది. ఇందలి గణపతి శబ్దమును తీసికొని మనవారు ఒక గణపతిని సృష్టించినారు. ఈ గణపతి శివుని కుమారుడనియు, శైవమతములోని దేవత యనియు వారి భావము. మన పురాణ కథలన్నియు విఘ్నేశ్వరుడు పార్వతీ-పరమేశ్వరుల పుత్రుడనియు, చదువులకు వేల్పు అనియు చెప్పుచున్నవి. శైవమును సహింపని వైష్ణవులు తమ మతము ననుసరించి వైష్ణవ దేవుడగు విష్వక్సేనుని విఘ్న పరిహారమునకై కార్యారంభముల యందు పూజింతురు. వీరు హయగ్రీవుని విద్యాదైవతముగా భావింతురు. విఘ్నేశ్వరునికి ఏనుగు తల, ఏకదంత మహాకాయములు, ఎలుక వాహనము మొదలగునవి కూడ పురాణ యుగ కల్పనలే. ఋగ్వేదములోని, బ్రహ్మణస్పతి సూక్తములలో

ఈయన సత్యస్వరూపము స్పష్టము కాగలదు. ఈ విషయము లను మిత్ర సాహస్రి ఇట్లు పేర్కొన్నది.

"ఆది పూజలందునట్టి ఆ గణపతి
బ్రహ్మణస్పతి యని పలుకు ఋక్కు;
త్వష్ట సుతుడె సుమ్ము బ్రహ్మణస్పతి యని
పలుకు నొక్క ఋక్కు; పరమ మిత్ర." — 860

"గజ ముఖాది రూపకల్పన గణపతి
కాధునిక మటంచు నరయ తోచు;
వేదఋషుల వాణి నాదరించి ఋతంబు
నవధరించు టొప్పు నయ్య మిత్ర." — 862

బ్రహ్మణస్పతి మహిమను గూర్చి ఋగ్వేదములోని మఱొక మంత్రమును పరిశీలింతము.

"న త మంహో న దురితం కుత శ్చ న
నా రాతయ స్తితిరు ర్న ద్వయావినః,
విశ్వా ఇ దస్మాద్ధ్వరసో వి బాధసే
యం సుగోపా రక్షసి బ్రహ్మణస్ప తే!"
— (ఋ. 2-23-5.)

తా॥ ఓ బ్రహ్మణస్పతీ సత్పాలకుడవగు నీవు ఏ జనుని రక్షించెదవో అట్టివానిని దుఃఖములు గాని, దురితములు గాని బాధింపవు. అతనిని శత్రువులు హింసింపలేరు. వంచకులు మోసగింపలేరు. అతనికి అపకారము చేయువారిని నీవు బాధింతువు. ఈ విధముగా ఋగ్వేదములో 10, 11 ఋక్కులలో బ్రహ్మణస్పతి మహిమను గూర్చి వ్రాయబడి

యున్నది. ఆ సూక్తములకు 'బ్రాహ్మణస్పత్య' సూక్తము లని పేరు. బ్రహ్మణస్పతిని గూర్చిన విస్తరము ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమున కొంత కాంచవచ్చును.

## త్వష్ట సృష్టించిన దేవతలు, ప్రజలు :

"విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టావిధద్రూప మేతి" అనెడి పురుష సూక్త వాక్యమును బట్టి త్వష్ట "విశ్వ కర్మ" పుత్రుడని తేలుచున్నది. ఆయనయే "బ్రహ్మ" అని కూడ వేద మంత్రముల వలననే తెలిసికొని యున్నాము. ఆయనకే "ప్రజాపతి, పరమేష్ఠి, హిరణ్యగర్భాది" పదములు చెల్లుననియు, వీరు చేసెడి పనులును, త్వష్ట చేసెడి కార్యము లును ఏక రూపములే అనియు గ్రహించి యుంటిమి. ఇట్టి త్వష్టకు సరణ్యూదేవి అనునామె కూతురు. ఆమె వివస్వం తుని పెండ్లాడినది. ఆ ఇరువురకు యమియు, యముడును, మనువును, అశ్వినీ దేవతలును కలిగినారు. ఈ వివస్వం తుని కుమారుడైన మనువు సూర్యవంశ క్షత్రియ జాతిని వృద్ధి చేసినట్లు పురాణముల వలన తెలిసికొందుము. త్వష్ట యొక్క కుమారుడు విశ్వరూపుడని "విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితో దేవానామాసీత్" అనెడి తైత్తిరీయ సంహితా వాక్యమును బట్టి తెలియుచున్నది కదా! ఈ విశ్వ రూపుడు దేవ పురోహితుడనియు, బ్రహ్మవిద్యాచార్యు లలో, మధ్యముడనియు చదివినాము. ఈ విశ్వరూపునికి ఏకాదశ రుద్రులు జన్మించినారని విష్ణు పురాణము చెప్పు చున్నది.

అగ్ని దేవుడు కూడ త్వష్ట యొక్క కుమారుడే అని ఇంతకుముందే చదివినాము కదా! ఆ అగ్నికి (అంగారములకు అనగా నిప్పులకు) కలిగినవారు అంగిరసులైరి. అగ్ని యొక్క మంటల నుండి పుట్టినవాడు భృగువైనాడు. ఆతడు భృగువంశ బ్రాహ్మణ్యమును వృద్ధి చేసినాడు. అంగిరునికి బృహస్పతి, ఉచథ్యుడు మొదలగు ఎనమండుగురు కుమారులు పుట్టినారు. వీరిలో సుధన్వు డనువాని కొడుకులే ముగ్గురైన ఋభువులు. వీరి ప్రభావమును గూర్చి ఋగ్వేదమున 10, 11 సూక్తములు ఉన్నవి. కనుక భృగ్వంగిరో వంశమునకు త్వష్టయే మూలపురుషు డగుచున్నాడు. ఆతడు అగ్ని దేవునికి తండ్రి కదా. భృగ్వంగురులు కలిగిన పిమ్మట శివ వాడుగా పుట్టినవాడే అత్రి మహర్షి అని బృహద్దేవతా గ్రంథము వలన తెలియుచున్నది. ఈ విధముగా అనేక దేవతల, ఋషుల సృష్టికి మూలభూతుడు 'త్వష్ట్ర' దేవుడగుచున్నాడు.

త్వష్టయు, అహాభూన ఋషియు అభేద రూపులని మనము తెలిసికొందుము. ఈ అహాభూన ఋషి 'ప్రాచీదిశామాది' మంత్రములలో పశ్చిమ దిక్కున ఇష్టకోపధానము చేయునప్పుడు "ప్రతీచీ దిశాం...అహాభూన ఋషిః" అని చదివినాము. ఈ మంత్రముల యందు పేర్కొనబడిన సానగ, సనాతన, అహాభూన, ప్రత్న, సుపర్ణ ఋషులే పంచ ఋషులు. వీరు "విశ్వకర్మ" నుండి సృష్టి తత్త్వమునకు (రహస్యమునకు) చిహ్నములుగా కలిగినవారని మన

మెఱుంగుదుము. వీరినుండి పుట్టిన జ్ఞాన విజ్ఞాన ఖనులే పంచార్షేయ బ్రాహ్మణులు. వీరు జ్ఞాన స్వరూపమైన పంచ వేదములను చదువుచు అయో, దారు, తామ్ర, శిలా, సువర్ణమయములైన పంచ శిల్పములను చేయుచు లోక సేవతో కాలము గడుపుచుందురు. అహంభూన ఋషి పంచ ఋషులలోనివాడు కావున ఆయన ద్వారా తద్గోత్రము గల బ్రాహ్మణ ప్రజ ఈ లోకమున వర్ధిల్లినది. ఈ విధముగా వేదముల యొక్క సమ్యక్పరిశీలనము చేత నా దృష్టికి పొడ కట్టిన త్వష్ట్ర దేవుని సృష్టిని ఈపాటిగా చెప్పగలిగితిని. నా దృష్టికి అందని చరిత్రలు, త్వష్ట్ర దేవుని విశేషములు ఆయన యొక్క దేవ మానవ సృష్టి మొదలగునవి ఇంకెన్ని కలవో బుద్ధిమంతులైన విద్వాంసులు వేద, బ్రాహ్మణ, ఆరణ్యకాది గ్రంథములను పరిశీలించి, పరిశోధించి ఆవిష్క రింతురని కోరుచున్నాను. తాత్త్విక దృష్టితో విచారించినచో విశ్వమంతయు త్వష్ట సృష్టియే అని చెప్పుటకు, గ్రహించు టకు ఎవ్వరును వెనుకంజ వేయనక్కరలేదు. ఇందుకు వేదము లందు పరమ ప్రమాణములు గలవు. విశ్వకుటుంబ మంతయు త్వష్ట్ర దేవునిదే అని ఈ కొలదిపాటి చర్చ వలన పాఠకులు గ్రహింతురు. అందుకే మన గ్రంథమునకు "విశ్వకర్మ మయం జగత్", "విశ్వకర్మ విశ్వరూపము" అని పేర్లు పెట్టుట సమంజసమని బుద్ధిమంతులైన పండితులు అన్నారు. ఈ త్వష్టనే బ్రహ్మదేవునిగా భావించి త్వష్ట్ర స్థానమున బ్రహ్మదేవుని నిల్పి, మన పురాణేతిహాసములు కొనసాగినవని

మేమిచ్చిన వేదాధారములను బట్టి పాఠకులు గ్రహింతురని భావింతుము.

విశ్వకర్మకును, విష్ణు, రుద్రాదులకును గల పితృ పుత్ర భావము, ఏకతత్త్వమే అను విషయములు ఈ గ్రంథము యొక్క పూర్వ ప్రకరణముల యందు అచ్చటచ్చట ప్రస్తావింపబడి యుండుటచే మఱల చెప్పదలంప మైతిమి.

## పంచ - ఋషి, బ్రహ్మ, మూర్తులకు అభేదము

మన మింతవరకు చెప్పికొనిన సానగాది పంచ ఋషులకు, మనుమయాది పంచ బ్రహ్మలకు, బ్రహ్మ విష్ణ్వాది పంచ మూర్తులకు వేదార్థము ననుసరించి అభేదమును అనేక గ్రంథములు వక్కాణించుచున్నవి. అందు ముఖ్యముగా స్కాంద, మత్స్య, బ్రహ్మాండాది పురాణములు, వాతూలము మొదలగు ఆగమములు స్పష్టము చేయుచున్నవి. వాటిని ఇప్పుడు పరిశీలింతము.

శ్లో. "మను శ్శివో, మయో విష్ణుః, త్వష్టా బ్రహ్మా, తథైవచ,
శిల్పీంద్రశ్చ, తథా సూర్యో విశ్వజ్ఞ శ్చేతి కథ్యతే."
—— స్కాంద నాగర ఖండము.

దీనికి తెలుగు నాగర ఖండములోని అనువాద పద్యము-

గీత॥ మనువు శివుడును, మయుడు రమాధవుండు,
త్వష్ట పరమేష్ఠి, శిల్పి వృద్ధశ్రవుండు,

తక్షు భానుండునగు; వీరు దైవగురులు
విశ్వకర్మాగ్రనందనుల్ వినుత పుణ్య.

మనువు శివుడనియు, మయుడు విష్ణువనియు, త్వష్ట బ్రహ్మదేవుడనియు, శిల్పి బ్రహ్మ దేవేంద్రు డనియు, విశ్వజ్ఞుడు సూర్యుడనియు, పంచ బ్రహ్మలకును, పంచ మూర్తులకును అభేదము చెప్పబడినది. ఇట్టి ప్రమాణములు బ్రహ్మాండాది పురాణములలో కూడ పెక్కులు కలవు. నాగర ఖండమే మను, మయ, త్వష్ట, శిల్పి, విశ్వజ్ఞులను బ్రహ్మల వంశమునందు పుట్టిన బ్రాహ్మణులకు అనగా "విశ్వ బ్రాహ్మణులకు" సానగ, సనాతన, అహాభూన, ప్రత్న, సుపర్ణ గోత్రములు కలవని చెప్పుచున్నది.

శ్లో॥ "మనుస్సానగ గోత్రశ్చ, సనాతన మయ స్తథా,
అహాభూనస్తు త్వష్టుః స్యాత్, ప్రత్నః స్యాచ్ఛిల్పిన
స్తథా, తక్షశ్చాపి సుపర్ణశ్చ, హ్యేవం గోత్ర
ముదీరితమ్."

ఇట్లు చెప్పుటచేత మన్వాదులకును సానగాదులకును గల అభేదము స్పష్టమగుచున్నది. మన్వాదులు సృష్ట్యాదులు చేయుచున్నప్పుడు బ్రహ్మలుగాను, ఆరాధనీయులైనప్పుడు బ్రహ్మాది మూర్తులుగాను, ప్రజాసర్గము చేయునప్పుడు గోత్ర కర్తలుగాను, లెక్కింపబడినట్లు సునిశిత పరిశీలన, అనుశీలనములచే తోచుచున్నది. లేకున్న శాస్త్రము లిట్లు చెప్పుటకు ఉపపత్తి తికమకగా నుండును.

సృష్ట్యాదిమ కాలమున ఈ సానగాదులైన పంచ

ఋషుల నుండియే ప్రజలు ఉద్భవించినారు. అందుచేత వారి కందరకును సానగాది ఋషి గోత్రములే ఉండెడివి. తమ శక్తినిబట్టి వీరందరును ఆనాడు శిల్పాది కర్మలు, కృషి, వాణిజ్యాదులు, ప్రజాపాలనాదులు చేయుచు ఆర్షాచార ప్రవీణులై ఉండెడివారు. ఇట్లుండగా కాలము జరుగుచూ ప్రజా సంఖ్య పెంపొందుచున్న కొలదినీ కొందరు సోమరులు, అజ్ఞానులు, కర్మభ్రష్టులునయి ఆచార వ్యవహారాదులలో వెనుకబడి తమ తమ గోత్ర సూత్ర ప్రవరాదులను, శిల్పములను, సృష్టి తత్త్వమును మరచి మూఢులైరి. అట్టివారే "శూద్రాది అవర వర్ణములు"గా పరిగణింపబడియుందురు. గోత్రసూత్ర ప్రవరాది విజ్ఞానము కలిగి సంధ్యా వందనాది సదాచార పరాయణులై- వేద, శిల్ప, కృష్యాది కర్మల యందు ప్రవీణులై వెలయువారు మాత్రమే "విశ్వకర్మ వంశీయుల"మని, పంచ ఋషుల నుండి పుట్టినందున "పంచార్షేయుల" మని, "విశ్వబ్రాహ్మణుల" మని చెప్పుకొనుచు, ప్రసిద్ధులై యుందురు. అట్టి స్థితిలోనే లోకమున వారు, వీరు అనెడి భేదము ప్రవర్తిల్లినదికాని, మొట్టమొదట అందరును "వైశ్వకర్మణులే", "సానగాది గోత్ర సంజాతులే" అని గ్రహించుటకు ఏపాటి ఆలోచన ఉన్నను చాలును. పంచ ఋషుల నుండి పుట్టినవారు "పంచార్షేయులు" అయినట్లే, సప్త ఋషుల నుండి పుట్టినవారు "సప్తార్షేయులు" అయినారు. దీనిని పిమ్మట విస్తరముగా విచారింతము. ఇప్పుడు మను, మయాదులకు పుట్టినవారికి శిల్పాది కర్మలు ఎట్లు విభజింపబడినవో ప్రమాణములు చూతము.

శ్లో॥ "అయస్కృతి ర్మనూనాం చ, మయానాం దారుకర్మ చ, త్వష్ట్రాణాం, తామ్రకర్మాణి, శిల్పకర్మ చ శిల్పినామ్. సౌవర్ణం తక్షకానాంచ, పంచకర్మాణి తాని వై, ఏ తే పంచకరూపాశ్చ, యజ్ఞకర్మ పరాః స్మృతాః." — (స్కాందపురాణ, నాగరఖండము)

మను సిద్ధాంతము ననుసరించువారికి అయశ్శిల్పమును (ఇనుప పని), మయ వంశీయులకు అనగా సనాతన గోత్రము వారికి దారుకర్మమును (కొయ్యపని-వడ్రంగము), త్వష్ట్ర వంశము వారికి రాగి, కంచు, ఇత్తడి శిల్పములును, శిల్పి బ్రహ్మవంశము వారికి శిలాశిల్పమును, విశ్వజ్ఞ వంశము వారికి సువర్ణ శిల్పమును (బంగారుపని) కర్తవ్యములని శ్లోకముల తాత్పర్యము. అంతేకాదు. "ఏ తే పంచక రూపాశ్చ" అని ఈ పంచకర్మలు సృష్టి, స్థితి, లయ, తిరోధాన, అనుగ్రహ కర్మముల అంతటి శ్రేష్ఠములనియు, యజ్ఞకర్మలతో సమానములనియు కూడ చెప్పబడినది. ఈ పంచ శిల్పముల ప్రభావము, పూజ్యత, మదీయ శిల్పదర్శన గ్రంథమున విస్తరముగా చూడవచ్చును. మను, మయాదులు గాని, సానగాదులు గాని అయిదయిదుగురేకాన అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయములైన అయిదు శిల్పములే చెప్పబడినవిగాని, సహస్రాధిక శిల్పములు గలవు. మహాభారతాదులు "విశ్వకర్మ"ను (దేవశిల్పిని) గూర్చి "కర్తా శిల్ప సహస్రాణాం, త్రిదశానాంచవర్ధకిః" అన్నవి. కనుక వేల

కొలది శిల్పములు శిల్పాచార్యులచే చేయబడుచున్నవన్న మాట.

మానవుడు చేసెడి ఆ యా కర్మల వలన పుణ్య పాప రూప ఫలములు కలుగుచున్నవి కాని, శిల్పకర్మలను చేయుట వలన కేవలము ఒక్క పుణ్యమే లభించుచున్నది. ఈ అంశమును శ్రీ వడ్డెపాటి వారి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" లోని శిల్ప కాండమును చదివి గ్రహింప వచ్చును. ఏ కర్మల నైనను విడవచ్చును గాని, శిల్పకర్మను గాని, కృషికర్మనుగాని విడనక్కరలేదని "ఈశోపనిషత్తు" లోని దిగువ మంత్రము చెప్పుచున్నది.

"కుర్వన్నే వేహ కర్మాణి, జిజీవిషేచ్ఛతం సమాః,
ఏవం త్వయి నాన్యథేతో౽స్తి, న కర్మ లిప్యతే నరే."

తా॥ శిల్ప, కృష్యాది కర్మలను చేయుచు నూరేండ్లు జీవింపుము. ఇట్టి నీకు ఏ దుష్ఫలితమును అంటదు. ఇట్లనుట చేత శిల్పము, కృషికర్మ ఎంతకాలము (జీవితాంతము) చేసినను, మానవుడు బద్ధుడు కాడని తేలుచున్నది. తక్కిన వైదిక, లౌకిక కర్మలు మానవునికి బంధకములై సంసారమున నే త్రిప్పుచుండును.

ఈ సందర్భమున సానగాది ఋషులను గూర్చిన విశేషములు బ్రహ్మాండ పురాణములోని 'ద్వితీయ' పటలము నుండి కొన్నిటిని సంగ్రహించి చెప్పుకొందము.

## 1. సానగ ఋషి :

"నమో౽స్తుతే సానగ విశ్వకర్మణే నమోస్తుతే

పూర్వ ముఖోద్భవాయ నమోస్తు షడూర్ధ్వభూత
వినిర్మితాయ (?) నమోస్తు చిద్రూప నమో నమస్తే.
సాధనం నాస్తి సర్వత్ర, లోకానాం సర్వసాధక,
కరోతి లోహకర్మాణి, లోకాన్ రక్షతి సానగః
దదా శస్త్రాణి దేవానాం, దుష్ట నిగ్రహ కారణాత్,
స చ సర్వం జగత్కర్తా, సద్యోజాతముఖోద్భవః
శూలం దదాతి భర్గాయ, చక్రం దత్తం చ విష్ణవే,
పాశస్తు బ్రహ్మణే దత్త, స్త్రీమూర్త్యాత్మక సానగః."

తా॥ "విశ్వకర్మ పరమేశ్వరుని" పూర్వ (తూర్పు) ముఖమున పుట్టిన చిద్రూపుడవైన ఓ సానగ విశ్వకర్మా, నీకు నమస్కారము. లోకమున ఎక్కడను ఏ ఉపకరణములూ లేనప్పుడు సర్వ సాధకుడైన సానగ బ్రహ్మర్షి లోహ కర్మలను చేసి లోకములను రక్షించుచున్నాడు. ఇంకను ఆ సానగ ఋషి దుష్ట నిగ్రహము కొఱకై దేవతలకు శస్త్రాస్త్రముల నొసంగెను. సద్యోజాత ముఖమున పుట్టి సర్వ జగత్కర్త అయిన ఆతడు శివునకు శూలమును, విష్ణునకు చక్రమును, బ్రహ్మకు పాశమును నొసంగెను. ఆతడు ఈ త్రిమూర్తి స్వరూపుడే.

## 2. సనాతన ఋషి :

క్షుత్తృష్ణాది నివృత్తాత్మా, జాయతే దక్షిణాన్ముఖాత్,
సనాతనో దారుకర్మ కుశలో నిర్మమే పురా.
హలాదీనాం తు కర్తవ్యం, మందిరాణాం విశేషతః,

స్యందనాదీని యానాని, వికరోతి సనాతనః."

— (బ్రహ్మాండ పురాణ ద్వితీయ పటలము)

తా॥ "విశ్వకర్మ" దక్షిణ ముఖము నుండి పుట్టిన సనాతన ఋషి ఆకలిదప్పులు లేనివాడును, కొయ్యను కనిపెట్టి దారుకర్మను సృష్టించినవాడును అయినాడు. ఆ మహర్షియే పూర్వము నాగలి, బండి, రథము మొ॥ సాధనములను కనిపెట్టి లోకమున దారుశిల్ప ప్రచారము చేసినాడు. ఈ సానగ సనాతనాది ఋషులు బ్రహ్మవిద్యోపదేశికులలో అగ్రగణ్యులుగా బృహదారణ్యక చతుర్థాధ్యాయాంతమున పేర్కొనబడినారు. ఆ పరంపర ఇట్లున్నది- "సనారుః సనాతనాత్, సనాతనః సనగాత్, సనగః పరమేష్ఠినః, పరమేష్ఠీ బ్రహ్మణో, బ్రహ్మ స్వయంభూ బ్రహ్మణే నమః."

తా॥ బ్రహ్మవిద్యా ప్రవర్తకులలో ప్రథమాచార్యుడు స్వయంభు బ్రహ్మ అనగా "విశ్వకర్మ." ఆయన నుండి పరమేష్ఠికి, అతని నుండి సానగునికి, వాని నుండి సనాతనునికి, అతని నుండి సనారువునకు- పిమ్మట 55 గురు మహర్షుల ద్వారా లోకమున ఈ బ్రహ్మవిద్య వ్యాపించినది. పై మంత్రమున పేర్కొనబడిన సనగుడే 'సానగుడని' గ్రహింపవలయును. సనగ-సానగ శబ్దములు భరద్వాజ-భారద్వాజ పదముల వంటివి. దీనినిబట్టి సానగాదులు శిల్పవిద్యా ప్రవర్తకులే గాక బ్రహ్మవిద్యోపదేశికులు కూడ అని స్పష్టమగుచున్నది. బ్రహ్మవిద్యను, శిల్పవిద్యను, జ్ఞాన విజ్ఞానములని

అమరము పేర్కొన్నది. "మోక్షేధీర్ జ్ఞాన, మన్యత్ర విజ్ఞానమ్ శిల్పశాస్త్రయోః."

### 3. అహాభూన ఋషి :

"సంస్తుతో నారదాద్యై, స్త్వహాభూన ఋషిసత్తమః
అశేష మునిభిః పూజ్య, స్త్వఘోర వదనోద్భవః
యో గార్హపత్య ధర్మస్య, వినిర్మాతా జగద్విభుః
త్వష్టా స్వర్ణాదిభిర్లోహైః, పాత్రాణి వికరోతి సంః."

— (బ్రహ్మాండ పురాణ ద్వితీయ పటలము)

తా॥ నారదాదులచే స్తుతింపబడినవాడును, సర్వముని కోటికీ పూజనీయుడును అగు అహాభూన ఋషి "విశ్వకర్మేశ్వరు"ని అఘోర ముఖము నుండి జన్మించెను. జగత్ప్రభుడగు ఆ అహాభూన ఋషియే గృహస్థ ధర్మమును సృష్టించిన వాడు. త్వష్ట్రు స్వరూపుడు అగు ఆతడు బంగారము మున్నగు లోహములచే ఇండ్ల యందు ఉపయోగింపదగిన పాత్రములు మొదలగువాటిని చేసి లోకోపకారము నొనర్చెను. పై శ్లోకములో త్వష్టయు, అహాభూన ఋషియు ఒక్క వ్యక్తియే అయినట్లు వర్ణింపబడినది. "యో గార్హపత్య ధర్మస్య వినిర్మాతా జగద్విభుః" అనుటచేత అనంత మహిమాభిశోభితుడగు త్వష్ట గృహస్థ ధర్మమమునకు నిర్మాత యని స్పష్టముగా తెలియుచున్నది. ఈ అంశమును గూర్చి పలు వేద మంత్రములు కూడ ఆ దేవుని మహిమను ఇట్లు వక్కాణించుచున్నవి. "త్వష్టా జాయా మజనయ, త్వష్టా వై...... కృణోతు వామ్." (చూడుము. పుట-260)

"త్వష్ట్రాణాం తామ్ర కర్మాణి" అనుటచేత అహాన భూనఋషి ఇత్తడి మొ॥లగువానిచేత పాత్రాది నిర్మాణమును కనిపెట్టినాడని, మహా శిల్పాచార్యుడని తెలియవలసి యున్నది.

## 4. ప్రత్న ఋషి :

"ప్రత్నో విశ్వస్య కర్తాసౌ, జగద్రక్షా పరాయణః,
బ్రహ్మోత్తరముఖా జ్జాతః, ప్రవరః ప్రత్నసంతతేః."
— (బ్రహ్మాండ పురాణము)

తా॥ విశ్వకర్మయు, జగద్రక్షకుడును అగు ప్రత్న ఋషి "విశ్వకర్మ" దేవుని, తత్పురుష మనెడి ఉత్తర ముఖము నుండి కలిగినాడు. ఇతడు ప్రత్న ఋషి గోత్రమునకు చెందిన బ్రాహ్మణ్యమునకు మూల పురుషుడు. పై శ్లోకములలో ప్రత్న ఋషి కనిపెట్టిన శిల్పమును "ఇది, ఇట్టిది" అని వక్కాణింపలేదు. అయినను "శిలాకర్మచ శిల్పినామ్" మొదలగు వచనముల చేత శిల్పిబ్రహ్మ అయిన ఆయన శిలా శిల్పమునకు ఉపదేశికుడై నానావిధ దేవతా మూర్తులను దేవాలయ, మండప, గోపుర, ప్రాకారాదులను నిర్మించుటను కనిపెట్టి లోకమును తరింపచేసెనని తెలియుచున్నది. ఈ గ్రంథకర్త ఈ ప్రత్న బ్రహ్మర్షి గోత్రమున పుట్టినవాడే. శిల్ప దర్శనమున గ్రంథకర్త చేసిన ప్రత్నబ్రహ్మ స్తోత్రమును ఇచ్చట ఉదాహరించుట అగుచున్నది.

శ్లో॥ "నానా శిల్పకలా కలాప గురుణా వ్యాసీచ్ఛిలా శిల్పకం
భూయిష్ఠం ప్రకటీకృతం త్రిజగతీ మోక్షాయ

దైవాత్మకం. దైవ జ్ఞాపర నాయక స్స భగవాన్
గోత్రాధినేతా మమ, ప్రత్న బ్రహ్మ ఋషీశ్వరో
విజయతాం స్వాన్తే నితాంన్తోజ్జ్వలః."

తా : గ్రంథకర్త ప్రత్న బ్రహ్మర్షి గోత్రజాతుడు. కనుకనే భార్యా వియోగానంతరము ఆయన "ప్రత్నానంద స్వామి" అయినాడు.

## 5. సుపర్ణ ఋషి :

"మహోన్నతో మహాత్మా వై, పీనవక్షా స్సుసుందరః,
అనాదినిధన స్స్వర్ణ, స్సుపర్ణ స్తస్య నామహి,
స్వర్ణం దదాతి లోకానాం, బ్రహ్మణ్యూర్ధ్వ ముఖోద్భవః,
కిరీట కుండలాదీనాం, భూషణానాం ప్రయోజకః."

— (బ్రహ్మాండ పురాణము)

తా : మహోన్నతుడును, మహాత్ముడును. అందగాడును, ఆద్యంతములు లేనివాడును అగు సుపర్ణ బ్రహ్మర్షి "విశ్వకర్మ" ఊర్ధ్వ ముఖము నుండి పుట్టినాడు. ఈ మహాత్ముడు సువర్ణ శిల్పమునకు సృష్టికర్తయై కిరీట, కుండల, మంగళసూత్రాది భూషణముల నిర్మాణమును లోకమునకు ఉపదేశించెను. ఈ ఋషులను వసిష్ఠోప పురాణము విశ్వకర్మ ముఖోద్భవులని చెప్పగా బ్రహ్మాండ పురాణము, బ్రహ్మ ముఖోద్భవులని చెప్పినది. కాగా 'బ్రహ్మ-విశ్వకర్మల'కు అభేదమే అని పాఠకులు గ్రహింపవచ్చును. ఈ అంశము శ్రుతి సమ్మతమేగాని విరుద్ధము గాదు. ఇటీవల నాగర లిపిలో

ప్రకటితమైన బ్రహ్మాండ పురాణములో ఈ శ్లోకము లగపడుటలేదని డా॥ శోభిరాల సత్యనారాయణగారు చెప్పినారు. ఇట్టివి తొలగింపబడుట సంస్కృత భాషా ద్రోహమే గాక ఒక మహా సంఘమునకు ద్రోహముచేయుట కూడ కాగలదు. ఈ రెంటికన్నను, చరిత్రకు చేసిన గొప్ప ద్రోహముకూడ అగుచున్నది. నేనీ శ్లోకములను మహారాష్ట్రి భాషలో క్షీర సాగరం నారాయణశాస్త్రి ప్రణీతమైన "విశ్వబ్రహ్మ కులోత్సాహ", వడ్డెపాటి నిరంజన శాస్త్రిగారి "విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము" అను గ్రంథములను చూచి వ్రాసినాను.

ప్రాచీన గ్రంథములలో ఉన్న ఇట్టి విషయములను తరువాతి కాలపు ముద్రాపకులు తమ భావములను బట్టి తమ కిష్టము కానివాటిని తొలగించుట, తమ కిష్టమైన క్రొత్తవాటిని చేర్చుట అనెడు ఈ పని ఘోరాతి ఘోరము. ఇట్టి పని మన దేశములో ఎక్కువగానే జరిగినది. ప్రస్తుతము జరుగుచున్నదికూడను. కొన్ని సంస్కృత గ్రంథముల వ్యాఖ్యానములలో అగపడిన శ్లోకములు ఇటీవలి ముద్రిత గ్రంథములలో లేకపోవుటను నేను నా గ్రంథములలో ఉదాహరించుచునే యున్నాను. ఇక ప్రకృతమునకు వత్తము.

సానగ, సనాతన, అహభూన, ప్రత్న, సుపర్ణ లనెడి పంచ ఋషులు యజుర్వేదము నందలి "ప్రాచీదిశామాది" మంత్రములలో వరుసగా ఉండుటను మనము ప్రకరణ ప్రారంభముననే చదివియున్నాము. ఈ విధముగా వేదములో

సప్త ఋషులు వరుసగా నుండుట నాకు కనపడలేదు. ఈ ఋషులు ఇట్లు వరుసగా నుండుట, వారు "విశ్వబ్రాహ్మణుల"కు ఆదిమ గోత్ర ఋషులగుట గొప్ప విశేషము. అట్టి స్థితియే లేనిచో "విశ్వబ్రాహ్మణుల"పై వచ్చిన తిట్టు గ్రంథముల అలజడిలో ఆ జాతి ఎప్పుడో నామరూపములు లేకుండా పోయెడిది. ఆ పంచఋషుల నుండి ఇరువదైదుగురు ప్రవర ఋషులు మొదటగా కలిగి ఆ వంశము 125 గోత్రములు గల మహా వంశమైనది. అందుకే దానికి "పంచ గోత్రం మహత్ కులమ్" 5 గోత్రములు ప్రధానముగా గల మహాకుల మగుటయే కారణము. ఆ పంచర్షులు సృష్టిలోని అనేక తాత్త్విక రహస్యములకు గుర్తులు (సంకేతము) లగుట కూడ ఒక విశేష హేతువే. సంస్కృతములో "విశ్వకర్మ పురాణము"ను వ్రాసిన కాళహస్తి మునీంద్రుడు ఈ పంచర్షులను గూర్చి 20వ అధ్యాయమున ఇట్లు వ్రాసినాడు.

"బ్రాహ్మణానాం కులం పూర్వం ద్వేధా విరచితం సురైః
అర్షేయం పౌరుషేయం కర్మ జన్మ విశేషతః.
ఆర్షేయం వసిష్ఠాది హ్యాముష్మిన్ ఋషిసత్తమ!
య ద్విశ్వకర్మణా శ్చాస్య పురుషస్య ముఖోద్భవమ్.
పౌరుషేయ మితి ఖ్యాతం పంచగోత్రం మహత్కులమ్."
— (విశ్వకర్మ పురాణం. అధ్యాయము-20)

తా : బ్రాహ్మణ కులము పూర్వము దేవతలచే రెండు రీతులు గలదిగా నిర్మింపబడినది. అయ్యది "ఆర్షేయ"

మనియు, "పౌరుషే"య మనియు కర్మనుబట్టి, జన్మమును బట్టి విభజింపబడినది. వసిష్ఠాది గోత్రముల చేత గలిగినది ఆర్షేయము. పురుష సూక్తమున వర్ణింపబడిన విరాట్పురుషుడగు "విశ్వకర్మ" ముఖము నుండి కలిగిన సానగాదులచే వెలసినది పౌరుషేయము. ఇందు సానగాది పంచ ఋషుల నుండి క్రమ ప్రవృద్ధమైనందున దీనికి "పంచగోత్ర వంశమని"యు, "పంచార్షేయ వంశమని"యు పేరులు ఏర్పడినవి. అట్లే వసిష్ఠాది గోత్రజాత వంశమునకు సప్తార్షేయమని కూడ ప్రసిద్ధి.

పురుషుని (విశ్వకర్మ) యొక్క ముఖముల నుండి కలిగిన సానగాది ఋషుల వలన కొనసాగినది కాబట్టి ఈ వంశమును పౌరుషేయమని కాళహస్తి ముని తన "విశ్వకర్మ పురాణములో" చెప్పినాడు. అది సత్యమే అయినను వీరు ఆర్షేయులు కాకపోరు. పంచ ఋషుల యొక్క మరియు 125 గురు ఋషులయొక్క గోత్రములు వీరికుండుట వలన వీరు 'ఆర్షేయులు' కూడా అయితీరుదురు. అట్లే సప్త ఋషులు కూడ "విశ్వకర్మ" మనస్సంభూతులే కనుక వారికినీ "పౌరుషేయ, ఆర్షేయ నామములు" చెల్లుటలో ఎట్టి ఆక్షేపమును లేదు. అంతేకాదు. "బాహూరాజన్యః కృతః" ఈ మొదలైన మంత్ర వాక్యములను బట్టి క్షత్రియ, వైశ్య, శూద్రులు కూడ పరమ పురుషుని అవయవముల నుండి పుట్టినవారే కనుక వారినికూడ "పౌరుషేయు"లని వ్యవహరింపవచ్చును. సృష్టి జరిగిన పిమ్మట సర్వులును యోని మార్గము నుండియే పుట్టుచున్నారు గదా! యోని మార్గము

నుండి పుట్టినవారే బ్రాహ్మణు లగుచుండగా చేతులు, మొదలగు అవయవముల నుండి పుట్టినవారు 'పౌరుషేయులు' ఏలకారు ? అసలీ బ్రాహ్మణాది విభాగమును నేను, పురుష సూక్తము ననుసరించి చేయుచున్నానే గాని నా కిష్టమై కాదు. శాస్త్రము నందున్న దానికి అర్థమును చెప్పి గతి కల్పించుట వ్యాఖ్యాత యొక్క, గ్రంథకర్త యొక్క అభిమతము. అసలు నా దృష్టిలో మానవులందరును భగవత్స్వరూపులే. "విశ్వకర్మాకారులే, విశ్వకర్మలే." వారు వేద ధర్మము నాచరించి బ్రాహ్మణులు అయి లోకసేవ చేసి తరించుట నా భావము. నా యీ కృషికూడ అందుకొఱకే. అయినను వర్తమాన ప్రపంచమున, లోగడ జరిగిన ఎన్నో అన్యాయములు మానవ సమాజముపై పెత్తనము చేసి వారిలో సమతను భంగపరచి వైషమ్యమును పెంచి కలహాములకు కారణమైనవని పాఠకులకు తెలియనిది కాదు. కాళహస్తి ముని "ఆర్షేయం, పౌర్షేయం కర్మజన్మ విశేషతః" అన్న వాక్యము సంప్రదాయమును బట్టి చెప్పినదేగాని వేఱొకటి కాదు. జన్మమాత్రముచేత (పుట్టుక చేత) ఎవడును బ్రాహ్మణుడు కాజాలడు. సత్కర్మలను ఆచరించి అంతఃకరణ స్థాయిని పెంచుకొని బ్రాహ్మీస్థితిని పొందిననేకాని బ్రాహ్మణుడని చెప్పబడుటకు వీలుండదు. కాని ఈ స్థితి ఈనాడు తారుమారైనది. గుణములనుబట్టి గాక పుట్టుకను బట్టియే బ్రాహ్మణాది వర్ణభేదములను ఈనాడు పాటించుచున్నాము తాత్త్వికులైనవారి విషయమున చూచినచో జన్మచే వచ్చిన

బ్రాహ్మణత్వమునకు ఎట్టి ప్రాధాన్యము లేదని గుర్తింప గలము. ఇక ప్రకృతమునకు వత్తము.

సానగ, సనాత, అహభూన, ప్రత్న, సుపర్ణులను ఋషుల సంతానమునకు అయో, దారు, తామ్ర, శిల, సువర్ణమయములైన శిల్పములు ఆచరణీయములని చెప్పు కొన్నాము గదా! అట్లే ఆ 5 గోత్రముల వారికి 5 వేద ములు కూడ పఠనీయములైనట్లు స్కాంద పురాణ నాగర ఖండాత్కర్గతమైన 13వ అధ్యాయము చెప్పుచున్నది.

"ఋగ్వేద శ్చ మనూనాం చ, మయానాం చ యజుశ్శ్రుతిః,
త్వష్ట్రాణాం సామవేద శ్చ, శిల్పిజానాం త్వథర్వకః
విశ్వజ్ఞానాం చ ప్రణవో గాయత్ర్యం చ సమాచరేత్."

తా : అనగా మనువంశము వారు (సానగఋషి వంశ జులు) ఋగ్వేదమును, మయ (సనాతన) వంశజులు యజు ర్వేదమును, త్వష్ట్ర (అహభూన) వంశికులు సామ వేదమును, శిల్పి (ప్రత్న) వంశమువారు అథర్వ వేదమును, విశ్వజ్ఞ (సుపర్ణ) గోత్రమువారు ప్రణవ వేదమును చదువవలయు నని భావము. దీనినిబట్టి వేదములు 5 అని తేలుచున్నది. ఔను. అది సమంజసమే. బ్రహ్మగాని, విశ్వకర్మగాని, గాయత్రి గాని 5 మోములు కలవారని వర్ణనలు కదా! ఆ మొగముల నుండియే వేదములు పుట్టినవని మనకు ప్రమాణము లున్నవి. కనుక వేదములు 5 అగుటలో అనుపపత్తి ఏమియు లేదు. బ్రహ్మ 5 తలలు కలవాడై విశ్వకర్మగా ఉన్నప్పుడు 5

వేదములు ఉండియుండును. ఆయన చతుర్ముఖుడైన పిమ్మట నాలుగు వేదములే అని ప్రచారము జరిగిఉండవచ్చును. కాగా ఋగ్యజుస్సామాథర్వములతోపాటు ప్రణవ వేద మొకటి 5వదిగా ఉన్నట్లు పై శ్లోకమును బట్టి తెలియు చున్నది. వ్యాస భగవానుడు వేద విభాగమును చేసినాడని ప్రసిద్ధి కదా! ఆయన విభాగములో 5, నాలుగై యుండునా? ఈ విషయము పరిశోధింపదగినది. ఈ పంచ వేదములకు, గాయత్రీదేవి యొక్క పంచ శీర్షములకు, గుర్తుగానే ఉప నయన కాలమున వటువులకు పంచశిఖల నుంచెడి ఆచారము కొనసాగుచు వచ్చినది. ఈ వేదములను గూర్చి మిత్ర సాహస్రి నవమ శతకములోని పద్యములను కొన్నింటిని ఇక్కడ నుదాహరించుట అప్రస్తుతము కాదు.

"బ్రహ్మ పంచవదన భాసితు డగువేళ
పంచ వేదములు ప్రపంచితములు,
నటికి ఒక్క తలను నాలుగు వేదాలె
అని వచించనార లార్య మిత్ర." — 863

"ప్రణవేద మొకటి ప్రత్యేకముగ లేక
ప్రణవమే సుపర్ణభవుల చేత
జప్యమనిన అద్ది సర్వ విప్రాళికు
పాస్యమగునుగాదె! పరమ మిత్ర." — 864

"అగుట పంచఋషుల కైదు వేదంబులు
కలవటన్న మాట కల్లకాదు-

పంచ ముఖములకును పంచ వేదంబులు
పుట్టియుండవా ? సుపూజ్య మిత్ర." — 865

"పంచ ముఖములకును పంచ వేదంబులు
ప్రాతినిధ్య మందబడుట కతన
పంచ ఋషుల చేత పఠన, పాఠన, యోగ్య
తను భజించె నవి- యుదార మిత్ర." — 866

"పరమ తత్త్వవాది పంచమ వేదంబు
శ్రుతి చతుష్టయమున జొనిపినారొ!
అంతరించెనేమొ, ఔపనిషదవిద్యఁ
గలిపినారొ తెలియగలమె; మిత్ర." — 867

"బ్రహ్మపంచకంబు, బ్రహ్మర్షి పంచక,
మంశ, శక్తి, మూర్తు లాదిగల్గు
బహుళ పంచకములె ప్రవచించు వేదము
లైదటంచు ప్రాజ్ఞులరయు మిత్ర." — 870

"కృత్య పంచకంబు, కృత్యత్రితయ మయ్యె,
మూర్తిపంచకము, త్రిమూర్తులైరి-
వేద పంచకంబు వేదముల్ నాల్గయ్యె,
ఇట్టి మార్పులెల్ల నెఱుగు, మిత్ర." — 871

"పంచ ఋషుల పూర్వ భవ్య సిద్ధాంతాల
నేట గలిపి, క్రొత్తలేవొ చెప్పి
మనుజులందు సమత ద్రుంచిరే స్వార్థ
పరులొ మొదటిపీట వలచి మిత్ర." — 872

ఈ గ్రంథకర్తను ఒక మహాసభలో "వేదము లెన్ని"?

అని ఒకరు ప్రశ్నించినారు. వెంటనే ఆయన "బ్రహ్మకు తల లెన్ని ?" అని ప్రతిప్రశ్న చేసినాడు. అందుకా వ్యక్తి "మొదట అయిదు, శివుడొక తలను నఱకగా నాలైనవి" అనినాడు. అప్పుడాయన అయిదు తలలు ఉన్నప్పుడు అయిదు వేదములు కాని, నాలుగు తలలైనప్పుడు నాలుగు వేదములే అయినవని సమాధానము చెప్పగా సభ అంతయు చప్పట్లు చఱచి తన హర్షమును వెలిపుచ్చినది.

ఇంతకు త్రిమూర్తి, పంచమూర్తి సిద్ధాంతముల రహస్యములను ఇట్లు గ్రహింపవలసి యున్నది. త్రిమూర్తులు స్థూల, సూక్ష్మ, కారణ శరీరములకు ప్రతీకలు, సంకేతములు. అట్లే పంచమూర్తులు లేక పంచ బ్రహ్మలు, పంచ ఋషులు అనువారు పంచ భూతములకే గాక, అన్నమయాది పంచ కోశములకు, పంచేంద్రియములకు, పంచ ప్రాణములకు ప్రతీకలు. ఈ భావన పిండాండ పక్షమున గూడ సమన్వయించి ఆ మూర్తులెల్లరు శరీరము నందే ఉన్నారనెడి రహస్యమును సూచించుచున్నది.

ఇంకను గాయత్రీదేవికి, సావిత్రి, సరస్వతి అని మరి రెండు పేర్లు గలవు. ఈ 3 పేర్లతో మూడు వేళల యందు "గాయత్రీదేవి"ని ద్విజులైనవారు అర్చించుచుందురు. ఈ గాయత్రి, సావిత్రి, సరస్వతి, పీఠములు "విశ్వబ్రాహ్మణుల" అనగా ఈ సానగాది బ్రహ్మర్షి వంశజుల పాలనలోనే ఉండెడివి. మొన్న మొన్నటివరకు గాయత్రీ పీఠమును వీపూరివారును, సావిత్రీ పీఠమును కనుపర్తివారును, సరస్వతీ

పీఠమును గినిగెర సాంబమూర్తి స్వామివారు పాలించు చుండెడి వారు. ఇదే ఆనెగొంది ప్రభుత్వ ఆస్థాన పీఠము. ప్రౌఢదేవరాయల ఆస్థానమున పండితుడుగా నున్న ముమ్మనాచార్యులు గాయత్రీ పీఠమును పాలించినట్లు "ఆంధ్ర విశ్వకర్మ పురాణము" చెప్పుచున్నది. సావిత్రీ పీఠాధిపతి అయిన శ్రీ కనుపర్తి బసవాచార్య స్వామి "రథ కారాధికరణము" అను గ్రంథమును వ్రాసియున్నాడు. రథ కారుల బ్రాహ్మణత్వమును గూర్చి ఆయన పేరూరిలోని సప్తార్షేయ పండితులతో వాదించి గెలిచినాడు. సప్తార్షేయులు ఈ మహానుభావునికి బ్రహ్మరథము పట్టి ఊరేగించినారు. ఆ కారణమున ఆయనకు "పేరూరి బ్రహ్మ రథా రూఢ" అనెడు బిరుదము కలిగినది. ఈనాడు రథకారుల బ్రాహ్మ ణత్వమును నిరూపించుటకు "రథకారాదికరణ" గ్రంథము పరమ ప్రమాణమై ప్రసిద్ధి గన్నది. కావున పంచార్షేయ బ్రాహ్మణుల చరిత్ర వేదముల నాటినుండి నేటివరకు సుప్ర సిద్ధమై, జగజ్జేగీయమానమై వెలుగొందుచున్నది.

## పంచార్షేయులు - వారిపై నిందలు

ఇంతటి ప్రాచీన చరిత్ర ప్రసిద్ధులు గల ఈ పంచా ర్షేయ బ్రాహ్మణుల మీద కొన్ని నిందలు ఇంకనూ వేదేతర గ్రంథములలో వ్రాయబడి వ్యవహారమున దుష్ప్రచార ములు జరిగి వీరు చిన్నచూపు చూడబడుట శోచనీయము. వీరు "బ్రాహ్మణులు" కారనియు, విశ్వకర్మకు శూద్ర స్త్రీ

యందు పుట్టినవారనియు, "మాహిష్య కరణజాతి" దంపతులకు కలిగినవారనియు, ఒకటి, రెండు స్మృతులయందును, ఒకటి రెండు పురాణముల యందును వ్రాయబడియున్నవి. స్వార్థపరులైనవారు, అజ్ఞానులు, అసూయాపరులు ఆ ఆధునిక కల్పిత గ్రంథములనే ప్రమాణముగ తీసికొని పంచార్షేయులను బ్రాహ్మణేతరులని నేటికినీ నిందించుట, గ్రంథాదులలో వ్రాయుట, మనము గమనించుచునే ఉన్నాము. ఇట్లు నిందించు వారికి వేదముల వాసనయే తెలియదు. సృష్టి తత్త్వమే, ఆనాటి లోక వ్యవహారమే తెలియదు- అని సత్యారాధకులు భావింపవలయును. అట్లు భావించుటకు పంచర్షులను గూర్చి మేమింతవరకును వ్రాసిన వేదాది పవిత్ర గ్రంథముల ప్రమాణములే నిదర్శనములు. ఈ నిందామయములైన వ్రాతలు ఆధునిక కాలమున ఎవరో అసూయాపరులు ప్రక్షిప్తములు చేసినారనుటలో ఎట్టి సందేహమును వలదు. గ్రంథములందున్న సద్విషయములను, సత్యములను, తమ కిష్టము కానిచో తొలగించుట, తమ కిష్టమైనటువంటి అసత్యములే అయిన నిందలను, తిట్లను గ్రంథములలో చేర్చుట అను పని మనవారికి అలవాటైన విద్యయే అని చెప్పికొన్నాము గదా. ఈ విధముగా ప్రక్షిప్త రచనలు చేసి నిందలకు గురి చేసినది ఒక్క "విశ్వబ్రాహ్మణు"లనే కాదు. నియోగులను, వైఖానసులను (నంబివారు), శివార్చకులను (తంబలవారు) కూడ మనవారు గ్రంథములలో తక్కువ

వారని వ్రాసి నిందించియున్నారు. ఉదాహరణమునకు ఈ దిగువ శ్లోకమును చూతురు గాక.

"పురా తు క్షత్రియే వర్గే, వినాశం భార్గవాద్గతే,
తత్కళత్రేషు సంజాతా విప్రేభ్యశ్చ నియోగినః."

తా॥ పూర్వము పరశురాముడు 21 మారులు దండయాత్రలు చేసి క్షత్రియ వంశమును సర్వనాశనము చేసినాడని పురాణాదులలో మనము చదువుదుము. అట్లు పరశురామునిచే క్షత్రియ వర్గము నాశనము చేయబడగా వారి భార్యలు, విప్రులతో సంగమించినారట. ఆ విప్రులకు ఈ క్షత్రియ స్త్రీలకు పుట్టినవారే నియోగులు. అనగా నియోగ విధిచేత పుట్టినవారు గాన "నియోగులు" అయినారని భావము.

ఇది ఎంత సమంజసమో ఆలోచింపుడు. వారి భార్యలు విధవలు కాగా, వారు విప్రులతో నియోగ విధిచేత సంగమించి బిడ్డలను కన్నారట. వారే నియోగులట. ఇది ఎంతతరకు సత్యము. నియోగి బ్రాహ్మణులను తిట్టదలంచి వ్రాసిన శ్లోకము కాదా ఇది? అసలు సత్యము ఇది. పరశురాముని యుద్ధ విప్లవ సమయమున కొందఱు క్షత్రియులు తప్పించుకొని పారిపోయి నగర గ్రామాంతరములలో శూద్రుల మనియో, వైశ్యుల మనియో, ఇంకొక కులము వారమనియో చెప్పుకొని ప్రాణరక్షణ చేసికొన్నారు. అట్టివారే తెలుగు దేశమున "వెలమలు" మొదలైన రాజ వంశము వారుగా, పిమ్మట పరిపాలన చేయుచున్నారని నా పరిశోధ

నలో గ్రహింపగలిగినాను. మనకు స్వాతంత్ర్యము రాక పూర్వము భారత దేశమున, చిన్న చిన్న పరగణాలను పరిపాలించుచున్న రాజులు, జమీందారులు, తమ కులమును మార్చి చెప్పుకొన్నది ప్రాచీన ఆ క్షత్రియులే. ఒక్కొక్క కుల, మత, జాతి విప్లవములు సంభవించినప్పుడు ఇట్టి మార్పులు, అవకతవకలు, ప్రాణరక్షణము కోసమై జరుగుట ఆశ్చర్యము కాదు. మనదేశ చరిత్రను, నిశితముగాను, సూక్ష్మముగాను పరిశీలించినచో ఇట్టి సంఘటనలు అనేకము చారిత్రక దృష్టికి పొడకట్టగలవు. విస్తర భయమున శివార్చకులకు, వైఖానసులుకు జరిగిన అపకారములను, అపచారములను, నిందలను ఈ సందర్భమున వక్కాణించుట లేదు. "వైశ్యో విశ్వాస ఘాతుకః" ఇట్టి వాక్యములునూ ఈ నిందలలోనివే.

పంచార్షేయులైన ఈ బ్రాహ్మణులను లోక వ్యవహారమున "బ్రాహ్మణులని" గాని, "విశ్వబ్రాహ్మణులని" గాని పిలుచుటయే మాని వృత్తి వాచకములైన "కమ్మరి, వడ్రంగి, కాసే, కంసాలి, బత్తులు" మొదలైన వృత్తివాచక పదములను వాడి వారి గౌరవమును మంటగలిపినారు. ఇట్టి దారుణ కర్మచేత వారు బ్రాహ్మణేతరులుగా ఇతరుల దృష్టిలో లోకమున పిలువబడుట, వ్యవహరింపబడుట, గ్రంథములలో వ్రాయబడుట జరిగినది. ఈ విషయమును మదీయ మిత్ర సాహస్రిలో ఇట్లు పేర్కొనుట యైనది.

"వృత్తి వాచకములు విపరీతముగ వాడి,
శిల్పగౌరవంబు చెఱచి అవల

విశ్వకర్మజాతి వృద్ధి నడంచిరీ
సత్యమును చరిత్రచాటు మిత్ర!" — 916

"దేశ చరిత నెన్ని తిరమకల్ జరిగెనో
ఊహసేయ తోచు ఉన్న నిజము-
అధము లధికులైరి, అధికులై రధములు,
కాలపురుష చిత్తలీల మిత్ర!" — 917

"పంచఋషులనాటి ప్రాథమిక స్థితి
ఇట్టు లుండెననుచు నెరిగి ప్రజలు
విశ్వమనుజ ధర్మ విధులు తీరిచి నూత్న
సంఘమును సృజింప జను- సుమిత్ర!" — 918

ఇట్టి సత్యముల నెన్నింటినో మిత్రసాహస్రిలో వ్రాయుట అయినది. సత్యారాధకులు దానిని చదివి విశేషములను గ్రహింపవలయునని కోరుచున్నాము.

"విశ్వబ్రాహ్మణు"లను గూర్చి, అబ్రాహ్మణులని ప్రచారము జరుగగా వారు ఎన్నియో న్యాయస్థానములలో మొర పెట్టుకుని తమ బ్రాహ్మణత్వమును, వాదోపవాదముల ద్వారా వేదాది ప్రమాణమ్ములను నిరూపించి, నిర్ధారణ చేసికొనుట, ప్రభుత్వమువారు సత్యమును అంగీకరించి ప్రక్షిప్తములైన కల్పిత శ్లోకములను పూర్వపక్షము చేసి పంచాణ్ణేయులు "బ్రాహ్మణులే" అని నిరూపించుట, పెక్కుతావుల జరిగినది. అట్టివాటిలో చిత్తూరులో జరిగిన చిత్తూరు జిల్లా తీర్పు, గుంటూరు జిల్లా తీర్పు మొదలగునవి ఎన్నియో

కలవు. ఇంతకుముందే "రథకారాధికరణము ఆ కోవకు చెందినదే యని తెల్పినాము." అనేకులు సత్పురుషులు, అసూయారహితులు, సత్యద్రష్టలు అయిన కవి, పండిత, రచయితలు పంచార్షేయుల బ్రాహ్మణత్వమును గూర్చి ఎంతగానో కొనియాడియే యున్నారు. నేటికినీ అట్టి పండితులు లేకపోలేదు.

18వ శతాబ్ది తొలి పాదమున వైదిక బ్రాహ్మణుడైన బొమ్మకంటి ప్రభాకర కవి "ధర్మపాల విజయము" (కాంస్యకార వీర చరిత్ర) అనెడి మహా కావ్యమును వ్రాసినాడు. ఆయన మేము వక్కాణించిన పంచబ్రహ్మ సంప్రదాయమును లెస్సగా ఎఱింగినవాడు. ఆయన తన కావ్యములో పంచార్షేయ వంశప్రాశస్త్యమును అడుగడుగునను వచించుచుండును. మచ్చునకు కొలది పద్యములను చూతము.

ఉ॥

పూని సమస్త లోకములఁ బొల్పుగ సృష్టియొనర్పఁ బ్రోవ సు
జ్ఞాన విశుద్ధ మార్గముల సంతతముం ఘటియింప బొల్చు స
న్మానిత కీర్తి సానగ, సనాతన, ప్రత్న, సుపర్ణ నామకా
భూన ఋషుల్ ప్రవర్తిలిన పూతమహీసుర వంశ మోనృపా.
— 3-17

తే. గీ. ఆ విరాడ్విశ్వకర్మ పంచాననంబు
లమరుచుండును వామదేవాది నామ
ములఁ దదాస్యంబులను సముద్భూతులైరి
సానగాదులు జ్ఞాన విజ్ఞాన నిధులు. — 3-19

సీ॥ మొదట సద్యోజాత ముఖ సంభవుండగు

సానగ బ్రహ్మ ఋక్శాఖవాడు,
వామదేవ ముఖోద్భవ సనాతన బ్రహ్మ
సంస్తుతామల యజుశ్శాఖవాడు,
అల యఘోరాస్యజుం డహాభూనుడను బ్రహ్మ
జగదీడితుడు సామశాఖవాడు,
తత్పురుషాన నోద్భవుడు ప్రత్న బ్రహ్మ
సరవి నథర్వణశాఖవాడు,
గీ॥ పరగ నీశాన ముఖజ సుపర్ణ మాని
ప్రణవశాఖ; జనించి రీ పంచశాఖ
లందునన్ నూటయిరువది యైదుగు రగు
బ్రహ్మఋషులు, తదన్వయ బ్రాహ్మణులము.
— 3-20

సీ॥ ఘన విశ్వకర్మ జగద్గురు రాజిత
పంచముఖోద్భవ బ్రహ్మఋషులు,
తత ఋగాదత్ర యాథర్వణ ప్రణవాఖ్య
పంచ వేదాంచిత బ్రహ్మ ఋషులు,
చయన సాంతపనాది సర్వయజ్ఞాళి ని
ర్వాహణ ధూర్వహ పరబ్రహ్మఋషులు,
నాయస దారు తామ్రాది లోకాధార
పంచకర్మలు గల బ్రహ్మఋషులు
గీ॥ నరయ బ్రహ్మ, విష్ణు, హర, పాకశాసన,
భాస్కర స్వరూప బ్రహ్మఋషులు

సృష్టి కాది పురుష సింహులు ల వ్వారి స
ద్వంశమందుఁ బుట్టి వఱలి నాము. — 3-15

ఈ పద్యము లందు ఇంతవరకు మనము వేదప్రమాణ సమ్మతముగా తెలిసికొనిన సానగాది బ్రహ్మ ఋషులు, మను మయాది బ్రహ్మలు, ఋగాది పంచ వేదములు మున్నగు విషయములు ప్రస్తావింపబడుట గమనింపదగినది. ఇక ఈ కావ్యమును చదివి అందలి భావములతో శ్రీపాదకృష్ణ మూర్తిశాస్త్రిగారు వ్రాసిన సంపూర్ణ అభిప్రాయమును, వీరేగాక శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు, శ్రీ మధ్వ పూర్ణ ప్రజ్ఞాచార్యుల వారలు వ్రాసిన అభిప్రాయములను కూడ పాఠకులు చదువుట మంచిదని వానినిట ఉదాహరించు చున్నాము.

1] <u>శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి అభిప్రాయము :</u>

"ఈ విశ్వకర్మ వంశమునకు చెందిన త్వష్టయు, విశ్వ రూపుడు, మయుడును, మహాప్రభావ సంపన్నులుగాను, లోకాతీత మహిమాతి విశాల యశోవిరాజితులుగాను వేదాది వాఙ్మయములో వర్ణింపబడి యున్నారు. పంచముఖ బ్రహ్మ వంశీయులగు విశ్వకర్మ లందరును "విశ్వబ్రాహ్మ ణులు." వీరికి చతుర్ముఖబ్రహ్మ వంశీయులగు బ్రాహ్మణులకు వలె వేదకర్మాధికారమేగాక, శిల్పకర్మాధికారము కూడ విశే షించి కలదు. వీరు విశ్వ మానవకోటికి చేయని ఉపకార మొక్కటియు లేదు. అణువు మొదలుకొని, బ్రహ్మాండము వరకు వీరు నిర్మించినదియె యనుట సిద్ధాంతము. ఈ అంశ

ములు ఈ ధర్మపాల విజయ కావ్యమున యథావకాశముగా సూచితము లనవచ్చును."

— (ధర్మపాల విజయము-పుట. 14)

[ఈ ధర్మపాల విజయము కావలసినవారు శ్రీ కోసూరి వెంకట సుబ్బారావుగారు (రిటైర్డ్ తహశీల్దారు), అడ్డావారి వీధి, నాజరుపేట, తెనాలి అను చిరునామాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును.]

## 2] శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి అభిప్రాయము :

"...... పూర్వ మీ దేశమున విశ్వబ్రాహ్మణు లెట్టి వారో ఈ కావ్యము నిరూపించుచున్నది. వారి ప్రాచీన సభ్యత, వారి వైదిక, లౌకిక శిల్ప ప్రాగల్భ్యము, వేదశాస్త్రాగమ, శిల్ప, వాస్తు గ్రంథములలో వ్యాఖ్యానరమ్యముగా కాంచగలము. విశ్వకర్మ పురాణ, మూలస్తంభ, నాగర ఖండాది గ్రంథములు వీరి ప్రాశస్త్యమును చాటునవి తెలుగులో కూడ నున్నవి ..."

## 3] కీ. శే. శ్రీమధ్వ పూర్ణ ప్రజ్ఞాచార్యులు గారి అభిప్రాయము :

" ... పిండితార్థ మేమన, ఈ కవి సత్యాన్వేషణ మొనర్చి "విశ్వబ్రాహ్మణు"లను సానగ సనాతనాది శిల్ప బ్రహ్మ ఋషి వంశ సంభవులనుగా నిరూపించి, మఱుగున పడియున్న యేత దుదంతమును వెలుగులోనికి తెచ్చినాడనుట పరమ సత్యము."

ఈ సందర్భమున కాశీ క్షేత్రము నందలి విద్వజ్జను లిచ్చిన తీర్మానము కూడ ఇచ్చట ఉదాహరించుట సమంజసముగా నుండును.

కాశీ క్షేత్ర విద్వజ్జనుల తీర్మానము :

"సామాన్యతః ప్రజా ద్వివిధాః. విశ్వకర్మ బ్రహ్మ నిర్మితాః, కశ్యప బ్రహ్మ నిర్మితాశ్చ. యద్యపి "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీ దిత్యా దినా విరాడంగత్వం ప్రతీయతే. తథాపి ఆకాశాద్వాయు రిత్యాదివత్ పరంపరయా తజ్జన్యత్వం బోధ్యమ్. ఆద్యాః పంచవిధాః, ద్వితీయాశ్చతుర్విధాః ... తత్రాద్యా వైశ్వకర్మణాః యజనాది త్రయం కర్తవ్యత్వేన ప్రజాపాలనాదికం వృత్త్యుపయోగిత్వేన స్వీచక్రుః. కాశ్యపేషు మధ్యే బ్రాహ్మణా యజనాది త్రయం కర్తవ్యత్వేన, యాజనాదిత్రయం జీవనోపయోగిత్వేన ... ."

— (విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగమము. పుట-337)

దీనికి తెలుగు : ప్రజలు 'విశ్వకర్మ బ్రహ్మ' నిర్మితులు, 'కస్యప బ్రహ్మ' నిర్మితులు అని సామాన్యముగా రెండు విధములు. "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" అనుటవలన విరాట్పురుషునకు వీరు అంగముల వంటివారని తెలియుచున్నది. ఐనను ఆకాశము నుండి వాయువు, దాని నుండి అగ్ని మొదలగునవి పుట్టినవన్నట్లు పరమ పురుషుని నుండి పుట్టుక యని ఎఱుంగవలయును. వీరిలో మొదటివారైన 'విశ్వకర్మ బ్రహ్మ'

ముఖోద్భవులు సానగ, సనాతనాది భేదముల చేత ఐదు రీతు లగుచున్నారు. రెండవవారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర భేదముచే 4 రీతులు. ఆద్యులైన "వైశ్వకర్మణులు", యజనము, అధ్యయనము, దానములను కర్తవ్యములుగను, ప్రజాపాలనాదులను వృత్తులుగను స్వీకరించినారు. కశ్యప సంతానము నందు "బ్రాహ్మణులు" యజనాదులు వీను కర్తవ్యములుగను, యాజనాదులు జీవనోపాయముగను ఎన్ను కొన్నారు.

<u>ఇచ్చట నొక విశేషము</u> : కాశీ క్షేత్రస్థ విద్వజ్జనులు తమ అభిప్రాయములో "విశ్వకర్మ బ్రహ్మ" నుండి పుట్టిన సానగాది ఋషులను, కశ్యపుని వేఱువేఱుగా చూచినట్లు తెలియుచున్నది. అల్లే కృష్ణమూర్తి శాస్త్రిగారును పంచ ముఖబ్రహ్మ ఒకడనియు, చతుర్ముఖ బ్రహ్మ వేఱొకడనియు, ఇరువురు బ్రహ్మ లున్నారని చెప్పినారు. ఈ భావము మన పురాణ వాఙ్మయము ననుసరించి కల్గినట్టిది. వేదము ననుస రించి చూడగా "విశ్వకర్మ" నుండియే పంచర్షులును, సప్తర్షు లును కలిగినట్లు మనము ఇంతకుముందు చదివినాము. అయితే పూర్వ ఋషులైన సానగాదులు మొదటివారనియు, సప్తర్షు లైన వసిష్ఠాదులు పిమ్మటి వారనియు వేదసూక్తమే (ఋగ్వే. 10-1-2 సూక్తములు) చెప్పినది కదా! కనుక ఉభయ ఋషులును "విశ్వకర్మ" సంతానమే. వారి సంతానమంతయు "వైశ్వకర్మణులే" కదా! అట్లు ఋగ్వేదము చెప్పినదానికి భిన్నమైన పురాణ వాక్యములు ప్రమాణము లెట్లగును ? వేదము ననుసరించిన స్మృతి, పురాణాగమాదులకే ప్రామా

ణ్యము గాని అందుకు భిన్నమైనవాటికి ప్రామాణ్య మెట్లు? "యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అని ఋగ్వేదమును, "విశ్వకర్మాణంతే సప్త ఋషివంతం" అని అథర్వ వేదమును సప్త ఋషులు "విశ్వకర్మ సంతతి"యే అని చాటుచున్నవి కదా! సృష్టికి హేతువైన, అఖండ పరమాత్మ స్వరూపము ఒక్కటేకాగా దానినుండి కలిగిన ఆకాశాది భూతములును, రజ, స్సత్వ, తమోగుణములును ఒకే తీరువై యుండగా, వాటినుండి కలగిన సృష్టిని- విశ్వకర్మ సృష్టి ఒకటనియు, చతుర్ముఖ బ్రహ్మ (లేక కశ్యపుడు) నుండి కలిగిన సృష్టి వేఱొకటనియు, చెప్పుచూ ఒకే తత్త్వము నుండి కలిగిన మానవులలోనే నానా భేదముల నేర్పరచి తరతమ భావముతో వ్యవహరించు మానవుల భేద దృష్టిని ఏమనవలయునో తెలియకున్నది! అసలు ప్రాచీన సిద్ధాంతము ఇట్లుండెడిది కాదు. పురుష సూక్తము మానవులలోని అంతరములను వర్ణించినదేగాని, వారు పరస్పరము వేఱనిగాని, ఒకరితో మరొకరికి సంబంధ బాంధవ్యములు లేవనిగాని చెప్పలేదు. బ్రహ్మ నుండి పుట్టినవారందరును బ్రాహ్మణులే. అట్లే ఆ మూల తత్త్వమును "విశ్వకర్మ" పదములో పేర్కొన్నప్పుడు ఆతని నుండి కలగినవారందరూ "వైశ్వకర్మణు"లే కావలయును కదా! భూతములతో ఏర్పడిన సృష్టిని భౌతిక మన్నప్పుడు, బ్రహ్మసృష్టిని బ్రాహ్మము లేక బ్రాహ్మణము అనియు, "విశ్వకర్మ" సృష్టిని వైశ్వకర్మణ మనియు, విశ్వకర్మజమనియు అనుటలో దోషమేమున్నది. ప్రకృతి నుండి

కలిగినది ప్రాకృతమగుచున్నది గదా! కనుక ఇదంతయు భాష లోని శబ్దము నందు గల భేదమేగాని వస్తుగతమైనది కాదు. కనుక పంచార్షేయులను, సప్తార్షేయులను భిన్నముగా చూడ నవసరము లేదు. వేదములను బట్టి అందరును వైశ్వకర్మణులే. ఈ విషయము లన్నియు బ్రహ్మర్షి కీ. శే. యలవర్తి ఆంజ నేయ శాస్త్రిగారు సంపాదించి ప్రకటించిన "విశ్వబ్రహ్మోప నిషత్తు", "గోత్రకాండము" అనెడి గ్రంథములలో స్పష్టమగు చున్నవి. ఈ మను, మయాదులు 'పంచ బ్రహ్మలు' అనెడి పేర్లు కలవారు. వారినుండి ప్రజాసృష్టి కొనసాగినది. ఒక్కొ క్కరి నుండి ఐదైదుగురు ఋషులు కలిగిరి. సానగ ఋషి నుండి "ఉపసానగుడు, భరద్వాజుడు, కశ్యపుడు, మను విశ్వ కర్మ, విశ్వాత్మకుడు" అను నైదుగురు పుట్టినారు. ఇట్లనుట చేత సానగ ఋషి, లేక శివుడు, లేక మనుబ్రహ్మ అనువాని నుండి కశ్యపుడు కలిగినట్లు తెలియుచున్నది. కనుక కశ్యపు నికి "విశ్వకర్మ" సంబంధము లేకపోలేదు.

"విశ్వకర్మ" సంప్రదాయమున గల విశ్వబ్రహ్మోప నిషత్తు, శిల్పోపనిషత్తు, పంచబ్రహ్మోపనిషత్తులు చేసిన వర్ణనమే, స్కాంద, బ్రహ్మాండ, వసిష్ఠోప పురాణములలోను, ఆగ్నేయ, మత్స్య పురాణములలోను కాంచగలము. ఈరీతిగా కశ్యపునకు "విశ్వకర్మ"తోను, మనువని చెప్పదగిన "శివుని" తోనుసంబంధముండుటవలనే ఆతడు మహాశిల్ప ఋషి అగుట కును, కాశ్యప శిల్పాది గ్రంథములను వ్రాయుటకును, అందు వాటిలో శైవ సిద్ధాంత ప్రభావ శిల్పములనే చెప్పుట

కను సంభవము కలిగినది. "యత్తే శిల్పం కస్యప రోచనావత్" ఇత్యాది మంత్రములు కశ్యపునకు సంబంధించినట్టివి మదీయ శిల్పదర్శనములోను, విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగములోను కాంచగలరు. ఈ కశ్యప మహర్షి భువన మహర్షి పుత్రుడైన "భౌవన విశ్వకర్మ"కు సార్వభౌమ పట్టాభిషేకము చేసినాడనియు దానిచేత ఆ "భౌవనుడు" మహా ప్రభావ సంపన్నుడైనాడనియు, "ఐతరేయ బ్రాహ్మణ పంచిక" యనెడి గ్రంథము చెప్పుచున్నది.

"ఏతేన హా వా ఐంద్రేణ మహాభిషేకేణ కశ్యపో
విశ్వకర్మాణం భౌవన మభిషిషేచ. తస్మా దు
విశ్వకర్మా భౌవనః సమస్తం సర్వతః పృథివీం
జయన్ పరియా యాశ్వే రుచ మేధ్యేరీజే."

— (8 ఖండం-21, అ-4.)

తా : భువనుని యొక్క కుమారుడు భౌవనుడు. కశ్యపుడు "భౌవన విశ్వకర్మ"కు సర్వశ్రేష్ఠమగు సార్వభౌమ పట్టాభిషేకము చేసినాడు. దాని వలన ఆ "విశ్వకర్మ" చతుస్సముద్ర పరివేష్టిత భూమి నంతయు జయించి పాలించుటయేగాక అనేక అశ్వమేధ యజ్ఞములు కూడ చేసి ప్రకాశించినాడు.

"కశ్యపో యా స్వింద్రః" అనెడి మంత్రమునకు భాష్యము వ్రాయుచు హారదత్తాచార్యులు కశ్యప శబ్దమును ఇట్లు నిర్వచించినారు. "కశ్యప ఇత్యాదిత్య స్యాభిధానం. పశ్యతి సర్వమితి పశ్యః. పశ్య ఏవ పశ్యకః. తత్ర ఆద్యంత

వర్ణ విపర్యయేణ పశ్యకః కశ్యపో భవతి. కించ దృశ్యతే చారణ్యకే, పశ్యకః కశ్యపో భవతి యత్సర్వం పరిపశ్యతీతి" అనినారు. కశ్యపు డనగా ఆదిత్యుని పేరు. అంతటినీ చూచు వాడు పశ్యుడగుచున్నాడు. దానికి 'క' ప్రత్యయము చేరగా ('బాలుడు' బాలకుడైనట్లు) 'పశ్యుడు' 'పశ్యకు' డగును. మొదటి, చివరి అక్షరములు మారుటచేత 'పశ్యకుడు' 'కశ్యపు' డగుచున్నాడు. అంతటినీ చూచుట అనెడి పనిచేత 'పశ్యకుడే' 'కశ్యపు'డగుచున్నాడని సారాంశము. మరియు స్కాంద నాగరఖండము (అధ్యాయము-4, శ్లో-28) న "కశ్యపో, విశ్వకర్మాచ విశ్వలోక పితామహా" అని యున్నందున వారికిగల సంబంధము తెల్లమగుచున్నది. ఈ కశ్యప ప్రజాపతి మహా శిల్పాచార్యుడనియు, ఆతని శిల్పము చేతనే భూమికి, 'కాశ్యపి' అను పేరు కలిగినదనియు తెలియు చున్నది. కనుక కాశీ విద్వజ్జనులు తమ జాతి నిర్ణయ పత్ర ములో పేర్కొన్న 'కశ్యప బ్రహ్మ' "విశ్వకర్మ" సంబం ధియేగాని భిన్నుడు కాడని గ్రహింపవలయును.

జగమంతయు "విశ్వకర్మ మయమే" అని వేద ప్రమా ణములతో నిరూపించుచున్న మాకు "కశ్యపుడు" భిన్ను డెట్లు కాగలడు. కాశీ విద్వజ్జనులు "విశ్వకర్మ బ్రాహ్మణు" లకు యజన, అధ్యయన, దానములు కర్తవ్యము లనియు (ఆచరణీయము), ప్రజా పాలనాదులు వృత్తులనియు వ్రాసి నారు. అది సరికాదు. వైశ్వకర్మణులకు యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహము లనెడి ఆరు

కర్మలు ఆచరణీయములే. వృత్తులు- సానగాది గోత్రముల ననుసరించి అయో, దారు, తామ్ర, శిలా, స్వర్ణమయము లనునవి. అనగా కమ్మరము, వడ్రంగము, రాగిపని, శిలా శిల్పము, బంగారు పని అని స్కాందాది పురాణ ప్రమాణ ములతో మేము నిరూపించి యున్నాము. కాశీ విద్వజ్జనులు యజ నాది త్రయమే అనగా యజన,అధ్యయన, దానములే (వేదము చదువుట, వేద కర్మల నాచరించుట, దానమిచ్చుట ఈ మూడే) కర్తవ్యము లనినారు. అదికూడ సరికాదు. ఈ పంచార్షేయులకు వేదము చెప్పుటకు, దానము స్వీకరించుటకు (ప్రతి గ్రహము) కూడ అధికారమున్నది. అనగా షట్క ర్మాధికారము కలదన్నమాట. ఇది ఈనాడు తెచ్చిపెట్టు కున్నది కాదు. వీరి పూర్వులైన ఋషులకు, బ్రహ్మలకు కూడ కలిగినట్టిదే.

"విశ్వకర్మ" కుమారుడు త్వష్టబ్రహ్మ కదా! ఆయన పుత్రుడే విశ్వరూపాచార్యుడు. ఆ విశ్వరూపుడు దేవేంద్రునికి పురోహితుడై ప్రకాశించెను. ఈ విషయమే యజుర్వేదమున "విశ్వరూపోవై త్వాష్ట్రః పురోహితో దేవానా మాసీత్" విశ్వరూపుడు దేవతలకు పురోహితుడై యుండెను. ఆ వంశమున పుట్టిన పంచార్షేయులకు పౌరో హిత్యము- అనగా వేదకర్మలను ఇతరులచేత ఆచరింప చేయుట, పరంపరగా వచ్చినట్టిదే. కనుక కాశీ విద్వజ్జనుల భావము సరికాదంటిని. అంతియేకాక బృహదారణ్యకోప నిషత్తు నందలి 4వ అధ్యాయమున గల బ్రహ్మవిద్యాచార్య

లలో సానగ, సనాతనులు, త్వష్ట్ర, విశ్వరూపాదులు స్పష్టముగా అగుపడుచున్నారు. అదృష్టవశమున మన పుణ్యాత్ములు ఆ భాగమును తొలగింపలేదు. ఈనాడు ప్రతి పాఠకుడును దానిని చదువుకొని సత్యమును గ్రహింపవచ్చును. "విశ్వకర్మ" మొట్టమొదటి బ్రహ్మ విద్యోపదేష్ట అనియు, ఆవల "విశ్వరూపుడు" మాధ్యముడనియు సద్గురు పరంపరా ధ్యాన శ్లోకమును బట్టియు తెలియుచున్నది:

"విశ్వకర్మ సమారంభాం, విశ్వరూపార్య మధ్యమాం,
అస్మదాచార్య పర్యన్తాం, వందే గురు పరంపరామ్."

విశ్వరూపుని విషయము మిత్రసాహస్రిలో ఇట్లు ప్రస్తావింపబడినది.

"త్వాష్ట్ర విశ్వరూప తత్త్వజ్ఞు డింద్ర పు
రోహితత్త్వమున నిరూఢుడగుచు
అత్మసుతుల కొసగె నా పురోహిత పద
గౌరవంబు- శ్రుతులఁ గాంచు మిత్ర!" — 857

"అల బృహస్పతియును, ఆ విశ్వరూపుండు
శిష్ట శిల్పులగుట జేసి కాదె
దేవగురువులైరి; తెలియక శిల్పంబు
గురుత నంద కొంపకూలు, మిత్ర!" — 859

బృహస్పతి 'శిల్పాచార్యుడు' కాదనుకొందురేమో, పంచ సంకృతులలో బృహస్పతి కూడ ఉండుటకు "స ప్రథమ ... శ్చికిత్వాన్" అను మంత్రమే నిదర్శనము. (ఈ గ్రంథము

52వ పుటలో విశదముగా వ్రాయబడినది.) ఒక్క బృహస్ప తియే యేమి ? వసిష్ఠ, విశ్వామిత్ర, భరద్వాజాదులు, భృగు, అంగిరః ప్రభృతులు కూడ మహాశిల్పులే. వారెన్నో శిల్ప గ్రంథములు వ్రాసినారు. గ్రంథములు వ్రాసినారే గాని, శిల్పము చేయలేదు అనుటకు వీలులేదు. శిల్పమనునది ఆచరణపూర్వక విద్యగాని, మాటలతో మాత్రమే అగునది కాదు. చేయగలవాడు మాత్రమే వ్రాయగల్గును. ఈ సంద ర్భమున మత్స్య పురాణము పేర్కొన్న 18 శిల్పాచార్యు లను మఱువరాదు.

18. శిల్ప విశారదులు :

భృగు, రత్రి, ర్వసిష్ఠశ్చ, విశ్వకర్మా, మయ స్తథా,
నారదో, నగ్నజిచ్చైవ, విశాలాక్షం, పురందరః,
బ్రహ్మా, కుమారో, నందీశః, శౌనకో, గర్గ ఏవచ,
వాసుదేవోఽనిరుద్ధశ్చ, తథా శుక్ర బృహస్పతీ.
అష్టాదశై తే విఖ్యాతా శ్శిల్ప శాస్త్రోపదేశకాః.
— (మత్స్య పురాణం- 250 అధ్యాయం)

వీరేకాక మఱికొందఱు శిల్పాచార్యులు గార్గేయా గమములో పేర్కొనబడినారు. (చూడుము. శిల్పదర్శనం)

రథకారులు కూడ అబ్రాహ్మణులని ఆధునిక గ్రంథము లలో వ్రాయబడినది. అదికూడ క్షమింపరాని దోషమే (తప్పు). "విశ్వకర్మ" సర్వజీవులకు శరీరములను నిర్మించెడి రథకారుడు. అనగా శరీరమనెడి రథమును చేసెడి శిల్పి

అన్నమాట. శరీరము రథమను విషయము కఠోపనిషత్తులో ఇట్లు ప్రస్తావింపబడినది.

"ఆత్మానం రథినం విద్ధి, శరీరం రథమేవచ
బుద్ధింతు సారథిమ్ విద్ధి, మనః ప్రగ్రహమేవచ
ఇంద్రియాణి హయానాహుః ర్విషయాం స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తే త్యాహు ర్మనీషిణః."

తా॥ జీవుడే రథికుడు. అనగా రథము నెక్కి ప్రయాణించువాడు. శరీరమే రథము. బుద్ధియే ఆ రథమును నడపు సారథి. మనస్సే పగ్గము. కన్ను, ముక్కు, చెవి, కాలు, సేతులు మొదలగు ఇంద్రియములే గుఱ్ఱములు. ఈ ఇంద్రియములు సంచరించెడి ప్రదేశములే అనగా ఇంద్రియ విషయములే సంచార ప్రదేశములు. ఇట్లు ఇంద్రియముల తోను, మనోబుద్ధులతోను కూడుకొని శరీర రథము నెక్కి తిరుగు జీవుడే పుణ్య పాపకర్మల ననుభవించు భోక్త. ఈ వర్ణనమును బట్టి శరీరము రథమని తేలుచున్నది కదా! ఆ శరీర రథమును నిర్మించిన భగవంతుడు రథకారుడు కాదా! కనుక రథకారు డనగా "విశ్వకర్మ" యని తేలుచున్నది. ఆయన సంతానమైన సానగ, సనాతనాదులు, వారి సంతతి యైన "పంచార్షేయ బ్రాహ్మణులు" శిల్పములు చేయు చున్నారు గాన వేదానుసారముగా వారు రథకారులు కూడ కావచ్చును. అగుదురు. ఐనారు. ఇట్టి స్థితిలో కొన్ని గ్రంథ ములలోని ప్రక్షిప్త శ్లోకములు వారిని "సంకరులనియు",

"సంకీర్ణు లనియు" నిందించి వ్రాసినవి. ఈ విషయమును మిత్రసాహస్రి ఇట్లు ప్రస్తావించినది.

"రథము చేయువాని రథకారు డందురు,
తను రథములచేయు ధాత యెన్న
ప్రథముడైన పూజ్య రథకారుడగుఁ గాదె!
విశ్వహిత చరిత్ర, వినుర మిత్ర! — 905

"విశ్వకర్మ మొదటి శాశ్వత రథకారు
డతని సుతులు సృష్టి ననుకరించి,
తాల్చినారు పేరు ధరణిలో రథకారు
లనుచు, సత్యమెరుగ నగును మిత్ర!" — 907

"సత్య మిట్టులుండ సంకరుల్ రథకారు
లనుచు వ్రాసినార లణప వారి;
వేదములను వీరు విశ్వజనీనులై
సంస్తుతింపబడిరి చదువు మిత్ర!" — 909

"భృగువు లెన్నబడిరి తగ రథకారులు
కాగ, సానగాది గణము నట్లె
అయిరి రథకరులుగ అవ్వారి సూనులు
కారె రథకరులుగ ? కాంచు మిత్ర!" — 910

సృష్టికర్త శిల్పి అను విషయమును ఋగ్వేదములోని బ్రహ్మాణస్పతి అను మంత్రము చెప్పుచున్నది. (చూడుము. పుటలు-270, 205)

ఇందు భగవంతుని కర్మారుడని చెప్పుట ఆయన

లోకములను 'అధమత్' అని వచించుట శిల్ప ప్రాధాన్య మునే సూచించుచున్నవి. ధమత్ మనగా 'ఊదుట' అని అర్థము. అధమత్ అనగా ఊది చేసినాడు అని భావము. శిల్పి లోహములను కొలిమిలో కరగనూది వస్తువులను చేయునట్లు భగవంతు డీ జగములను సృష్టించినాడని భావము. 'కర్మార' శబ్దము ప్రకృతి. దానియొక్క వికృతియే కమ్మరి. వేద మీ రీతిగా భగవంతుని "కమ్మరి" యని, "రథకారుడు" అని, "విశ్వకర్మ" అని చెప్పి తన శిల్పకర్మాభిమానమును వెల్లడించుట ప్రతివారును గమనింపవలసియున్నది. సంకృతి పదమునకు కూడ 'శిల్పాచార్యుడ'నియే అర్థము. అనగా యోగ్యమైన శిల్పకర్మ ద్వారా వస్తువులను సృష్టించువాడని భావము. ఇట్టి భావములు విజ్ఞులైనవారు పలుతావుల కాంచవచ్చును. విస్తర భయమున ఉదాహరింపజాలకున్నాము. వైశ్వకర్మణులకే వేదమును చదివెడి, శిల్పమున్ను చేసెడి అధికారము కలదనుట మా యభిప్రాయము కాదు. బుద్ధి పాటవము, చేతినేర్పు, గల సత్పురుషు లెవరైననూ వాటిని అనుష్ఠింపవచ్చును. ఈ భావమును మా మిత్రసాహసి ఇట్లు చెప్పినది.

"వర్ణ భేద బుద్ధి వర్ధిల్లిన దినాల
శ్రుతి కనర్హమనెరి శూద్ర జాతి;
ఇట్టి స్వార్థపరత యెంత విగర్హ్యమో!
విశ్వహిత చరిత్ర వినర మిత్ర!" — 900

వేద దృష్టిలో అందఱును బ్రాహ్మణులగుటకు అవ

కాశ మున్నది. ఆ వేద మార్గమునే సానగాది ఋషులును, వారి సంతానమైన పంచార్షేయులును అనుసరించినారు.

"సర్వమానవులను సద్బ్రాహ్మణుల చేయ
బూనినట్టి ఋషులు సానగాదు
లగుట వారిత్రోవ నణచి రాధునికులు;
విశ్వహిత చరిత్ర వినర మిత్ర!" — 899

ఒకసారి సప్తఋషులు, మయబ్రహ్మ చేత బ్రాహ్మణత్వ రహితులై పోవునట్లు శపింపబడగా వారికి మరల "విశ్వకర్మ" చేత బ్రాహ్మణత్వ మొసగబడినది. ఈ విషయమునే విశ్వకర్మ సూక్తము "తేషా మిష్టాని సమిషా మదన్తి యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః" అను వాక్యమున "విశ్వకర్మ" సప్త ఋషులను అనుగ్రహింపగా వారు హర్షించినారని (తే మదన్తి) చెప్పినది. ఈ అంశము మిత్రసాహస్రిలో ఈరీతిగా పూర్వాధునిక విషయముల ననుసరించి చెప్పబడినది.

"విశ్వకర్మ దొట్టి విబుధులు తద్వంశ్యు
లిచ్చినారు బ్రాహ్మ్య మెందఱికినో;
సానగాద్యనాది సంయముల్ తొల్లింటి
గురుగణంబు సుమ్మో పరమ మిత్ర!" — 901

"శాపతప్తులైన సప్తర్షులకు బ్రాహ్మ్య
మొసగి విశ్వకర్మ ఉద్ధరించె;
వరలు నీ చరిత్ర వైవస్వత పురాణ
భాగమందు కనవె! పరమ మిత్ర!" — 902

అథర్వ వేదము నందలి పృథివీ సూక్తము వైశ్వకర్మణుల యొక్క యజ్ఞకార్య నిర్వహణమును ఎట్లు నిరూపించినదో 45- 48 పుటలలో కాంచవచ్చును.

## బ్రాహ్మణుల లక్షణములు - భగవద్గీత :

శ్లో. "శమో దమ స్తపశ్శౌచం క్షాంతి రార్జవ మేవచ,
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్."
— (భగవద్గీత 18-42)

తా : శమము, దమము, తపస్సు, క్షాంతి, ఆర్జవము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము అనునవి బ్రాహ్మణునికి జన్మతో వచ్చు గుణములని భావము. ఇందలి 'జ్ఞానము'ను మోక్ష విషయమైన బుద్ధియనియు, 'విజ్ఞానము'ను శిల్పము నందు, శాస్త్రమునందు ప్రావీణ్యముండుట అనియు అమర కోశము చెప్పినది. కాగా జ్ఞానమనగా వేద శాస్త్రాదుల పరిజ్ఞానమనియు, విజ్ఞానమనగా శిల్పమునందలి, సైన్సు నందలి, పరిజ్ఞాన ప్రావీణ్యములనియు తేలుచున్నది.

"మోక్షే ధీర్ జ్ఞాన మన్యత్ర విజ్ఞానమ్ శిల్ప శాస్త్రయోః" కనుక బ్రాహ్మణుడైనవానికి వేదవేదాంత జ్ఞానముతోపాటు శిల్పములు చేయు సామర్థ్యమును ఉండవలెనని తెలియుచున్నది. అట్లున్ననే కాని అతడు పూర్ణ బ్రాహ్మణుడు కాజాలడు. దీనినిబట్టి చూడగ పంచార్షేయులకు (విశ్వబ్రాహ్మణులకు) వేద పరిజ్ఞానము, శిల్ప ప్రావీణ్యము రెండూ ఉండుటవలన వారు పూర్ణ బ్రాహ్మణులని తేలుచున్నది. కావుననే మహాభారతము- "శిల్ప మధ్యయనం నామ వృత్తం బ్రాహ్మణ లక్షణమ్." శిల్పము చేయుట,

వేదాధ్యయనము అనునవి బ్రాహ్మణునకు ముఖ్య లక్షణము లన్నది. ఈ విషయమే "మిత్ర సాహస్రి" ఇట్లు గానము చేడినది :

"శిల్ప మింత యేని చేయక, జ్ఞానంబు
పడయ కెవడు గాడు బ్రాహ్మణుండు;
అట్టులైన గీత అనృతమాడిన యట్లె!
విశ్వహిత చరిత్ర వినర మిత్ర!" — 890

సృష్టికర్తయే శిల్పి కాగా, అతని సుతులు శిల్పము చేయక బ్రాహ్మణు లెట్లగుదురు!

"బ్రహ్మ, సృష్టికర్మ పలురీతుల నొనర్ప,
వాని సుతులు వివిధ వస్తువులను
సృష్టి చేయకెట్లు చెప్పికొందురు "మేము
బ్రాహ్మణుల" మటంచు పరమ మిత్ర!" — 891

"సానగాది పంచసంయముల్ విజ్ఞాన
మునకు, జ్ఞానమునకు పొత్తు గూర్చి,
ఇహపరముల రెంటి కిల సేతువొనరించి
మంచి త్రోవ చూపి రెంచు మిత్ర!" — 892

వేదము చదువుటకు ద్విజులు మాత్రమే అర్హులనుట కూడ గ్రంథకర్తకు ఇష్టము కాదు. ఆ విషయమునే యిట్లు చెప్పినాడు.

"వేద మంత్రరాశి, విజ్ఞానమును, జ్ఞాన
మైనయెడల దాని నధిగమింప,
చదువు, ప్రజ్ఞ యున్న సర్వులర్హు లటంచు
పూర్వఋషులు చెప్పి పోరె! మిత్ర!" — 893

# పంచాననులు - చారిత్రక దృష్టి

ఇంతవరకు మనము పంచర్షులను, పంచార్షేయులను గూర్చి వేద, శాస్త్ర, పురాణాది ప్రమాణములతో కొంత తెలిసికొన్నాము. ఇప్పుడు చరిత్రకారుల దృష్టితో వారి స్థానము ఏ విధముగా నున్నదో పరికించి చూతము. "చరిత్ర చతురానన" బిరుదు కలవారును, తొలిగా ఆంధ్రుల చరిత్రను వ్రాసిన మహనీయులును అగు కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారు 1934 సం॥ ఫిబ్రవరి నెల 'భారతి' పత్రికలో "హరిజనులు హిందువులు కారా, మహాత్ముడు హిందువు కాడా?" అను పేరుతో వ్రాసిన వ్యాసము లోని కొన్ని భాగములను పరిశీలింతము.

" ... ఇటీవల పంజాబు దేశమునందు మొహంజోదరో, హరప్పా ప్రదేశములలో నూతనముగా బయల్పడిన నగరములలో కన్పట్టెడి వేలకొలది సంవత్సరములనాటి విజ్ఞాన నాగరికతా సూచకములగు వస్తువిశేషములకు కర్తలుగా నున్న ప్రజలు "ఏ జాతి వారికి సంబంధించినవారు? వారి మతమేమి?" అను ప్రశ్నములు పుట్టగా, పురాతన వస్తు పరిశోధకులైన పండితులు పెక్కండ్రు చర్చించుచు ఇది మిథ్యమని నిర్ణయింపజాలక పత్రికల ద్వారా తమ వాదముల బలాబలములను ప్రకటించి నిరూపించుకొనుచున్నారు.

"మొట్టమొదట భూమండలమున బుట్టిన 'భూతజాతి' అణ్డభూతజాతివారని ఎల్లరెరుంగుదురు. ఈ భూతజాతియే

ప్రపంచమంతయు చాలకాలము వ్యాపించియుండెనని ఎఱుంగనగును. ఈ భూతజాతి అనేక శాఖలతో కూడుకొని యుండి కాలక్రమమున "అణ్ణు భూతజాతి"గా పరిణామమును గాంచియున్నది. అణ్ణ భూతజాతులలో ఎన్ని శాఖలుగలవో, వీనిలో కూడ అన్ని శాఖలు గలవనియే విశ్వసింపదగును. నవీన శిలాయుగమును (NEOLITHIC AGE) కూడ గడచిన వెనుక, అనగా ఇప్పటికి దాదాపు 10,000 సం॥లకు పూర్వమే, లోహములను కనిపెట్టగలిగి రాళ్ళతోను, రప్పలతోను తమకు కావలసిన గృహోపకరణాది వస్తు సామగ్రిని నిర్మాణము చేసికొనుటకు మాఱుగా ఇనుము, రాగి, కంచు మొదలగు లోహములతో నిర్మాణము చేసికొనుటకు మొదలుపెట్టి యుందురని ఊహింప అవకాశము కలదు. ఈ కాలమును లోహ యుగమని చెప్పదగును. ఈ కాలమున హిందూదేశము లోని ముఖ్య నదులు- అనగా సైంధు, కావేరి, కృష్ణ, గోదావరి, మహానది, నర్మద, సబర్మతి, యమున, గంగ, సింధునదీ తీరములందు అసంఖ్యాక జనములు ఇప్పటివలెనే నివసించుచుండిరను మాట మఱువరాదు. ఈ 'అణ్ణులను'వారు సింధునది యొక్క ఉపశాఖలగు పంచనదీ మధ్య ప్రదేశములందు నివసించినవారగుటచేతనో, అయిదు వేర్వేఱు వృత్తులను అభ్యసించిన వారగుటచేతనో, వేర్వేఱు ప్రదేశములందుండి, వేర్వేఱు భాషలను మాట్లాడుచు ఒకే ప్రదేశమునకు వచ్చి, వేర్వేఱు శాఖలవారుగ

నివసించుటచేతనో, వీరలకు "పంచాణ్ణు" లను పేరు వచ్చి యుండును. వీరా ప్రాంతముల యందు నివసించుచుండిన కాలమున వీరినుండియే పరిణామము చెందిన అరయణ్ణుల తోడ సమ్మేళనము చెందిన వెనుక "పంచాలురు" అను పేర వ్యవహరింపబడి యుందురు. అత్యంత ప్రాచీన కాలముననే హిందూ దేశములో నాగరికతా విజ్ఞానమును అలవఱచుకొని సుప్రసిద్ధిని గాంచిన వారిలో ఈ "పంచాణ్ణు" లనువారినే తొలుదొల్త ప్రశంసింపవలసి యుండును.

"ఆంధ్ర దేశములో నేటి కాలమున వడ్రము, కమ్మరము, కంచరము, కాశి, స్వర్ణకార- పనులు చేయువారిని "పంచాణ్ణము" వారని వ్యవహరించుట చిరకాలము నుండి పారంపర్యముగా వచ్చుచున్న సంప్రదాయము నెవ్వరును మఱువరాదు. ఈ తెగలవారు తాము "విశ్వకర్మ సంభూతులము" అనియు, విశ్వకర్మ పంచశిరస్కుడు కావున "పాంచాననవారము" అనియు చెప్పుకొనుటయేగాక, గ్రంథ దృష్టాంతములతో నిరూపించుకొనుచున్నారు.

ఆర్ష విజ్ఞానమనునది వీరినుండియే మొలకెత్తినటుల కన్పట్టుచున్నది గావున "పంచాణ్ణ" శబ్దము వీరి పూర్వులు వహించిన ప్రాచీన జాతి శాఖానామమును తెల్పునదియై యుండెననుటకు సంశయింపనక్కరలేదు. శివునకు "పంచాననుడ"ను నామాంతరము కలదు. బ్రహ్మకు కూడ 5 శిరస్సులుండెను కాని, తదనంతరము 5వ శిరస్సును హరుడు హరించుట జేసి చతుర్ముఖ బ్రహ్మ అయ్యెను. ఈ పంచవిధ

శిల్పుల చరిత్రము స్కాంద పురాణమున నాగర ఖండములో వివరముగా విస్తరింపబడినది. "విశ్వకర్మ" దేవతల శిల్పిగా వర్ణింపబడెను. వీనికి మనువు, మయుడు, త్వష్ట, శిల్పి, తక్షుడు-లేక దైవజ్ఞుడు అను ఐదుగురు పుత్రులు గలరు. కమ్మరపు పనులు చేయుట యందు మనువు, వడ్రపుంబనులు చేయుటయందు మయుడు, కంచరపు పనులు చేయుట యందు త్వష్టయు, రాతి పనులు చేయుటయందు శిల్పియు, వెండి, బంగారపు పనులు చేయుటయందు దైవజ్ఞుడును ప్రఖ్యాతి కెక్కినవారగుటచేత, ఈ 5గురను లోక కార్యములు నిర్వహింప "విశ్వకర్మ" నియమించెను. ఈ శిల్ప విజ్ఞానము పూర్వకాలమున ప్రపంచమున కంతటికీ వ్యాపించినట్లుగా హైందవ వాఙ్మయము వేనోళ్ళ చాటుచున్నది. "విశ్వకర్మ" దేవతల శిల్పి, "మయుడు" దానవుల శిల్పి అని హైందవ వాఙ్మయమున కన్పట్టుటచేత దేవదానవ భేదము కూడ ఆ కాలమున అంతగా పాటింపని హైందవజాతి పూర్వులనియే వీరిని మనము నిశ్చయింపవచ్చును. దేవదానవులకు తల్లులు వేరుగా చెప్పబడినను, తండ్రి ఒక్కడే. ఆతడే కదా కశ్యప ప్రజాపతి. దక్షిణాపథవాసులు మయ శిల్పమును విశ్వకర్మ శిల్పముతో జోడించుట గమనింపదగిన విషయము.

తొలుదొల్త 'ఆండి భూతముకు' ఆదిశక్తిగను, 'అణ్ణాండిస' ఆదిపురుషునిగను భావించి పూజించు భావము ఈ పంచాణ్ణుల నుండియే మొలకెత్తినది. ఈ ఆది పురుషుడైన 'అణ్ణాండిని' అనంతుడని తరువాతివారు భావకల్పన చేసి

నారు. అణ్ణా+అండ=అణ్ణాండ అగుచున్నది. "అణ్ణాండ, అణ్ణాంద, అణ్ణాంత, అనంత" అనునది శబ్ద పరిణామము. అనంతుడు చావులేనివాడు. అణ్ణాండులు తమ జన్మ స్థాన మెచ్చటనో తెలిసికొ్న సాధ్యముకానంతగా భూమండలమున సర్వత్రా వ్యాప్తికాంచి యుండుటచేత అనంతుని కూడ మనవారు అంతము లేనివానిగా భావించి ఆ శబ్దమును సంస్కృత భాషలోనికి గైకొని ఆదిదేవు (అణ్ణి దేవు) నకు పర్యాయ పదముగా వాడినారు. పురాణాది గ్రంథముల మాట అటుండ నిచ్చినను ఇటీవలి నిఘంటుకారులు కూడ 'అనంతుడు' విష్ణువని వక్కాణించిరి. అనంతుడనగా పురాణములలో శివుడని కూడ చెప్పిరి. అథర్వణోపనిషత్తులో రుద్రునకు కూడ అనంతనామము వాడబడినది. అనంతుడు-విశ్వంభరుడగుట వలన విష్ణువని భావించినట్లుగాను, విశ్వనాథుడగుటవలన శివుడని భావించినట్లుగాను, పంచాణ్ణులు "అనంతుని" పంచాననునిగా చేసి "విశ్వకర్మ లేక విశ్వబ్రహ్మ"గా భావించుటలో ఆశ్చర్యమేమి యుండును. ఈ "అనంతుడే" పురుష సూక్తములో సహస్ర శీర్షములు, సహస్రాక్షులు, సహస్ర పాదములు గల విరాట్పురుషుడుగా వర్ణింపబడి యున్నారు. ఇయ్యది తరువాతి భావకల్పనము.

"ఆ కాలమునందు శైవ, వైష్ణవ భేదములు లేవు. అవి తరువాతి భావకల్పనలు. "పంచాణ్ణులు" మొట్టమొదట సింధునదీ తీరమునందు వర్థిల్లుచుండిన కాలమున 5 మోములు గల అనంతునే ఆరాధించుచుండిరి. తరువాత

"సుమేరియా" రాష్ట్ర ప్రజలతో సంబంధ మేర్పడిన వెనుకనే అనంతుని "పంచాననుని"గను, "విశ్వకర్మ"గను నిరూపించి ఆరాధింప దొడగిరని ఊహింపదగును. ఇట్టి ఊహకు కారణ మేమనగా. స్కాంద పురాణములోని నాగర ఖండమున ద్వితీయాశ్వాసమున నారదుఁడు మేరుదక్షిణ దిగ్భాగంబున "విశ్వకర్మ"ను చూచి బహుకాల మచ్చట ఉండి, అతని సామర్థ్యాతిశయమంతయు గార్గేయ మహాముని వలన పండ్రెండు లక్షల, పదమూడు వేల (12, 13, 000) గ్రంథ సంఖ్య గల "విశ్వకర్మ పురాణము" వినుటయు, అది ఆ యా లోకములలో నున్న సంఖ్యా ప్రకారంబును, "విశ్వకర్మ" ముఖాద్యవయవముల నుండి పాద్మము మొదలగు అష్టాదశ పురాణోత్పత్తి ప్రకార కథనమును ఎఱింగించి చనుట గూర్చి సూతునకు చెప్పగా ఆతఁడు శౌనకాది మహర్షులకు చెప్పినట్లు చెప్పబడియుండుటయే గాని అన్యము గాదు. దేవభాషలో మాత్రమే ప్రజలను "విశు"లనిరి. కనుక "విశ్వకర్మ" శబ్దము నకు కూడ ఆ భాష మొలకెత్తిన తరువాతనే ప్రచారము కలిగియుండును. ఈ కాలము మనము తలంచు పంచాణ్ణుల కాలమునాటిది కాదు. నేను ప్రసంగించెడి కాలము "మొహంజోదరో-హారప్పా"లలో ప్రప్రథమమున నిర్మింప బడిన నగరములనాటి కాలము.

"పంచాణ్ణుళ్ళు తమ నాగరికతా విజ్ఞానములను విస్తరింప చేయుచుండ, కొంత కాలమునకు మధ్యాసియా ఖండము నందలి తఖ్కులనువారు, వారి విజ్ఞాన నాగరికతలతో

కూడ వీరితో సమ్మేళనము చెందిరి. ఈ పంచాణ్ణులు సప్త సింధు ప్రదేశమున మొదట ఈ తక్షులతో ఐక్యమైపోయిన వెనుకనే "పంచకృషు"లని వేదములో వ్యవహరింపబడిరి. ఆ ప్రదేశమునందే వీరు నిర్మాణము గావించిన తక్షశిలా నగరము యొక్క ప్రఖ్యాతి ప్రపంచమంతటను వ్యాపించినది.

"వీరు పంచాణు లనెడి తెగలవారి నుండి, సప్త సింధు ప్రదేశముల నుండి పోయి నాగరికతా విజ్ఞానములను పొంది పై ప్రదేశములందు నివసించుచుండిన వారనియే పెక్కు ప్రమాణ దృష్టాంతములతో నిరూపింపవచ్చును. వీరే వేదములలో "పంచజను"లని వ్యవహరింపబడిరి. మన పురాణేతిహాసములలో వీరినే యయాతి మహారాజు కొడుకులైన "యదు, తుర్వసు, ద్రుహ్యా, అను" పూరులనుగా మనవారు చెప్పియున్నారు. సప్తసింధు తీరము లందుండెడి దస్యులు, పంచజనులతో సమ్మేళనము చెందినవెనుకనే "పాంచాలురు" అనికూడ బ్రాహ్మణాది గ్రంథములందు వ్యవహరింపబడియున్నారు. అనగా పంచాణు లనువారు పూరులతో చేరినవారు 'పాంచాలుర'నియు, హరూఖు ప్రజలతో సమ్మేళనము చెందినవారు 'కురుప్రజలు'గాను, రెండు విభాగములుగా ఏర్పడి "కురు పాంచాలు" రని వ్యవహరింపబడినారు."

శ్రీ వీరభద్రరావుగారి ఈ వ్యాసము గాఢ పరిశోధనతో కూడినదిగాని, సామాన్యమైనది గాదు. నేను వేద శాస్త్రాది ప్రమాణములను చూపి,"పంచఋషుల లేక పంచాననుల లేక పంచార్షేయుల" ఉదంతమును నిరూపించినట్లే

వారుకూడ సత్యమైన చారిత్రకోపపత్తులను చూపి యున్నారు. యదు. తుర్వసు, ద్రుహ్యు, అను, పూరులు పిమ్మట "పంచజనులు"గా భావింపబడినారనుటకు వేదము లోనే ఆధారము కలదు.

"య దింద్రాగ్నీ యదుషు, తుర్వశేషు,
యత్ ద్రుహ్యు, ష్వనుషు, పూరుషుస్థః."
— (ఋ. 1-108-8)

ఈ మంత్రము నందు యదువులు, తుర్వశులు, ద్రుహ్యులు, అనువులు, పూరులు అను 5 తరగతుల జనులు పేర్కొనబడియున్నారు. వీరినే "పంచజను"లని ఈ మంత్రము వ్యవహరించినది. కాని యజుర్వేదము వరుసగా పేర్కొనిన సానగ, సనాతన, అహంభూన, ప్రత్న, సుపర్ణ లనువారిని అంతకు పూర్వము "పంచజను"లని, "పంచ కృష్టు" లని వ్యవహరించినట్లు వేదమున మంత్రరూప సాక్ష్యము లున్నవి. అథర్వ వేదము ఆ విషయములను కూడ ప్రస్తావించినది. ఈ విస్తరమును ఋగ్వేద దిగ్దర్శనమున విశే షముగా కాంచవచ్చును.

శ్రీ వీరభద్రరావుగారు వేదము లందలి విశ్వకర్మ సూక్తములను, సానగాదుల మంత్రములను చూచి యున్నచో, ఇంకా అనేక రహస్యములు మనకు అందించెడి వారు. ఈ సానగాది పంచ ఋషులే- మను, మయాది పంచ బ్రహ్మలని, బ్రహ్మ-విష్ణు-రుద్రాది పంచమూర్తులని తెలిసి కొని యున్నాము.

# విశ్వకర్మ తత్త్వము - గీత

జగత్కారణుడైన "విశ్వకర్మ భగవాను"ని పరమ తత్త్వము వేదములలో పరిపూర్ణముగా ఉన్నదని మన వేద దర్శనములు ప్రతిపాదించుచున్నవి. ఈ తత్త్వము నాసదీయ సూక్తముతో ప్రారంభమై విశ్వకర్మ, పురుష, మోక్ష సూక్తములతో కొనసాగుచున్నది. దీనిని ఉపనిషత్తులు విస్తరించినవి. వేదములు జగత్కారణమును "విశ్వకర్మ" శబ్దముతోను, "పురుష" శబ్దముతోను పేర్కొనగా ఉపనిషత్తులు "బ్రహ్మ" శబ్దముతో దానిని వచించినవి. పరిశీలించి చూచిన "బ్రహ్మ-విశ్వకర్మ" లకు భేదము గోచరింపదు. 'బ్రహ్మ' శబ్దము నపుంసక లింగమై జగత్కారణమును చెప్పగా "పురుష, విశ్వకర్మ" శబ్దములు పుంలింగములో ఉండి జగత్కారణమును చెప్పుచున్నది. భగవద్గీత ఈ బ్రహ్మతత్త్వమునే విస్తరించుచున్నది. బ్రహ్మతత్త్వము గాని, విశ్వకర్మ తత్త్వముగాని భిన్నములు కావని మనము గ్రహించియే యున్నాము. మన దర్శనములలో పెక్కుతావుల ఆ రెండు శబ్దములకు గల సాదృశ్యమును వివరించుచునే యున్నాము. గీతార్థమును బోధించినవాడు కృష్ణభగవానుడని కదా! ఆయన విష్ణుని అవతార మనుచున్నారు. ఈ "విష్ణు-విశ్వకర్మ"లకు అభేదమును, ఐక్యమును మన దర్శనములు వాకొనుచునే యున్నవి. "కృష్ణ, విష్ణు" శబ్దములు కాని "భగవత్" శబ్దముకాని పుంలింగములో ఉండి జగ

త్కారణత్త్వమును వచించుట మరువరాదు. "విశ్వకర్మ సూక్తము" లోని, తదితర వేద, ఉపనిషత్తుల లోని తాత్త్విక భావములనే "భగవద్గీత" కూడ చెప్పుచుండుట మన మీ అధ్యాయమున గమనింపగలము.

విశ్వకర్మ సూక్తము "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః, పరమచ్ఛదోవర ఆవివేశ" అన్నది. అనగా ఆ "విశ్వకర్మ"యే చరాచరోపాధులను సృష్టించి వాటి హృదయము లందు జీవ రూపుడై (ఆత్మయై) ప్రవేశించినాడని భావము. ఈ భావ మును "భగవద్గీత" ఇట్లు పేర్కొన్నది :-

"అహ మాత్మా గుడాకేశ, సర్వభూతాశయ స్థితః,
అహ మాదిశ్చ, మధ్యం చ, భూతానా మంత ఏవ చ."
— (10-20)

తా : ఓ అర్జునా! నేను అన్ని భూతముల హృద యము లందున్న ఆత్మనే సుమా. అంతేకాదు. ఆ భూతముల యొక్క ఆదిని, మధ్యమును, అంతమును కూడ నేనే.

శ్లో॥ "క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత"
— (13-3)

తా॥ సర్వ శరీరముల యందును గల జీవస్వరూప క్షేత్రజ్ఞుడను నేనే. ఇట్లనుటచేత "విశ్వకర్మ సూక్తము" చెప్పిన అద్వైత భావమే గీత అనువదించినది. ఇది జీవే శ్వరుల యొక్క ఐక్యమును చాటెడి వాక్యము. ఈ శరీరము క్షేత్రమనియు, దీనియందుండి దీనిని తెలిసికొనువాడు

క్షేత్రజ్ఞుడనియు 13వ అధ్యాయములోని మొదటి శ్లోకము చెప్పినది. ఇంకొక శ్లోకము "సర్వస్య చాహం హృది సన్ని విష్టః" — (15-15). నేను అందరి హృదయములలో ఉన్నాను- అన్నది. ఇంకొక శ్లోకమేమో హృదయము నం దున్న ఈశ్వరుని గూర్చి ఇట్లు చెప్పినది. "ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి" —(18-61). ఈశ్వరుడు ఎల్లభూతముల యొక్క హృదయము లందు కలడు అన్నది. ఈ అంశమును విశ్వకర్మ సూక్తము "పరో దివా పర ఏనా పృథివ్యా పరో దేవేభి రసురై ర్గుహాయత్." హృదయ గుహాలో నున్న పరతత్త్వము భూ-దివముల కంటెను, సురా సురుల కంటెను పరమైనది అని చెప్పి ఈశ్వర నిర్దేశము చేసి నది. ఉపనిషత్తేమో "ఏష దేవో విశ్వకర్మా, మహాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః." విశ్వకర్మ పరమేశ్వ రుడు సర్వుల యొక్క హృదయములో నున్నాడు- అని చెప్పినది. ఈవిధముగా "విశ్వకర్మ సూక్తము, శ్వేతాశ్వత రము, గీత" ఏకవాక్యము గలవై ఒప్పుచున్నవి. ఇంకను గల సాదృశ్యములను చూతము. వసు, రుద్రాదిత్యులు "విశ్వ కర్మ" నుండి పుట్టినారని మనము 5వ ప్రకరణమున (74వ పుట నుండి) చదివియున్నాము. గీత యేమో "పశ్యాదిత్యా న్వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా" — (11-16). వసు, రుద్రాదిత్యులు, అశ్వినీ దేవతలు, మరుత్తులు అనువారిని నాయందే చూడుము" అని చెప్పినది. వారందఱు తన సృష్టియే. తనయందు ఉన్నవారే అని భావము. ఇంతయేల?

ఈ జగమంతయు నాయందొక ఏకదేశమున ఉన్నదని "ఇహైకస్థం జగత్ కృత్స్నం పశ్యాద్య సచరాచరం ..." (11-7) అనెడి శ్లోకములో చెప్పబడినది. విశ్వకర్మ సూక్త మంత్రము- "విశ్వకర్మా హ్యజనిష్ఠ దేవ ఆదిద్గంధర్వో అభవ ద్ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనామ్" ఓష ధులను పోషించెడి 'సోముడను' నేనని చెప్పగా, గీత- "పుష్ణామి చౌషధీస్సర్వా స్సోమో భూత్వా రసాత్మకః" — (15-13) 'రస స్వరూప సోముడనై' నేను ఓషధులను పోషించుచున్నాను" అన్నది. ఇట్టి సాదృశ్యములను ఎన్నింటినో సూక్ష్మ పరిశీలనచే ఎఱుంగవచ్చును.

"పరో దివా పర ఏనా పృథివ్యాః" నేను భూ-దివ ముల కంటెను పరుడను అని "విశ్వకర్మ సూక్త" మనగా, గీత- "మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ" (7-7). నాకంటె పరమైనదేదియును లేదు. అన్నిటికీ నేనే పరుడను అని అన్నది."యోనః పితా, జనితా, యో విధాతా" అని విశ్వకర్మ సూక్త మనగా, భగవద్గీత యేమో- "పితాఽ హ మస్య జగతో మాతా ధాతా పితామహః" — (9-17) అని అన్నది. " ... నదీనాం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వకర్మణే విశ్వాహా మర్త్యగ్ం హవిః" తండ్రియైన "విశ్వ కర్మ"కు ఎల్లవేళల యందును హవిస్సులను (కర్మలను) సమ ర్పింపుమని విశ్వకర్మ సూక్తమనగా, భగవద్గీత-

"పత్రం, పుష్పం, ఫలం, తోయం, యో మే భక్త్యా
ప్రయచ్ఛతి, త దహం భక్త్యుపహృత మశ్నామి
ప్రయతాత్మనః." — (9-26)

పత్రముగాని, పుష్పముగాని, ఫలముగాని ఎవరేని భక్తితో ఒసంగిన, నేను దానిని స్వీకరించి అనుభవింతును" అన్నది. అనగా జనులు భక్తితో చేసెడి కర్మలను భగవంతుడు స్వీకరించునని భావము. గీతలోని 10, 11- అధ్యాయముల యందలి శ్లోకములు ఎక్కువగా "విశ్వకర్మ సూక్తము" లను అనుసరించుచున్నవి. అందు 10వది విభూతి యోగము కనుకను, 11వది విశ్వరూప సందర్శనము కనుకను ఆ రెంటికిని "విశ్వకర్మ" మంత్రములతో సాదృశ్యముండుట అని వార్యము."విశ్వకర్మ సూక్తము"- "న తం విదాథ య ఇదం జజాన" ఈ జగమును సృష్టించిన "విశ్వకర్మ"ను మీరెఱుంగరు అన్నది. ఆ భావమునే నాసదీయ సూక్తము- "కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్, కుత ఆజాతా, కుత ఇయం విసృష్టిః" (ఋ. 10-129-6) మనము ఎవనినుండి వచ్చినామో, ఈ సృష్టి ఎవనినుండి కలుగుచున్నదో ఎవ డెఱుంగును ?" అని పేర్కొన్నది. ఈ అంశమును గీత-

"న మే విదు స్సురగణాః, ప్రభవం న మహర్షయః,
అహ మాదిర్హి దేవానాం, మహర్షీణాం చ సర్వశః."
— (10-2)

నన్ను గూర్చి బ్రహ్మాది దేవతలు గాని, వసిష్ఠాది మహర్షులు గాని యెఱుంగరు. నేను వారి కందఱికిని ఆదిని, జగత్కారణుడను అన్నమాట." వారిని సృష్టించినది తానే కనుక వారు తనను ఎఱుంగరనుట దోషము కాదు. అట్లే సృష్టిలోనివారును తన్నెఱుంగ లేరని చెప్పినట్లే అయినది.

అందుకే "నతం విదాథ" అని మంత్రమన్నది. దానినే వివరించుచు గీతా శ్లోకము నా అవతారములను (వైభవం) గూర్చిగాని, నన్ను గూర్చిగాని ఎఱుంగరని అన్నది. తన్ను ఎవరుగాని ఎఱుగజాలకపోయినచో వారికిక బంధ విముక్తి యెట్లు? అని ప్రశ్న రావచ్చును. అందుకే సమాధానముగా 15వ అధ్యాయములోని 15వ శ్లోకము యొక్క తుది రెండు పాదములు ఇట్లున్నవి. "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః, వేదాంత కృద్వేద విదేవ చాహాం" వేదముల వలన నన్ను ఎఱుంగవచ్చును. ఆ వేదములలో ముఖ్యములైన సూక్తములే 1) నాసదీయ 2) విశ్వకర్మ 3) పురుష 4) మోక్ష సూక్తములు. వాటిని గూర్చి మన దర్శనములు వివరించినవి. పై శ్లోకములో "వేదాంతకృత్" అను మాట కలదు. ఈ వేదాంతము ఎక్కడదో కాదు. వేదములలోని కొన్ని సూక్తములలో నిగూఢముగా నున్నదే. దానిని చెప్పునవే పైని పేర్కొన్న సూక్తములు. అట్టి సూక్తముల నుండియే ఉపనిషత్తులు, గీత పుట్టినవి. వేద వేదాంతములకు భగవంతుడు సృష్టికర్త అను నంశమును, విశ్వకర్మ సూక్తము "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అను మాటతో చెప్పినది. అనగా వేద సృష్టికర్త విశ్వకర్మయే అని భావము. ఆ వేదము నెఱింగినవాడును తానే అని "వేద విదేవ చాహాం" అన్నమాట చెప్పినది. వేదవేద్యుడైన తన్నెఱింగిననే (విశ్వకర్మను) కాని మోక్షము, అమృతత్త్వము కలుగదని పురుష సూక్త మంత్ర మనుచున్నది :

ఇట్టివాడైన భగవానుని ఎఱింగినవాడు అమృతు డగును. "తమేవం విద్వా నమృత ఇహ భవతి" అని పురుష సూక్తమనగా, గీత యేమో-

"యో మా మజ మనాదిం చ వేత్తి లోక మహేశ్వరం,
అసమ్మూఢ స్స మర్త్యేషు, సర్వపాపైః ప్రముచ్యతే."
— (10-3)

నన్ను జన్మరహితునిగాను, ఆది లేనివానినిగాను, సర్వలోకేశ్వరునిగాను ఎఱింగినవాడు జ్ఞానియై సంసార పాశ (పాప) విముక్తుడు కాగలడు" అన్నది. అథర్వ వేదము 'కాలము' భగవత్ స్వరూపమనుటను కాలసూక్తము చెప్పగా, గీత యేమో "అహ మేవాక్షయః కాలః" (10-33) అనియు, "కాలోఽస్మి లోక క్షయకృత్ప్రవృద్ధః" (11-33) అనియు అనంతమగు కాలము నేనే, లోకములను మ్రింగెడి కాలమును నేనే అన్నది. వేద మంత్రములకు, గీతా శ్లోకము లకు గల సాదృశ్యములను ఆ యా ప్రకరణముల యందే చూపుచు వచ్చినాము. వాటిని ఇక్కడ చెప్పుట పునరుక్తి కాగలదు. అయినను పునరుక్తిని, స్పష్టత కోసమై స్వీకరింపక తప్పుటలేదు. విశ్వకర్మ సూక్తము "యో దేవానాం నామధా ఏక ఏవ" విశ్వకర్మ ఒక్కడే సర్వదేవతా స్వరూ పుడు అగుచున్నాడనగా, గీత-

"వాయుర్యమోఽగ్నిర్వరుణశ్శశాంకః,
ప్రజాపతి స్త్వం, ప్రపితా మహశ్చ." — (11-39)

తా॥ వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చం

ద్రుడు, ప్రజాపతి ఇత్యాది దేవతలందఱు భగవత్ స్వరూప ములే అని స్తుతించినది. "విశ్వకర్మణోఽన్యం న కించన" "బ్రహ్మణోఽన్యం న కించన" అని పాఠకులు భావింప వలయును.

## విశ్వకర్మ పంచసూత్రి

వ్యాస మహర్షి ఉపనిషత్తులకు, వాక్యార్థ వివరణము, సమన్వయము చేయుచు, బ్రహ్మసూత్రములను రచించినాడు. అది నాలుగు అధ్యాయముల గ్రంథము. దానికి బ్రహ్మ దర్శనమనియు, బ్రహ్మ సూత్రములనియు పేర్లు గలవు. ఉత్తర మీమాంస అనియు దానినందురు. పూర్వ మీమాంసా దర్శనము యజ్ఞయాగాది కర్మలను గూర్చి చెప్పునది కాగా ఈ ఉత్తర మీమాంస జగత్కారణమైన పరబ్రహ్మము యొక్క తత్త్వమును, జ్ఞానమును, సాధనను వివరించును. ఈ బ్రహ్మసూత్రములకు శంకర, రామానుజ, మధ్వాచార్యులు- అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత పరముగా భాష్యములు వ్రాసియున్నారు. శ్రీకంఠాచార్యులు శైవ పరముగా శ్రీకంఠ భాష్యమును వ్రాసినారు. బ్రహ్మ సూత్రములు మొదటి అధ్యాయములోని నాలుగు సూత్రము లకు "చతుస్సూత్రి" అని పేరు. ఈ 4 సూత్రములను చదివినచో చాల భాగము వేదాంతము తెలిసినట్లే కాగల దని విజ్ఞుల భావము. అనేకులు శంకర భాష్యములో ఈ

చతుస్సూత్రిని చదివి భాష్యశాంతి చేసినామనుచుందురు. ఈ నాలుగు సూత్రములను గురు ముఖమున చదివిన ఎడల తక్కిన గ్రంథమంతయు సొంతముగా తెలుసుకొనవచ్చునని కూడ కొందఱి భావము.

ఉత్తమ పండితులగు శ్రీ భాగవతుల కుటుంబరావు గారు "ఋగ్వేద రహస్యాలు" అను నా గ్రంథమునకు అనుశీలనము వ్రాయుచు ఇట్లనినారు. "వాస్తవముగా నీ గ్రంథములకు "విశ్వకర్మ తత్త్వ సర్వస్వము", లేదా "విశ్వకర్మ విశ్వరూపము" అని పేర్లు పెట్టవచ్చును" అని అనినారు. అంతియేగాక ఈ గ్రంథమును, తక్కిన గ్రంథములను కూడ "అథాతో విశ్వకర్మ మీమాంస" లేక "అథాతో విశ్వకర్మ తత్త్వ జిజ్ఞాసా" అని మొదలిడవచ్చునని అనిపించుచున్నది" అనినారు. ఈ వాక్యములను చూచినప్పటినుండియు ఇప్పటికి నేను వ్రాసిన 6 వేద దర్శనముల సారమును మఱికొన్ని విశేషములను చేర్చి "విశ్వకర్మ మయం జగత్" అనెడి పుస్తకమును వ్రాయుట శ్రీ కుటుంబరావుగారి అభిప్రాయమును గౌరవించుట కాగలదని ఈ గ్రంథమును వ్రాయబూనుటయైనది. అట్లే "విశ్వకర్మ జిజ్ఞాసా" అనెడి సూత్రమును కూడ శ్రీ వారే సూచించినందున ఆ బ్రహ్మసూత్రములలోని 4 సూత్రములను "విశ్వకర్మ" పరముగా అన్వయించి వ్రాయుట సముచితముగ నుండునని తోచి ఈ ప్రకరణము వ్రాయుట యగుచున్నది. బ్రహ్మసూత్రములలో "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అనునది మొదటి

సూత్రము. ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన జగత్కారణ మును 'బ్రహ్మ' మని, 'ఆత్మ' అని, 'పరమాత్మ' అని ఉపనిష ద్రష్టలు పేర్కొనినారు. వేదములు 1) మంత్రము 2) బ్రాహ్మణము 3) ఆరణ్యకము 4) ఉపనిషత్తు అని చతు ర్విధములుగా నుండును. వాటిలో 4వది (కడపటిది) ఉప నిషత్తు గదా! అది చివర నున్నందున దానికి వేదాంతమని పేరు వచ్చినది.

మా దృష్టిలో ఈ ఉపనిషత త్త్వమైన జగత్కారణ ప్రస్తావన, జగత్ సృష్టి, మోక్షము (అమృతత్వము) ఈ మొదలగు విషయములు ముమ్మొదటగా ఋగ్వేదములోనే ఉన్నందున ఈనాడు మన మనుకొను వేదాంతము వేదాల లోనే ఉన్నదని తేలినది. అందును జగత్కారణ వస్తువును ఋగ్వేదమే నాలుగు (4) సూక్తములలో ప్రస్తావించినది. ఆ సూక్తములే 1) నాసదీయము 2) విశ్వకర్మ సూక్తము 3) పురుష సూక్తము 4) మోక్ష సూక్తము అని మేము మా వేద దర్శనముల యందు వివరించియే ఉన్నాము. కనుక ఇట్టి జగత్కారణ "విశ్వకర్మ తత్త్వము"ను నాలుగు సూత్రము లలో శ్రీ భగవతులవారి సూచనను అనుసరించి ప్రవచించుట మంచిదని మా భావము కూడ. అందు మొదటి సూత్రము :

1] "<u>అథాతో విశ్వకర్మ తత్త్వ జిజ్ఞాసా</u>" :

ఇందు అథ, అతః, విశ్వకర్మ, తత్త్వ జిజ్ఞాసా- అను

నాలుగు మాటలు గలవు. వీని భావము పిమ్మట "విశ్వకర్మ తత్త్వము" యొక్క జిజ్ఞాస చేయబడుచున్నది అని. జిజ్ఞాస అనగా తెలిసికొనగోరుట అని భావము. అనగా తెలియ బూనుట అని సారాంశము. ఇప్పుడు సూత్రములోని ఒక్కొక్క పదమును విపులముగా చర్చింతము. మొదటి పద మైన 'అథ' శబ్దము మంగళవాచకము. మంగళకర పదముతో గ్రంథారంభము చేయుట ఉత్తమ పద్ధతి కదా! సూత్ర గ్రంథకారులందఱు ఈ 'అథ' శబ్దముతోనే తమ గ్రంథము లను ప్రారంభించినారు. యోగసూత్రకారుడైన పతంజలి మహర్షి తన యోగ దర్శనమును "అథ యోగానుశాసనమ్" అని ప్రారంభించినాడు. అట్లే వ్యాసుడు "అథాతో బ్రహ్మ జిజ్ఞాస" అని 'అథ' శబ్దముతోనే తన దర్శనమును మొదలిడి నాడు. అథ శబ్దమునకు 'పిమ్మట' అని మఱియొక అర్థము. మానవులందరును జగత్కారణమైన భగవంతుని గూర్చి విచారింపరు. ఏ కొలదిమంది మాత్రమో కంటికగపడు ఈ జగము ఏమిటి ? ఇది ఎట్లు వచ్చినది ? దీనిని సృష్టించినవాడు ఎవడైనా ఉన్నాడా ? అని ఆలోచింప పూనును. ఈ విషయ మునే నాసదీయ సూక్తములోని దిగువ మంత్రము ఇట్లు అన్నది.

"కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్
కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః."

మన మెచ్చటనుండి పుట్టినాము ? ఈ సృష్టి ఎట్లు కలిగినది ? అను విషయములను ఎవడెఱుంగును? ఎవడు

మనకు ఈ రహస్యములను చెప్పగలడు? అని భావము. అందఱునూ తినుట, త్రాగుట, భోగించుటల తోనే తృప్తి పడుదురుగాని తమను గూర్చిగాని, ఈ జగమును గూర్చిగాని, తాము పొందవలసిన గమ్యమును గూర్చిగాని ఆలోచింపరు. అట్టి ఆలోచన కలిగిన పిమ్మటకాని భగవతత్త్వమును గూర్చి విచారించుట సంభవింపదు. కనుక అథ శబ్దమునకు 'అట్టి ఆలోచన, కోరిక కలిగిన పిమ్మట' అని అథ శబ్దమునకు అర్థము చెప్పుకొనుట యుక్తముగా నుండును. ఇక "అతః" అను శబ్దమును గూర్చి చూతము. 'అతః' అను మాట కారణ వాచకము. అనగా కారణమును గూర్చి చెప్పునదన్నమాట. మానవుడు చేయు కర్మలన్నియు లౌకికములని, వైదికములని రెండు విధములుగా నుండును. లౌకిక కర్మలు ధన సంపాదన, భోజనాదులు కాగా, వైదిక కర్మలు సంధ్యావందన, దేవపూజ, మంత్ర జపాదులు అగుచున్నవి. ఈ వైదిక కర్మలు ఈ లోకమునకు సంబంధించినవనియు (ఐహికములు), పరలోకమునకు సంబంధించినవనియు (పారలౌకికములు) రెండు రీతులగును. ఈ లోకమునకు సంబంధించినవైన ధన సంపాదన, భోజన వ్యవహారాది కార్యముల యొక్క ఫలములు, పనులు జరిగిన కొంతకాలమునకు నశించి పోవుచుండుట మనము చూచుచునే యున్నాము. సంపాదించిన ధనరూప ఫలము కొంతకాలమునకు నశించి తీరును. అనగా ఖర్చు అయిపోవునన్నమాట. అట్లే చేసిన భోజన రూప కర్మము కూడ, జీర్ణము కాగానే నశించినదగుచున్నది.

ఈ విధముగా చూచినచో ప్రతి లౌకిక కర్మ యొక్క ఫలము కూడ నశించిపోవుటను మన అనుభవము ద్వారా గమనింప గలము. అట్లే సంధ్యావందనాది వైదిక కర్మల ఫలము కూడ నశించునని మనము తేలికగానే ఊహించుకొనవచ్చును. ఇక పోగా స్వర్గాది పరలోకములకు సంబంధించిన ఫలములను మానవులు యజ్ఞయాగాది కర్మలు చేసి పొందుచున్నారు. "జ్యోతిష్టోమేన స్వర్గ కామో యజేతా" స్వర్గము కావలయునని కోరువాడు "జ్యోతిష్టోమ" మనెడి యజ్ఞము చేయవలెనని వేదము చెప్పుచున్నది. దీనిచేత యజ్ఞకర్త స్వర్గలోకమునకు పోయి అచ్చట దివ్య సుఖములను (దేవ భోగములను) అనుభవించునని వేదాభిప్రాయము. ఇట్లే సంతానము కలుగుటకు, సంపన్నుడగుటకు, ఇంకా ఆ యా ఫలములను పొందుటకు ఎన్నెన్నో యజ్ఞయాగాది కర్మలు వేదములందు చెప్పబడినవి. వాటియందలి ఆశతోనే మానవులు ఈ ఐహిక భోగముల కన్నా పారలౌకిక సౌఖ్యములు శ్రేష్ఠములని యెంచి యజ్ఞాది కర్మలను ఆచరించుచుందురు. కాని ఈ లోకములోని ధన సంపాదనాది కార్యములు, కృషి, వాణిజ్యాదులు ఎట్లు ఫలముల నిచ్చి నశించుచున్నవో అట్లే వైదిక కర్మలు కూడ కొంతకాలము అనుభవింపబడి నశించి తీరునని వేదమే చెప్పుచున్నది. ఆ వేద వాక్యము ఇది. "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవ మేవా ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే." ఈ లోకమున కర్మల యొక్క ఫలములు ఏ విధముగా నశించుచున్నవో అట్లే యజ్ఞాది

పుణ్యకర్మలు చేసి సంపాదించిన స్వర్గాది లోకములలోని భోగములు కూడ (ఫలములు కూడ) నశించుచున్నవి అని భావము. ఈ విషయమునే భగవద్గీత-

"తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి,
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం, కామకామా లభంతే." — (9-21)

తా॥ యజ్ఞాదులు చేసి స్వర్గమున కేగినవారు ఆ లోకములో కొంతకాలము తాము చేసిన పుణ్యకర్మల ఫలమును అనుభవించి ఆ పుణ్యము క్షీణింపగా మరల ఇహ లోకమున మానవులుగానే పుట్టుచున్నారు. కనుక వేద ధర్మమును అనుసరించెడి యాజ్ఞికులు, యజ్ఞములు చేయుట, తత్ఫలముగా స్వర్గమున కేగుట, ఆ ఫలము క్షీణింపగా మరల మనుష్య లోకమున పుట్టుట జరుగుచుండునే గాని, జన్మ రాహిత్యముగాని, శాశ్వతమైన మోక్షానందము గాని వారికి ప్రాప్తించదు. కనుక లౌకిక కర్మలవలె పరలోక కర్మలు కూడ అశాశ్వతములే. అల్పకాల్పము అనుభవింపతగినవి మాత్రమే అగుచున్నవి.

ఇది ఇట్లుండగా వేదమాతయే, భగవంతుని విజ్ఞానము వలన జీవునకు పునర్జన్మ నశించి, అతడు శాశ్వతానంద స్వరూపుడు, అమృతుడు అగుననియు చెప్పుచున్నది. ఆ వాక్యము లివి. "త మేవం విద్వా నమృత ఇహ భవతి", "తమేవ విదిత్వా అతి మృత్యుమేతి" ఆ "విశ్వకర్మ"ను

ఎఱింగినవాడు అమృతు డగుచున్నాడు. ఆ "విశ్వకర్మ"ను తెలిసికొని మృత్యువును దాటుచున్నాడు- అని ఈ పురుష సూక్త వాక్యములకు అర్థము. దీనికి తగినట్లుగానే శ్వేతాశ్వతరోపనిషత్తు కూడ ఇట్లనుచున్నది. ఏవ దేవో విశ్వకర్మా మహాత్మా ... య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి." (చూడుము- పుట. 28)

సర్వజీవుల యొక్క హృదయముల యందు "విశ్వకర్మ పరమాత్మ" ఉండియే యున్నాడు. అట్టి "విశ్వకర్మ"ను ఎవరు యోగాది సాధనముల ద్వారా ఎఱుంగజాలుదురో అట్టి సత్పురుషులు అమృత స్థితి నందుదురు. ఈ విషయమును "న స పునరావర్తతే" ఆ భగవంతు నెఱింగినవాడు తిరిగి పుట్టవలసిన పని లేదు. "తరతి శోక మాత్మవిత్" ఆత్మవేత్త అగువాడు శోకమును పొందడు. "బ్రహ్మ విదాప్నోతి పరమ్" బ్రహ్మ (విశ్వకర్మ) వేత్త అయినవాడు ఉత్కృష్టమైన స్థితిని పొందుచున్నాడు. మొదలైన ఉపనిషద్వాక్యములు కూడ భగవద్విజ్ఞానము చేత- జగత్కారణమైన తత్త్వము నెఱుంగుటచేత దుఃఖరహితమైన శాశ్వత మోక్షము పొందునని చెప్పుచున్నవి. కనుక వేదమే ఇహ, పర లోకములకు సంబంధించిన కర్మల యొక్క ఫలములు శాశ్వతములు కావనియు, భగవంతు నెఱుంగుటచే కలిగెడి ఫలము శాశ్వతమనియు చెప్పుచున్నందున (అతః) ప్రతివాడును "విశ్వకర్మ తత్త్వము" యొక్క జిజ్ఞాస చేయవలసియున్నదని తేలుచున్నది. ఇదియే ప్రథమ సూత్రము యొక్క అర్థము.

అథ=జగత్కారణమును గూర్చి తెలుసుకొనదలచి

నప్పుడు ఇహ పర లోకముల కర్మల యొక్క ఫలములు నశించునవి కనుకను, భగవంతు నెఱుంగుటచే కలిగెడి ఫలము శాశ్వతమైనది కనుకను, సత్పురుషు డైనవాడు "విశ్వకర్మ తత్త్వమును" గూర్చి తెలియవలసి యున్నది. ఈ "విశ్వకర్మ తత్త్వము", విశ్వకర్మ సూక్త మంత్రముల యందు సమగ్రముగా బోధింపబడి యున్నది.

## 2] "జన్మాద్యస్య యతః" :

జన్మాది, అస్య, యతః ఈ సూత్రము నందలి 3 మాటలు ఇవి. అస్య=మన కంటికగపడు ఈ జగత్తునకు (జగత్తు యొక్క), జన్మ+ఆది=పుట్టుక, పెరుగుట, నాశమగుట మొదలగు కార్యములు, యతః=ఏ సర్వశక్తి నుండి కలుగుచున్నవో, ఆ సర్వశక్తియే "విశ్వకర్మ" అని సారాంశము. మనకంటి కగపడెడి జగము పుట్టుచు, పెరుగుచు, తరుగుచు, నశించుచు, నానావిధమైన అవస్థలను పొందుచున్నది. ఏ మూలకారణము యొక్క శక్తివలన జగత్తునకు (జీవులకు) జన్మాది కార్యములు జరుగుచున్నవో ఆ శక్తికి "విశ్వకర్మ" అని పేరు. పుట్టుట, పెరుగుట మొదలగునవి కర్మలు కదా! ఇట్టి కర్మలు అనేకములు. అట్టి సమస్త కర్మలు, సర్వజ్ఞమైన ఏ శక్తి నుండి కొనసాగునో దానికే "విశ్వకర్మ" నామము తగుచున్నది. ఈ శక్తిని "విశ్వకర్మ" నామముతో వేదము పేర్కొనియున్నది. అందుకు "విశ్వకర్మ సూక్తము"లే కాక అనేకములైన మంత్రములు కూడ ఉదాహరణములే. ముందు విశ్వకర్మ సూక్తమును చూతము.

"య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా నిషసాద పితానః. స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమ చ్ఛదో వర ఆవివేశ" ఈ మొదలైన మంత్రముల అర్థములు జగత్తుల యొక్క జన్మాదులకు "విశ్వకర్మ"యే మూల కారణమని చెప్పుచున్నవి. కనుక జగదుత్పత్త్యాది కార్యము లకు మూలభూతుడైనవాడు, జగజ్జనకుడు, జగత్ పాలకుడు, జగత్తుల సంహర్త, పునఃసృష్టికర్త ఆయనే (విశ్వకర్మయే) గనుక, ఆయనను గూర్చి విచారించి, చర్చించి తెలిసికొనుట కర్తవ్యము. ఈ విషయమునే విశ్వకర్మ సూక్త వాక్యము "న తం విదాథ" ఆతని నెఱుంగకున్నారు అని పలికినది. పురుష సూక్త వాక్యమేమో "త మేవం విద్వా నమృత ఇహ భవతి" అన్నది. ఇట్టి "విశ్వకర్మ"ను గూర్చి మన ఈ గ్రంథమంతయు అంగ ప్రత్యంగ విమర్శతో విశదముగా చెప్పుటకే ప్రయత్నించినది కదా!

## 3] "శాస్త్ర యోనిత్వాత్" :

శాస్త్రమునకు కారణము అయినవాడు శాస్త్రయోని. అతని యొక్క భావము శాస్త్ర యోనిత్వము. అనగా భగ వంతుడగు "విశ్వకర్మ", శాస్త్రము- అనగా వేదము జన్మించు టకు కారణమైనందువలన ఆయన శాస్త్రియోని అని చెప్ప బడుచున్నాడు. వేద మనునది "విశ్వకర్మ" నుండియే కలిగిన దని విశ్వకర్మ సూక్తములోని "వాచస్పతిం విశ్వకర్మాణమ్" అనెడి మాటయే చెప్పుచున్నది కదా! అందువలన ఆయన వేదమునకు జనకుడు, పాలకుడు కూడ అన్నమాట.

"యో బ్రహ్మాణం విధదాతి పూర్వం
యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై."

అనువాక్యమును బట్టి బ్రహ్మను సృష్టి చేసినదియు, ఆయనకు వేదముల నిచ్చినదియు "విశ్వకర్మ"యే అని మనము రెండవ ప్రకరణమున విస్తరముగా చదివే ఉన్నాము. దానికి తగిన అనేక ప్రమాణములను కూడ బృహదారణ్యక భగవద్గీతాది గ్రంథముల నుండి స్వీకరించియే యున్నాము. కనుక వేద జనకుడు "విశ్వకర్మ" యని ఇచ్చట పునర్విచారణ చేయుట విస్తరము కాగలదు.

శాస్త్రయోని శబ్దమునకు ఇంకొక అర్థమును కూడ మనము చెప్పికొనవచ్చును. శాస్త్రం యోనిః (కారణమ్) యస్య సః = ఎవనికో ఆతడు శాస్త్రయోని అని బహు వ్రీహి సమాసము. అనగా "విశ్వకర్మ", శాస్త్రము (వేదము) కారణముగా గలవాడు. ఆయన వస్తుతః తనకే కారణము లేనివాడైనను, ఆయన నెఱుంగవలెనన్న వేదము నాశ్రయించకుండ ఎవ్వరికినీ సాధ్యముకాదు. కనుక "విశ్వకర్మ తత్త్వము"ను తెలుపుటకు వేదము కారణమగుచున్నది. అందువలన ఆయన శాస్త్రముచే తెలిసికొనతగినవాడను నర్థమున, బహువ్రీహి సమాసము రీతిని కూడ "శాస్త్రయోని" శబ్దము సార్థకమగుచున్నది.

"విశ్వకర్మ తత్త్వము" నెఱుంగవలెనన్న విశ్వకర్మ సూక్తములు, శ్వేతాశ్వతరోపనిషత్తు, విశ్వకర్మ-విశ్వ

బ్రహ్మోపనిషత్తులు, శిల్పోపనిషత్తు, పంచబ్రహ్మోపనిషత్తు, మూలస్తంభము, విశ్వకర్మ పురాణము మొదలగు మహా గ్రంథములను చదువవలసి యున్నది. వాటి యొక్క పరిపూర్ణ జ్ఞానము లేనిది అరకొర జ్ఞానముతో "విశ్వకర్మ తత్త్వము" పూర్తిగా అవగాహన కాదు. ఈ గ్రంథము లన్నియు వేదార్థమును, జగత్కారణ తత్త్వమును వివరించు నట్టివే. కనుక ఆయన నెఱుంగుటకు ఇవి హేతువులు గాన, ఆయనను శాస్త్రము (వేదము) "యోని"గా (కారణముగా) కలవాడని ఈ శివ సూత్రము చెప్పుచున్నది. కాళిదాసు కూడ భగవంతుని గూర్చి "జగద్యోని, రయోని స్త్వం, జగదంతో, నిరంతకః." ఓ పరమేశ్వరా! నీవు జగత్తులకు కారణుడవు. అయినను అయోనివే. అనగా నీకై ఏ కారణమును లేనివాడవే. అట్లే జగత్తులకు నీవు అంతకుడవే. అయినను నీవు మాత్రము నిరంతకుడవు. అనగా నీకు ఇంకొక అంతకుడు లేనట్టివాడవు. అనగా అనంతుడవన్న మాట- అని చమత్కారముగా చెప్పినాడు. కనుక ఈ సూత్రము "విశ్వకర్మ"ను వేదమునకు కారణమనియు, ఆయన నెఱుంగవలెనన్న వేదము కారణమనియు, రెండర్థములనూ చెప్పినది. కాగా భగవంతుని వాక్కులు అని ఏ వేదములను అనుచున్నామో ఆ వాక్కులే భగవంతుని ఎఱుకపరుచుటకు హేతువు లగుచున్నవని సారాంశము. అనగా ఈశ్వరుడు లోకములతోపాటు వేదములను కూడ సృష్టించి, లోకులు

ఎట్లు ప్రవర్తింపవలసినదీ ఆ వేదములలోనే అనుశాసించి నాడని భావము.

## 4] "తత్తు సమన్వయాత్" :

'తత్, తు, సమన్వయాత్.' ఈ సూత్రము నందలి 3 పదములు ఇవి. పూర్వ సూత్రమున, వేదము విశ్వకర్మ జ్ఞానమునకు కారణమని చెప్పికొన్నాము కదా! అనగా "విశ్వకర్మ జ్ఞానము" కలుగుటకు వేదార్థమును తెలిసికొన వలయునని కదా భావము. వేదములలో ఎందఱో దేవతలు, వారి కార్యములు పేర్కొనబడినవి. వీటిలో ఒక దేవునికి ఇంకొక దేవునితోను, ఒక కార్యమునకు ఇంకొక కార్యము తోను సంబంధము అగపడకున్నది. ఇట్లు నానా దేవతల తోను, నానా కర్మలతోను వివిధ జ్ఞానములతోను కూడు కొన్న వేదము "విశ్వకర్మ తత్త్వము"ను ఎట్లు చెప్పగలదు అని సందేహము కలుగగా ఈ 4వ సూత్రము అట్టి ఏకార్థ లాభము, సమన్వయము వలన చేకూరగలదు అని పలికినది. "సమన్వయాత్" అనగా భిన్నత్వమునకు త్రోవతీయు వాక్యములను, తగినట్లుగా చక్కగా సమన్వయించుకొని సిద్ధి పొందవలయునని ఈ సూత్రము యొక్క పరమ తాత్ప ర్యము. ఈ సమన్వయమంతయు, పూర్ణముగా "విశ్వకర్మ సూక్తముల"లోనే నిక్షేపింపబడియే యున్నది. దానిని వివ రించుటకే మేమీ గ్రంథమున 1) విశ్వకర్మ సూక్త తత్త్వా ర్థము 2) విశ్వకర్మ రూపనామ క్రియలు 3) ఈశ్వర స్తోత్ర

పూజా, జప, ధ్యానాదులు- ఇత్యాది ప్రకరణముల ద్వారా తత్త్వమును సమన్వయించుటకు ప్రయత్నించినాము. ఈ గ్రంథమున మేము చేసిన ప్రయత్నమంతయు సమన్వయము కొఱకే. కనుక మొదటి నుండి గల ప్రకరణముల సారమును పాఠకులు అవగాహన చేసికొన్నచో, చక్కని సమన్వయమే పొసగగలదు. భిన్న దృష్టికిగాని, ఇది విశ్వకర్మేతరమనుటకు గాని ఈ గ్రంథమున తావే లేదు. కనుక సాధకులు గాని, పాఠకులు గాని సమన్వయ దృష్టితో దీనిని పఠించుట ఎంతయో ముఖ్యము.

## 5] "యోగసాధనాత్ సంసిద్ధిః" :

ఈ సూత్రములో 'యోగసాధనాత్, సంసిద్ధిః' అని, రెండే రెండు పదములు కలవు. 'సంసిద్ధి' అనగా మానవుడు తన జీవితమున పొందవలసిన జీవిత సిద్ధి అని భావము. ఆ సంసిద్ధి జన్మరాహిత్యము, మోక్షము, విశ్వకర్మ ప్రాప్తి, ఆనందము, అమృతత్త్వము ఇత్యాది పదములతో పేర్కొన తగినదై కూడ ఉన్నది. ఇట్టి 'సంసిద్ధి' అనునది సాధన వలననే కలుగగలదు. మానవుడు జీవితములో దుఃఖరహితమైన శాశ్వతానందమును పొందుటకు అనేక మార్గములున్నవి. ఆ మార్గములే కర్మ, భక్తి, జ్ఞాన, అష్టాంగ, కుండలినీ యోగాది సాధనములుగా సర్వులెఱింగినట్టివే. వీటిలో భక్తి, జ్ఞాన, కర్మాదులను గూర్చి మనకు యోగదర్శన, యోగ వాసిష్ఠ, జ్ఞానవాసిష్ఠ, భగవద్గీతాది గ్రంథములు అనేకము చెప్పుచునే యున్నవి. అష్టాంగ యోగమును గూర్చి పాతం

జల యోగ శాస్త్రము, దానిననుసరించి వెలువడిన పెక్కు గ్రంథములు చెప్పుచున్నవి. మేము కూడా వీలైనప్పుడు ప్రస్తావించుచునే యున్నాము. ఇకపోగా కుండలినీ యోగ మనునది ఒకటి కలదు. ఈ కుండలినీ యోగము విష్ణు మంత్రములలో నిగూఢముగా నిరూపింపబడి యున్నదని మా వేదదర్శనములలో మొదటినుండియు పేర్కొనబడు చునే యున్నది. "ఇదం విష్ణుర్వి చక్రమే, త్రేధా నిదధే పదమ్", యతో విష్ణుర్విచక్రమే, పృథివ్యా స్సప్త ధామభిః" అను ఇత్యాది మంత్రములలోని త్రిసప్త పదములు సప్త చక్రములకు సంకేతములు, సూచకములు అనియు, విష్ణు శబ్దము కుండలినీ శక్తికి సూచకమనియు, సూర్య చంద్రాగ్ని పదముల చేత ఇడ, పింగళ నాడులునూ, సుషుమ్నా నాడియు, సూచింపబడినదనియు చెప్పుచునే యున్నాము. కనుక అష్టాంగ యోగమును, కుండలినీ యోగమును సాధకు లకు సంసిద్ధి కలిగించుటకు దగ్గఱి త్రోవలని మఱువరాదు.

"శ్రద్ధా భక్తి జ్ఞాన యోగా దవేహి". ఈ వాక్యము ప్రతి సాధకునికి శ్రద్ధ అనునది ఉండవలెనని సూచించు చున్నది. ఆవల భక్తి అనునది అత్యవసరము. పిమ్మట జ్ఞానము కావలయును. ఆ తరువాత యోగ మవసరము. ఈ శ్రద్ధా భక్తి జ్ఞాన యోగములు కలవాడు "విశ్వకర్మ జ్ఞానము" కలిగి తరించుననుటలో సందేహము లేదు. ఈ సూత్రమునే "యోగ సాధనే నామృతత్త్వం" అనికూడ అన వచ్చును.

# అహం విశ్వకర్మాఽస్మి

ఉపనిషత్తులలో జగత్కారణ వస్తువు బ్రహ్మమనియు ("...తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" — తైత్తిరీయం), ఆత్మ అనియు ("ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" — ఐతరేయము), సత్ అనియు (సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్ — ఛాందోగ్యము), చిత్ అనియు, సచ్చిదానందమనియు పేర్కొనబడినది. కనుకనే "బ్రహ్మ విదాప్నోతి పరం"— (తైత్తిరీయము), ఆత్మానం చేద్విజానీయాత్" — (బృహదారణ్యకం), "ఏ తదాత్మ్యం, ఇదం సర్వం, స ఆత్మా, తత్త్వమసి శ్వేతకేతో" — (ఛాందోగ్యము) ఇత్యాది వాక్యములు బ్రహ్మ జ్ఞానముచేత, ఆత్మజ్ఞానము చేత మోక్షము కలుగునని చెప్పినవి. కాని ఉపనిషత్తుల కంటె పూర్వములైన వేదములలో జగత్కారణ వస్తువు "విశ్వకర్మ" శబ్దముతో పేర్కొనబడినది. అదే పురుష సూక్తమున 'పురుష' శబ్దముచే చెప్పబడి ఆ పురుషుడే "విశ్వకర్మ" అనియు, అట్టి "విశ్వకర్మ" నెఱింగిననే మోక్షమనియు, "తమేవం విద్వాన్ నమృత ఇహ భవతి", "తమేవ విదిత్వా అతి మృత్యుమేతి" అనియు ఇత్యాదిగా పురుష సూక్తమున పేర్కొనబడినది. దానికి తగినట్లే విశ్వకర్మ సూక్తము "న తం విదాథ య ఇదం జజాన" అన్నది. ఇక శ్వేతాశ్వతరమేమో "ఏష దేవో విశ్వకర్మా ... అమృతా స్తే భవన్తి" అన్నది. కనుక ఋగ్యజుర్వేదముల యందలి

విశ్వకర్మ సూక్తమును బట్టి జగత్కారణ వస్తువు "విశ్వకర్మ" అనియు, ఆ జగత్కారణ విశ్వకర్మ స్వరూపమే అయిన విశ్వ స్వరూప కార్యములను, వాటి కర్త అయిన "విశ్వకర్మ"ను ఎఱిఁగిననేకాని మోక్షము, అమృతత్త్వము కలుగదనియు తెలియుచున్నది. దీనినిబట్టి చూడగా ఉపనిషత్తుల ననుసరించి "అహం బ్రహ్మాఽస్మి" మహా వాక్యము అనుభవమునకు రావలసినట్లు, ఆ ఉపనిషత్తులకు మూలమైన వేదమును బట్టి "అహం విశ్వకర్మాఽస్మి" అను మంత్రార్థము అనుభవ గోచరము కావలసియున్నది. ఈ విషయమును, "విశ్వకర్మ తత్త్వము"ను అనుభూతికి తెచ్చుకొన్న వారి వాక్యములలో చూడవలసి ఉన్నది. ఋగ్వేదములో జగత్కారణా (విశ్వకర్మా)నుభూతిని పొందినవారిలో అంభృణ మహర్షి కూతురైన వాగ్దేవి, వామదేవుడు, త్రసదస్యుడు మొదలైనవారు కన్పట్టుచున్నారు. వారిలో వాగ్దేవి యొక్క అనుభవ మంత్రములను ముందు పరిశీలింతము. జగత్స్వరూపానుభవము, జగత్కారణాను (విశ్వకర్మా)భూతిని పొందిన ఆమె ఇట్లనుచున్నది-

1] "వాగ్దేవి" జగత్కారణాను (విశ్వకర్మా) భూతి :

"అహం రుద్రేభిర్వసుభిశ్చరా...ర్మ్యహ మింద్రాగ్నీ అహామశ్వినోభా". — ఋ. 10-125-1 (చూడుము. పుట-33).

మన కిక్కడ ప్రధానాంశము, "విశ్వకర్మ" వసు,

రుద్రాదిత్యులను సృష్టించినాడనునది. వసు రుద్రాదిత్యులు పిండ బ్రహ్మాండ సంబంధము గల దేవతలు. ప్రకృతి శక్తులు. విశ్వకర్మతో వాటికి (వారికి) అభేదమన్నమాట. వారిని విడిచిన, సృష్టియే లేదు. కనుకనే జగత్కారణ రూపము నందిన బ్రహ్మవాదిని వాగ్దేవి "అహం రుద్రే భిర్వసుభిశ్చ రామ్యహమాది త్యైరుత విశ్వ దేవైః" అన్నది. ద్వాదశా దిత్యులలో "ధాతృ విధాతలు, మిత్రా వరుణులు, ఇంద్రుడు, త్వష్ట, విష్ణువు" ఉండుటను మన ఋగ్దర్శన ప్రథమ భాగమున చదివియే యున్నాము. మా పూర్వ దర్శనములు ఈ విశేషములను అతి విశదముగా వక్కాణించియే యున్నవి. "ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః ... ఏకం స ద్విప్రా బహుధా వదన్తి" అన్న మంత్రములోని 'సత్తే' యీ జగత్కారణ "విశ్వకర్మ". సూక్త మంత్ర మింకొకటి "యో దేవానాం నామధా ఏక ఏవ" దేవతలెల్లరు విశ్వకర్మజులే, తత్స్వరూపులే అని చెప్పుచునే యున్నది. కనుకనే వాగ్దేవి "అహం విశ్వకర్మాఽస్మి" అనకుండగనే, 'నేను వసు రుద్రాదిత్య రూపిణిని' అని ఆ అర్థ భావములనే ఆవిష్కరించినది. కనుక "అహం బ్రహ్మాఽస్మి" అను మాట కంటెను "అహం విశ్వకర్మాఽస్మి" అన్నమాట ఇన్ని విశేషములను గోచరింపచేయుచున్నదని గ్రహింపనగును. ఇప్పుడు వాగ్దేవి దర్శించిన, గానము చేసిన మఱియొక మంత్రమును చూతము :

"అహం సోమ మాహనసం బిభర్మి,
అహం త్వష్టార ముత పూషణం భగమ్,

అహం దదామి ద్రవిణం హావిష్మతే
సుప్రావ్యే యజమానాయ సున్వతే."

— (ఋ. 10-125-2)

తా॥ నేను సోముని, త్వష్టను, పూషను, భగుని భరించుచున్నాను. వారిని సృష్టించి వారిచే ఆ యా పనులు చేయించుచున్నానని భావము. లెస్సగా యజ్ఞముచేయు యజమానునికి దాని ఫలరూపమైన ధనమును నేనే యిచ్చుచున్నాను.

వివరణ : ఇందలి సోముడు చంద్రుడును, సోమలతయు. సూర్య చంద్రులను సృష్టించినది "విశ్వకర్మయే" అని ఆ సూక్తము నందలి ఈ మంత్రము చెప్పుచున్నది. "విశ్వకర్మా హ్యజనిష్ట దేవ, ఆదిద్గంధర్వో అభవద్ద్వితీయః, తృతీయః పితా జనితౌషధీనాం." ఇందు పేర్కొనబడిన దేవుడు త్వష్ట లేక బ్రహ్మ. రెండవవాడైన గంధర్వుడు సూర్యుడే ("సూర్యోగంధర్వః" అని యజుర్వేదమన్నది). మూడవవాడైన ఓషధీపిత సోముడే- అనగా చంద్రుడే అన్నమాట. లేదా సోమలత అనియైనను తలంపవచ్చును. ఇక త్వష్ట "విశ్వకర్మ" తనయుడే అనుటకు "విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధద్రూపమేతి" అనెడి పురుష సూక్త మంత్రమే ప్రమాణము. పూష, భగుడు అనువారు ద్వాదశాదిత్యులలోని దేవతలు. ద్వాదశాదిత్యులు "విశ్వకర్మ" తనయులని ఇంతకుముందే చదివి

యున్నాము. త్వష్ట గూడ ద్వాదశాదిత్యులలో కలడు. త్వష్టయే యేమి? విష్ణువు సైతము ద్వాదశాదిత్యులలోని వాడే. "ద్వాదశో విష్ణు రుచ్యతే" అని ఋగ్వేద దర్శన ప్రథమ భాగమున చదివియేయున్నాము. సర్వకర్మల ఫలమును ప్రసాదించునది భగవంతుడే కనుక యజ్ఞకారులకు ఫలప్రదాత "విశ్వకర్మ"యే అన్నమాట. ఈ విధముగా వాగ్దేవి తాను "విశ్వకర్మ" రూపమేకాక "విశ్వకర్మ" సంతానమైన సర్వదేవతా (విశ్వ) స్వరూపమనియు ఈ మంత్రములలో గానము చేసినది. ఇక 3వ మంత్రమున, వాగ్దేవి తనకు సిద్ధించిన జగత్కారణ రూపమును లోతుగా వివరించుచున్నది.

"అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం,
చికితుషీ, ప్రథమా యజ్ఞియానాం,
తాం మా, దేవా వ్యదధుః పురుత్రా
భూరిస్థా త్రాం భూర్యావేశయంతీం."

— (ఋ. 10-125-3)

టీక : అహమ్=వాగ్దేవినైన నేను, రాష్ట్రీ=జగత్తులను సృష్టించిన ఈశ్వరిని. వసూనాం = కర్మ ఫలములనెడి ధనములను, ఉపాసకులకు, సంగమనీ = సమకూర్చుదానను. చికితుషీ=జగత్కారణమైన "విశ్వకర్మ తత్త్వము"ను ఎఱింగిన దానను (జ్ఞానిని అన్నమాట). విశ్వమంతయు నేనే అని సాక్షాత్కార సిద్ధి పొందినదాననని భావము. యజ్ఞియానామ్=యజ్ఞార్హములైన వానిలో, ప్రథమా = ముఖ్యమైన

దానను. అనగా యజ్ఞ సర్వస్వము తన స్వరూపమే అన్న మాట. తాం మా=ఇట్టి నన్ను, దేవాః=దేవతలు (ఆరాధకులు), భూరి స్థాత్రాం=పలు భావములతో ప్రపంచ స్వరూపముగా ఉన్నదాననుగాను, భూరి ఆవేశయన్తీం = బహు విధములుగా ఉన్న చరాచరముల యందు జీవ రూపముగా ప్రవేశించినదానినిగాను అయిన నన్ను, పురుత్రా = పలు చోట్ల, పలు విధములుగా ఉన్నట్లు, వ్యదధుః = చేసినారు. ఏకరూపిణి నైన నన్ను మాయా (ప్రకృతి) వశమున, ఆ ప్రకృతి శక్తులు అనేకముగ చేసినవన్న మాట.

<u>వివరణ</u> : ఈ మంత్రము నందు చెప్పబడిన తత్త్వమంతయు "విశ్వకర్మ" స్వరూపమునకు సంబంధించినదే. "భూర్యావేశయంతీ" అనెడి పదము ఉపాధుల యందు ప్రవేశించిన "విశ్వకర్మ"ను చెప్పుచున్నది. ఈ భావమే విశ్వకర్మ సూక్తములో "స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ" అని పేర్కొనబడినది. ఉపనిషత్తులో ఈ భావమే 'అనుప్రవేశ' మని చెప్పబడినది. "తత్సృష్ట్వా త దేవాను ప్రావిశత్" ఇత్యాదులను చూడనచ్చును. కనుక విశ్వకర్మ సూక్తములోని "విశ్వకర్మ"యే ఉపనిషత్తులలో బ్రహ్మముగా చెప్పబడినాడు కాన, వేద మార్గము ననుసరించి "అహం విశ్వకర్మాస్మి" కాగా, దానిని ఉపనిషత్తులు జగత్కారణమును బ్రహ్మముగా ఎన్ని "అహం బ్రహ్మాస్మి" అన్నవి.

ఈ మంత్రము నందలి "భూరిస్థాత్రా, భూరి-ఆవేశయంతీం" అను పదములు సృష్టి వైచిత్ర్యమును సూచించు నట్టివి. అసలు "విశ్వకర్మ" పర స్వరూపము- "పరో దివా, పర ఏనా పృథివ్యా, పరో దేవేభి రసురైర్ గుహాయత్" అని పేర్కొనబడినది కదా! అది ద్యావా పృథువులతో గాని, అందలి నానాత్వముతో గాని, దేవాసురాది ప్రాణికోటితో గాని ఎట్టి సంబంధమును లేని ఏకమేవా ద్వితీయము. అట్టి దానికి తనదే అయిన శక్తియందు, జగము తోచినది. విశ్వకర్మ సూక్తము మాయను, ప్రకృతిని 'ద్యావా, పృథివీ' శబ్దములతో పేర్కొనునని యిప్పట్టున పాఠకులు గ్రహింపవలసి యున్నది. ఆ విషయమునే సూక్తము "ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః" అని చెప్పినది. ఆ ద్యావా పృథువులే మాయగాని, ప్రకృతిగాని, అష్ట ప్రకృతులు గాని, క్షేత్రము గాని అన్నమాట. ద్యావా పృథువులలో "విశ్వకర్మ" పర స్వరూపము ప్రతిబింబించగానే విశ్వము, విశ్వక్రీడ ప్రారంభమగును. ఈ ద్యావా పృథివ్యాదులను దేవతా దృష్టితో 'గాయత్రి' అనిగాని, 'సావిత్రి' అనిగాని, 'సరస్వతి' అనిగాని చెప్పుకొనవచ్చును. అట్లు చెప్పికొనియే యున్నాము. ఇందుకు ప్రమాణము, సూక్తములో "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అని యుండుటయే. ఈ వాగ్నేని ఆ 'గాయత్రీ' స్వరూపమే. సాక్షాత్తు 'సరస్వతి'యే. కనుకనే తన పర స్వరూపమగు "విశ్వకర్మ తత్త్వము"ను ఈ సూక్తములో స్పష్టీకరించుచున్నది.

పరిశీలించి చూచినచో విశ్వకర్మ సూక్తములోని "విశ్వకర్మ తత్త్వము"నకు సంబంధించిన భావముల నన్నిటిని 'వాగ్దేవి' అనుభవమునకు తెచ్చుకొని తాను దర్శించిన (వాగ్దేవీ) సూక్తములో ప్రవచించినదని ఈ ప్రకరణమున పాఠకులు సులభముగానే గ్రహింపవచ్చును. మఱియొక ముఖ్యోదాహరణమును చూతము. "విశ్వకర్మ" పర స్వరూప మును ఈ మంత్రము ఇట్లనుచున్నది. "పరోదివా పర ఏనా ... రై ర్గుహాయత్." (చూడుము- పుట. 213.)

"విశ్వకర్మ" పర రూపము భూ-దివముల కంటెను, అందలి నానాత్వమున కంటెను దేవాసురాదుల కంటెను విభిన్నము, విలక్షణము అని ఈ మంత్ర వాక్య భావము. దీనిని వాగ్దేవీ సూక్తపు చివరి మంత్ర మిట్లనువదించినది.

"అహ మేవ వాత ఇవ ప్రవా,
మ్యారభమాణా భువనాని విశ్వా,
పరో దివా, పర ఏనా పృథి,
వ్యై తావతీ మహినా సంబభూవ."

— (ఋ. 10-125-8)

టీక : అహమేవ = వాగ్దేవినైన నేనే, విశ్వాని = సమస్తమైన, భువనాని = భూత సమూహములను- అనగా కార్యములను, ఆరభమాణా = కారణరూపిణినై ప్రారంభించుదాననై, వాత ఇవ=గాలివలె. ప్రవామి=వాటికి అంత ర్యామినై వెలయుచున్నాను. గాలి ఇతరుల ప్రేరణలేకయే సంచరించునట్లు, తాను స్వయముగానే తనయందు, తన

నుండియే భువనములను తోపింపచేయుచున్న దన్నమాట! దివా పరః=దివముకంటెను పరమై, ఏనా పృథివ్యా పరః = ఈ బ్రహ్మాండమునకంటె పరమై, మహిమ్నా=నా మహిమ చేత (నా యందలి మాయాశక్తి చేత అన్నమాట), ఏతావతీ=ఇది అంతయు అయినదాననై, సంభవామి = తోచుచున్నాను. అనగా తానే విశ్వరూపిణియై తనచేతనే ప్రకాశించుచున్నదన్నమాట.

వివరణ : విశ్వకర్మ సూక్తములోని "పరో దివా..." అన్న వాక్యమే ఈ వాగ్దేవీ మంత్రమున ఆవృత్తమై ఆమెకు, విశ్వకర్మకు గల అభేద భావమును తెలుపుచున్నది. కనుకనే ఈ సూక్తమున వాగ్దేవి "అహం విశ్వకర్మాఽస్మి" అని తన జగత్కారణానుభవమును గానము చేసినదని తెలియుచున్నది. కనుక "విశ్వకర్మ" వాచస్పతి అయి తత్త్వమును ప్రకాశింపజేసెనని గ్రహింపవలెను. కాన తత్త్వజ్ఞులు పొందెడి "విశ్వకర్మానుభవము"నకు "వాగ్దేవీ-విశ్వకర్మ" సూక్తములు రెండును పరమోదాహరణములు. తక్కిన మంత్రములలో కూడ ఇట్టి భావార్థ సాదృశ్యమును కాంచగలము.

"మయా సో అన్న మత్తి యో విపశ్యతి,
యః ప్రాణితి య ఈం శృణో త్యుక్తం,
అమంతవో మాం త ఉపక్షియన్తి
శ్రుధి శ్రుతం శ్రద్ధివం తే వదామి."
— (ఋ. 10-125-4.)

తా॥ అన్నము తినువానిలోని తినగల శక్తి నేనే. చూచెడివానిలోని దర్శన శక్తి, జీవించువానిలోని శ్వాస ప్రశ్వాసరూప ప్రాణశక్తి, వినువానిలోని శ్రవణ శక్తి నా స్వరూపమే, నేనే. నేను వారిలో లేనిచో వారి ఇంద్రియములు ఆ యా పనులను చేయలేవన్నమాట. అంతర్యామినై ప్రాణుల కిట్టి శక్తులను ప్రసాదించు నన్ను ఎవరెఱుంగరో. అట్టివారు సంసార చక్రమునబడి నశింతురు. ఓ బుద్ధిమంతుడా! నేను చెప్పెడి ఈ విషయమును శ్రద్ధకలవాడవై విని జగచ్చక్ర రహస్యము నెఱింగి ప్రవర్తింపుము. మంత్రమున "అమంతవః" అను పదమును వాడి ఈ సూక్తము నందు చెప్పిన భావములను గ్రహించి ఆచరింపనివారు "ఉపక్షియంతి" నశింతురని "వాగ్దేవి" స్పష్టము చేసినది.

<u>వివరణ</u> : ఈ 4వ మంత్రము ననుసరించియే కేనోపనిషత్తులోని దిగువ మంత్రము వెలువడినది-

"యచ్చక్షుషా న పశ్యతి, యేన చక్షూంషి పశ్యతి, తదేవ బ్రహ్మ త్వం విద్ధి, నేదం య దిదముపాసతే ... "

దేనిని కన్ను చూడలేదో, దేనిచేత కన్ను చూడగలుగుచున్నదో, ఆ 'అంతస్తత్త్వమే' బ్రహ్మమని నీ వెఱుంగుము. అంతేకాని, నీవనుకొన్న దేదియు బ్రహ్మము కాదు అని భావము.

ఆలోచించినకొలదీ "విశ్వకర్మ, వాగ్దేవి" సూక్తములు రెండును అభేదాద్వైత భావమునకు బింబ ప్రతిబింబముల వలె తోచుచున్నవి.

"అహం రుద్రాయ ధను రాతనోమి
బ్రహ్మద్విషే శరవే హంత వా ఉ,
అహం జనాయ సమదం కృణోమి
అహం ద్యావా పృథివీ ఆవివేశ."

— (ఋ. 10-125-6)

తా॥ వేద ధర్మ ద్వేషులైన త్రిపురాసురులను సంహారించుటకు రుద్రునికి ధనుస్సును నిర్మించి యిచ్చినది నేనే. రామాయణములో రామ పరశురామ సంఘర్షణ ఘట్టమున "విశ్వకర్మ" రుద్ర-విష్ణులకు ధనుర్బాణములను నిర్మించి యిచ్చినాడని యున్నది. దాని కీ మంత్రమే మూలము. ఆ శివధనుస్సునే విఱిచి రాముడు సీతను పెండ్లాడినాడని గాథ. కనుక ఈ మంత్రములందు ప్రస్తుతింపబడిన జగత్కారణము "విశ్వకర్మ"యే అని స్పష్టమగుచున్నది. విశ్వసృష్టినే చేసిన దివ్యశక్తికి ధనురాదుల నిర్మాణ మొక లెక్కా ? జనులలోని ర్చెడి సంగ్రామము నా స్వరూపమే. అనగా యుద్ధ సాధనములు, యుద్ధము చేయువారు, యుద్ధము అనెడి త్రిపుటి తన స్వరూపమే అని యిచ్చట అద్వైతము. చివరి పాదములో నేను ద్యావా పృథువులలో అంతర్యామినై ప్రవేశించి జగచ్చక్రమును త్రిప్పుచున్నానన్నది. ఈమాట సాక్షాత్తు "విశ్వకర్మ సూక్తము" లోనిదే-

"యతో భూమిం జనయ న్విశ్వకర్మా
విద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః."

— (ఋ. 10-80-2)

విశ్వ విజ్ఞాని అయిన "విశ్వకర్మ" తన మహిమచే భూమిని సృష్టించి ఆ భూ-దివములలో వ్యాపించినాడు. ఈ భావమునే వాగ్దేవి "నేను ద్యావా పృథువులలో ప్రవేశించితిని" అని అన్నది (అహం ద్యావా పృథివీ ఆవివేశ). దీనిని బట్టి "వాగ్దేవీ-విశ్వకర్మ"ల పరమాద్వైత భావము సువ్యక్తమగుట లేదా. అట్టి అఖండాద్వైతమునే సర్వ సాధకులు పొందవలయునని వేదము మనలను శాసించుచున్నది.

"ద్యావా భూమీ జనయన్దేవ ఏకః", ద్యావా పృథివీ నిష్టతక్షుః", "ద్యావా పృథివీ అప్రథేతాం" ఇత్యాది మంత్రముల నరయుడు. ఇక 7వ మంత్రమును చూతము :

"అహం సువే పితర మస్య మూర్ధ
న్మమ యోని రప్స్వంత స్సముద్రే
తతో వితిష్ఠే భువనాని విశ్వా
ఉతామూం ద్యాం వర్ష్మణోప స్పృశామి"
— (ఋ. 10-125-7.)

టీక : అహం = నేను, పితరమ్ = ద్యులోకమును, ("ద్యౌః పితా, పృథివీ మాతా, సోమోభ్రాతా అదితిః స్వసా" అని మంత్రము). కావున పిత అనగా ద్యులోకమన్న మాట. అస్య=జగత్కారణము యొక్క, మూర్ధన్ = శిరస్సునన్, సువే=కన్నాను. వేదము ననుసరించి పృథివి దిగువది, ద్యులోకము (ఆకాశాది) పైది అన్నమాట. మమ = నా యొక్క, యోనిః=కారణము, సముద్రే అప్సు అంతః =

సముద్ర జలముల లోపల- నీటియందని భావము. "అపాం గర్భం వ్యదధాత్పురుత్రా" అని విశ్వకర్మ సూక్తము అన్నది. కనుక జగత్కారణము నీటి యందుంచబడినదన్న మాట. "తమి ద్గర్భం ప్రథమం దధ్ర ఆపో యత్ర దేవా స్సమగచ్ఛన్త విశ్వే" (ఋ. 10-82-6) సర్వ సృష్టికి నివాసమైన గర్భము నీటియందుంచబడినదని విశ్వకర్మ సూక్త మన్నది. ఆ భావమే "మమ యోని రప్స్వంత స్సముద్రే" అని వాగ్దేవి పలికినది. తతః = ఆ గర్భము కారణముగా, విశ్వా భువనాని = సమస్త బ్రహ్మాండములలో ప్రవేశించి, వితిష్ఠే=ఉందును. ఉత=ఇంకను, అమూం ద్యాం = ఈ భూమి మొదలు ద్యులోకము వఱకు గల సర్వమును, వర్ష్మణా = నా శరీరముచేత, అనగా నా సచ్చిదానంద స్వరూపము చేత (విశ్వకర్మ పర స్వరూపముచేత), ఉపస్పృశామి= తాకుదును, వ్యాపించియుందునని భావము.

ఉదకములు జగద్బీజమును ధరించినవన్న విషయమును మదీయ ఋగ్వేద దిగ్దర్శన ప్రథమ భాగమునందు విశేషముగా నిరూపింపబడినది. చూతురు గాక! "విశ్వకర్మ" వలన సర్వ విశ్వసృష్టి జరిగినదని విశ్వకర్మ సూక్తము చెప్పగా, ఆ "విశ్వకర్మ భావము"ను పొందిన- తత్స్వరూపమే అయిన వాగ్దేవి ఈ సృష్టియంతయు తానే అని ఈ సూక్తమున చెప్పుచున్నది. కనుక "వాగ్దేవి-విశ్వకర్మ"లకు అభేదము, అద్వైతము సిద్ధించి "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అను అర్థము సిద్ధించుచున్నది. ఇట్టి అద్వైత సిద్ధి ప్రతి పాఠ

కుడు పొందవలసియున్నాడు. ఇక 5వ మంత్రమున "వాగ్దేవి" ప్రతిజ్ఞను చూతము-

"అహ మేవ స్వయ మిదం వదామి,
జుష్టం దేవేభి రుత మానుషేభిః,
యం కామయే తం త ముగ్రం కృణోమి
తం బ్రహ్మాణం, త మృషిం, తం సుమేధామ్."
— (ఋ. 10-125-5.)

తా॥ సాక్షాత్తు "విశ్వకర్మ" స్వరూపిణినే అయిన నేనిట్లు దృఢముగా చెప్పుమాట ఇది: దేవతలలో గాని, మనుజులలో గాని ఎవరు నన్ను ఈ రీతిగా తెలిసికొని సేవింతురో, అట్టివానిని నేను, ఎవ్వరికీ తేరిచూడలేనివానినిగా చేయుగును. అంతేకాదు. అట్టి సిద్ధపురుషుని, మేధావంతునిగాను, అతీంద్రియ ద్రష్టయైన ఋషినిగాను, కడకు సృష్టికర్తయైన "బ్రహ్మ"నుగాను కూడ నేను చేయగలను. కాగా, జగత్కారణ విశ్వకర్మ తత్త్వ జ్ఞానము కలిగినవాడు సాక్షాత్తు "విశ్వకర్మ"యే కాగలడని భావము.

<u>వివరణ</u> : ఈ అంశమును వాగ్దేవి స్వయముగా అనుభవమునకు తెచ్చుకొని తాను జగత్కారణ "విశ్వకర్మ"యే అయి ఈ సూక్తము ద్వారా లోకమునకు చాటినదన్నమాట. కనుక ఋగ్వేదములో "నాసదీయ, విశ్వకర్మ, పురుష, మోక్ష" సూక్తములవలె చివరిగా వాగ్దేవీ సూక్తము కూడ అవశ్య పఠనీయమే కాక, అవగతము చేసి

కొనవలసినది, ఆచరించవలసినది అని ప్రతివారు గమనింప వలెను. ఈ వాగ్దేవీ సూక్త మంత్రముల కన్నింటికి సాయణులు జగత్కారణ బ్రహ్మపరముగానే భాష్యము వ్రాయు చుండును. కాని మంత్రముల అర్థమును బట్టి చూడగా అవి సంపూర్ణముగా "విశ్వకర్మ" పరములై యుండుట గమనింప గలము. అందుకే "అహం విశ్వకర్మాఽస్మి" అని అనవలసి వచ్చినది. వాగ్దేవీ సూక్తము వలె వామ దేవ, త్రసదస్యుల జగత్కారణానుభవములు కూడ ఈ సందర్భమున పరిశీలించి తెలియదగినవని మఱువరాదు. వామదేవుని "విశ్వకర్మ" అనుభవ మిట్లున్నది. తన్ను "విశ్వకర్మ"గా నెఱింగిన ఆత డిట్లు గానము చేయుచున్నాడు-

## 2] వామదేవుని జగత్కారణా (విశ్వకర్మా)నుభూతి :

"అహం మను రభవం, సూర్య శ్చాహం
కక్షీవా నృషి రస్మి విప్రః;
అహం కుత్స మార్జునేయ న్యృంజేఽహం
కవి రుశనా పశ్యతా మా." — (ఋ. 4-26-1)

తా॥ నేను సూర్యుడను, మనువును అయియున్నాను. కక్షీవంతుడను ఋషిని నేనే. శుక్రాచార్యుడుగా కూడ నన్నెఱుంగుడు.

వివరణ : ఇందలి సూర్యుడు, "విశ్వకర్మ" పుత్రుడని మనమితః పూర్వము చదివేయున్నాము. ఈయన పుత్రుడే మనువు లేదా "మనుశ్శివో, మయో విష్ణుః" అను స్కాంద

వచనమును బట్టి మనుబ్రహ్మ అయినను కావచ్చును. మంత్రము ముందు మనువును, పిమ్మట సూర్యుని పేర్కొన్నందున, మనువనగా 'శివుడని' చెప్పుకొనుటయే యుక్తము. మను శబ్దమునకు "మనుబ్రహ్మ" అని చెప్పికొన్నప్పుడు, సూర్య శబ్దమునకు "విశ్వజ్ఞ బ్రహ్మ" అని చెప్పుకొనుట తగియుండును. అప్పుడు "విశ్వజ్ఞ స్సూర్యఏవచ" అను శ్లోక పాదమునకు సరిపోవును. నేను 'అర్జుని' కుమారుడైన కుత్సుని సంస్కరించి బాగుచేసితిని.

"అహం భూమి మదదా మార్యా
యాహం వృష్టిం దాశుషే మర్త్యాయ,
అహ మపో అనయం వావశానా
మమ దేవాసో అనుకేత మాయన్."

— (ఋ. 4-26-2)

తా॥ నేను మనువునకు భూమి నిచ్చితిని. నేను మానవులకు వర్షముల నొసంగితిని.అనగా వానలు కురిపించునది తానే అన్నమాట. నేను నీటిని ఎల్లయెడలకు చేర్చితిని. అనగా జగద్బీజము నుంచతగిన జలములను సృష్టించెనని భావము. (అపాం గర్భం వ్యదధాత్పురుత్రా" అను విశ్వకర్మ సూక్త మంత్రములను గమనింపవలెను.) నా సంకల్పమును అనుసరించి దేవతలు ప్రవర్తింతురు. "భీషాస్మా ద్వాతః పవతే" అన్నట్లు అగ్నీంద్రాదులు ఆ ఈశ్వరునికి భయపడి పనులొనర్తురని గ్రహింపవలసియున్నది. ఇదియంతయు విశ్వకర్మ సూక్తములోని భావమే కదా! ఇక "త్రసదస్యు"ని సూక్తములను గూర్చి తెలిసికొందము.

3] త్రసదస్యుని జగత్కారణా (విశ్వకర్మా)ను భూతి :

"అహ మింద్రో వరుణ స్తే మహి
త్వోర్వీ గభీరే రజసీ సుమేకే,
త్వష్టేవ విశ్వా భువనాని విద్వాన్
త్సమైరయన్ రోదసీ ధారయం చ."

— (ఋ. 4-42-3.)

టీక : అహం = త్రసదస్యుడనైన నేను, ఇంద్రః = ఇంద్రుడనూ, వరుణః=వరుణుడనూ అయితిని. మహిత్వా = గొప్పవైన, గభీరే = గంభీరములయిన, ఉర్వీ = భూమిని, రజసీ=భూమ్యాకాశములను, సుమేకే=సుందరములైన ఆ ద్యావా పృథువులు కూడ నా స్వరూపములే. ఈ ద్యావా పృథువులు "విశ్వకర్మ" నిర్మితములు, ఆయనచేతనే వ్యాప్త ములు అని పూర్వము "విశ్వకర్మ సూక్తము"న చదివినాము. ఈ భావము విశ్వకర్మ సూక్తము లోనిదే. ఇంద్ర వరుణులు కూడ ద్వాదశాదిత్యులలోని వారే అని మన మెఱుగుదుము కదా! ఇక సృష్టికర్త అయిన 'త్వష్ట' తానే అని చెప్పు చున్నాడు త్రసదస్యుడు. విద్వాన్=సర్వజ్ఞుడను, సర్వశక్తిని అయిన నేను, త్వష్టా ఇవ = త్వష్ట్ర దేవునివలె, విశ్వా భువ నాని=ఎల్ల భువనములను (బ్రహ్మాండములను), సమైరయన్ =సృష్టించి నడుపుచుంటిని. అట్లే, రోదసీ=ద్యావా పృథువు లను, ధారయంచ=ధరించుచున్నాను. ద్యావా పృథువుల సృష్టి అనగా- బ్రహ్మాండ సృష్టియే.ఆ సృష్టిని "విశ్వకర్మ"యే

చేసినాడని విశ్వకర్మ సూక్తము పలుసారులు చెప్పియేయున్నది. ఆ భావమే "విశ్వకర్మత్వము"ను పొందిన త్రసదస్యుడును చెప్పియున్నాడు. ఇందు విశేషముగా త్వష్ట్ర దేవుని (విశ్వకర్మని) సృష్టి ప్రస్తావింపబడినది. వాగ్దేవికూడ "త్వష్టారముత పూషణం భగం" అని తాను "త్వష్ట, పూష, భగుడు అయినట్లు పలికినది కదా!

"అహ మపో అపిన్వ ముక్షమాణా,
ధారయం దివం సదన ఋతస్య."

— (ఋ. 4-42-4)

తానే జగద్బీజ నిక్షేపమునకు తగు నీటిని సృష్టించినాడనీ, ఆకసమున సూర్యుని నిలిపినాడనీ, తన లోక సృష్టిని త్రసదస్యుడు వ్యక్తీకరించినాడు. దీనినిబట్టి "విశ్వకర్మత్వము" 'వాగ్దేవి, వామదేవ, త్రసదస్యుల'కు సిద్ధించి, వారు సృష్టి రహస్యము నెఱింగి ఎట్లు అమృతులైనారో తెలియుచున్నది కదా! సమదృష్టితో చూచినపుడు విశ్వకర్మత్వము, బ్రహ్మత్వము ఒక్కటే అయినను వాగ్దేవి ప్రభృతుల మంత్రములను బట్టియు, విశ్వకర్మ సూక్తమును బట్టియు, "విశ్వకర్మత్వము" వేద మంత్రానుసారి అని తేటతెల్లమగుచున్నది.

"విశ్వకర్మ సూక్తము" జగత్కారణము యొక్క, విశ్వము యొక్క లక్షణములను చెప్పగా "వాగ్దేవి సూక్తము" దానికి లక్ష్యమై ఒప్పుచూ, సాధకుల సాధన విధాన మెట్లుండవలయునో ఉపదేశించుచున్నది. "నతం విదాథ య ఇదం జజాన" ఈ విశ్వమును సృష్టించినవానిని మీరెఱుంగరని

"విశ్వకర్మ సూక్త" మనగా, పురుష సూక్తమేమో "తమేవం విద్వా నమృత ఇహ భవతి" అతని నెఱింగిననే అమృతత్త్వము, ముక్తి అన్నది. ఇక "వాగ్దేవీ సూక్తము" ఆ జగత్కారణ సృష్టికర్తను ఎట్లెఱింగి, అనుభూతిని పొంది, ఆనందించవలయునో, అమృతత్త్వము నొందవలెనో, దృష్టాంతములతో బోధించినది. ఇదియే ఋగ్వేద పరమ రహస్యము. "అహం విశ్వకర్మాఽస్మి" భావము, స్వరూపము, తత్త్వము సిద్ధి! ఈ ఋగ్వేద సత్యతత్త్వ విచారణను బట్టి "అహం విశ్వకర్మాఽస్మి" అని అనుభూతి కలిగినవానికి "సర్వం ఖల్విదం విశ్వకర్మా" అనెడి అనుభూతి కూడ కలుగును. వాగ్దేవ్యాదులకు కలిగిన వైదిక దివ్యానుభూతి అట్టిదే అని మన మర్థము చేసికొనియుందుము.

# విశ్వకర్మోపనిషత్తు

విశ్వకర్మోపనిషత్తు సుప్రసిద్ధమైనది. ఇది వసు రుద్రాదిత్యులే గాక బ్రహ్మ, విష్ణు, రుద్రాదులు కూడ "విశ్వకర్మ" నుండియే పుట్టినారని చెప్పుచున్నది. ఈ భావము ఋగ్యజుర్వేదములలోని "విశ్వకర్మ సూక్తము"ల నుండియు, తదితర వేద వాఙ్మయము నుండియు గ్రహింపబడినట్టిదేగాని క్రొత్తదేమియు కాదు. వేద మంత్రములను అనుసరించినప్పుడే ఉపనిషత్తులకు ప్రామాణ్యసిద్ధి. అట్టి ప్రామాణికత ఈ విశ్వకర్మోపనిషత్తునకు సంపూర్ణముగా కలదు. ఇది ఇట్లుండ

గా విశ్వకర్మోపనిషత్తు స్థానమున నారాయణోపనిషత్తు అనునది ఒకటి కనబడుచున్నది. ఇది నారాయణ శబ్ద ప్రచారము జరిగినపిమ్మట వెలసినదని ఊహింపవచ్చును. ఋగ్వేదమున నారాయణ శబ్దమే అగపడదు. "విశ్వకర్మ" శబ్దము తరచుగా అగపడుటయేగాక ఆ "విశ్వకర్మ" పేరుతో రెండు సూక్తములు కూడ ప్రసిద్ధములై యున్నవి. అందుకే "మొదటి వేదమందు వెదకిన నారాయ, ణాహ్వాయంబె దొరకదతని పేర, పిదప మంత్రకాండ పెంపొందె నెంతయో, విశ్వహిత చరిత్ర వినర మిత్ర" అని వ్రాయుట అయినది. పురుష సూక్తమునకు నారాయణుడు దేవత అని అనుచుందురు. కాని ఆ పురుష సూక్తమున కూడ నారాయణ నామము కనపడనే కనపడదు. నారాయణుడు, పురుష సూక్తమునకు 'ద్రష్ట' అను విషయము కూడ ప్రమాణమనుటకు వీలులేదు. దాని ద్రష్టయు, విశ్వకర్మ సూక్త ద్రష్టయు ఒక్క 'భౌవన విశ్వకర్మ'యే అని విజ్ఞులనుచున్నారు. విశ్వకర్మ సంప్రదాయజ్ఞులు ఈ భావమునే విశ్వసింతురు. దీనికి తగినట్లు యజురారణ్యక పురుష సూక్తములో "విశ్వకర్మ" శబ్దమే కాక త్వష్టృ శబ్దము కూడ కనపడుచున్నది. "విశ్వకర్మణ స్సమ వర్తతాధి, తస్య త్వష్టా విదధద్రూప మేతి" అని వేద పాఠకు లెల్లరూ చదువుచుందురు. ఈ ప్రమాణమును ఎట్లు కాదందుము. కావున విశ్వకర్మ సూక్తములవలె, విశ్వకర్మోప

నిషత్తు కూడా సనాతనమే అని అనటకు అభ్యంతరముండ నక్కఱలేదు.

"ఓం సహనావవతు, సహనౌ భునక్తు, సహ వీర్యం కరవావహై. తేజస్వినా వధీతమస్తు మావిద్విషావహై, ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"ఓం విశ్వకర్మా దిశాంపతి స్సనః పశూన్ పాతు సోస్మాన్ పాతు తస్మైనమః. ప్రజాపతీ, రుద్రో వరుణోఽగ్ని ర్దిశాంపతి స్సనః పశూన్పాతు సోస్మాన్ పాతు తస్మై నమః.

అథ పురుషోహవై విశ్వకర్మా కామయత । ప్రజా స్సృజాయేతి. విశ్వకర్మణః ప్రాణో జాయతే। మనస్సర్వేంద్రి యాణిచ । ఖంవాయుర్జోతిరాపః । పృథివీ విశ్వస్యధారిణీ । విశ్వకర్మణో బ్రహ్మ జాయతే । విశ్వకర్మణో రుద్రో జాయతే । విశ్వకర్మణో నారాయణో జాయతే । విశ్వ కర్మణః ప్రజాపతయః ప్రజాయన్తే । విశ్వకర్మణో ద్వాదశా దిత్యా, రుద్రా, వసవ స్సర్వే దేవతాః సర్వే ఋషయః సర్వాణిఛందాగ్ంసి సర్వాణి భూతానివా సముత్పద్యన్తే।విశ్వ కర్మణి ప్రవర్థన్తే । విశ్వకర్మణి ప్రలీయన్తే । ఓం అథనిత్యో దేవ ఏకో విశ్వకర్మా । యో దేవానాం నామధా ఏక ఏవ విశ్వకర్మా । విరాడ్విశ్వకర్మా । స్వరాడ్విశ్వకర్మా । సమ్రా డిశ్వకర్మా । అథ రుద్రో విశ్వకర్మా । బ్రహ్మ విశ్వకర్మా । శివశ్చ విశ్వకర్మా । విష్ణుశ్చ విశ్వకర్మా । శక్రశ్చ విశ్వ కర్మా । ద్యావా పృథివ్యోచ విశ్వకర్మా । కాలశ్చ విశ్వ కర్మా । దిశశ్చ విశ్వకర్మా । దిగంతశ్చ విశ్వకర్మా । అగ్ని

శ్చ విశ్వకర్మా । ఊర్ధ్వశ్చ విశ్వకర్మా । అధశ్చ విశ్వకర్మా । అవాంతరశ్చ విశ్వకర్మా । అన్తర్బహిశ్చ విశ్వకర్మా । విశ్వకర్మణో నిరాకృతిః । విశ్వకర్మణ ఏ వేదగ్ం సర్వం । యద్భూతం యచ్చభవ్యం । నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో, నిరాఖ్యాత శ్శుద్ధా ద్వంద్వో విశ్వకర్మా। నద్వితీయో స్తి కశ్చిత్ । య ఏవం వేద । స విశ్వకర్మారే భవతి । స విశ్వకర్మారే భవతి । ఓం ఇత్యగ్రే వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్ । విశ్వకర్మణ ఇత్యుపరిష్టాత్ । ఓం ఇత్యేకాక్షరమ్ । నమ ఇతి ద్వే అక్షరే । విశ్వకర్మణ ఇతి పంచాక్షరాణి । ఓం విశ్వకర్మణ ఇతి షడక్షరాణి । ఓం నమో విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పదమ్ । యోహ్యైవై విశ్వకర్మణ ఇత్యష్టాక్షరం పద మధ్యేతి । అనుప్రబ్రువన్ త్సర్వమాయురేతి । విందతే ప్రాజాపత్యం । రాయస్పోషం గౌపత్యం । తతో౽మృతత్త్వ మశ్నుతే, తతో మృతత్త్వ మశ్నుత ఇతి । య ఏవం వేద । ప్రత్యగానందం బ్రహ్మ పురుషం ప్రణవ స్వరూపమ్ । అకార, ఉకారో, మకార ఇతి । తానేకధా సమభరత్తదే తదోమితి । యముక్త్వా ముచ్యతే యోగీ జన్మ సంసార భంధనాత్ । ఓం నమో విశ్వకర్మణ ఇతి మంత్రోపాసకః । సాయుజ్యం గమిష్యతి । తదిదం పరం పుండరీకం విజ్ఞానఘనమ్ । తస్మాత్తదు తావన్మాత్రమ్ । బ్రహ్మణ్యో విశ్వకర్మోమ్ । సర్వ భూతస్థమేకం విశ్వకర్మాణం । కారణరూప మకార పర విశ్వబ్రహ్మోమ్ । పదం విష్ణ్వాఖ్యమితి తేపి విశ్వకర్మణోపనిషదమ్ । యో

హ నై విశ్వకర్మణోఽపనిషదమధీతే । స సర్వేభ్యః పాపేభ్యో విముక్తో భవతి । స సర్వేభ్యో విముక్తస్సర్వాన్ కామా నవాప్నోతి - బ్రహ్మత్వంచ గచ్ఛతి । ఇత్యుపనిషత్ ।

ఓం సహనావవతు । సహనౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నావధీత మస్తు మావిద్విషావహై । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః।"

తా : దిక్కులతో గూడిన ప్రపంచమునకు అధిపతి యైన "విశ్వకర్మ భగవానుడు" మా పశువులు మొదలగు సంపదను, మమ్ములను కాపాడుగాక. ఆ దేవదేవునకు నమస్కారము. ప్రజాపతియు, రుద్రుడును, వరుణుడును, అగ్నియు అయిన ఆ దేవదేవుడు మా పశువులను, మమ్మును కాపాడుగాక! ఆయనకు నమస్కారము. సర్వజీవుల యొక్క హృదయము లనెడు పురములలో నివసించెడి పురుషుడైన విశ్వకర్మ "నేను అనేకమగుదును, ప్రజలను సృజింతును" అని సంకల్పించుకొనెను. ఆ సంకల్పమునకు పిమ్మట ఆ "విశ్వకర్మ" నుండి ప్రాణము, మనస్సు, జ్ఞానకర్మేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, విశ్వమును భరించెడి భూమి అనెడి ప్రకృతి ద్రవ్యములు జన్మించినవి. పిమ్మట "విశ్వకర్మ" నుండి బ్రహ్మ, రుద్రుడు, విష్ణువు, ప్రజాపతులు కలిగినారు. ఇంకను ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, అష్ట వసువులు, తక్కిన దేవతలందరూ సానగ, సనాతనాది పంచ ఋషులు, వశిష్ఠాది సప్త ఋషులు, ఇంకా తక్కిన ఋషులు కలిగిరి. సమస్తమైన ఛందస్సులు,

భూతములు కూడ ఆయన నుండియే పుట్టినవి. ఈ విశ్వమంతయు ఆయనయందే పెరుగుచున్నది. కడకు ఆయనలోనే లీనమగుచున్నది. ఏ "విశ్వకర్మ" సర్వదేవతల యొక్క నామ రూపములను దాల్చి ఆ యా పనులు చేయుచున్నాడో అట్టి నిత్యుడగు "విశ్వకర్మ దేవుడు" ఒక్కడే. ఆతడే విరాట్ పురుషుడు. ఆ విశ్వకర్మయే స్వరాట్టు. (స్వయముగా ప్రకాశించువాడు). సమ్రాట్టు కూడ ఆతడే. ఇంకను రుద్రుడు విశ్వకర్మయే. బ్రహ్మ విశ్వకర్మయే. శివుడు కూడ విశ్వకర్మయే. విష్ణువు సైతము విశ్వకర్మయే. ఇంద్రుడును విశ్వకర్మయే. భూమియు, పైనున్న ద్యులోకమును విశ్వకర్మ స్వరూపమే. కాలము విశ్వకర్మయే. దిక్కులు, దిగంతములు, అగ్ని, ఊర్ధ్వము, దిగువ, వీటి మధ్యప్రదేశము, లోపల, వెలుపల అంతయు విశ్వకర్మయే. ఇట్టి విశ్వస్వరూపుడైన ఆ విశ్వకర్మ భగవానుడు (సమాధి దశలో) నిరాకారుడే. ఆ నిరాకారుని నుండియే ఈ సాకారమంతయు తోచుచున్నది. గడచినది గాని, గడచుచున్నది గాని, రాబోవునదిగాని అంతయు విశ్వకర్మ స్వరూపమే. ఆ విశ్వకర్మ ఏ కళంకము లేనివాడు. ఏ వికల్పములు లేనివాడు. ఒక పేరుతో చెప్ప వీలుకానివాడు (అనగా అన్ని పేర్లు ఆయనవే అన్నమాట). ఆయన పరిశుద్ధుడు. తనకంటె వేరైన రెండవ వస్తువు లేనివాడు. ఏదేని భిన్నముగా తోచినను అది ఆయన స్వరూపమే అని మనము అర్థము చేసికొనవలయునన్నమాట. అందుకే ఆయన ఏకైక పరమాత్మ. రెండవ వస్తువు లేనివాడు. ఏ

సాధకుడు విశ్వకర్మ తత్త్వమును ఈ విధముగా అర్థము చేసి కొనునో ఆ సాధకుడు "సాక్షాద్విశ్వకర్మ స్వరూపుడే" అగును. ఆతనికి విశ్వకర్మాద్వైత సిద్ధి కలిగినదన్న మాట. ఇట్టి విశ్వకర్మ తత్త్వమును పొందుటకు ఓంకారముతో కూడిన విశ్వకర్మాష్టాక్షరిని జపింపవలయును. ప్రథమాక్షరము 'ఓం' అనునది. 'నమః' అనునది చివరిది. 'విశ్వకర్మణే' అనునది మధ్యభాగము. మొత్తము 'ఓం నమో విశ్వకర్మణే' అని 8 అక్షరములు గల మంత్రమగుచున్నది. ఎవరీ విశ్వకర్మాష్టాక్షరిని జపింతురో వారు సర్వసిద్ధులను, ఆయుస్సును పొందుదురు. ఆతనికి జనవశీకరణము చేకూరును. ధనహీనత ఉండదు. గోసంపదకు అధికారి కాగలడు. ఈ ప్రపంచ సుఖములను అనుభవించిన పిమ్మట పురుషసూక్తము చెప్పిన అమృతత్త్వమును ఆతడు పొందగలడు.

ప్రణము (ఓం)లో అకార, ఉకార, మకారము లనెడి మూడక్షరములు కలవు. ఆ మూడిటినీ కలిపి ఉచ్చరించినచో "ఓం" అగును. ప్రణవ జపము చేత యోగి అయినవాడు సంసారబంధము నుండి విముక్తుడు కాగలడు. "ఓం నమో విశ్వకర్మణే" అను మంత్రమును ఉపాసించు (జపించు)వాడు విశ్వకర్మ సాయుజ్యము నొంది తరించును. సర్వభూతములయందు గల ఏకైక విశ్వకర్మ తత్త్వమును, కారణరూపమైన దానిని విశ్వబ్రహ్మమునుగా తెలియవలయును. దానినే విష్ణుపదమని కూడ అందురు. ఇదియే విశ్వకర్మోపనిషత్తు. ఈ విశ్వకర్మోపనిషత్తును పఠించినవాడు అన్ని పాపముల నుండి

విముక్తుడై, సమస్త వాంఛలను పొంది బ్రహ్మత్వము నంద గలడు.

ఈ ఉపనిషత్తు నందు ఉపదేశింపబడిన విశ్వకర్మాష్టా క్షరి యజుర్వేదమున "ఓం నమో విశ్వకర్మణే స ఉపాత్వ స్మాన్" అనెడి రూపమున ఉన్నది. దానినే ఉపనిషత్తు ఇందు అనువదించినది. ఇంతవరకు మనము ఏ విశ్వకర్మ సూక్త, పురుష సూక్తాది ప్రమాణముల ద్వారా సర్వమూ విశ్వకర్మ నుండియే కలిగినదని చెప్పికొన్నామో ఆ విషయమునే ఈ విశ్వకర్మోపనిషత్తు ప్రవచించుట గమనింపదగియున్నది. ఇందలి సర్వార్థము పురుష, విశ్వకర్మ సూక్తములోనిదే. పురుషుడనగా విశ్వకర్మయే అనుటకు "ఏష దేవో విశ్వ కర్మా" అనెడి శ్వేతాశ్వతర మంత్రమే నిదర్శనము. అందుకే ఈ ఉపనిషత్తు "అథపురుషోహవై విశ్వకర్మా కామ యత" అని ప్రారంభమగుచున్నది.

నారాయణోపనిషత్తు కూడ ఈ విధముగానే ఉండును. విశ్వకర్మ స్థానమున నారాయణుని నిల్పి, ఆ నారాయణోప నిషత్తు కొనసాగినదనుట వేద పరిశీలకులకు తెలిసిన విష యమే. అంతమాత్రముచేత గ్రంథకర్తకు గాని, విశ్వకర్మ భక్తులకు గాని నారాయణ పదముమీద భిన్నభావము లేదని గ్రహింతురుగాక. సాయణాచార్యుల వంటి భాష్యకర్తయే "విశ్వకర్మ-నారాయణుల"కు అభేదమును పాటించినాడని మేము దృష్టాంతములను ఇచ్చుచునేయున్నాము కదా! మా ఈ సదభిప్రాయమును ఋగ్వేద దిగ్దర్శనాది గ్రంథములలోని

విష్ణు మంత్ర వ్యాఖ్యానావసరమున పాఠకులు గమనించియే యుందురు. అంతియేగాక విష్ణు మంత్రములలో కుండలినీ యోగము కలదని నిరూపించిన మాకు విష్ణుదేవుని యెడ భిన్నాభిప్రాయము గాని, చిన్నచూపుగాని ఉండుటకు వీలు లేదని గ్రహింతురు గాక.

విశ్వకర్మ నుండి ఆ యా దేవతలు పుట్టినారను విషయమును "వైశ్వకర్మణ శిల్పసారము" అను గ్రంథము ఇట్లు పేర్కొన్నది :-

"విశ్వకర్మా పరం బ్రహ్మా, విశ్వకర్మా జగద్భరః,
విశ్వకర్మా పరంజ్యోతి, ర్విశ్వకర్మా మునీశ్వరః.
స్థపతి ర్విశ్వకర్మావై, విశ్వకర్మా మనుశ్శివః,
విశ్వకర్మా మహావిష్ణుః, విశ్వకర్మా ప్రజాపతిః.
విశ్వకర్మైవ సూర్యః స్యాద్విశ్వకర్మైవ శిల్పికః,
దేవాచార్యో విశ్వకర్మా, విశ్వకర్మైవ దేశికః.
యజ్ఞాకారో విశ్వకర్మా, విశ్వకర్మా విచక్షణః,
సురశ్రేష్ఠో విశ్వకర్మా, విశ్వకర్మా జగద్గురుః.
విశ్వకర్మా జగన్నాథో, విశ్వకర్మైవ కశ్యపః,
విశ్వజ్ఞో విశ్వకర్మాచ, విశ్వనిర్మాణ బంధురః.
పంచభూత మహాదేవః, సర్వభూత దయాపరః,
దేవదేవ, మహాదేవ, విశ్వకర్మ న్నమోఽస్తుతే."

# వేదారంభములు

యజ్ఞములందలి హావిస్సులను (అనగా హోమము చేయు వస్తువులను) దేవతల కందించువాడు 'అగ్నిదేవుడ'ని వేద సిద్ధాంతము. కావుననే ఋగ్వేదము అగ్నిదేవుని స్తోత్రముతో ప్రారంభమగుచున్నది.

1] <u>ఋగ్వేద ప్రారంభ మంత్రము :</u>

"అగ్ని మీాళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్నధాతమమ్."

ఇందలి అగ్ని పంచభూతములలోని అగ్నియేకాక 'పరమాత్మ స్వరూపుడైన అగ్ని' అని ఈ మంత్రము లోని అగ్ని విశేషణములు పేర్కొనుచున్నవి. ఇందు 'పురోహితమ్' అను పదము కలదు. ఈ పురోహిత పదము సర్వుల యొక్క మేలు కోరువాడని అర్థమిచ్చును. ఈ పదమే పురుష సూక్తములో "విశ్వకర్మ"కు కూడ వాడబడినది. ఆ మంత్రమును చూడుడు. "యో దేవేభ్య ఆతపతి, యో దేవానాం పురోహితః". ఇందు "విశ్వకర్మ"కు వాడబడిన పురోహిత శబ్దము ఋగ్వేద ప్రథమ మంత్రములో అగ్నికి కూడ వాడబడినందున "అగ్ని-విశ్వకర్మ"లకు గల శబ్ద, అర్థ, భావ, సాదృశ్యము వెల్లడి యగుచున్నది కదా! "యజ్ఞస్య దేవం"

అనుటచేత యజ్ఞాధిపతి 'అగ్ని' అని, యజ్ఞస్వరూపుడు కూడ 'అగ్ని' అని తెల్పుచున్నది. భగవంతుడు కూడ యజ్ఞ స్వరూపుడే కదా! ఇంకొకమాట 'ఋత్విజం' అనునది. 'ఋత్విక్' అనగా యజ్ఞ తంత్రమును నడుపు యాజకుడని అర్థము. మఱొకమాట 'హోతారం' అనునది. 'హోత' అనగా యజ్ఞము చేయు యజమానుడు లేక యజ్ఞకర్త అని భావము. ఈ 'హోతృ' శబ్దమే విశ్వకర్మ సూక్తారంభమున "య ఇమా విశ్వా భువనాని జుహ్వ దృషి ర్హోతా" అను వాక్యమున "విశ్వకర్మ"కు విశేషణముగా ప్రయోగింపబడి నది. జగత్తుల యొక్క సృష్టి, స్థిత్యాది కర్మలనెడి యజ్ఞము లకు విశ్వకర్మ 'హోత' అని అక్కడ భావము. ఈ భావమే ఋగ్వేదారంభమున అగ్నికి విశేషణముగ హోతృ శబ్దము వాడబడి ఈ అగ్ని "విశ్వకర్మ స్వరూపు"డే అని స్పష్టము చేయబడినది. ఇట్టి సాదృశ్యముల చేత "అగ్ని-విశ్వకర్మ"లు ఏకరూపులే అయి విశ్వసృష్టి యజ్ఞమును నిర్వహించుచున్నా రని స్పష్టమగుచున్నది. అగ్నికి గల భౌతిక, దైవిక అర్థములు మనమందరకు తెలిసినట్టిదే. అగ్నిని నిత్యకృత్యములకు వాడుచుందుము. దేవునిగా ఆరాధించుచుందుము కూడ. కాగా ఋగ్వేదము ఈ 'అగ్ని' పరమాత్మ స్వరూపుడని కూడ ఇత్యాది మంత్రముల చేత విశదము చేయుచున్నది. ఋగ్వే దారంభము అగ్ని సూక్తముతో ప్రారంభమగుటయే కాక తక్కిన 9 మండలముల యొక్క ఆరంభములు కూడ అగ్ని సూక్తములతోనే ప్రారంభమగుట గమనింపవలసియున్నది.

ఋగ్వేదము వలెనే, సామవేదము కూడ అగ్ని సూక్తముతోనే ప్రారంభమగుచున్నది.

2] సామవేద ప్రారంభ మంత్రము :

"అగ్న ఆయాహి వీతయే గృణానో హవ్యదాతయే
నిహోతా సత్సి బర్హిషి" — 1

జీవులను ముందుకు నడిపించెడి అనగా అభ్యుదయము నకు కొంపోయెడి ఓ అగ్ని దేవా! మా హృదయ ప్రదేశము లకు విచ్చేయుము. ఈ మంత్రము నందు కూడ ఋగ్వేద మంత్రమునందు వలె 'హోతా' అనుమాట ఉండుట గమ నింపవలసియున్నది. ఇక 2వ మంత్రము కూడ చూతము.

"త్వ మగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితః
దేవేభి ర్మానుషే జనే". — 2

ఇందు అగ్ని దేవుడు యజ్ఞములకు హోత యనియు, విశ్వములకు హితుడనియు, దేవమానవ ప్రియుడనియు పేర్కొనబడుట గమనింపతగినది. ఇక కృష్ణ యజుర్వేదము యొక్క ప్రారంభ మెట్లైనదో చూతము.

3] కృష్ణ యజుర్వేద ప్రారంభ మంత్రము :

"ఓమ్ ఇషే త్వోర్జే త్వా వాయవస్థా పాయవస్థ దేవో వ స్సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణే".

దేవుడైన సవిత మమ్ము శ్రేష్ఠమైన కర్మలు (మంచి పనులు) చేయుటకు ప్రేరేపించుగాక. అనగా భగ వంతుడైన 'సవిత' మాచేత ఎల్లపుడు మంచి పనులనే

చేయించుగాక అని భావము. యజుర్వేదము కర్మకాండ ప్రధానము కావున, దీని ప్రారంభము ఇట్టి మంత్రముతో జరుగుట ఉచితముగా నున్నది. ఇందలి 'సవిత' సాక్షాత్ "విశ్వకర్మ"యే అని మా వేద దర్శనములందు మేము నిరూపించియే యున్నాము. గాయత్రీ మంత్రార్థ సందర్భమున దీనిని పాఠకులు గమనింపవచ్చును. కృష్ణ యజుర్వేదము వలెనే, శుక్ల యజుర్వేద ప్రారంభము కూడ "ఇషే త్వోర్జే త్వా" అనెడి మంత్రము చేతనే అగుచున్నది. ఇఁకఁ అథర్వవేద ప్రారంభమును చూతము.

4] <u>అథర్వ వేద ప్రారంభ మంత్రము</u> :

"యే త్రి షప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః
వాచస్పతి ర్బలా తేషాం తన్వో అద్య దధాతు మే".

ఈ సూక్తమునకు దేవత వాచస్పతి. వాచస్పతి అనగా "విశ్వకర్మ" అని, "వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే" అనెడి విశ్వకర్మ సూక్తములో మనము చదివియే ఉన్నాము. ఈసూక్తమునకు "మేధా జనన" సూక్తమని పేరు. అనగా మనయొక్క మేధాశక్తి అనగా బుద్ధి వృద్ధి యగుటకు ఈ సూక్తమును పఠింతురని ఎఱుఁగవలయును. విశ్వరూపధారులై ఏ 3, 7 పదార్థములు విశ్వమంతటా వ్యాపించి యున్నవో వాటియొక్క సమస్త బలమూ- ఓ వాచస్పతీ! నాకు సమకూర్చుము అని దీని భావము. ఇందలి 3, 7 పదములకు కుండలినీ యోగ పరముగా 3 కమలములు, సప్త చక్రములు అని అథర్వవేద దర్శనమున మేము అర్థము వ్రాసి

యున్నాము. 21కి కూడ భౌతిక, ఆధ్యాత్మికమయిన అర్థములు కలవు. ఈ విధముగా అథర్వ వేదము వాచస్పతి (విశ్వకర్మ) సూక్తముతో ప్రారంభమై అనేక యోగాది విశేషములను చర్చించుచూ కొనసాగుట గమనింపవలసియున్నది. దీనినిబట్టి సూక్ష్మముగా ఆలోచించినచో నాలుగు వేదములు "విశ్వకర్మ" స్ఫురణను కలిగించు పదములు గల మంత్రములతో ఆరంభమగుట గమనింపతగియున్నది.

అగ్నికి, విశ్వకర్మకు గల సంబంధము మా గ్రంథములు చెప్పుచునే యున్నవి. ఆ విశ్వకర్మయే 'సవితృ' నామముతో యజుర్వేద ప్రారంభమున సత్కర్మ ప్రేరకుడుగా పేర్కొనబడి మనకు పొడ కట్టినాడు. "దేవ స్త్వష్టా సవితా విశ్వరూపః" (ఋ. 3-55-19) అనేది త్వష్ట మంత్రములో సవితృ పదమున్నది. ఈ విధముగా వేద ప్రారంభములేమి, వేదముల అంతములేమి, వేద మధ్యములేమి, "విశ్వకర్మ" మయములై కొనసాగుట మనము గమనింపవలసియున్నది. పాఠకులు భిన్న భిన్న దేవతా వాచకములు ప్రయోగింపబడుటచేత భ్రాంతిపడుదురేమో యని, వారి భ్రాంతిని నివారించుటకు విశ్వకర్మ విశ్వరూపమును, తద్రహస్యమును తెల్పుటకే విశ్వకర్మ సూక్తములో "యో దేవానాం నామధా ఏక ఏక" అనెడి మాట ప్రయోగించబడినది. ఇందుకు తగినట్లుగానే మోక్ష సూక్తములోని "ఏకం స ద్విప్రా బహుధా వద న్తి" అనెడి వాక్యము కూడ నానా దేవతలు ఒకే తత్త్వము యొక్క భిన్నభిన్న రూపములని విస్పష్టముగా చాటినది.

# ఈశ్వర (విశ్వకర్మ)
# స్తోత్ర, పూజా, జప, ధ్యానాదులు

ఇంతవరకును చదివిన గ్రంథముచేత జగత్కారణుడైన భగవంతుడొకడున్నాడనియు, ఆయన "విశ్వకర్మా"ది బహు నామములచేత వేదములందు పేర్కొనబడిననూ, "విశ్వకర్మ" నామముతో ఆయనను పిలుచుట వేదమునకు ఎక్కువగా ఇష్టమనియు గ్రహించియున్నాము. అట్టి పరమేశ్వరుని సాకార, నిరాకార రూపములను స్తుతించుట, పూజించుట (అర్చించుట), ఆయన నామమును, రూపమును ధ్యానించుట, ఆయనను సమాధి దశయందు సందర్శించుట మొదలగు క్రియలు ఆచరించిననేగాని, జీవులు దుష్కర్మలను వదలిపెట్టి సత్కార్యములకు అలవాటుపడి ఈశ్వరానందము నొంది సంసార ముక్తులు కారని శాస్త్రములును, మహాత్ముల అనుభవములును మనకు చాటుచున్నవి. ఈ అంశములు వేదాదులయందు ఎట్లు సూచితములైనవో వివరింపబడినవో ఈ ప్రకరణమున తెలిసికొందము.

## 1] ఈశ్వర (విశ్వకర్మ) స్తోత్రము :

ప్రపంచ వాఙ్మయము నందెల్ల మొదటిదిగా పేర్కొనబడుచున్న ఋగ్వేదములోని మొదటి సూక్తము అగ్నిదేవునికి సంబంధించినది. ఆ సూక్తములో మొట్టమొదటి మంత్రము ఇట్లు ప్రారంభమగుచున్నది.

"అగ్ని మీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతమమ్".

తా॥ పురోహితుడును, యజ్ఞమును నిర్వహించు దేవుడును, ఆ యజ్ఞమును నడుపు ఋత్విక్కును, ఆ యజ్ఞమును చేయు యజమానుడును, శ్రేష్ఠ వస్తువులను సృష్టించు వాడును అగు అగ్ని దేవుని, (ఈళే=) స్తుతించుచున్నాను. ఇందు పేర్కొనబడిన అగ్ని యజ్ఞస్వరూపుడైన దేవుడు. ఆ యజ్ఞమును నిర్వహించు అధ్వర్యుడు (సాధనము), ఆ యజ్ఞమును చేసి ఫలమును పొందెడి యజమానుడును, అంతయు "అగ్ని"యే అని మంత్రము చెప్పుచున్నది. ఇట్లు చెప్పుటచేత ఈ అగ్ని పంచభూతముల లోని అగ్నియేకాక "పరమాత్మ స్వరూప అగ్ని"యని తెలుచున్నది. కాగా సాధ్యము, సాధనము, సాధకుడు అనెడి త్రిపుటి (3) ఒకే అగ్నియై అద్వైత సిద్ధాంతము సూచితమగుటయేగాక ఆలోచించినచో అద్వైత సిద్ధాంతము ప్రకటమగుచున్నది. అట్టి అగ్నిని, ఆయన తత్త్వమును, ఈ పై మంత్రమున వేద పాఠకుడు స్తోత్రము చేయుచున్నాడు. దీనినిబట్టి ఋగ్వేదారంభమే స్తోత్రముతో ప్రారంభమైనట్లు తెలియుచున్నది. తక్కిన అగ్ని విశేషణ శబ్దములు, ఆ అగ్ని యొక్క తత్త్వమును చెప్పుచూ స్తోత్ర రూపమునకు శరీర మగుచున్నవి. కనుక ఏ దేవునైనను, ఎవ్వరినైనను, వారి స్వరూప స్వభావ క్రియలను కీర్తించుచు, మనము ఉచ్చరించెడి వాక్యములకు

'స్తోత్రమ'ని పేరు- అని ఈ మంత్రమును బట్టి మనకు తెలియుచున్నది. ఈ స్తోత్రము నమస్కారాది రూపమై ఉండునని ఇంకొక అగ్ని స్తుతి మంత్రమే పలుకుచున్నది. అగ్నే నయ సుపథా రాయే ... నమ ఉక్తిం విధేమ. — 1-189-1. (చూడుము- 14వ పుట.)

ఈ మంత్రమున (1-189-1) స్తుతింపబడిన అగ్ని సాక్షాత్ పరమేశ్వరుడే అని వేఱుగా చెప్పనక్కరలేదు. ఇది పైకి చూచినప్పుడు దైవ స్తోత్రముగానే కన్పట్టును. ఆ స్తోత్రములో చేసెడి అభ్యర్థనతోపాటు నమస్కారము కూడ ఒక భాగమే అని "నమ ఉక్తిం విధేమ" అనెడి వాక్యము చెప్పుచున్నది. ఆ నమస్కారమును "భూయిష్ఠాం" అనుటచేత అది ఏ లోపములు లేని పరిపూర్ణ నమస్కారము కావలయునని తెలియుచున్నది. కనుక భగవానుని స్తోత్రములో భగవన్మహిమను వర్ణించుట తనకు కావలసిన దానిని చెప్పుట అందుకై నమస్కారాదు లర్పించుట అంగములని తెలియుచున్నది. కనుక స్తోత్రమనెడి దానిలో ఇన్ని విశేషములున్నవని ఋగ్వేదపు మొదటి మంత్రమును, అట్టి పెక్కు మంత్రములును చెప్పుచున్నవి. "త్రియంబకం యజామహే" (త్రియంబకుని పూజింతుముగాక) అనెడి వాక్యముకూడ పై తరగతికి చెందినట్టిదే. "తత్స వితుర్వ రేణ్యం, భర్గో దేవస్య ధీమహి" అనెడి గాయత్రీ మంత్రము కూడ ఈ తరగతికి చెందినట్టిదే. యజుర్వేదములోని శత రుద్రీయ మంతయు (నమకము) ఇట్టి నమస్కారములతో కూడిన రుద్రస్తోత్రమే.

"నమశ్శివాయ చ రుద్రాయ చ నమో భవాయ ... "
ఇత్యాదులన్నియు నమస్కారముతో కూడిన రుద్ర స్తోత్రములే. విస్తరమైన నమకమంతయు రుద్ర స్తోత్రము కాగ, చమకమనునది మనకు ప్రకృతిలో ఏ ఏ వస్తువులు కావలయునో వాటి వాటి ఆవశ్యకమును తెలుపుచున్నది. కనుకనే తైత్తిరీయ సంహితలో "విశ్వకర్మ సూక్తము"ల తరువాతి స్థానమును ఈ నమక చమకములు పొందుచున్నవని గ్రహింపవలయును. మనము అష్టకములతోను, అష్టోత్తరశత త్రిశతి, సహస్ర, నామములతోను చేసెడి స్తోత్రములన్నియు ఇట్టి స్తుతుల క్రిందికే రాగలవు. ఈ దైవ స్తోత్రముల స్వరూపము వేదముల తరువాత పురాణ, స్తోత్రాది పలు గ్రంథములలో కాంచగలుగుదుము. ఆదిశంకరులు నానా దేవతల (స్త్రీ, పురుష, నదీ ప్రభృతుల) స్తోత్రములను- అష్టకములుగాను, దశకములుగాను, పంచకములుగాను పలు విధములుగా వ్రాసి, భక్తులకు ఉపకారముచేసియున్నారు.

## 2] ఈశ్వర (విశ్వకర్మ) పూజ :

భగవంతునికి ఒక ఆకారమును కల్పించి ఆ విగ్రహాము నకు షోడశోపచారాదులతో చేసెడిదే 'పూజ' అనబడును. ఈ పూజలో గంధ పుష్పాక్షతాదులు, కొబ్బరికాయ, బెల్లము అభిషేకార్థమైన పాలు, పెరుగు, నీళ్ళు, మహానివేద నాదులు అవసరములని అందరూ ఎఱింగిన విషయమే. ఇది

బాహ్యమైన పూజ. దీనిని విగ్రహారాధన అనియు అను చుందురు. అర్చా మూర్తులకు ఇట్టి పూజా పురస్కారములు జరుపబడుచుండును.

## 3] ఈశ్వర (విశ్వకర్మ) జపము :

జపమనగానే ఒక మంత్రమును తీసికొని దానిని ధ్వని వచ్చునట్లు గాని, లేక మునినాలుక కదలునట్లు గాని లేక మానసికముగా కాని చేయునట్టిదని అందఱకు తెలిసిన విష యమే. ఈ జపములో ఒక దేవతయు, ఆ దేవతకు సంబం ధించిన ఒక మంత్రమును ఉండితీరవలయును. ఆ దేవతా స్వరూపమును ఉచ్చరించెడి ఒక ధ్యాన శ్లోకము కూడ ఇందు ముఖ్యమే. గాయత్రీ ధ్యాన శ్లోకము, గాయత్రీ మంత్రము మనకు తెలిసినట్టివే. ఇంకను "నమశ్శివాయ" అనునది శివ మంత్రమనియు, "ఓం నమో విశ్వకర్మణే" అనునది విశ్వకర్మ మంత్రమనియు "ఓం నమో నారాయ ణాయ" అనునది విష్ణు మంత్రమనియు కూడ ఆ యా మంత్రోపాసకులు ఎఱుంగుదురు. వీటిలో "ఓం నమో విశ్వ కర్మణే" అనునదియు, "నమశ్శివాయ" అనునదియు, యజు ర్వేదము నందు మనకు అగపడును. నారాయణ మంత్ర మే మో నారాయణ మనెడి ఆరణ్యక భాగమున వినపడును. ఇంకను అనేకములైన మంత్రములు అనేక దేవతలను గూర్చి ప్రసిద్ధములై యున్నవి. కొన్ని మంత్రములు (శ్రీవిద్యలో) బీజాక్షర సహితములై కూడ ఉన్నవి. ఇంత ఏల? మనకు

"మంత్ర మహోదధి" (మంత్రములకు సముద్రము) అని ఒక గ్రంథమే కలదు. అందు వందల సంఖ్యలో మంత్రము లుండును. వాటివలన మానవులకు ఆ యా కోరికలు తీర గలవని చెప్పుచుందురు. మంత్ర జపమనగా ఒక దేవుని యొక్క నామమును జపించుట అని తేలిన సారాంశము. జగత్కర్త అయిన ఈశ్వరునికి (విశ్వకర్మకు) 'ఓంకారమే' (ప్రణవమే) నామధేయమని వేదములేకాక, పతంజలి మహర్షియు "తస్య వాచకః ప్రణవః" అని తన యోగ శాస్త్రములో చెప్పియున్నాడు. ఆ ప్రణవమును జపించి దాని అర్థమును భావించి జీర్ణింపచేసికొనవలెననియూ ఆ మహ ర్షియే తరువాతి సూత్రములో "తజ్జపః, తదర్థ భావనా" అని చెప్పియున్నాడు. కనుక ప్రణవము కాని ప్రణవముతో కూడిన ఏ మంత్రమును గాని దాని అర్థమును భావించుచు, జపించిననే ఫలమునిచ్చును గాని కేవలము పెదవులపై అక్ష రములను దొరలించిన చాలదని జపము చేయువారు గ్రహింపవలసి యున్నది. అర్థభావన చేయుటకు మనోబుద్ధుల యొక్క ఏకాగ్రత, నిర్మలత్వము అత్యవసరములని జపము చేయువారు మఱువకూడదు.

## 4] ఈశ్వర (విశ్వకర్మ) ధ్యానాదులు :

ధ్యానమనునది "విశ్వకర్మ భగవాను"నికి మిక్కిలి ఇష్టమని దిగువ నుదాహరించెడి సంప్రదాయ శ్లోకము చెప్పు చున్నది.

"ధ్యాన ప్రియో విశ్వకర్మా, జలధారా ప్రియశ్శివః,
అలంకార ప్రియో విష్ణుః, నమస్కార ప్రియో రవిః."

అనగా "విశ్వకర్మ"కు ధ్యాన సమాధులనిన ఇష్టము. శివునికి జలాభిషేకమన్న ఆసక్తి. అందుకే మనము రుద్రాభిషేకములు చేయుచుందుము. విష్ణుదేవునికి బాహ్యాలంకారములన్న ప్రీతి. ఇక సూర్య భగవానునికేమో నమస్కారమన్న ఇష్టమట. అందుకే ఉదయించు సూర్యునికి మనము నమస్కారములు చేసి ఆయన అనుగ్రహమును సంపాదించుచుందుము. ఈ శ్లోకము ఇటీవలి కాలమున ఇట్లు ప్రచారమగుచున్నది :

"అలంకార ప్రియో విష్ణుః, జలధారా ప్రియ శ్శివః,
నమస్కార ప్రియో భానుః, బ్రాహ్మణో భోజన ప్రియః"

"విశ్వకర్మ" స్థానము భోజన ప్రియుడైన బ్రాహ్మణునికీయబడినదన్న మాట.

అష్టాంగ యోగములో 1) యమము 2) నియమము 3) ఆసనము 4) ప్రాణాయామము 5) ప్రత్యాహారము 6) ధారణ 7) ధ్యానము 8) సమాధి అని ఎనిమిది భాగములు కలవు. వీటిలో 7వది 'ధ్యానమన్న' మాట. ధ్యానమనగా ఒక దేవుని యొక్క బాహ్యాంత స్వరూపములను గూర్చి చింతించుట లేక భావన చేయుట అన్నమాట. పూజ, అర్చనాదులు మన ఇంద్రియములతోను, వాక్కుతోను, చేతులతోను చేసెడి కార్యములు. ధ్యానమనునది పరమాత్మ స్వరూపమును, మనో బుద్ధులను ఏకాగ్రపరచి చేసెడి చింత

నము లేక మననము. ఇది సాకార ధ్యానమనియు, నిరాకార ధ్యానమనియు రెండు విధములుగ నుండును. సాకార ధ్యానములో భక్తునికి ఇష్టమైన దేవత యొక్క స్వరూపమును మనో నేత్రమునకు అగపడునట్లు ధ్యానింపవలయును. నిరాకార ధ్యానములో నిష్కళుడు, అశరీరుడు అయిన భగవంతుని యొక్క అనగా పరమాత్మ యొక్క సచ్చిదానంద స్వరూపములను ధ్యానించుట జరుగును. అప్పుడు శుద్ధ చైతన్యము మాత్రమే మనస్సునకు లక్ష్యమగును. అనగా విషయమగు నన్నమాట. అప్పుడు మన మనస్సు ఇతర చింతనలు లేక సచ్చిదానందము నందు లీనమై ఉండును. ఆ సమయమున ఇది మనస్సు, ఇది ధ్యేయ వస్తువు, ఈ జరిగెడి క్రియ ధ్యానము అనెడి త్రిపుటి యొక్క పరిజ్ఞానము ఉండును. ఈ త్రిపుటి యొక్క పరిజ్ఞానము తొలగి అఖండమైన పరమాత్మ స్వరూపమే తానుగా నిలిచినచో దానిని 'సమాధి' అందురు. ఇట్టి సమాధిలో ఆహార పానీయముల యొక్కగాని, గాలి, వెలుతురులయొక్క గాని అవసరము లేశమాత్రమైనను లేకుండ ఏండ్ల తరబడి పరమ సమాధి మగ్నమైయున్న తల్లి మన రాజుపాలెం బాలయోగిని "నాగ శేషమాంబ"గారు చెప్పతగినది. పూజింపతగినది. స్మరింప తగినది కూడ. ఈ తల్లి వర్తమాన కాలమునకు చెందినదై మనందరిచేత చూడబడి, మన మనోరథములను పండించి, ఇటీవలనే సజీవ జీవములతో శాశ్వత సమాధిలో ప్రవేశించినది. అట్టి సమాధి పొందిన యోగికి సంసార బంధ

ములు వాటంతట అవియే తెగిపోవును. అతనికి పునర్జన్మకు వచ్చెడి కర్మశేషమేదియు ఉండదు. ఆ స్థితినే "అమృతత్త్వము లేక మోక్షము, నిర్వాణము, అపునరావృత్తి" మొదలైన పదముల చేత పేర్కొనుచుందురు. ఈ స్థితి అందరికీ సాధ్యము కాదనియే విశ్వకర్మ సూక్తము "నతం విదాథ" అని జాలిపడినది. బ్రహ్మముగారు "తనలోన నున్న తత్త్వమెవ్వరు తెలిచి కనరన్నా" అనియు, "వెదకితే కనపడని వస్తువు ఎక్కడున్నదో చూడరా" అనియు అన్నారు. ఇవి వేదవాక్యముల వంటివే. పురుష సూక్తమేమో ఆతని నెఱింగినదే మోక్షమని "తమేవం విద్వా నమృత ఇహ భవతి" ఆ పరమాత్మ నెఱింగిననాడు అమృతస్థితి కలుగునని తెల్పినది. సర్వ మానవులు పొందవలసిన పరమ లక్ష్యము, గమ్యము, పరమపదము ఇదియే. అప్పుడే మనకు "విశ్వకర్మ మయం జగత్" అయి విశ్వకర్మ విశ్వరూపము గోచరించినట్లు!

## విశ్వకర్మ తత్త్వ ప్రాముఖ్యము

వైదిక వాఙ్మయ చరిత్ర వ్రాసిన (The History of vedic literature) "మేక్డోనాల్డ్" పండితుడు వైదిక దేవతలలోనికెల్లా "విశ్వకర్మ" అగ్రగణ్యుడనియు, అయన పేర వెలసిన రెండు సూక్తములలోను, ఇతర శాకల "విశ్వకర్మ" మంత్రములలోను ఆ దేవదేవుని ప్రభావము, సృష్టికర్తృత్వము మొదలగు విశేషములు సత్యసమ్మతము,

గాను, హృదయాకర్షకముగాను ప్రవచింపబడినవని ప్రశం సించుటయేగాక "విశ్వకర్మ సూక్త" మంత్రములను పెక్కిం టిని ఉదాహరించినాడు కూడ. ఆయనకు పూర్వులైన, ఆంగ్లేయులగు వేద పండితులు కూడ ఆపని చేయుటంబట్టియే "మేక్‌డోనాల్డ్" వారి సంప్రదాయమును అనుసరించి "విశ్వకర్మ తత్త్వము" నెఱింగి అట్లు వివరించియున్నాడు. ఇట్టి "విశ్వకర్మ తత్త్వము" శ్వేతాశ్వతరోపనిషత్తు నందలి "ఏష దేవో విశ్వకర్మా మహాత్మా ... రమృతాస్తె భవన్తి" అన్న మంత్రములో అద్భుతముగా వివరింపబడినది (చూడుము-2౩వ పుట).

దీని అర్థమును పూర్వ గ్రంథమున మనము గమనించియే యున్నాము. సర్వజీవుల యొక్క హృదయముల యందు ప్రకాశించెడి దేవుడు "విశ్వకర్మ"యే. బుద్ధిమంతులగు నెవ్వారు తమ మనోవాక్ బుద్ధులను యోగమయములు చేసికొని ఆ "విశ్వకర్మ తత్త్వము"ను అదియే నేనని తెలిసికొనజాలెదరో- అనుభూతి పొందెదరో, అట్టివారు అమృతులు కాగలరు. సమస్త వేదవాఙ్మయములోను దీనిని మించిన మంత్ర మింకొకటి లేదని చెప్పుట అతిశయోక్తి కాదు. "విశ్వకర్మ సూక్త" ప్రకారము జగములను (జీవులను) సృష్టించి, ఆ ఉపాధులలో ప్రవేశించి, జీవస్వరూపుడై జగన్నాటకము నాడునది ఈ "విశ్వకర్మ"యే అని అద్వైత సిద్ధాంతము, విశ్వకర్మ సూక్త" అనుసారముగ ఈ మంత్రమున ప్రవచింపబడినది. కనుకనే జగత్ ప్రసిద్ధ వేదాంతాచార్యుడైన డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ పండితుడు లండన్ ఆక్స

ఫర్డ్ విశ్వవిద్యాలయములో మొట్టమొదటగా చేసిన ఉప న్యాసమున ఈ మంత్రమును ఉదాహరించి దాని ప్రభావ మును వేనోళ్ళ కొనియాడినాడు.

Nobel బహుమాన గ్రహీతయు, ప్రపంచ మహా కవియు, శాంతినికేతన విశ్వవిద్యాలయ నిర్మాతయు అయిన రవీంద్రనాథ్ టాగూర్ గారికి ఈ శ్వేతాశ్వతరోపనిషన్మంత్ర మన్నచో ప్రాణములు లేచివచ్చును. తన తాత్త్వికోపన్యాస ముల యందు ఎన్నితావులనో "ఓ నిఖిల జనగణ మనస్సన్ని కృష్ట విశ్వకర్మా" అని సంబోధించుచు ఆ దేవదేవుని మహి మను హృదయస్థితుడైన ఆయన తత్త్వమునూ ఉగ్గడించుచుం డును. ఆయన వలెనే ఆయన శిష్యులైన వంగదేశస్థులు కూడ ఈ మంత్రమును తరచు వాడుచుందురు. ఇంత ఏల? ఇటీవలి అరవింద యోగీంద్రుడు కూడ ఈ "ఏష దేవో విశ్వకర్మా" అను మంత్రమునెడ గాఢ భక్తి విశ్వాసములు కలిగియున్నాడని ఆయన బహుళ రచనల మూలమున తెలిసి కొనగలము. అరవిందుని గీతా వ్యాఖ్యానాదులలో ఈ అంశమును పసిపట్టగలము. గాంధీ మహాత్ముని శిష్యుడైన వినోభాభావే మీదకూడ ఈ మంత్ర ప్రభావము పడినట్లు ఆయన గీతా ప్రవచనములు చెప్పుచుండును. ఈ విధముగ సత్యద్రష్టలైనవారందరూ "విశ్వకర్మ తత్త్వము"ను గ్రహిం చియే ఆచరించియే ధన్యులైనారు. "శ్వేతాశ్వతరోపనిషత్తు ఈ మంత్రమును కలిగియుండుటచేతనే, ఉపనిషత్తులలో రాజువంటి దైనది.

# మహా శిల్పోపనిషత్తు

ఓం సహనా వవతు. సహనౌ భునక్తు. సహవీర్యం కరవావహై. తేజస్వి నావధీత మస్తు. మా విద్విషావహై. ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

అథ మహాశిల్పోపనిషదం వ్యాఖ్యాస్యామః । సకల నిగమాగమసార పారగం పరిపక్వ భావభర మాచార్యం ప్రణమ్య ఛాత్రః పరిపృచ్ఛతి। భగవన్! మే మహాశిల్ప తత్త్వ రహస్యం బ్రూహీతి । తగ్ం సహోవాచ । అణోరణీయ న్మహతో మహీయ దతో న వేదితుగ్ం శిల్పరహస్యగ్ం శక్నోతి । భవ తస్మాత్సావధానః । వాఙ్మనో౽గోచరాతీ తాఅనంత దివ్య తేజో మయో నిత్యో నిర్వికల్పో నిరంజనో నిరాఖ్యాతో౽తిశుద్ధో దేవ ఏకః పరబ్రహ్మ విరాజతే। స ఏవా ఖిలాణ్డ కోటీనాం మూలబీజం భవతి । తస్మా న్నద్వితీ యో౽స్తి కశ్చిత్ । స నిరాకారో౽పి సాకారత్వం విధత్తే । నిరాకార సాకారావస్య నైసర్గికే వర్తేతే । జగదుదయ కారణం తన్మనో జాయతే । మనస్సంకల్పా త్సర్వం జగ త్సంకల్పితం భవతి. తదైవం ప్రారభ్యతే జగచ్ఛిల్పమ్ ।

య ఇమా విశ్వా భువనాని జుహ్వదృషి హ్రోతా నిష సాద పితా నః । స ఆశిషా ద్రవిణ మిచ్ఛమానః పరమ చ్ఛదో వర ఆవివేశ । విశ్వాని సృష్ట్యవన ప్రళయ రూపాణి కర్మాణి యస్యాసౌ విశ్వకర్మా భవతి । యస్మిన్నిదం సర్వం

భువనం జజాన । యస్మా దిదం సమస్తగ్ం సంకల్పరూపం శిల్పం ప్రకల్ప్యతే । స విశ్వకర్మా పరమాత్మా భవతి । ఆది శిల్పకృత్త తస్స భవతి । మనసా యత్ సృజ్యతే విశ్వకృద స్తత్సర్వగ్ం శిల్పమేవ భవతి । య త్తద్విధాన మనుబ్రూహీతి ఛాత్రేణః పృష్టో దేశికస్స పున రువాచేతి । యదా యదా పరబ్రహ్మణ స్సంకల్పోదయో భవతి । తదైవాహంకారః ప్రజాయతే । తస్మాత్పంచ చ భూతాని । భూతేభ్య ఓషధయ స్సర్వే । తేభ్యోఽన్నం । తతః స్థావర జంగమః ప్రపంచో భవతి। కారణం భవత్యత్ర చోపాదాన మాకాశాదీని । అఖండోఽపి దీవ్యతేఽయమేవ హృత్కోశేషు పరిచ్ఛిన్నో జీవత్వేన । వ్యాప్నోతి చాకాశవత్సర్వమ్ । అలం చకార నక్షత్రాదిభి రాకాశమ్ । శైలకానన ద్రుమాదిభిశ్చ వసుంధరామ్ । నానార్థభాజం వాచగ్ం శిల్పవిచిత్ర సుందరా మకరోత్ । ఏవ మేవాలంకృత వాన్పదార్థాణి వై సర్వాణి । సర్వమే తద్భవతి విశ్వకృదశ్శిల్పమ్ । యదా తదా భవజ్జగ ద్విజ్ఞానశూన్యమ్ । సోఽకామయతా త్మానం పంచాస్యం । తదై వావిరాసీ త్ప్రవృత్త్యై తస్యైవ తేజోఽంశా దభవన్ బ్రహ్మణో మను ర్మయ స్త్వష్టా శిల్పీ విశ్వజ్ఞ ఇతి పంచ । తా నేవగ్ం హోవాచ విశ్వకర్మా । ప్రవర్తయత లోకం పంచకర్మభి రితి । ప్రవర్తత ఇత్యేతైః పంచభి రితి ప్రపంచో భవతి। యజ్ఞ ఏవేదం కర్మ, యజ్ఞః కర్మైవ। శ్రుణుత తద్యథా సృష్టి, స్థితి, లయ, తిరోధానానుగ్రహ రూపాణీతి । ఏ

తద్భవత్యేవం విశ్వకర్మణ శ్శిల్పమ్ । కుర్యాదేవమేవ చ లోకస్య । దాతారో భవన్తు జ్ఞానస్య, విజ్ఞానస్య చ శిల్పినః । అధిష్ఠాతాహం కర్మణ స్సకలస్య యజ్ఞరూపః। విలసిత మేవం మయైవ జగచ్ఛిల్పస్య కౌశలమ్ । గుహ్యామిద మధ్యాత్మన్ । రహస్యం భవతి ప్రాణినా మజ్ఞేయమ్ । తదేత ద్వివృణుత వివృణుత లోకస్య । ప్రకల్పయత యజ్ఞగ్ం శిల్పేన । శిల్పేనై వేద ముపబృంహితమ్ । యజ్ఞో భవతి లోకానాం నిశ్రేయసే । సిధ్యేరన్ వివిధాన్యపి కార్యాణి । భవతి చ త న్నానావిధ శిల్పబహుళమ్ । శిల్పాదృతే కించి త్సత్రమితి నోచ్యతే నోచ్యత ఇతి । తతోఽవశ్యం విసృజత విసృజతో పకరణాని జ్యేష్ఠాః । అభ్యర్చనీయోఽహం యజ్ఞే నైవ లోకస్య । తాన్యేవం వేదీకుణ్డ రథపాత్రా దీన్య భ్యూహ యత । కారయతాధ్వరాన్ సర్వైరపి లోకైరనుశ్రుతి మితి। ఏకై కస్యై కైకోఽధ్యక్ష ఇతి వేదస్య । తత్రాథర్వణ శ్శిల్ప భూయిష్ఠ మత్యన్తమ్ । రూపేణైవ ధ్యాయన్తే తద్దైవతమ్ । రూపమేవ తచ్ఛిల్పమ్ । తాన్యయో దారు శిలా తామ్ర హిరణ్య వికారాణి । మృదాదీన్య ధమాని । యదస్యోక్తం తద్వికారం తస్య । ఆయతనవన్తి వై సర్వాణ్యపి దైవతాని। ఏవ మేవా పరాణ్యపి శిల్ప విలసితాని కర్మాణి । భవన్త్యే తాని చ మోక్షప్రదాని ప్రపద్యేరన్ సర్వకల్యాణాని లోకాః । సంచినుయా త్పుణ్య మేభి శిల్పైః । బ్రాహ్మణానా మేతద్భవతి శిల్పమ్ । యద్య బ్రాహ్మణో భవేన్న శిల్పీతి ।

అబ్రవీదేవం పున రాచార్య స్సర్వజ్ఞః। యదా యదా వహీయతే లోకా దస్మాద్ధర్మగ్ం శిల్పరూపమ్ । తదైవా విర్భాయతే భగవాన్విశ్వకర్మా త్మన స్తేజసః ప్రకల్ప్య కారాన్ । తస్మాదేవ ప్రజాపతయ ఋషయః ప్రజాయన్తే శిల్పవిభవః । తేభ్య ఏవ పారంపర్యగ్ం సమాగతం భవతి శైల్పిక మాచార్యత్వం చ । దేవానా మప్యాచార్యా స్త ఏవ విభ్రాజన్తే మహాన్తః । నిరుక్తా స్తే భవన్త్యాదికర్తారో లోకప్రవర్తకాః । తద్ద్వివిధ మేవం శిల్పం దైవం మానుషం చేతి । నాభానేదిష్ఠాదీ న్యత్ర ప్రథమాని । అన్యాని మాను షాణీ త్యుచ్యన్తే । దేవమూర్తి దేవా యతనేష్ట్యాదికం భవతి సర్వం దైవమితి విచిత్రం శిల్పమ్ । మానుషం చైవం భవతి శస్త్రాస్త్ర గాన్త్రహాల ప్రాసాద వాప్యాభరణా దీనీతి । తయో రేవం శిల్పయోర్భవన్తి వాగీశ్వరీ మేర్వాదీ న్యుపకరణాని। ఏభ్యో దశభ్య ఏవ క్రియతే సర్వం వైవిచి త్రగ్ం శిల్పమ్ । అత శ్శిల్పమూలాని సర్వాణి। పూజనీయాని స ర్వేషా మతో భవన్తి వై శిల్పాని । ఏభి స్సుఖం జీవేయు ర్లోకాః। ఏభిరాప్నుయా న్నిశ్రేయసం । ఏభి ర్భవన్తి జగన్తి చక్షుష్మన్తి । ఏభిః పూజ్యన్తేఽత్ర వేధస స్థపతయశ్చ । ఏభిః పూర్ణం భవత్యానందంచ । ఏభి ర్ముముక్షవః ప్రాప్ను వన్తి మోక్షమ్ । ఇత్యేవం భవతి శిల్పమ్ । శిల్పగ్ం హ్యస్మి న్నధిగమ్యతే । తస్మా జ్జగత్సర్జనం భవతి శిల్పమ్ । యజ్ఞో భవతు శిల్పమ్ । శిల్పం వై భతు యజ్ఞః । పుణ్యం భవతు శిల్పమ్ । జ్ఞానం భవతు విజ్ఞానం చ శిల్పమ్ । లౌకికం భవతు

వైదికం చాపి శిల్పమ్ । బ్రాహ్మణానా మేవేదగ్ం శిల్పం భవతు । తత్త్వం భవతి శిల్పమ్ । రహస్యం భవతి శిల్పమ్ । జగత్సర్వం శిల్పమేవ భవతి । తదేవ విశ్వ వర్ధకం భవత్విత్యు పనిషత్ । ఓం సహనా వవతు । సహనౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నావధీత మస్తు । మా విద్విషా వహై । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః ।

—— (ఇతి యాజుసాథర్వణ మహాశిల్పోపనిషత్సమాప్తా)

తా॥ వేద వేదాన్తములను చదివి పరిపక్వ బుద్ధియైన గురువునకు నమస్కరించి శిష్యుడో స్వామీ, నాకు మహా శిల్పతత్త్వము నెఱిఁగింపుమని కోరగా, ఆ ఆచార్యుడు ఇట్లు ఉపదేశించుచున్నాడు. అణువు కంటె అణువును, మహత్తు కంటె మహత్తును అగు శిల్పరహస్యము నెఱుంగుట అంత తేలికకాదు. కనుక సావధానుడవు కమ్ము. మాటకు, మనస్సునకు అందక, తేజస్స్వరూపుడును, నిత్యుడును, నిర్వికల్పుడును, నిరంజనుడును, నిరాఖ్యాతుడును, శుద్ధుడును అగు పరబ్రహ్మము ఒక్కడే ప్రకాశించుచున్నాడు. ఆతడే సకల బ్రహ్మాండములకు మూలమైన విత్తనము. అతని కంటె భిన్నుడింకొకడు కానరాడు. అదియొక మహాశక్తి అన్నమాట. అత డాకారము లేనివాడయ్యును, రూపములను తాల్చుచుండును. సాకారత్వ నిరాకారత్వము లాతనికి సహజములు. జగముల పుట్టుటకు, కారణములైన సంకల్పము లాతనికి కలుగుట తోడనే జగము లేర్పడుచున్నవి. సంకల్పములనెడి ఉపకరణములతోనే జగచ్ఛిల్పము ప్రారంభింపబడినది.

ఎవడు ప్రళయ కాలమున సమస్త బ్రహ్మాండములను తనయందు బాహుతిగా వేసికొని, హరించి, అతీంద్రియ ద్రష్టయై, మనకు తండ్రియై యుండెనో, అత డాశీర్వాద రూపముచే జగద్రూప ధనభోగమును కోరి శరీరుల హృదయ పద్మములందు జీవరూపుడై ప్రవేశించెను. ఆ దివ్యశక్తి, సృష్ట్యాది విశ్వ (సర్వ) కర్మలకు కారణుడైనందున "విశ్వకర్మ" యని వేదములందు పేర్కొనబడినాడు. ఎవని యందీ విశ్వము జన్మించెనో, ఎవనివలన సంకల్పరూప శిల్పముదయించెనో, ఆతడే "విశ్వకర్మ పరమేశ్వరుడు"గా వెలుగొందెను. ఆతడే ఆదిశిల్పకర్త అగుచున్నాడు. ఆతని మనస్సుచే సృజింపబడినదంతయు శిల్పమే అగుచున్నది. ఆ శిల్ప విధానమును పూర్ణముగా సెలవీయుడని యడిగిన శిష్యునకు మఱల ఆచార్యు డిట్లు పలికెను.

ఎప్పుడా "విశ్వకర్మ"కు జగత్సృష్టి చేయవలెనను సంకల్పము కలుగునో అప్పుడే అహంకార తత్త్వ మేర్పడుచున్నది. దానివలన ఆకాశాది పంచభూతములు, వాటి నుండి ఓషధులు, వాటినుండి అన్నము, దాని నుండి స్థావర జంగమ రూప ప్రపంచము కలుగును. దానికి ఉపాదాన కారణము, ఆకాశాది భూతపంచకమే. ఈ పరమాత్మ అఖండ స్వరూపుడైనను, ప్రాణుల హృదయములందు పరిచ్ఛిన్నుడుగాను, జీవరూపుడుగాను వెలుగుచున్నాడు. అతడు ఆకాశమువలె అంతట నిండియుండువాడు. ఆ దేవుడు సూర్యచంద్ర నక్షత్రముల చేత ఆకాశమును, కొండలు; నదులు; అడవులు;

సముద్రములు; అనువానిచేత భూమిని, అనేకార్థాలంకా రాదులచేత వాక్కును, అలంకరించెను. ఇట్లే అన్ని వస్తువుల నాతడు శిల్పసుందములుగా చేసినాడు. ఇది అంతయు ఆ "విశ్వకర్మ దేవుని" శిల్పమే. ఈ జగము విజ్ఞాన శూన్య ముగా ఉన్నప్పు డా "విశ్వకర్మ" తాను అయిదు ముఖములు కలవాడై అవతరించెను. పంచముఖావతారుడైన అతని తేజము నుండి మను, మయ, త్వష్ట్ర, శిల్ప, విశ్వజ్ఞ లనెడి పంచబ్రహ్మ లుదయించినారు. వారిని ఆ జగత్పిత "మీరు అయిదు కర్మలచే జగత్తును ప్రవర్తింపజేయుడు. ఈ పంచ కర్మలచే ప్రవర్తించుచున్నది కానసే ఇది ప్రపంచమగు చున్నది. సృజించుట, పోషించుట, లయింపజేయుట, అంత ర్థానము నొందించుట, పునస్సృష్టికి అనుగ్రహించుట అనెడి పంచకర్మలు నావలననే ప్రవర్తించుచున్నవి. ఇట్లే శిల్ప బ్రహ్మలగు మీరుకూడ సృజింపుడు. జ్ఞాన విజ్ఞానములకు దాతలు కండు. సమస్త కార్యములకు యజ్ఞరూపుడనైన నేనే అధిష్ఠాత నగుచున్నాను. నాచేతనే ఈ జగచ్ఛిల్ప కౌశ లము ప్రకాశించుచున్నది. ఇది అంతయు అధ్యాత్మికమగు రహస్యము. ఇది సామాన్య ప్రాణులు తెలియజాలనిది. దీని నంతయు లోకమునకు చక్కగా వివరింపుడు. శిల్పముచేత యజ్ఞములను కల్పింపుడు. శిల్పముచేతనే యజ్ఞమంతయు వృద్ధి నందుచున్నది. లోక కళ్యాణము కోసమే యజ్ఞము. మీరు సర్వ శిల్పకార్యములను సిద్ధి పొందించెదరు గాక! ఆ యజ్ఞము నానావిధ శిల్పములచేతగాని వృద్ధికాదు. శిల్ప

రహితమైనదేదియు యజ్ఞమని చెప్పబడదు. ముమ్మాటికీ చెప్పబడదు. యజ్ఞము చేతనే నేను లోకమునకు అర్చింపదగినవాడ నగుచున్నాను. ఆ యజ్ఞోపకరణములగు వేదికలను, కుండములను, రథములను, పాత్రాదులను రచింపచేయుడు. సమస్త యాగములను లోకములచే చేయింపుడు. మీలో ఒక్కొక్కరు ఒక్కొక్క వేదమునకు అధ్యక్షులు. వేదములలో అథర్వణము శిల్పము నెక్కువగా బోధించును. మంత్రముల చేతనే రూప నిర్మాణము జరుగవలయును. ధ్యాన యోగము చేతనే రూపదర్శనము సాధ్యము. కాన రూపమును ధ్యాన మనుసరింపవలయును. రూప మనగా శిల్పమే సుమీ! రూపము లన్నియు ఇనుము, కొయ్య, రాయి, రాగి, బంగారు మొదలగువాటిచే చేయవచ్చును. మట్టి మున్నగువాటితో చేయబడునవి అధమములు. దేవత లందఱు ఆలయములు గలవారు కావలెను. ఇట్లే ఇతర శిల్ప కర్మలనూ అని తెలియవలెను. ఈ శిల్పకర్మలన్నియు మోక్షప్రదములగుచున్నవి. వీటిచే లోకములు ఎల్ల శుభములను పొందుచున్నవి. వీటిచే పుణ్యముల నందవచ్చును. ఈ శిల్పకర్మలను బ్రాహ్మణులే చేయవలెను. శిల్పము నెఱుగనివాడు బ్రాహ్మణుడు కాజాలడు".

అని ఆచార్యు డిట్లు మరల చెప్పబూనెను. ఎప్పుడు శిల్పధర్మము ఈ లోకమున నశించుచుండునో, అప్పుడప్పుడు భగవంతుడగు "విశ్వకర్మ" తన తేజస్సుచేత ఆత్మ ప్రతిబింబ మూర్తుల నవతరింపజేయుచున్నాడు. ఆ "విశ్వ

కర్మ” వలననే శిల్ప స్వాములగు ఋషులు, ప్రజాపతులు పెక్కండ్రు జన్మించిరి. వారి పరంపరను బట్టియే శిల్ప ధర్మము, ఆచార్యత్వమును వచ్చుచున్నది. ఆ మహాత్ములే దేవతలకు సైతము ఆచార్యులై ప్రకాశించుచున్నారు. లోక ప్రవర్తకులగు ఆది శిల్పకర్తలు వీరే. ఈ శిల్పము దైవము, మానుషము అని రెండు విధములు. నాభానేదిష్ఠాది శిల్పములు దైవములు, తక్కినవి మానుషములు. దేవతా విగ్రహ, దేవాలయ యజ్ఞాదికమగు సమస్తమును దైవ శిల్పము. ఇవన్నియు మిక్కిలి ఆశ్చర్యకరములు. శస్త్రములు, అస్త్రములు, నాగళ్ళు, యంత్రములు, భవనములు, బావులు, ఆభరణాదులు మానుషములు. ఈ రెండు రకముల శిల్పములు చేయుటకును కుంపటి, నాగలి మొదలగునవి ఉపకరణము లగుచున్నవి. ఈ పది రకముల సాధనముల వల్లనే విచిత్రమైన శిల్పమంతము చేయబడుచున్నది. కావున సర్వమునకు శిల్పమే మూలము. అందుచేతనే ఎల్లరకు శిల్పములు పూజార్హము లగుచున్నవి. ఈ శిల్పముల చేతనే సమస్త లోకములు బ్రతుకజాలుచున్నవి. వీటిచేతనే సమస్త శుభములను పొందుదురు. వీటిచేతనే జగములు, కన్నులు గలవగుచున్నవి. వీటిచేతనే బ్రహ్మలు, స్థపతులు పూజింపబడుచున్నారు. వీటిచేతనే ఆనందము కలుగుచున్నది. మోక్షాపేక్షగలవారీ శిల్పముచేతనే ముక్తి నందుచున్నారు. ఇట్టి శిల్పము అత్యాశ్చర్యకరమని చెప్పబడుచున్నది.

కావున జగత్సృష్టి యంతయు శిల్పమే. యజ్ఞమును శిల్పమే. శిల్పము యజ్ఞమే. శిల్పమే పుణ్యము. జ్ఞాన విజ్ఞానములు శిల్పములు అగుగాక. లౌకిక వైదిక కర్మములు శిల్పము లగుగాక. ఈ శిల్పము బ్రాహ్మణులకే అగుగాక. తత్త్వమును, రహస్యమును కూడ శిల్పమే అగుగాక. సమస్త జగమును శిల్పమే. ఆ శిల్పమే విశ్వప్రపంచాభ్యుదయమును చేయుగాత మని ఉపనిషత్తు పలుకుచున్నది.

— (విశ్వకర్మ బ్రాహ్మణ వంశాగము నుండి)

## ఉపసంహారము

సారభూతమగు రెండు శ్లోకములతో ఈ గ్రంథమును ముగింతుము.

"అహం శ్రీ విశ్వకర్మాస్మి, విశ్వరూపస్తతోఽస్మ్యహం,
నాన్యత్కించి ద్విశ్వకర్తుః, విశ్వకర్మ మయం జగత్".

తా॥ నేను సాక్షాత్తు విశ్వకర్మనే. పిమ్మట విశ్వమే రూపముగా గలవాడను అగుచున్నాను. లోకమున విశ్వకర్మ కానిది ఏదియునూ లేదు. జగత్తంతయు విశ్వకర్మమయమే.

ఈ శ్లోకమున, మొదటి పాదములోని "శ్రీ" శబ్దమునకు 'వేదమ'ని అర్థము. "శ్రీ విశ్వకర్మ" అనగా వేదముల యందు వర్ణింపబడిన "విశ్వకర్మ" అని భావము. ఇందుకు ప్రమాణము "సాహి శ్రీ రమృతా సతామ్" అనెడి వేద

వాక్యము. అనగా అమృతమయమైన శ్రుతికి "శ్రీ" అని పేరు కలదని భావము. ఈ విషయమును నిరంజనశాస్త్రిగారు తన ప్రార్థనా శ్లోకములో ఇట్లు పేర్కొనినారు.

శ్లో॥ శ్రీష్వేవ నిర్మల విచిత్ర పథ స్సతాం య
స్సంకల్ప సత్యకరణై ర్జగతాం విధాతా
హోతా నిజాత్మ నిచితాఖిల లోకహోమే
తం విశ్వకర్మ పరమేశ్వర మానతోఽస్మి.

తా॥ వేదముల యందు నిర్వచింపబడిన లోకసృష్టి మార్గములు కలవాడును, సత్యసంకల్పాదులచేత జగత్తులకు సృష్టించినవాడును, కడకు ఆ జగత్తులను తనలోనే ఆహుతిగా వేసికొని, లీనము చేసికొన్న హోతయూ అగు "విశ్వకర్మ పరమేశ్వరు"ని ప్రార్థించుచున్నాను. ఈ శ్లోకమున విశ్వకర్మ సూక్తార్థము ప్రపచింపబడుట గమనింపదగి యున్నది.

"శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః"
(ఆలకింపు డమృతపుత్రు లంద ఱిద్ది)

"యద్దాయత్రీ విశ్వకర్మ, ప్రసాదాసాదిత శ్శుభః,
విశ్వకృద్విశ్వ రూపాఖ్య, గ్రంథ స్తాభ్యాం సమర్పితః."

శ్రీ ప్రత్నానంత కృత

"విశ్వకర్మ విశ్వరూపము" సంపూర్ణము.

# సవరణలు
(అగపడినవి మాత్రము)

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 9 | 10 | శరుణః | వరుణః |
| 11 | 17 | దేవానం | దేవానాం |
| 11 | 18 | దీనికి | దీనిని |
| 15 | 12 | ఆధ్యాత్మిక | ఆధ్యాత్మిక |
| 25 | 8 | మంత్రమును | మంత్రమున |
| 32 | 8 | త్ర్యయంబకుడు | త్ర్యంబకుడు |
| 32 | 12 | "విశ్వక్మయే" | "విశ్వకర్మయే" |
| 34 | 8 | ఆత్మావలోకనము. | ఆత్మావలోకనము, |
| 34 | 17 | దిద్దర్శ | దిగ్దర్శన |
| 35 | 1 | రోప | రూప |
| 35 | 4 | క్రియలను | క్రియలును |
| 35 | 7 | జగత్తు | జాగ్రత్తు |
| 35 | 9 | నాసదీయి | నాసదీయ |
| 38 | 3 | మీా | నీ |
| 38 | 16 | పంౘడెము | పంౘడెండు |
| 44 | 20 | వాచస్పతి | వాచస్పతిం |
| 60 | 3 | సప్తఋచాభి | సప్తఋషిభి |
| 64 | 16 | "త్వష్టా తష్టా కరణే" | "త్వష్టా తష్టా తనూ కరణే" |
| 71 | 14 | ఋగ్వాది | ఋగాది |

| | | | |
|---|---|---|---|
| 72 | 4 | అదితి | దితి |
| 72 | 4 | ఇంద్రునితో సమానుడైన | ఇంద్రుని జయింపగల |
| 72 | 6 | గర్భములోని | ఆమె గర్భములోని |
| 73 | 13 | జ్ఞానేందియములను | జ్ఞానేంద్రియములను |
| 81 | 16 | సలీల | సలల |
| 81 | 17 | భూత్వాచ ర్తత్స | భూత్వాచరత్స |
| 83 | 2 | "పజాపతిర్విశ్మకర్మ" | "ప్రజాపతిర్విశ్వకర్మ" |
| 83 | 18 | నీటిను డి | నీటినుండి |
| 85 | 13 | ధృవుడు | ధ్రువుడు |
| 88 | 6 | విధాతలను | విధాతలును |
| 88 | 18 | విబూతియే | విభూతియే |
| 100 | 15 | ముసలితసము | ముసలితనము |
| 101 | 4 | తెలియవలెను, | తెలియవలెను. |
| 106 | 12 | విశ్వకర్మ తనయు" | "విశ్వకర్మ తనయు" |
| 110 | 16 | గుడ్లవాడై | గుడ్డి వాడై |
| 113 | 1 | ప్రారంభించనది | ప్రారంభించినది |
| 113 | 4 | ప్రత్యేకమైనది | ప్రత్యేకమైనది. |
| 115 | 10 | ధాత విధాత | ధాతా విధాతా |
| 116 | 1 | పరము | పరమ |
| 116 | 1 | తాను సృష్టించిన. | తాను సృష్టించిన, |
| 116 | 8 | ఇషాని | ఇష్టాని |
| 116 | 20 | విద్ధి | విధ్ది |
| 119 | 13 | ఉత్పాదకుడును | పోషకుడును |
| 127 | 12 | జగత్త్వతమే | జగత్తత్త్వమే |

| | | | |
|---|---|---|---|
| 129 | 1 | అగోచరమే | అగోచరమేమీా |
| 139 | 12 | తనువః | తనువం |
| 156 | 12 | (ద్యావా | "ద్యావా |
| 163 | 10 | హస్త | హస్త |
| 163 | 16 | ఆరాధింపవలయునో | ఆరాధింపవలయునో |
| 216 | 5 | పరమేనోవ్యమన్ | పరమేవోవ్యమన్ |
| 234 | 2 | సహోఽసి, | సహోఽసి. బలమసి. |
| 254 | 10 | వైశ్వానదేణ | వైశ్వానరేణ |
| 270 | 22 | రుడే | కుమారుడే |
| 272 | 23 | కలవాడ్నన | కలవాడన్న |
| 278 | 18 | విశ్వజ్ఞశ్చతి | విశ్వజ్ఞ శ్చేతి |
| 297 | 6 | బ్రాహ్మణేతురులని | బ్రాహ్మణేతరులని |
| 299 | 4 | ప్రాచీన | ఆ ప్రాచీన |
| 336 | 11 | మీామాంస" | మీామాంసా" |
| 340 | 21 | ముంత్ర | ముత్ర |
| 341 | 17 | అల్పకాల్పము | అల్పకాలము |
| 351 | 18 | జగత్కరణాను | జగత్కారణాను |
| 371 | 23 | విష్ణోఖ్యమితి | విష్ణాఖ్యమితి |
| 390 | 18 | అయిన | ఆయన |
| 391 | 22 | విశ్వకర్మ సూక్త" | "విశ్వకర్మ సూక్త" |
| 392 | 21 | "శ్వేతాశ్వత రోపనిషత్తు | "శ్వేతాశ్వత రోపనిషత్తు" |
| 393 | 10 | గోచరాతీతా అనంత | గోచరాతీతానంత |
| 395 | 13 | కారయతాధ్వీరాన్ | కారయతాధ్వరాన్ |

# ప్రథమ భాగ ప్రశంసా

Tirupati
1-11-84.

**Dr. D. Arka Somayaji,** M. A., Ph. D.,
Project officer for Creative work & Research,
Tirumala Tirupati Devasthanams.
Retd. Principal, D.N.R. College, Bhimavaram
Presidential Awardee as Sanskrit Scholar.

ఇదం మే మహతే ప్రమోదాయ, యత్ శ్రీమంతః వీర రాఘవాచార్యాః సంప్రతి ప్రజ్ఞానంద నామానః ఋగ్వేదే కృత భూరిపరిశ్రమాః ఋగ్వేద దిగ్దర్శన నామగ్రంథం అరరచన్. స చ గ్రంథః మయా ఆద్యంతం వ్యలోకి. ఏతే మహోదయాః ఆధ్యాత్మిక తత్త్వవిషయే అహర్దివ మపి కృతశ్రమా ఇతి గ్రంథావలోకనేన మయా అబుద్ధ. సంప్రత్యపి బహవః సంస్కృత పండితా భారతే జాగ్రతి. కింతు తత్త్వానుభూతి విషయే శ్రద్ధధానా విరళా ఏవేతి నిశ్చప్రచమ్. ఏతే మహాభాగాః అన్యా నపి శిష్యాన్ స్వ సదృశాన్ కుర్వన్త్వితి ఆశాసే.

శ్లో॥ ప్రజ్ఞానంద మహోదయేన రచితం తత్త్వ ప్రచారేప్సునా
మా మత్యంత మతూతుషత్ శ్రుతివచ స్తత్త్వార్థ దిగ్దర్శనం,
బ్రహ్మజ్ఞాన బుభుత్సుభి ర్మునివరై ర్దృష్టా వచో యాః పరాః
వ్యాఖ్యాన్ తాః విబుధా నయం బుధవరో కుర్యాత్ శ్రుతివ్యాపృతాన్.

— ఇతి ధూళిపాళోపాఖ్యః అర్కసోమయాజీ.